# ఆత్మవిచారము

## (ఉత్తరభాగము)

అద్దంకి సీతారామశాస్త్రిచే
విరచితము



చెన్నపట్టణం, [illegible] దివ్యజ్ఞానదీపిక ఆఫీసువారిచే ప్రచురితము

# ఆత్మవిచారము

## (ఉత్తరభాగము)

అద్దంకి సీతారామశాస్త్రిచే
విరచితము

చెన్నపట్టణం అడయారునందు దివ్యజ్ఞానదీపిక ఆఫీసువారిచే ప్రచురితము

1924

వెల 1-8-0] [తపాలాకూలి వేరు



సీ ॥ అవనిదివ్యజ్ఞాన మను సమాజమునకు గురురూపిణిగ నిల్చి
వరుస నెల్ల ।
యజ్ఞానులం గాంచి యమలవిద్యామృతబిందుతృప్తులఁ జేయు
విధిని గల్ప ।
కమణీయనందగి కరుణాంబురాశియై జ్ఞానరాజ్యప్రభు
శక్తి మించి ।
జననియటంచు స జ్జనులు మతింపంగ యశమున దిక్కుల
నావరించి ।

వెలయుచున్న వసంతాంబ లలితపూజ్య ।
పాదపంకజములకు సద్భక్తిమీఱ ।
వినయ మొప్పంగ నీసత్కృతిని గృతజ్ఞ ।
తను సమర్పించినాఁడను ధన్యమతిని ॥

తే ॥ బ్రహ్మవిజ్ఞానసభయు శాశ్వతముగాఁగ ।
వలరుఁగావుత శ్రీవసంతాంబికయును ।
భావిగురువును సత్యరూపమగుధర్మ ।
మును ధరాస్థలి నెప్పుడు తనరుఁగాత ॥

# శ్రీ కృష్ణతాండవ స్తోత్రం

భజే వ్రజైకమండనం సమస్తపాపఖండనం
స్వభక్తచిత్తరంజనం సదైవ నందనందనం ।
సుపిఞ్ఛగుచ్ఛమస్తకం సునాదవేణుహస్తకం
అనంగరంగసాగరం నమామి కృష్ణనాగరం ॥ ౧ ॥

మనోజగర్వమోచనం విశాలఫాలలోచనం
విధూతగోపశోచనం నమామి పద్మలోచనం ।
కరారవిందభూధరం స్మితావలోకసుందరం
మహేంద్రమానదారణం నమామి కృష్ణవారణం ॥ ౨ ॥

కదంబసూనకుండలం సుచారుగండమండలం
వ్రజాంగనైకవల్లభం నమామి కృష్ణదుర్లభం ।
యశోదయా సమోదయా సకోపయా దయానిధిం
ఉలూఖలేసుబంధనం నమామి నందశంవహం ॥ 3 ॥

నవీనగోపనాగరం నవీనకేళిమందిరం
నవీనమేఘసుందరం భజే వ్రజైక మందిరం ।
సదైవ పాదపంకజం మదీయ మానసే నిజం
దధాతినందబాలక స్సమస్తభక్తిపాలకః ॥ ౪ ॥

సమస్తగోపనాగరీహృదంబుజైకమోహనం
    నమామి కుంజమధ్యగం ప్రసూనబాలశోభినం ।
దృగంతకాంతరింగణం సహాసబాలసంగినం
    దినే దినే నవం నవం నమామి నందనందనం ॥ ౫ ॥

గుణాకరం సుఖాకరం కృపాకరం కృపానరం
    త్వరాసుఖైకదాయకం నమామి గోపనాయకం ।
సమస్తదోషశోషణం సమస్తలోకతోషణం
    సమస్తదాసమానసం నమామి కృష్ణలాలసం ॥ ౬ ॥

సమస్తగోపనాగరీనికామకామదాయకం
    దృగంతచారుసాయకం నమామి వేణునాయకం ।
భువోభవావతారకం భవాబ్ధికర్ణధారకం
    యశోమతేః కిశోరకం నమామి దుగ్ధచోరకం ॥ ౭ ॥

విదగ్ధముగ్ధగోపికామనోమనోజదాయకం
    నమామిముంజకాననే ప్రవృద్ధవహ్నిపాయినం ।
యదాతదా యథాతథా తథైవ కృష్ణసత్కథా
    మయా సదైవ గీయతాం తథా కృపా విధీయతాం ॥ ౮ ॥

---

బర్హాపీడాభిరామం మృగమదతిలకం కుండలాక్రాంతగండం ।
కంజాక్షం కంబుకంఠం వికసితవదనం సాదరన్యస్తవేణుం ।
శ్యామం శార్ఙ్గం త్రిభంగం సదరుణవదనం భూషితం వైజయంత్యా । వందే బృందావనస్థం యువతిశతవృతం బ్రహ్మగోపాలవేషం ॥ ౧ ॥

సార్వైకసారం వేదాంతసారం తత్సార మేకో గోపాల వేషః ।
భక్తానుగ్రాహీ లీలావతారః శ్రీకృష్ణరూపో మమ దేవదేవః ॥ ౨ ॥

నవాభ్రనీలం నవనీతలోలం రమానుకూలం రమణీయచేలం ।
శృంగారలీలం కరుణాలవాలం వందేసుశీలం వసుదేవబాలం ॥ ౩ ॥

వంశీవిభూషితకరా న్నవనీరదాభా త్పీతాంబరా దరుణబింబ ఫలాధరోష్ఠాత్ ।
పూర్ణేందుసుందరముఖా దరవిందనేత్రా త్కృష్ణాత్పరం కిమపి తత్త్వ మహం న జానే ॥ ౪ ॥

ధ్యానాభ్యాసవశీకృతేన మనసా తన్నిర్గుణం నిష్క్రియం ।
జ్యోతిః కించన యోగినో యది పరం పశ్యంతి పశ్యంతు తే ।
అస్మాకం తు తదేవ లోచనచమత్కారాయ భూయా చ్చిరం । కాళిందీపులినాంతరేషు యత్కి మపి నీలం మహో ధావతి ॥ ౫ ॥

శ్రీకృష్ణాయ తుభ్యం నమః

---

# పీఠిక

ఆత్మవిచారము, పూర్వభాగమునందు వ్రాసిన పీఠికయంత యు నుత్తరభాగమునకు కూడ అన్వయించును.

ఈ గ్రంథముయొక్క ప్రూపులను పరిశీలించిన నా స్నేహితులు బ్రహ్మశ్రీ అల్లాడి మహాదేవశాస్త్రిలవారికి నా కృతజ్ఞతా పూర్వక నమస్కారములను సమర్పించుచున్నాను. ఈ గ్రంథమును అచ్చువేసిన వసంతాప్రెస్సునందుండు వారిపైకి ఈ గ్రంథముఫార ములను పరిష్కరించిన నా స్నేహితులు చిట్టమూరు సుబ్బరా యడు పంతులుగారికిని నా కృతజ్ఞతను విన్నవించుకొనుచున్నాను.

కాళిదాసు, దండి, నన్నయు, తిక్కన మొదలగు గ్రంథ కర్తలు అను సూర్యుల ప్రకాశమును అనుసరించి ప్రాచీనాధునిక గ్రంథకర్తలు వ్రాసిరి. వారికి పాండిత్యము ఉండినందున వారి గ్రంథములు శోభిల్లుచున్నవి. ఈ గ్రంథకర్తకూడ గ్రంథమును వ్రాసినాడు కాని పాండిత్యము ఉండలేదు. అయితే తాను చదివి విని అవగాహనచెసికొన్న విషయములను తనవంటి యితరులకు ఇయ్యవలెనను నాసతోనే ఈ గ్రంథమును ఈ గ్రంథకర్త వ్రాసి నాడు. బంగారును తూచుటకుగా త్రాసుయొక్క నొక గిన్నెలో బం గారు, దానిమెదుటి గిన్నెలో గురిగింజలను ఉంచినంతమాత్రమున నే గురిగింజ బంగారుతో సమానము కాచాలదు. ఆ విధముగా

నేను గ్రంథకర్తను అని యీ గ్రంథకర్త అనుకొనినయెడల వంచితుడగును.

చెప్పబూనిన విషయమునకు ఇంతటి స్థలము కావలెనను నిదాన మెఱుగక గ్రంథారంభమునుండి బ్రహ్మాండము అను విషయమును వ్రాయబోవుచున్నానని చెప్పుచువచ్చి కట్టకడపట చెప్పుటకు వీలులేదు, మన్నించవలెను అని విజ్ఞాపన చేసికొనవలసి వచ్చెను. అభ్యాసము లేనివాడు పెద్దకార్యమును చేయబూనునపుడు తప్పులు చేయుననుట ఇప్పటికి నాకు అనుభవసిద్ధముగా తెలిసినది.

మఱియు నేను ముప్పది సంవత్సరములుగా థియోసాఫికల్ సొసైటీలో మెంబరును. దీర్ఘకాలము తాదాత్మ్యము నిచ్చినది గాని థియోసాఫికల్ సొసైటీయందలి మెంబర్లు కొనియుండు అభిప్రాయములు థియోసాఫికల్ సొసైటీవి కావనియుండియు అజాగ్రతదోషమువల్ల నీ గ్రంథము 22 వ పుటయందు నేను, నావంటి మెంబర్లును, అంగీకరించియుండు అభిప్రాయము థియోసాఫికల్ సొసైటీవారి యభిప్రాయమని వ్రాసినాను. ఇది తప్పు. థియోసాఫికల్ సొసైటీలో ప్రముఖుల యభిప్రాయము అనుట న్యాయము.

ఈ గ్రంథముయొక్క పూర్వభాగము సారాంశమందు ప్రవృత్తిమార్గమును గురించి చెప్పుచున్నది. ఉత్తరభాగము వస్తుతః నివృత్తిమార్గమును గురించి చెప్పుచున్నది. ఈ రెండు భాగములు గల ఆత్మవిచారము ఆస్తికులకు సహాయకారిగా నుండుగాత యని నా ప్రార్థన.

గ్రంథకర్త

# ఉపోద్ఘాతము

"ఆత్మవిచారము" ద్వితీయ సంపుటము పరిసమాప్తి అయి, దానిం జదివి, దానికి పీఠిక ప్రాయముగ నీ యుపోద్ఘాతము వ్రాయు భాగ్యము నాకిచ్చినందుకు నా హృదయము ఉప్పొంగు చున్నది. సనాతనధర్మ మూలతత్త్వములగు "పరావిద్యా" విష యములు ఇక్కాలమునకుఁ దగినట్లు దేశభాషలయందును, ఆధు నిక భౌతిక శాస్త్రమార్గమున కవిరుద్ధముగను, పురాతన గ్రంథ ములయందు అతి గూఢములై, గనులయందలి రత్నములవలె విశేష ప్రయాసవలననే గాని యసాధ్యములగు బోధరత్నములను విడనాడకయు, పూర్వ సంప్రదాయములను కాలానుసారముగ ఉపయుక్తములగునట్లు ఒకచోట చేర్చి వ్రాయబడియుండు గ్రంథ ములు అరుదు. ఇయ్యది అట్టి గ్రంథము.

ఈ గ్రంథమున, పురాతన గ్రంథములయందు సంగ్రహ ముగ సూచింపబడి, దైనందిన అనుష్ఠానమునకు చాలినంత విపుల ముగ లేక, గూఢముగ నుండు, సాధనచతుష్టయ విషయము, దివ్యజ్ఞానసమాజ ఆంగ్ల గ్రంథముల[1] ననుసరించి, విస్తరించి, దిన దిన అనుష్ఠానమునకు సుబోధముగ నుండునట్లు, పూర్వ గ్రంథ

[1] (1) Path of Discipleship. (2) In the Outer Court. (3) At the Feet of the Master. (4) Talks on "At the Feet of the Master."

ములనుండి ప్రమాణములతోడ వ్రాయబడి యున్నది. జ్ఞానదీక్షలు (Initiations) పూర్వ గ్రంథములయందు అతి గూఢముగను, పరమరహస్యములుగను సూచింపబడియున్నవి. అట్టి రహస్యోపదేశములు కలవను వార్త అచ్చటచ్చట కొందఱియందు సంప్రదాయముగ నుండినను, అట్టి యుపదేష్టలు, జీవన్ముక్తులు, ఇప్పుడు కలరా యనియు, ఉండినను ఉందురు గాక, వారికిని లోకమునకును ఏలాటి సంబంధమును కల్పించుట యజ్ఞానమనియును, అట్టి మహాత్ములయందు నమ్మిక హిందూశాస్త్ర సమ్మతము కాదనియు ప్రస్తుతము హిందువులలో పలు పలు అభిప్రాయములు వ్యాపించి, శ్రద్ధాళువులగు భక్తులను సైతము అపమార్గముల ద్రిప్పుచున్నయవి. అట్టి సంశయములను పూర్ణముగ తొలగించుటకు, రెండవ అధ్యాయమునందు—జ్ఞానదీక్షలు, మహీపీఠము అనునవి చాలి యున్నవి. ఈ జ్ఞానదీక్షలను గురించి ఇంకయు వ్రాయదగిన యంశములు బాహుళ్యముగ నున్నయవి. గ్రంథవిస్తర భీతిచే గ్రంథకర్తగారు విరమించిరని తలచెద.

పైయంశములు నివృత్తిమార్గనిరతులకు గాని లౌకిక వృత్తులయం దెంతమాత్రము సంబంధమున్నను, వారి కివి యచింత్యము లేమో యను సంశయము ఎల్లయెడల కలదు. అట్టి అభిప్రాయము పొరపాటు. జనకుడు లోనగు రాజర్షులు బోధించిన "తృతీయ మార్గము" నవలంబించుచు, అంతరంగవృత్తులను శుద్ధముచేసికొని ఉత్తమోత్తమగతిం బొందుట సాధ్యము అను ఆదేశమును అనుష్ఠించుటకు తగిన ఉపాయములును, అట్లు సాధించిన పదవియందు ఉత్తీర్ణులైన వారు పర్యవసానమున లోకమున నెట్లు వర్తింతు రను

విషయములు, మూడవ అధ్యాయము మొదలు గ్రంథాంతము వరకు చాల విస్తారముగ వ్రాయబడియున్నవి.

ముఖ్యముగ స్థూల సూక్ష్మ సూక్ష్మతరము లగు నానా దేహ ములు, వాని పాటవము, వాని పారిశుద్ధ్యము, ఇంద్రియమనో ని గ్రహములు, దైహికము, ఐంద్రియ మానసిక శక్తిసామర్థ్యముల విని యోగము, పురుషార్థసాధనములగు అష్టాంగయోగములగు కర్మ జ్ఞాన భక్తిమార్గములు, వాని మూలముగ క్రమముగ సాధ్యములగు కర్మ జ్ఞాన భక్తియోగము, అట్టి పూర్ణయోగులకు నైజమును వారి యనుచరులగు ముముక్షువులకు పరమలక్ష్యమగు భూతసేవామార్గ ము—ఈ విషయములన్నియు చాల విస్తరించి వ్రాయబడియున్నవి.

అనేక సంస్కృత, ఆంధ్ర, ఆంగ్ల గ్రంథములయందు పెక్కు చోట్ల సందర్భాను సారముగ బోధింపబడియుండు గొప్ప విషయ ములు ఒకచో చేర్చి సులభముగ ఆంధ్రపాఠకులకు అబ్బునట్లు చేసి నందుకు గ్రంథకర్త సీతారామశాస్త్రిలవారు ఆంధ్రలోకము యొక్క కృతజ్ఞతకు పాత్రులైయున్నారు.

గ్రంథకర్తగారు ప్రతిఫలము ఇంచుకయైనను అపేక్షించక, పెద్దలవలన గ్రహించిన జ్ఞానరత్నములను ప్రీతిపూర్వకకైంకర్యరూప ముగ ఆంధ్రసోదరులకు అర్పించియున్నారు.

గ్రంథము ఆంధ్రలోకమున సర్వత్ర వ్యాపించి, ఆంధ్రపాఠ కుల మనంబుల రంజింపచేయుటయే గాక, పాఠకులలో కొందర నైనను మహీపీఠ ఆధికారికులగు జీవన్ముక్తుల అనుగ్రహమునకు పాత్రులుగ చేయగలుగు గాక.

చిట్టమూరు రామయ్య

# విషయసూచిక

పుట

పుట

పుట

౭ వ అధ్యాయము—శ్రవణమనననిదిధ్యాసలు ౨౧౮—౪౧౬

# ఆత్మవిచారము

## ౧ వ అధ్యాయము

నతా స్మ్స తే నాథ పదారవిందం ।
బుద్ధీంద్రియప్రాణమనోవచోభిః ।
యచ్చింత్యతేం తహ్రృదాది భావయుక్తైః ।
ముముక్షుభిః కర్మమయోరుపాశాత్ ॥

### సాధనచతుష్టయము

ఓ నాథా ! కర్మరూపకమైన మహాపాశమునుండి విముక్తులు కావలె ననియు తద్వారా మోక్షము పొందవలెననియు ఆశను పొందిన మహానుభావులు తమ హృదయాకాశమందు ధారణా యోగంబున నే మహానుభావుని పాదారవిందంబులను చింతామయముగా నునిచికొని ధ్యానింతురో అట్టి నీయొక్క పాదకమలములను జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, మనస్సు మొదలగు సర్వకరణములతోనును నమస్కరించుచున్నాము అని దేవతలు శ్రీ కృష్ణులవారిని ప్రార్థించిరి.

ఈ పుస్తకముయొక్క పూర్వభాగమునందు ౩౮ వ పుటలో ప్రజ్ఞానాంశువు అను తురీయాత్మ పాంచభౌతికప్రపంచమునందు ప్రవేశించి క్రమక్రమముగా సప్తవర్గములయందును శరీరములను సంపాదించి అనుభవములను కూడబెట్టుకొని ఆ విధమున పృథగ్భావము చెందిన తాను తనయొక్కయు తనకుకావలసినవారియొక్కయు క్షేమమునకుగా హావ్యాసములను చేయుచువచ్చి అనేకజన్మములయందు ఈ ప్రకారము అనాత్మలగు లోకసుఖములను అనుభవించుచుండెను. ఆ యనుభవములవల్ల కష్టసహితములుగాని సుఖములే లేవని తెలిసికొనెను. మరియు పరమాత్మయొక్క అనేకకోట్లలెక్కగల ఇతర అంశలకన్న తాను వేరు కాదు అను అభిప్రాయమును పదేపదే వినుచుండెను. ఇట్లు జననమరణరూపకమైన సంసారమందు యాత్రచేయుచున్నపుడు ప్రవృత్తిమార్గయాత్రచేయుచున్నాడని వాడుక.

శ్రీ మహాభారతము శాంతిపర్వమునందు ప్రవృత్తినివృత్తిమార్గములనుగురించి విస్తారముగా చెప్పబడియున్నది. ౨౦౨ వ యధ్యాయము మొదలు ౫, ౬ అధ్యాయములలోని తాత్పర్యమును క్రోడీకరించి యీ దిగువ వ్రాయబడును. శ్రీ మహాభారతములోనే ఈ భాగమును చదివితే బాగుగనుండును.

జీవాత్మ స్వభావతః పరమాత్మయే. బుద్ధి, మనస్సు, కామము, ఇంద్రియములు అను తత్త్వములను స్వీకరించి స్థూలశరీరధారి యగును. ఇంద్రియములగుండా బహిఃప్రపంచముతో సంపర్కము కలుగజేసికొనును. బహిఃప్రపంచమునందలి వస్తువులయొక్క స్వభావమును ఉన్నదిఉన్నట్టు అవగాహనపరుచుకొ

నుటకు ఇంద్రియములకు గాని మనస్సునకు గాని శక్తిచాలదు. కనుక తాము ఎంతమాత్రము అవగాహనచేసికొనినవో ఆ మాత్రము అభిప్రాయమును జీవాత్మకు అందించును. ఈ అభిప్రాయములు అంతరింద్రియమైన మనస్సునందు మనోభావములుగా నిలిచియుండును. మనస్సునందు ఇమిడియుండు మనోభావములను బుద్ధి గ్రహించి జీవాత్మకు సమర్పించుచు జన్మజన్మాంతరములయందును ఈ చర్యను మరలమరల చేయుచు బహిఃప్రపంచమునుగురించి జీవాత్మకు ఒకవిధమైన పట్టుదలను కలుగచేయుచుండును. అనేకజన్మములవరకును కామమునకును మనస్సునకును ఉద్దేశము తుల్యముగానుండును. కామమే మనస్సు అనునట్టుగా నడవడికలో కనపడును. మనస్సునకు కామముయొక్క చర్యలు చాల ఇంపుగానుండును. అంతేకాక మనస్సు కామముయొక్క ప్రేరణకు లోబడి నడుచుచుండును. ఇదంతయు ప్రవృత్తిమార్గయాత్ర.

ఈ యాత్రనే అగస్త్యమహర్షిగారు "ప్రవృత్తిమార్గనిరతా అవిద్యావశవర్తినః" అని వర్ణించిరి.

ప్రవృత్తిమార్గయాత్ర చేసి "యే తు సంస్పర్శజా భోగాః దుఃఖయోనయ ఏవ తే" అని జీవాత్మ తెలిసికొనును. అనగా బహిఃప్రపంచమునందలి విషయస్పర్శవల్ల కలుగు భోగములు ఖండితముగా దుఃఖకారణములే అని తెలిసికొని విరక్తిని కొంతమట్టుకు పొందును. ప్రవృత్తిమార్గమునందు ఇంద్రియములు, మనస్సు అను తత్త్వములు జీవాత్మకు ఎల్లపుడును తాను వేరు, లోకులు, లోకము వేరు అనియే తెలుపుచు వచ్చెను. అనేక జన్మములకుపిమ్మట నానాత్వము అను పృథగ్భా

వము అబద్ధము అని చెప్పుశాస్త్రములను జీవాత్మ అదృష్టవశమ్మున శ్రవణము చేసి

తస్మా దేవంవి చ్ఛాంతో దాంత ఉపరత స్తితిక్షుః సమాహితో భూత్వా।

(బృహదారణ్యకోపనిషత్)

బుద్ధిమంతుడై శాంతమునుపొంది (దాంతుడై) కామమును తిరస్కరించి, ద్వంద్వములకు అతీతుడై, సహనను సంపాదించికొని తనను తాను నియమించి సమాహితుడగును. ఈ స్థితి ప్రవృత్తి మార్గయాత్రయొక్క అంత్యభాగము అనవచ్చును. దీనినే నివృత్తి మార్గయాత్రకు ఆదియనియును అనవచ్చును. కనుకనే ఈ గ్రంథముయొక్క పూర్వభాగమునందు ప్రవృత్తిమార్గముయొక్క అంత్యమును నివృత్తిమార్గముయొక్క ఆదియును తుల్యములు అని వ్రాయబడియె.

శ్రీమహాభారతము, శాంతిపర్వమునందు నివృత్తిమార్గమునుగురించి చెప్పిన విషయమును క్రోడీకరించి ఈదిగువ వ్రాయనగును.

మొదట ప్రవృత్తిమార్గమునందు చేసిన ప్రయాణమును త్రిప్పుకొని వచ్చుటయే నివృత్తిమార్గము. బహిఃప్రపంచసంస్పర్శను చాలించితే అందువలన ఇంద్రియములు శాంతమును పొంది, ఇంద్రియములమూలముగా సంపాదించిన మనోభావములను వితర్కించుట చాలించురీత్యా మనస్సు శాంతమును వహించును. బుద్ధితత్త్వము ప్రవృత్తిమార్గమునందువలె మనస్సుగుండా బహిఃప్రపంచ సేవ చేయుట వదిలి శాంతిచెందును. అట్టి బుద్ధితత్త్వమునకు శుద్ధబుద్ధియని పేరు. శుద్ధబుద్ధియందు ఆత్మ ప్రతిబిం

బించును. మనస్సుకూడ ఇంద్రియములను వెదకుచు పోయి నపుడు దుఃఖములను అనుభవించుచున్నాననియు బుద్ధిని అను సరించి పోయినపుడు సుఖమును అనుభవించుచున్నాను అని యు తెలిసికొనును. ఈ నివృత్తిమార్గగమనమువల్ల జీవాత్మ సంసారచక్రభ్రమణమును చాలించవలెనని ఆశగొని ఇకమీద తనకు జననస్థానమైన సద్వస్తువును చేరవలెనని నిశ్చయించి ప్రవృత్తిమార్గయాత్రాకాలమందు తాను చేసికొనిన ఋణము లను నివర్తిచేసికొనుటకు బహువిధముల ప్రయత్నముచేయును. ఇదే నివృత్తిమార్గము.

దీనినే అగస్త్యులవారు "నివృత్తిమార్గనిరతా వేదాంతార్థ విచారకాః" అని వర్ణించిరి.

> యశ్చ మూఢతమో లోకే యశ్చ బుద్ధేః పరం గతః ।
> తావుభౌ సుఖమేధేతే క్లిశ్యత్యంతరితో జనః ॥
>
> (శ్రీభాగ—స్కం. 3, అధ్యా. 8)

> ద్వావేవ చింతయా ముక్తౌ పరమానంద ఆప్లుతౌ ।
> యో విముగ్ధో జడో బాలో యశ్చ బుద్ధేః పరం గతః ॥
>
> (శ్రీభాగ—స్కం. ౧౧, అధ్యా. ౯)

పైన ఉదాహరింపబడిన రెండుశ్లోకములయొక్క తాత్పర్యము ఏ మనగా: యుక్తాయుక్త వివేకము లేమింజేసి మూఢుడయి సంసార మందు మునుగుచు తేలుచు నుండువాడు జ్ఞానశూన్యమువల్ల తా నుండు పదవియే తనకు సుఖము అని అనుకొనును. మరియొక తరహా మనుష్యుడు, అనగా ఇంద్రియములను వశీకరించుకొని మన స్సును గెలిచి బుద్ధితత్త్వమును దాటి "యో బుద్ధేః పరత స్తు

స॥” అను నుపనిషద్వాక్యప్రకారము స్వస్వరూపానుసంధానము చేయు మహానుభావుడును సుఖియే. ఇటు మూఢుడుగాకయు అటు ముక్తుడుగాకయునుండు మనవంటివారలకు సుఖము లేదని తాత్పర్యము.

పైన చెప్పిన అగస్త్యులవారి వాక్యము అయిన “ వేదాంతార్థవిచారము ” అనుటకు ప్రయోజన మేమనగా:

వేదాంతార్థవిచారేణ జాయతే జ్ఞాన ముత్తమం ।
తేనాత్యంతికసంసారదుఃఖనాశో భవ త్యను ॥
(వివేకచూడామణి)

వేదములయొక్క అంతములు ఉపనిషత్తులు. ఉపనిషత్తులయందు జీవాత్మ ఇట్టివాడనియు పరమాత్మ ఇట్టివారనియు చెప్పబడియున్నది. వేదాంత+అర్థము=వేదాంతార్థము అనగా జీవాత్మ పరమాత్మలయొక్క స్వభావములు, సంబంధములు ఇవి మొదలుగాగల పారమార్థిక విషయములను గురించి చెప్పియున్న చదువు. వేదాంతార్థవిచారము అనగా పైవివరములను శ్రవణముచేసి మననముజేసి అర్థమును అవగాహనచేసికొనుట. మననము అనగా గురుమూలముగా వినినవిషయములను శాస్త్రములయందు చెప్పిన యుక్తులతో సమన్వయముచేసికొని మనస్సునందు ఆ విషయమును స్థిరపరిచికొనుట. ఇట్లు శ్రవణ మననములు చేసినవాడు అభ్యాసము చేయవలెనని యిచ్ఛయించును. అభ్యాసముచేయవలయును అను ఇచ్ఛకు నిదిధ్యాస యని పేరు. ఇట్టి నిదిధ్యాసవలన జ్ఞానము జనించును. అందువలన దుఃఖనాశమగును అని పైశ్లోకముయొక్క అర్థము. వేదాంతార్థవిచారమునకు బ్రహ్మజిజ్ఞాస యని పేరు.

"అథా తో బ్రహ్మజిజ్ఞాసా" అని బ్రహ్మసూత్రవాక్యము. దీని యర్థము "అందుపైన బ్రహ్మవిచారము" అని యెరుగవలయును. "అందుపైన" అనుటకు అర్థము. "తస్మా దథ శబ్దేన యథోక్త సాధనసంపత్త్యానంతర్య ముపదిశ్యతే" సాధనచతుష్టయమును సంపాదించిన పిమ్మట యని యర్థము. సాధనచతుష్టయము అనగా నాలుగు సాధనములు.

ప్రథమం – నిత్యానిత్యవస్తువివేకః.
ద్వితీయం – ఇహాముత్రఫలభోగవిరాగతా.
తృతీయం – శమాది షట్క సంపత్తిః. షట్కంనామ – శమః, దమః, ఉపరతిః, తితిక్షా, శ్రద్ధా, సమాధానం.
చతుర్థం – ముముక్షుత్వం.

మొదటి సాధనము నిత్యానిత్యవస్తువివేకము. రెండవది, ఇహాముత్రఫలభోగవిరాగతా. మూడవది శమము, దమము, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానములు అను ఆరు. నాలుగవది, ముముక్షుత్వము. ఇవన్నియు సాధనములనబడును. సాధనము అనగా సామగ్రి యనవచ్చును. ఒకడు తన దేహమునకు బలముకలుగచేసి కోవలెనంటే భోజనము చేయవలెను. ఇక్కడ భోజనము సాధనము. భోజనము చేయవలెనంటే ఆకులోనుండు అన్నము నోటిలోకి ఎగిసిపడదు. చేతుల నుపయోగించి అన్నమును ఎత్తి నోట పెట్టుకోవలెను. చేతులు సాధనములు. ఈ విధముగా బంధముల నుండి ముక్తుడుకావలెనంటే, మోక్షేచ్ఛయుండవలెను. ఇది సాధనము. మోక్షేచ్ఛకు ముముక్షుత్వము అని పేరు. ముముక్షుత్వము అనుకూలించవలెనంటే శమము, దమము, ఉపరతి, తితిక్ష,

శ్రద్ధ, సమాధానము అను సాధనములు కావలెను. ఈ గుణము లన్నియు కావలెనంటే, వైరాగ్యము అవశ్యము. మనము ఇపుడు ఉండుస్థితికన్న వేరైన మరియొక మంచిస్థితియున్న దని నిశ్చయ జ్ఞానము లేనియెడల ఇపుడు ఉండుస్థితియందు విసుకుపుట్టదు. గనుక నిత్యానిత్యవస్తువివేకము ముఖ్యము. వీటిలో పూర్వపూర్వ ములు ఉత్తరోత్తరహేతువు లని శాస్త్రములయందు చెప్పబడి యున్నవి.

## నిత్యానిత్యవస్తువివేకము.

పరమగురుచరణసన్నిధి యను గ్రంథము సాధనచతుష్టయ మునుగురించి యే వ్రాయబడినది. అందలి సంగతులు సమీప మందవతరింతు రని లోకు లెదురుచూచుచున్న మహనీయులగు జగద్గురువులవారు అనుమోదించినవి. అంతకన్న ముద్దుగా సుల లితముగా సులభముగా ద్రాక్షాపాకశైలితో వ్రాయబడిన గ్రం థము నాకు తెలియదు. ఆ గ్రంథమునందు వ్రాసినంతకంటె వివరముగా వ్రాయుటకు జీవన్ముక్తులు కానివారిచేత కాచాలదు. పరమగురుచరణసన్నిధి యను గ్రంథమునందు సాధనచతుష్టయ మునుగురించి అతి బాలశరీరధారియైన తన శిష్యునకు ఒక మహ నీయుడగు జీవన్ముక్తుడు ఉపదేశించిన విషయములన్నియు చాల సులభశైలితో వ్రాయబడియున్నవి. “యేషు సత్స్వేవ సన్నిష్ఠా” అని వివేకచూడామణియందు చెప్పిన ప్రకారము “పరమగురు చరణసన్నిధి” యందు చెప్పిన యుపదేశములను అనుష్ఠించిన శిష్యుడే జ్ఞానదీక్షను చెందును. కనుక మనమందరమును ఆ చిన్న

గ్రంథమును జాగరూకతతో చదివి, మననముచేసి, అభ్యసించి మనము ఇప్పుడుండు అజ్ఞానస్థితిని అతిక్రమించి జ్ఞానమును సంపాదించికొని విజ్ఞానమును సంపాదించుటకు సాధ్యమైన జ్ఞానదీక్షను పొందవలయును. జ్ఞానదీక్షలనుగురించి యీ పుస్తకమునందు ఒక అధ్యాయము వ్రాయబడును. ప్రవృత్తిమార్గయాత్రారంభమునందు మనుజుడు సాధారణముగా లోకవ్యవహారములందు కొంత మట్టుకు బుద్ధిశాలిగానుండినను పారమార్థికదృష్టి ఏమాత్రమైనను లేనందున జీవించియుండు శవమునుపోలినవాడు. ఒక సంస్కృతగ్రంథమునందు ప్రవృత్తిమార్గారంభమునందు జీవన్మృతులుగానుండినవారు నివృత్తిమార్గయాత్రాంత్యంబున జీవన్ముక్తులగుదురు అని చెప్పియున్నది.

పరమగురుచరణసన్నిధి యందలి విషయములను శ్రీయోగీ లెడ్బీటరుగారు తన శిష్యులకు తెలియచెప్పుచు ఆ గ్రంథమునందలి అర్థగౌరవమును వీడదీసి వ్యాఖ్యవ్రాసినట్లు ఒక గ్రంథమును హూణభాషయందు వ్రాసియున్నారు. ఆ గ్రంథమును ఆంధ్రీకరించుచున్నారని వినుచున్నాము. ఆంధ్రీకరింపబడి ప్రచురింపబడినయెడల హూణభాషాపరిచయము లేని యాంధ్రుల యదృష్టము ఫలించినదని యెంచెదము.

సాధనచతుష్టయసంపత్తి సిద్ధించవలెనను ఆశకు కారణము మోక్షేచ్ఛ. ఈ సాధనమును మనగ్రంథములయందు నాలుగవదిగా చెప్పియుండినను మోక్షేచ్ఛలేనివానికి బ్రహ్మజిజ్ఞాసయందు అభిలాష పుట్టదు.

సాధనానాం తు సర్వేషాం ముముక్షా మూలకారణం ।

(సర్వవేదాంతసిద్ధాంతసారసంగ్రహః, శ్లో. ౨౨౩)

సాధనములలోకెల్లయు ముముక్షు మూలకారణము.

శిరో వివేక స్త్వత్యంతం వైరాగ్యం వపు రుచ్యతే ।
శమాదయ ష్షడంగాని మోక్షేచ్ఛా ప్రాణ ఇష్యతే ॥

(సర్వవేదాంతసిద్ధాంతః, శ్లో. ౨౪౮)

దీనియర్థము: సాధనచతుష్టయము అను శరీరమునకు శిరస్సు ఆత్మానాత్మవివేకము. డొక్క అత్యంతవైరాగ్యము. బాహూరు పాదములు శమాదిషట్కము. ప్రాణము ముముక్షుత్వము. కనుక ముముక్షుత్వము ముఖ్యసాధనము.

ముముక్షుత్వ మనగా మోక్షేచ్ఛ. మోక్ష మనగా అవిద్య నుండియు అవిద్యవల్లపుట్టిన బంధములనుండియు వీడుట. దీనికే కైవల్యపదవి యని పేరు. కైవల్యపదవిని పొందుటకు జ్ఞానమే ముఖ్యసాధనము "జ్ఞానాదేవతు కైవల్యం" అని శ్రుతివాక్యమున్నది. జ్ఞాన మనగా నేమి అని ప్రశ్నకు

యేన భూతా న్యశేషేణ ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి ॥

(శ్రీమద్భగవద్గీత, అధ్యా. ౪ శ్లో. ౩౫)

జ్ఞానముచేత అవిద్యాకల్పిత పతిపుత్రాది అనేకరూపములను వాని పృథగ్భావమును మఱచి వానినెల్లయు నీ యాత్మయందే యున్నట్టు అనగా సర్వులు తనయందే ఉన్నారు, తనవారు, అని నమ్మి ఆ ప్రకారము అందరిని ప్రేమించి ఆదరించవలెననియు పిమ్మట మీరందరును నాయందున్నట్టు అనుభవించగలరు. అని శ్రీకృష్ణులవారు

అర్జునునికి ఉపదేశము చేసిరి. కనుక జ్ఞానమనగా సర్వాత్మైక్య భావము. అనగా లోకములో తనయందు తనకు ఎంతప్రేమయున్న దో అంతటి ప్రేమ సకలజీవాత్మలయందును చూపుట. కనుక జ్ఞానసిద్ధికిగా కావలసిన సాధనములు నాలుగింటిలో ముఖ్యమైనది ముముక్షుత్వము, అనగా గురుదేవులవారు ఉపదేశించిన ప్రకారము ప్రేమ యని యర్థము. ముముక్షుత్వము లేక ప్రేమ అను సాధనము ఎంత తీవ్రముగానుండునో అంత వేగముతో మిగిలిన అన్ని సాధనములనును ఉపాసకుడు సంపాదించును. జ్ఞానము లోకహితకరప్రేమపూరితస్థితి యైన యెడల జ్ఞానసంపాదనసాధనమైన ముముక్షుత్వము ప్రేమ అనుటకు ఎందుకు సందేహము. దృఢతరమైన ముముక్షుత్వము ముఖ్యసాధనము. ఈ గుణమును అభ్యసించువారు ఇక ముందు జీవన్ముక్తులై లోకసేవ చేయవలయును గనుక ఎంత త్వరగా ప్రేమాభ్యాసము నారంభించినను అంత మంచిది అని యెరుగవలయును.

జ్ఞానము అను పదమునకు శ్రీకృష్ణులవారు తన శిష్యుడైన ఉద్ధవునకు ఉపదేశము చేసినపుడు

> నవైకాదశ పంచ త్రీన్ భావాన్ భూతేషు యేన వై ।
> ఈక్షేతాథైకమప్యేషు తత్ జ్ఞానం మమ నిశ్చితం ॥
>
> (శ్రీమద్భాగవతము, స్కం. ౧౧, అధ్యా. ౧౯)

నవ అనగా ప్రకృతి-పురుష-మహత్-అహంకారపంచతన్మాత్ర లను జగత్కారణములు తొమ్మిది, ఏకాదశేంద్రియములు, పంచమహాభూతములు, త్రిగుణములు అను పేళ్ల నెరుగబడు ఇరువదియెనిమిది తత్వములును వ్యక్తప్రపంచమునందంతయు నిండియుండగా నీ

అన్నిటియందును ఒక్కటైన పరమాత్మతత్త్వము అనుగతముగా నున్నది కదా యని ఏ తెలివివల్ల తెలియునో ఆ తెలివికి జ్ఞాన మని పేరు అని యర్థము.

నిత్యానిత్యవస్తువివేకము నందు నిత్యమైనది బ్రహ్మము, అనిత్యమైనది జగత్తు, కనుక "బ్రహ్మ సత్యం జగ న్మిథ్యే త్యేవం రూపో వినిశ్చయః" అని వ్రాయబడినది. ఐనను ముముక్షువు ప్రతినిత్యమును లోకసేవ ఏవిధముగాచేయుచురావలెను అను విష యమునందు వివేకమును ఉపయోగించవలెను. బుద్ధిశాలి యగు మనుజుడు నివృత్తిమార్గదృష్టి పొందినపుడు, పొందతగునని కోరు వస్తువులన్నియు ఉత్తరోత్తర తాను చరించబోవు జ్ఞానమార్గము నందు తనకు ఉపయోగించునవిగానే యుండవలెను. (ధనము, అధికారము మొదలగునవి కొద్దికాలముండి పోవును గనుక ఇట్టి వన్నియును అసద్వస్తువులు. మనము బజారుకు వెళ్లి వస్త్రములైనను ఆభరణములనైనను కొనవలెనని పోతే దీర్ఘకాలము మనకు వాడుకకు రాతగినవానినిగా చూచి పరిశీలించు సంప్రదాయము కలదు కదా. నిత్యానిత్యవస్తువివేకమును ఒక విధముగా అచ్చట ఉపయోగించుచుండలేదా. ఇదే విధమున తాను సంపాదించవలెనని కోరు వస్తువులు కూడ ఒక జన్మమునందు మాత్రముపయోగ పడునవి కాక అనేకజన్మములకు ఉపయోగపడునట్టివిగా నుండ వలెను. అదే విధమున మన మితరులకు చేయు సహాయములు కూడ దీర్ఘకాలముండునవిగా నుండవలెను. నిత్యానిత్యముల పరిశీలనను సకలవిషయములయందును చేయు స్వభావము మనకు ప్రవృత్తిమార్గమునందే బాగుగా దృఢపడియున్నది. ఆ స్వభావ

మునందలి మాలిన్యములను మినహాయించి స్వచ్ఛతను ఇమిడ్చి లోకోపకారదృష్టిని ఉపయోగించవలెను.

నివృత్తిమార్గయాత్రయందు ధర్మము అధర్మము అను ద్వంద్వమునందు ధర్మమును అతిజాగ్రతతో నభ్యసించవలసియున్నది. శరీరము అంతఃకరణము వీట్లకు ధర్మము ఎంత శ్రమకలుగ జేయునట్టిదిగానుండినను ధర్మమునే ఆచరించవలసినది విధాయకము. అధర్మమును నిరాకరించవలసినది. అయ్యా, ఈ ఆచారము చాల కష్టమండీ; కొంత ఇంచుమించులుండినను చింతలేదు అనరా, అని యడుగుకొనిన యెడల శ్రీ గురుమహారాజుగారు ఏమిచెప్పుదురంటే "నాయనా, శరీరమును అంతఃకరణమునును వానికి ఇన్నిదినములును ఇష్టములుగానుండిన కార్యములను చేయుచు పోషించుకొనుచు అదేకాలమందు ఆత్మానుభవమునకుగా ప్రయత్నముచేయువాడు తనయుద్దేశమును విడనాడుకొని చెడిపోవును. ఒకానొకపుడు చాలలోతుగల నదిని దానియొక్క లోతు ఇంత అని తెలియనివాడొకడు దాటవలె నని ప్రయత్నపడి నీటిలో దిగెనట. కొంతదూరము పోగానే తనను మించిన లోతు ఉన్నదని కనుకొ్కనెనట. ఆ హా హా! ఇట్టి యవస్థయందు నీట తేలునట్టిశక్తిగల దూలము దొరికితే సులభముగా నేను ఈదుకొనిపోయి ఎదుటిగట్టు చేరగలనే అని చుట్టుచూచెనట. అపుడు తన సమీపమునందు ఒక మొసలి నీటిపైన తేలుచుండగా చూచి అతివేగముతో ఈదుకొని వెళ్లి ఆ మొసలిని, అది మొసలి యని తెలియక దూలమని నమ్మి, పట్టుకొనెనట. తర్వాత ఏమిజరిగియుండును ఊహించుము. ఈదవలెనని ఆశపడిన

వాడు ఆ మొసలివాతపడెను. ఆ విధముగా నివృత్తిమార్గయాత్ర యందు శరీరాంతఃకరణములయొక్క ఇష్టానుసారము పోవలె నని కోరువాడును చ్యుతిని చెందును. న్యాయాన్యాయముల విషయమైన చర్చ వచ్చినపుడు కొండవలె నిశ్చలుడై అముఖ్యములైన విషయములలో లోకులకు ఇష్టమైన ప్రకారము నడుచుకొని వారలను తృప్తి చెందించవచ్చును. లోకులయం దనురాగమును నడతయందు నమ్రభావమును చూపునది ఉపాసకునికి విధాయకము" అని చెప్పుదురు.

నిత్యానిత్యవస్తువివేకముయొక్క మరియొక పరిణామ మేమనగా నిరుపయోగకరములైన కార్యములను ఉపయోగకరములైన కార్యములనుండి వేరుదీయుశక్తిని సంపాదించుకొనుటయే కాక ఉపయోగకరములైన కార్యములలో కూడ మిక్కిలి యుపయోగకరములైన కార్యములను సాధారణ ఉపయోగకరములైన కార్యములనుండి వేరుతీయుశక్తిని సంపాదించుట.

"ఎల్లవారు నెఱుగ రెల్లవిద్యలన్" అని చెప్పియున్నది. కనుక నివృత్తిమార్గయాత్రాపరుడు క్రొత్తవిద్యల నభ్యసించవలయు నని ఇచ్ఛయించితే ఏ విద్యను అభ్యసించవలసినది అని నిర్ధారించుటయందు నిత్యానిత్యవస్తువివేకము నుపయోగించవలయును. అన్నివిద్యలును ఉపయోగములే. ఐనను పరోపకారమునందు మిక్కిలి ఉపయోగకరములైన విద్యలను అభ్యసించవలయును. పరోపకారముచేయు నభిలాష యెంత తీవ్రముగానుండినను విద్య లేనివాడు ఏవిధమున పరోపకారముచేయగలడు. మరియొక ఆచరణ మేదంటే, మనోమయశరీరమును సత్యమునే తలంచుమని

నియమించవలయును. తాను తలంచు తలంపులు సత్యములుగా నుండవలయును. తాను ఇతరులయందు పడు అభిప్రాయములు సత్యములైన వాక్కులను అనుసరించి యేర్పడిన అభిప్రాయములు గానుండవలెను. అదేవిధమున వాక్కునందుకూడ సత్యమునే యభ్యసించవలయును. ఇతరులు తప్పునడత నడిచినారని వినిన యెడల ఆ వినికిడిని ఇతరులతో చెప్పకూడదు. ఏలనంటే అది నిజమో అబద్ధమో తెలియదు. ఒకవేళ నిజముగానే యుండెనను కొందము. అప్పటికైనను దయాస్వభావమును వృద్ధిపరుచుకో వలె నని ప్రయత్నము చేయుచున్న ఉపాసకుడు తాను వినిన దూషణమాటలను ఇతరులతో చెప్పకూడదు. అధికముగా మాటలాడవలె నని వాగింద్రియము ప్రేరేపించుట సహజము. అయింద్రియమును దండించు నుద్దేశముతో నైనను వాఙ్నియమ మును అభ్యసించవలయును. ఇదే విధమున ఉపాసకుడుచేయు కార్యములలో కూడ నిత్యానిత్యవస్తువివేకము నుపయోగించ వలయును. మనోవాక్కాయములను దండించి స్వాధీనపరుచు కొనుట ఉపాసకునికి విధేయము.

లోకులలో నొక వాడుక కలదు. ఎవడో చేసిన సత్కార్య మును తాను చేసినట్టును తాను చేసిన దుష్కార్యమును మరి యొకనియందు ఆరోపించుటయు సహజము. నివృత్తిమార్గయాత్రా పరుడు ఈలాటి మోసమునకు లోబడకూడదు.

ఈ విధమున బహుప్రకారములుగా తనను తాను సవరించు కొను నభిప్రాయముతో ఉపాసకుడు నిత్యానిత్యవస్తువివేకమును అనుష్ఠించుచురావలయును.

నిత్యానిత్యవస్తువివేకమును మనము సంపూర్ణముగా నెరుగ వలసినది ముఖ్యము. ఆత్మవిచారము, పూర్వభాగము, పుట ౪౭ నందు ఆదిపురుషునికి ప్రజ్ఞానాంశువు లేక తురీయుడు లేక తురీయాత్మ యని పేళ్లు వాడుకలోకి తేబడియున్నవి. తురీయాత్మ యొక్క ప్రతిబింబమునకు ప్రాజ్ఞుడు, ప్రాజ్ఞాత్మ, ఆత్మబుద్ధిమనస్కుడు అను పేళ్లువాడబడెను. తురీయాత్మను ఉద్దేశించి చూచునెడల తురీయాత్మ సత్యం, ప్రాజ్ఞాత్మ మిథ్య, ఇది ఒక మెట్టు. రెండవది ప్రాజ్ఞాత్మ ప్రతిబింబించెననియు ఆ ప్రతిబింబమునకు తైజసవైశ్వానరు డని పేరు అనియు చెప్పబడెను. ఈ విషయమే ఉత్తరోత్తర సందర్భములయందు అనేక తడవలు వివరింపబడి యున్నది.

ప్రాజ్ఞాత్మ సత్యం అని యుద్దేశించి తైజసవైశ్వానరుని చింతించిన యెడల తైజసవైశ్వానరుడు ప్రతిబింబమైనందున మిథ్య. తైజసవైశ్వానరాత్మ యను రెండవ ప్రతిబింబము స్వర్గము మొదలు భూలోకస్థూలభాగ మంతటయు వ్యవహరించగల దనియు వ్రాయబడెను. ఇట్టి వ్యవహారార్థముగా స్థూలశరీర మొక్కటి, అస్థిలుబాడి యొకటి, అశుద్ధమానసశరీరము ఒకటి వెరసి మూడు శరీరముల నుపయోగించుచుండును అని చెప్పబడెను. ఈ శరీరములకు దేహములు అని పేరు. దేహములను ఉపయోగించు వానికి దేహి యని పేరు. దేహిని యుద్దేశించి దేహములు అసత్యములు. "దేహీ నిత్య మవధ్యోయం దేహే సర్వస్య భారత," అని శ్రీమద్భగవద్గీతయందు చెప్పబడియున్నది. నిత్యానిత్యవస్తు వివేకమునందు దేహి నిత్యుడనియు దేహములు అనిత్యములనియు నిశ్చయముగా తెలిసికొనుట ముఖ్యము.

దేహములకు దేహి యొకవిధమైన స్వతంత్రాధికారమును బహుకాలముగా నిచ్చియున్నాడు. అందువలన దేహములు తామే దేహియని నమ్మి వాసనాబలమువల్ల యథేచ్ఛగా వ్యవహరించు చుండును. సుబాలోపనిషత్తునందు "అన్నమయో భూతాత్మా ప్రాణమయ ఇంద్రియాత్మా మనోమయ స్సంకల్పాత్మా విజ్ఞానమయః కాలాత్మా ఆనందమయో లయాత్మా" అని చెప్పబడి యున్నది. ఇందువలన పైన చెప్పబడిన స్వతంత్రాధికారము స్థిరపడుచున్నది. దివ్యజ్ఞానసమాజపు గ్రంథములయందు భూతాత్మకు ఫిజికలు ఎలిమెంటలు (Physical Elemental) అనియు, ఇంద్రియాత్మకు డిజైయిరు ఎలిమెంటలు (Desire Elemental) అనియు, సంకల్పాత్మకు మెంటలు ఎలిమెంటలు (Mental Elemental) అనియు పేళ్లు. దేహి వేరు, దేహములు వేరు అని దృఢనిశ్చయము గలుగుట నిత్యానిత్యవస్తువివేకముయొక్క మొదటి మెట్టు. ఇట్టి జ్ఞానము కలిగితేనే కామక్రోధాదిబంధములు వదులుటకు సాధ్యమైన విచారము కలుగును.

కామము, క్రోధము, లోభము అను మూడును అరిషడ్వర్గములో చేరినవి. అరిషడ్వర్గమనగా ఆరుగురు శత్రువులు అని అర్థము. శ్రీ భగవద్గీతయందు ముఖ్యోపదేశము కామక్రోధలోభములను త్యజించవలసినది అనునదే. శత్రువులను జయించవలెనను ఆసగొన్నవాడు శత్రువులయొక్క బలాబలములను ఆమూలాగ్రముగా విచారించి రహస్యమును తెలిసికొనవలయును. కామక్రోధలోభములు నరకమునకు ద్వారములనియు వాటిని తొలగతోలినవాడు పురుషార్థసాధనమును చేసికొనుచున్నాడు

అనియు శ్రీమద్భగవద్గీత ౧౬ వ అధ్యాయమునందు చెప్పబడి యున్నది.

> కామో బుద్ధా వుదేతి ప్రథమ మిహ పున స్యుద్ధిశే త్యర్థజాతం
> తద్గృష్ణా తీంద్రియా స్యై స్తదనధిగమతః క్రోధ ఆవిర్భవే చ్చ ।
> ప్రాప్తా వర్థస్య సంరక్షణ మతిరదిలో లోభ ఏతత్త్రియం స్యాత్
> సర్వేషాం పాతహే తు స్త దిహ మతిమతా త్యాజ్య మధ్యాత్మయోగాత్ ॥
> (శతశ్లోకీ—౧౮. శ్లో.)

ఈ శ్లోకముయొక్క ముఖ్యార్థము ఉపాసకునికి పతనహేతువులు కామక్రోధలోభములు అనియు సర్వప్రయత్నేన ఈ మూటిని జయించవలయును అని.

పై చెప్పిన మూడుశరీరములలో మనకు వ్యక్తముగా కనబడు స్థూలశరీరము కొన్ని దుశ్చేష్టలు కలిగియుండును. దేహాత్మభావము అని వేదాంతసంప్రదాయమందు ఒక విషయము కలదు. అది యేమనగా స్థూలశరీరమే తాను అని జీవాత్మ నమ్ముట. స్థూలశరీర మెప్పటికిని జీవాత్మ కాదు. అయితే స్థూలశరీరము తాను కోరు సుఖములను కోరుచు ఉపాసకుని మనస్సును మోసపుచ్చి ఉపాసకుడు తానే కోరినట్టు అనుకొనునట్టు చేయును. ఆ మోసమును తెలిసికొని ఉపాసకుడు శరీరి కనుక శరీరములకు అధిపతి అని తనయొక్క అధికారమును నడుపవలయును. చాల పని చేయవలసినది శిలుకులో నుండగా స్థూలదేహము శ్రమపరిహారము పొందవలె నని తిరుగపోవలెనని గాని, భోజనము, పానముచేయవలె నని గాని, పని విడిచిపెట్టి పోనిచ్ఛయించును. మూఢుడు

దేహము కోరిన కోరికలన్నియు తానే కోరినట్టు అనుకొనును. దీనిని ఒక విధమయిన నిత్యానిత్యవస్తువివేకముచేత పోగొట్టుకో వలెను. ఈ విధముగాపలు తెఱంగులుగా దేహము మలినములైన కోరికలను కోరుచుండును. నిత్యానిత్యవస్తువివేకవంతుడైన ఉపా సకుడు విమర్శించి వివేకమును అభ్యసించవలయును.

ఇదే విధముగా కామమయశరీరము అయిన ఆస్ట్రలుబాడీ కూడ తనకు వాసనాబలమువల్ల కలుగు కామములనెల్లయు కోరు చు తానే దేహి అని నటించును. కోపించుకొనునట్టు చేయును. దుర్భాషలాడు నట్టు చేయును. ధనకాంక్ష కలిగించును. ఓర్వలే మిని పుట్టించును. ఖిన్నుడై పరవశత నొందుమని ప్రేరేపించును. ఈ దుశ్చేష్ట లేవియు దేహికి మంచివి కావు. పరమేశ్వరుని అంశరూపి యైన దేహికి ఇవి ఏవియు నవశ్యములు కావు.

ఇదేవిధమున అశుద్ధమనోమయశరీరము కూడ తనయందలి వాసనలచే ప్రేరేపించబడినదై తానే దేహి యని నటించి తానధి కము అనియు ఇతరులు అల్పులు అనియు తన మేలిమినే చూపు చుండును. ఉపాసకుడు ధ్యానమునకు కూర్చున్నపుడు అతడు పొం దవలెనని ప్రయత్నము చేయు విషయములనుండి మరలి తనకు ఇష్టములైన విషయములనే ఈ శరీరము చింతించుచుండును. ఆయితే దేహి మనస్సు కాడు. ఈ జ్ఞానము స్థిరపరచుకొనుటకు నిత్యానిత్యవస్తువివేకము కావలెను.

ఇట్లు చిన్న చిన్న విషయములయం దంతయు నిత్యానిత్య వస్తువివేకమును అభ్యసించుచువచ్చినయెడల ఆత్మకు కావలసిన మోక్షసామ్రాజ్యసంపాదనమునందు నిత్యానిత్యవస్తువివేకము నుప

యోగించుట సాధ్యమగును. ముఖ్యముగా తారతమ్యజ్ఞానమును సంపాదించుటకు ఇది అవకాశము నిచ్చును.

విత్తా త్పుత్రః ప్రియః పుత్రా త్పిండః పిండా త్తథేంద్రియం ।
ఇంద్రియేభ్యః ప్రియః ప్రాణః ప్రాణా దాత్మా పరః ప్రియః ॥

(వార్తికామృతము)

ధనమునకంటె పుత్రుడు అధికుడు, తన పుత్రునికంటె తనయొక్క శరీర మధికము, శరీరమునకంటె ఇంద్రియములు అధికములు, ఇంద్రియములకంటె అంతఃకరణ మధికము, అంతఃకరణకంటె ఆత్మ అధికుడు, అను అభిమానతారతమ్యజ్ఞానము ఈ శ్లోకము నందు సూచించబడినది. ఈ ప్రకారముగా నిత్యానిత్యవస్తువివేకమును అభ్యసించుచు రావలెను.

దేహములు జీవాత్మకు వాహనములు. స్థూలశరీరము అను వాహనమును చక్కగ నాదరించి దాని శక్తికి మించిన పనినియ్యక దానిని స్నానాదులచే పరిశుద్ధముగానుంచి పరిశుద్ధము లగు ఆహారములనిచ్చి లేశమాత్రమైనను మైలలేకుండునటుల పెంచవలెను. ఈ విషయమును బట్టియు ఆస్ట్రల్ బాడీ, అశుద్ధమనోమయశరీరము మొదలగువానిని పట్టియు ఇకముందు "దేహముల సౌష్ఠవము" అను అధ్యాయమునందు వ్రాయనగును.

ఒకవిధముగా వేదాంతమందు నిత్యానిత్యవస్తువివేకము అనుదానిని మనము లోకసేవచేయునపుడు అనుష్ఠానార్థము యుక్తాయుక్తజ్ఞానముగా అనుకోవచ్చును. దీనినే వివేకమనియు అందురు. శ్రీ పరమగురుచరణసన్నిధి యను గ్రంథమునందు ఆల్కి-

యోనీగారు బృహదారణ్యకోపనిషత్తులోనుండి మూడువాక్యములను వ్రాసియున్నారు. అవియేవన :

౧. అసతో మా సద్గమయ
౨. తమసో మా జ్యోతి ర్గమయ
3. మృత్యో ర్మాఽమృతం గమయ అనునవి.

ఈ మూడువాక్యములను గురించియు పరమగురుచరణసన్నిధి వ్యాఖ్య అను గ్రంథమునందు వివరముగా వ్రాయబడియున్నది.[1]

ఈ వాక్యములలో సదసద్వివేకమును గురించిన సూచనయున్నది.

సదసద్వివేకములో ముఖ్యాంశము ఆత్మ ఒకటి, అనేక అనాత్మలు ఆత్మను ఆవరించుకొనియున్నవని దృఢనిశ్చయము సంపాదించికొనుట. ఉపాసకుడు తాను నిర్మలమైన జీవాత్మయని నిర్ధారణగా నెరిగి అందువలన తాను నిశ్చలుడు, నిస్సంగుడుగా నుండవలసి యుండినను మనోవికారములవల్ల తన నిశ్చలత పోవుచున్నది అని గమనించి నిశ్చలతను పోగొట్టుటకు ఏమికారణము అని విచారించి ఆకారణము వేరు, తాను వేరు అని నిశ్చయించి, ఆకారణము నుండి వియుక్తుడై తాను నిలిచియున్నానని మనసా నిర్ధారణచేసికొను అభ్యాసమును ప్రతినిత్యమును కలుగచేసికోవలయును. అదేవిధమున తనయొక్క నిశ్చలతను, నిస్సంగమును నిరామయతను చెడగొట్టు సందర్భములు ఏవి ప్రాప్తించినను తానైన ఆత్మ వేరు, తనకు కలిగిన సందర్భములు వేరు అని నిర్ణయించుకొని అట్టి

[1] దివ్యజ్ఞానదీపిక, ౧౯౨౩ సం॥ మేనెల ప్రతి, ౪౯ వ పుట చూడుడు.

సందర్భములను దూరపరచవలెను. ఇది యొక అభ్యాసయోగము. మనయందుండు ఆసురసంపద్గుణములను ఒక్కొక్కటిగా పరిశీలించి "ఈ గుణము నేనుకాను" అని నిరాకరణాభ్యాసము చేయుచు రావలెను. ఈ యభ్యాసముచేయుచు తాను "కేవలశ్శివోహం" కేవల ఆత్మను అనుకొని యనుసంధానము చేయుచు అట్టి కేవల ఆత్మలుగా ఇతరులను కూడ భావించు అభ్యాసమును చేయుచు రావలయును.

ఇట్లు సర్వకాల సర్వావస్థలయందును తాను నిస్సంగుడైన ఆత్మయని మననముచేయుచు సాధ్యమైనంతకంటె కొంచమధిక ముగా అభ్యాసముచేయుచు రావలయును.

బాల్యాదిష్వపి జాగ్రదాదిషు తథా సర్వాస్వవస్థా స్వపి ।
వ్యావృత్తా స్వనువర్తమాన మహ మిత్యంత స్స్ఫురంతం సదా ।
స్వాత్మానం ప్రకటీకరోతి భజతాం యోముద్రయా భద్రయా ।
తస్మై శ్రీగురుమూర్తయేనమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥

## వైరాగ్యము

ఇది రెండవసాధనము. రాగము అనగా వెలుపటి ప్రపంచమునందలి వస్తువులయందు మనకు గల కోరికతోచేరిన సంబంధము. విరాగము అనగా అట్టిసంబంధము లేకపోవుట. వైరాగ్యము అనగా వెలుపలిప్రపంచమునకును మనకును సంబంధము కలుగజేయు "కామః క్రోధ శ్చ లోభ శ్చ తస్మా దేతత్త్రియం త్యజేత్" అనిన ఆశనును అందుయొక్క పరిణామములనును విడిచియుంచుట. కనుక వైరాగ్యమనగా "కామరాహిత్యము" లేక

పరమగురుచరణసన్నిధియందు చెప్పిన "నిష్కామత్వము" లేక ఆశలేమి. ఈ సాధనములనుగురించి "పరమగురుచరణసన్నిధి" కంటె మంచిగ్రంథము లేదు. వైరాగ్యమును సరిగా అర్థముచేసి కొని యనుష్ఠించవలయును. వైరాగ్య మనగా విషయములు తుచ్ఛములు అను జ్ఞానము. అనిత్యములైన సుఖములన్నియు తుచ్ఛ ములు. తుచ్ఛములు గనుక అవి మనకు అవశ్యములేదు. సుఖ ములవల్ల ఆనందము కలుగునని కదా వాటిపైన అభిలాష. (సచ్చి దానందమూర్తియొక్క అంశమైన జీవాత్మ ఆనందసముద్రము వంటివాడు. ఆనంద మను క్షీరసముద్రమునందు వసియించువా డైనను ఆనందపుతుంపరలనా కోరవలెను అని జ్ఞానము తెచ్చు కొని ఆనందకణములయం దభిలాష లేకయుండుట. ఇంతకుముందు ఆరంభించి యిదివరకును ఇకమీదటను కూడ అభ్యసింపబడు చుండు నిత్యానిత్యవస్తువివేకజ్ఞానమువల్ల అల్పసుఖమును ఈయ గలసంతోషములయందు నిస్పృహ పుట్టవలయును. వైరాగ్య మనేక విధములు. తాత్కాలికవైరాగ్యము అనునది యొకటి. శ్మ శానమునందు తన ప్రియమిత్రుల శరీరములు దహించబడుచుం డగా పుట్టు వైరాగ్య మొకటి కలదు. పురాణముల శ్రవణము చేయు నపుడు పుట్టు వైరాగ్య మొకటి గలదు. మృష్టాన్నము భుజించి కడుపునిండినపుడు ఆ సమయమునందు మరియు నెంత రుచికరమైన ఆహారము లభించినను దానియం దాసక్తిలేని స్థితి యొకటి. ఇవన్నియు వైరాగ్యములే యైనను నిత్యానిత్యవస్తువివే కము స్థిరముగా కుదరక యే అప్పట్లో కలిగిన అసందర్భములవలన పుట్టిన వైరాగ్యములు. దీనినే మందవైరాగ్యమందురు. ఇంతటి

కంటె మేలైనది మధ్యమరూపక వైరాగ్యము. మనలో కొందరు తల్లులు తమబిడ్డలు చనిపోయినపుడు కొన్నాళ్లు అలంకారము వదలుట, ఆహ్లాదము మానియుండుట, ఇట్టి వైరాగ్యము నభ్య సించియుందురు. ఇట్టివారికి గ్రహచారవశాత్తుగా మరల గర్భము సంభవించినపుడు వైరాగ్యము పోవును. అదేవిధమున స్త్రీలు గాని పురుషులు గాని తమ భర్తలైనను భార్యలైనను చనిపోయినపుడు తద్ద్వారా కలిగిన దుఃఖములవల్ల అహారాది విషయములయందు విరక్తికలిగియుందురు. "భార్యాదుఃఖం పునర్భార్యా" అను వచనప్రకారము వారలకు మళ్లీ వివాహమైతే ఆ వైరాగ్యము పోవును. ఇవంతయు వైరాగ్యము అని పేరుపొందుటకు అర్హ ములు గావు. కనుక నిజమైన వైరాగ్యము విచారమువల్ల సిద్ధించ వలెనే గాని వేరుకాదు.

నిజమైన వైరాగ్యము నిత్యానిత్యవస్తువివేకజ్ఞానమువల్లనే సిద్ధించును. నిజమైన వైరాగ్యము వస్తువులయొక్క స్వభావమును విమర్శించి ఆ వస్తువులవల్ల కలుగు సంతోషము ఆత్మకు లాభకర మా లేక దేహములకు లాభకరమా అని విచారించినపుడు ఏర్ప డును. ఇట్టి విమర్శ బహుకాలము అభ్యసించిన వెనుకనే విరా గము పుట్టును.

వాస్తవముగా నివృత్తిమార్గమునందు అభిలాషకలవానికి ప్రవృత్తిమార్గయాత్రాకాలమందు తాను అనుభవించిన ఐహిక సుఖములయందంతటయు అశ్రద్ధ కలుగవలయును. అట్టి అశ్రద్ధ గాని ఉపేక్ష గాని లేనియెడల తనయొక్క లక్ష్యమును తానే మరిచిన వాడై తనను తానే మోసపుచ్చుకొనును. ఇటువంటివాడు ఆత్మ

హత్యచేసికొనినవాడవును. ఫలితార్థమందు లాభము లేక, పై వేష మునకు విరక్తుడుగా కనబడియు, లోకులను మోసపుచ్చియు, తనను తానే మోసపుచ్చుకొనుచు, చెడిపోవును. కనుక నిజముగా నివృత్తిమార్గయాత్రచేయువానికి అనిత్యములైన భోగ్యవస్తువుల యందు అత్యంత ఉపేక్షయు ఉదాసీనభావమును ఉండవలయును. ఈ ఉదాసీనభావము పుట్టుటకు ముఖ్యముగా సరియైన విచారము ఉండవలయును. వస్తువులయందు దోషమున్న దని కనుక్కొనిన వారు దోషయుక్తములైన వస్తువులను సంపాదించుటకు ఇష్టపడరు. మనలో అనేకులు బజారులకు వెళ్లి వ్యాపారము చేయువారు ఎవ రైనను పాములు తేళ్లు ఇట్టి విషజంతువులను వెలపెట్టి కొని యిం డ్లకు తెచ్చుకొందుమా? తెచ్చుకోము కదా. ఏల తేము? ఆ వస్తువులయందు మనకు అనుకూలములైన గుణములు లేవు. ప్రతి కూలములును భాధకరములు నైన గుణములు ఉన్నవి. అదేవిధ మున ఉపాసనకు ఉపయోగకరములైన గుణములు లేని విషయ ములగు శబ్ద స్పర్శ రూప రస గంధములనును త్యజించవలయును.

విషయభోగత్యాగము దీర్ఘకాలప్రయత్నముపైననే సిద్ధిం చును. వర్ణాశ్రమధర్మములు సరిగా జరుపుచుండినకాలమునందు జనులు చేయుచువచ్చిన తపస్సు, కర్మలు, ఇవన్నియు వాటివల్లకలుగ గల మహోన్నతసుఖములయందు ఇచ్ఛలేకయే చేయబడుచుం డెను. ఆ తపస్సులను, కర్మలనును, మహేశ్వరప్రీతిగా సమర్పణ చేయుచువచ్చిరి. « యద్యత్కర్మకరోమి తత్తదఖిలం శంభో తవా రాధనం ” అని కర్మలను భగవదర్పణముచేయుచువచ్చిరి. మరియు శ్రీమద్భాగవతము, చతుర్థస్కంధము, ౩౦ వ అధ్యాయమునందు

ప్రచేతసులచరిత్రమునందు వారు చేసిన తపస్సు, కర్మ మొదలగు సకలఫలములనును భగవత్ప్రీతిగా దత్తముచేసిరని చెప్పియున్నది. ఇట్టిత్యాగములవల్ల వైరాగ్యము కరతలామలకముగా సిద్ధించును. సాధారణముగా మనము ఆచరించు శాకవ్రతము, లవణవ్రతము, ఏకాదశ్యుపవాసము మొదలగు వ్రతములన్నియు వైరాగ్యమును పుట్టించుటకే కదా. ఇట్టి వ్రతములవల్ల పుట్టిన వైరాగ్యమును ఉపాసకుడు కాలక్రమమున బలపరుచుకొనవలయును. మందవైరాగ్యము, మధ్యమవైరాగ్యము అను వానిని దాటి తీవ్రవైరాగ్యమును అభ్యసించవలయును.

ప్రదృశ్యతే వస్తుని యత్ర దోషః న తత్ర పుంసోఽస్తి పునః ప్రవృత్తిః ।
(సర్వవేదాంతసిద్ధాంతసారసంగ్రహము)

ఎప్పుడైతే ఒక వస్తువునందు దోషమున్నదని యొకరు తెలిసికొనిరో అపుడు ఆ వస్తువును పొందవలెనను ఆశ వారికి కలుగదు. కనుక వస్తువులయందుండు గుణాగుణములను విమర్శించవలయును.

ఇట్టి దృఢతరవైరాగ్యము అభ్యసించవలయు నని యాశగొనినవానికి ఆరుగురు శత్రువులు కలరని శాస్త్రములు చెప్పుచున్నవి. ఆరుగురుశత్రువుల పేళ్లేమియనిన— కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము అనునవి. ఇవి ఆరుగా కనబడినను ఇవన్నియు మనస్సుయొక్క చేష్టలే. కొంతమట్టుకు మనస్సుమలినమును పోగొట్టుకొనివారికి నివృత్తిమార్గయాత్రయందభిరుచియే యుండదు. కనుక ఆరుగురు శత్రువులు అను అరిషడ్వర్గమును జయించు నుపాయమును వెదుకవలయును. అటింట మొదటిది కామము. కామము అనగా కోరిక యని

యర్థము. దీనినే ఆశయనియు చెప్పవచ్చును. కామము విషయములయందు మనలను ప్రవేశపెట్టును. శబ్దాదిపంచవిషయముల యందొక్కొకటియు మనకు శ్రమలు కలుగజేయుచునేయుండును. కనుక విమర్శవల్ల విషయానుభవమునకుగా మనస్సును లాగకయుండునట్లు స్థిరపరుచుకోవలెను. విషయములకు పిమ్మట మనస్సునకు ఆరామస్థలములు ఏషణలు. ఏషణలు అనగా పుత్రేషణ విత్తేషణ భార్యేషణలు. స్త్రీలపైన పురుషులకును పురుషులపైన స్త్రీలకును కలుగు అనుబంధము, ధనమునందుకలుగు పట్టుదల, బిడ్డలయందు పుట్టు చెలిమి, ఇవన్నియు ఏషణ లనబడును. విద్యాభ్యాసము వలన కలిగిన తెలివివల్ల ఏషణలను జయించవలయును.

చదివి చదివియు జగము నసత్య మనుచు ।
జగదితర మగు బ్రహ్మమే సత్య మనుచు ।
గురుదయావాప్తి తా గాంచి గురు దలంచి ।
ఏషణాదుల వర్జించి యేపుమించి ॥

ఈ ప్రకారము చదివి విమర్శించి స్త్రీచింతనమును వదులుటకు ప్రయత్నపడవలయును. “ రంగారు బంగారు సింగారముం గేరు మంగళతర మగు నంగకాంతి । అరవిందభరమందు వెలుగందు శరదిందురుచి క్రిందుపరుచు మోము । ” అను మొదలుగాగల వర్ణనలను విని మోసపోకుండవలయు. కామము అను శత్రువు అజేయుడు గనుక అతిజాగరూకతతో నుండవలయును. ఆత్మవిచారము, పూర్వభాగము, ३౧౭ వ పుటయందు కామమునుగురించి చెప్పియున్న ప్రకారము కామము మొదలగు అరిషడ్వర్గమును జయించు ప్రయత్నము చేయవలయును. గృహస్థుడైన మనుజుడు తనకు బుద్ధి

శాలురైన పుత్రులు కలిగినపుడు తన వ్యవహారములను క్రమక్రమ ముగా తనపుత్రుల కిచ్చి తాను విరక్తి చెందవలయును.

> గుణవత్సుతరోపితశ్రియః పరిణామే హి దిలీపవంశజాః ।
> పదవీం తరువల్కవాససాం ప్రయతాః సంయమినాం ప్రపేదిరే ॥
>
> (రఘువంశము, ౮ సర్గ.)

ఇట్లు అనేక జన్మములయందు కొంత కొంతగా నభ్యసించుచు వచ్చిన వైరాగ్యము ఒక జన్మమునందు దృఢీకరింపబడవలయును. అత్యంత వైరాగ్యమే మోక్షహేతువు.

> మోక్షస్య హేతుః ప్రథమో నిగద్యతే వైరాగ్య మత్యంత మనిత్య వస్తుషు ।
>
> (వివేకచూడామణి, ౭౧ శ్లో.)

వైరాగ్యాభ్యాసమునందు ప్రమాదము సంభవించుట సాధారణము గా నుపాసకుల యనుభవము. ప్రమాదము అనగా ఏమరిపోవుట. ఆత్మవిచారము, పూర్వభాగము, ౧౬౦ వ పుటయందు చెప్పిన విధముగా మనయొక్కమనస్సు మనలనే ఏమర్చును; లోపడకూడదు.

> యోగస్య ప్రథమం ద్వారం వాఙ్నిరోధోఽపరిగ్రహః ।
> నిరాశా చ నిరీహా చ నిత్య మేకాంతశీలతా ॥
>
> (వివేకచూడామణి, ౩౬౮ శ్లో.)

యోగమారంభించువారు మౌనవ్రతమును అవలంబించి, వస్తువులు విషయములు వీట్లయందు అభిలాషను వదిలి, ఆశలను విడిచి, వైరా గ్యమును సంపాదించుటకు ప్రతికూలములైన ప్రయత్నములను వదిలి, ఎల్లపుడును ఏకాంతమునం దుండి, వైరాగ్యమును దృఢపరచి కొనవలయును. విరక్తి దృఢపడనియెడల ఇక ముందు అభ్యసించ వలసిన శమదమాదులు సాధ్యములుకావు. ఏషణాదులవర్జించుట,

విషయానురాగమును పోగొట్టుకొనుట, ఆశాపాశములను ఛేదించుట, నిత్యానిత్యవస్తువివేకము సంపాదించుట, యీరీతిని వైరాగ్యమభివృద్ధి చేసికొనుట, ఇవి యన్నియు నేక కాలమందు జరుగవలయును.

సత్కర్మక్షయపాప్మనాం శ్రుతిమతాం సిద్ధాత్మనాం ధీమతాం ।
నిత్యానిత్యపదార్థశోధన మిదం యుక్త్యా ముహుః కుర్వతాం ।
తస్మా దుత్థ మహావిరక్త్యసిమతాం మోక్షైక కాంక్షావతాం ।
ధన్యానాం సులభం ప్రియాది విషయే ష్వాశాలతా ఛేదనం ॥

(సర్వవేదాంతసిద్ధాంతసారసంగ్రహము, ౭౭ శ్లో.)

సత్కర్మలు చేయురీత్యా పాపక్షయముపొంది బుద్ధిమంతులై మనో నిశ్చయముగలిగి శ్రవణము నభ్యసించువారును, యుక్తితో పలు మారులు నిత్యానిత్యపదార్థశోధనము చేయువారును, అట్లు నిత్యానిత్యవిచారమువల్ల నుద్భవించిన దృఢవైరాగ్యము అను ఖడ్గాయుధమును సంపాదించి తత్ప్రయోజనంబుగా దేశకాలజాతినీతి మొదలగు బంధములను దాటిన ప్రేమాభ్యాసరూపకమైన ముముక్షుత్వమును కోరినవారు నగు ధన్యులకే అహంకారము, మమకారము మొదలగు ఎల్లలకు లోబడిన ప్రియాదివిషయములయందు తమకు కలిగియుండు ఆశయను తీగను ఛేదించుట సాధ్యము అని తాత్పర్యము.

ముక్తిశ్రీనగరస్య దుర్జయతరం ద్వారం యద స్త్యాదిమం ।
తస్య ద్వే అరరే ధనం చ యువతీ తాభ్యాం పినద్ధం దృఢం ।
కామాఖ్యార్గళదారుణా బలవతా ద్వారం తదే తత్త్రయం ।
ధీరో యస్తు భినత్తి సోఽర్హతి సుఖం భోక్తుం విముక్తిశ్రియః ॥

(సర్వవేదాంతసిద్ధాంతసారసంగ్రహము, ౯౭ శ్లో.)

మముక్షుత్వ మను నగరముయొక్క ప్రఖ్యాతి గల ద్వారమునకు రెండు రెక్కతలుపులు గలవు. ఆ రెండు రెక్కలనును చేర్చి దృఢముగా మూయుటకు భారీ ప్రమానిగడియకలదు. కాంత, కనకము అనునవి రెక్కతలుపులు, కామ మనునది గడియ. మోక్షద్వారమును ప్రవేశించుట కిచ్ఛయించువారు గడియను వదిలించి తలుపులను బ్రద్దలుగొట్టి గాని లోపలికి ప్రవేశించుట సాధ్యముకాదు.

ద్వేధా వేధా భ్రమం చక్రే కాంతాసు కనకేషు చ ।
తాసు తేష్వప్యనాసక్తః సాక్షాద్భర్గో నరాకృతిః ॥

అని చెప్పబడినది. కనుక సకల ప్రయత్నములవల్లను బుద్ధిశాలి యగు ఉపాసకుడు చేయదగిన దేమనగా—

వివేకజాం తీవ్రవిరక్తిమేవ ముక్తేర్నిదానం నిగదంతి సంతః ।
తస్మాద్వివేకీ విరతిం ముముక్షుః సంపాదయేత్తాం ప్రథమం ప్రయత్నాత్ ॥

(సర్వవేదాంతసిద్ధాంతసారసంగ్రహము, శ్లో. ౯౨.)

నిత్యానిత్యవస్తువివేకాభ్యాసమునుండి పుట్టిన తీవ్రవైరాగ్యమే ముక్తికారణము అని పండితులు చెప్పుచున్నారు. కాబట్టి వివేకియైన ముముక్షువు మొట్టమొదట దృఢవైరాగ్యమును సంపాదించవలయును.

వైరాగ్యము ముఖ్యముగా కామమయశరీరముయొక్క సవరణకు సంబంధపడినది. ఐహికవిషయములు నశ్వరములు అని నిత్యానిత్యవస్తువివేకాభ్యాసకాలమందు తెలిసికొంటిమి గదా. ఐహికచర్యలకు కొన్ని ఆముష్మికప్రయోజనములు కలవు. శాస్త్రసమ్మతములైన యజ్ఞములయొక్క ప్రయోజనము సూక్ష్మలోకముల

యందు అనుభవములగుండా కలుగునని ఆత్మవిచారము, పూర్వ భాగము, ౨౮౮ వ పుట మొదలు కొన్ని పుటల వరకును వివరించ బడియున్నది. కారణములే నశ్వరములైనపుడు వానియొక్క కార్య ములు కూడ నశ్వరములే కావలయును. కనుక ఇహలోకమునందు గాని ఆముష్మికలోకములందుగాని మనకు లభించు సుఖములను ఆ శించక వదలవలయును. అన్నియపేక్షలును బంధములే. “ కేవల మోక్షాపేక్షా సంకల్పోబంధః ” అని నిరాలంబోపనిషత్తునందు చెప్పబడియున్నది. కనుక జీవలోకమునందు ప్రేమాచరణ మను ఆశ తప్ప మిగిలిన ఆశలనన్నిటిని వదులుకొనవలెను. ప్రేమాచరణము నందుకూడ మనము ఒకనికి మేలుచేసినపుడు వానికి మనము ఎం తటిమేలుచేసినాము అని పరిశీలించి యానందించు మోహమొ క్కటి యుండును. అది ఉండకూడదు. అంతేకాక మేలుపొందిన వానికి మేలుచేసిన మహానుభావుడను నేనండీ అని తెలిపించవలయు నను ఆశయుండును. మరియు మేలుపొందినవాడు తనకృతజ్ఞతను మనకు చూపవలయుననియు ఆశయుండును. చూచినారండీ. అట్ల యినయెడల అదియు కామమే. ఆత్మవిచారము, పూర్వభాగము, ౨౫౬ వ పుటయందుచెప్పిన ప్రయోజనమే కలుగును. కనుక అట్టి కోరిక యుండకూడదు. అప్పటికే అది నిష్కామకర్మయని పేరు పొందును. లోకసేవచేయుటకు ఉద్దేశము ప్రేమతప్ప వేరేమియుగా నుండకూడదు. ప్రేమ ప్రతిఫలము నాశించదు. అదేకాక ఉపాస కుడు ఎన్నడును యోగసిద్ధులు లభించవలెనని ఆశపడకూడదు. దూరశ్రవణము, దూరదృష్టి, భావపరివర్తనము, పరేంగితజ్ఞానము మొదలగు సిద్ధులనంతయు కోరకూడదు. ఉపాసకునియందు స్వాభి

మానము అను దుర్గుణము మాసిపోవుచురాగా క్రమేణ పైవివరించిన సిద్ధులు తాముగానే ఉద్భవించును.

ఉపాసకుడు తాను యోగ్యుడని అనిపించుకోవలెనని యాశించకూడదు. పదిమందిలో తాను మంచివక్త అని అనిపించుకోవలెనని యాశపడకూడదు. ఇవన్నియు గర్వోద్రేకము కలుగజేయును. గర్వము పతనహేతువు.

మౌనవ్రతము నభ్యసించవలయును. ఇందుకనే " నిరాశా చ నిరీహా చ నిత్యమేకాంత శీలతా " అని చెప్పబడినది. బహు మాటలాడు అభ్యాసమున్నపుడు మాటలాడువానికి తెలియకనే అహంకారము పుట్టి తాను మహావాగ్ధురిగలవాడని జనులు సన్మానించుచున్నారని యొక గర్వము పుట్టును. ఆ సన్మానమును కాపాడుకొనుటకుగా మరల మరల మాటలాడవలసియుండును. అతిమాటలు అయినపుడు సత్యమునందు దృష్టిలేకపోవును. అసత్యమో సత్యమో మాటలాడుదురు. ఈ విధముగా అసత్యప్రవచనమునందిదివరకును ఏర్పడియుండిన అసూయ మరిచిపోయి సత్యాసత్యములకు భేదమే తెలియకపోవును. జనసమూహముతో కలిసి మాటలాడుటతగ్గించుటకుగా ఏకాంతశీలత. లేక జనులతో కలిసిమెలసియుండవలసినపుడు మౌనము లేక మితభాషణము. ఇది క్షేమకరము.

<u>షట్సంపత్తి</u>

అనగా ఆరు గుణములను పొందియుండుట. ఆరుగుణములు ఏవి అనిన—౧. శమము, ౨. దమము, 3. ఉపరతి, ౪. తితిక్ష, ౫. శ్రద్ధ, ౬. సమాధానము అని యెరుగవలయును.

సాధనచతుష్టయసంపత్తియందు ఒక చిత్రము ఏమనగా నాలుగు సాధనములును ఒకటితో నొకటి అన్యోన్యసంబంధము కలిగియుండుటవలన అన్ని సాధనములును ఏకకాలమందు కొంచ మించు మించుగా సిద్ధికావలెను. మోక్షేచ్ఛ ముఖ్యకారణ మని యిదివరకే చెప్పబడెను. మోక్షేచ్ఛయందు మంద మధ్యమ తీవ్ర ము లను భేదములు గలవు. మందమోక్షేచ్ఛగలవానికి మంద వైరాగ్యమే సాధ్యము. మందవైరాగ్యము గలవానికి మందనిత్యా నిత్యవస్తువివేక మే సాధ్యము. ఇట్లు మోక్షేచ్ఛయొక్క స్వభావము మారునట్లంతయు వైరాగ్యాది సాధనములయొక్క స్వభావము మాగుచుండును. తీవ్రమోక్షేచ్ఛగలవానికి తీవ్రవైరాగ్యము కలు గును. అదే విధమున మిగిలిన సాధనములన్నియు లభించును. ఒక విషయమును మరువకూడదు. అది అనగా సాధనములలో ఒకటిని పరిపూర్ణముగా సంపాదించినతరువాతనే మరియొకసాధన మును సంపాదించవలెను అని కాదు. ఇల్లు కట్టువాడు ఇంటిలో నాలుగు గదులు, తాళ్వారములు మొదలగు అంగములతో ఇల్లు కట్టుట కుద్దేశించును. గుణావర్ధనము వేయునపుడు ఇంటికంతయు కావలసిన గుణావర్ధనమును ఒకటే తడవన వేసి అన్ని గదులను అన్ని తాళ్వారములనును ఒకటే తూరి కట్టుచువచ్చునుకదా. ఒక గదికి కావలసిన గోడలను కట్టి పిమ్మట మరియొక గదికి కావలసిన గోడలను కట్టు సంప్రదాయము లేదు కదా. అన్ని గదులను అన్ని తాళ్వారములనును ఒకటే తడవ కట్టునట్టుగా సాధనముల నన్నిటినిని ఏకకాలమందే సంపాదించవలయును. నిత్యానిత్యవస్తు

A 5

వివేకము, వైరాగ్యము, ఈ గుణములను సంపాదించుచుండి నపుడే శమాదిషట్కసంపత్తియు కూడ జరుగుచుండును.

శమము అనగా మనస్సును నిగ్రహించుట. దమము అనగా శరీరమును ఇంద్రియములను స్వాధీనపరుచుకొనుట. ఉపరతి యనగా ద్వంద్వాతీతుడై యుండుట. తితిక్ష కీడుచేసినవానికి బదులు కీడు చేయకయు తనకు సంభవించిన శ్రమకు, దుఃఖమునకు వ్యసనపడకయే ఓర్చుకొనియుండుట. శ్రద్ధ యనగా శ్రీగురుమహారాజుగారి వాక్యములందును శాస్త్రములయందును ధృఢమైన నమ్మకము. సమాధానము అనగా భగవంతునియందును కర్మఫలములయందును నమ్మకముతో నుండుట.

శమము అను మనోనిగ్రహాభ్యాసము చాల కష్టమైనది. ఆత్మవిచారము, పూర్వభాగము, ౫ వ అధ్యాయమునందు మనస్సుయొక్క శక్తులనుగురించి బహుబాహుళ్యముగా వ్రాయబడియున్నది. అంతటి శక్తివంత మైన మనస్సును స్వాధీనపరుచుకొనిన గాని నివృత్తిమార్గయాత్ర సిద్ధించుట అరుదు. ఏలనంటే

బంధశ్చ మోక్షో మనసైవ పుంసాం అర్థో ప్యనర్థో ప్యము నైవ సిద్ధ్యతి ।
శుద్ధేన మోక్షో మలినేన బంధో వివేకతో ర్థో ప్యవివేకతో న్యః ॥
రజస్తమోభ్యాం మలినం త్వశుద్ధం అజ్ఞానజం సత్త్వగుణేనరిక్తం ।
తిరస్కృతం సన్న తు వేత్తి వాస్తవం పదార్థతత్త్వం హ్యుపలభ్యమానం ॥

(సర్వవేదాంతసిద్ధాంతసారసంగ్రహము)

మనుష్యుని బంధమునకుగాని మోక్షమునకుగాని మనస్సే కారణము. అదేవిధమున అర్థమునకును అనర్థమునకును. మనస్సు

శుద్ధముగా నుంటే మోక్షప్రాప్తి, మలినమైతే బంధము. రజో గుణము, తమోగుణము, వీట్లచేత నిండినపుడు మలినము. అపుడు మనస్సు వస్తువుల వాస్తవమును ఆత్మకు కనుపరచదు.

వాయువు ఏవిధముగా మేఘములను గుమిగూరిచి వర్షప్రద ములుగా జేయునో అదే వాయువు అదే మేఘములను ఛిన్నాభిన్న ములుగా పారదోలి వర్షశూన్యము చేయునో అట్లు ఆత్మకు దేహేం ద్రియాదులయందు అనురాగము కలుగజేసి తద్ద్వారా బంధము కలుగజేసి పశువును త్రాటితో కట్టినట్టు కట్టిపెట్టును. కొంత తెలివి కలిగినపుడు ఆ మనస్సే దేహాదులయందు వైరాగ్యము కలుగజేసి ఆత్మకు మోక్షోపాయమును చూపును.

సహాయముననైనను అనిష్టప్రాప్తికైనను కారణభూతమైన మనస్సును స్వాధీనపరుచుకొనిన గాని నివృత్తిమార్గయాత్రాపరు డైన ఉపాసకునికి క్షేమప్రాప్తి లేదు. శమము అను సాధనమువల్ల తెలిసికొనదగిన విషయము ఏమనగా మనస్సునకు ఏదైనను యోగ్య మైన విషయమును చూపి, ఓ మనస్సా, నీవు ఈ విషయమును వదిలి ఇటు అటు తిరుగవద్దు సుమా యని నిబంధనచేయుట. "స్వల క్ష్యే నియతావస్థా మనస శ్శమ ఉచ్యతే" అని వివేకచూడామణి యందున్నది. ఆత్మవిచారము, పూర్వభాగమునందు ౧౮౧ వ పుట మొదలు ౧౯౫ వ పుట కొనవరకును చెప్పియుండు విషయములను ఈ సందర్భమునందు చదువవలయును. నివృత్తిమార్గమునందు శ్రవణమననములకు సిద్ధపడవలసినందుకు ప్రవృత్తిమార్గమందలి ఏ కాగ్రచిత్తము అను శక్తినే అనేకంతలు అధికపరుచుకోవలెను. మనస్సునకు రెండు స్వభావములు గలవు. అనగా ఇంద్రియములు

వాని వానికి సంబంధపడిన విషయములను వెదకుకొని వెళ్లినపుడు ఆ యింద్రియములవెంబడి పరువెత్తు స్వభావము ఒకటి. (శ్రీ మద్భగవద్గీత, ౨ వ అధ్యా, ౬౭ వ శ్లోకము చూడుడు). అటు గానపుడు తనలో తానే సంకల్పించుచుండుట మరి యొకటి. ఇటు ఇరువైపుల చెరుపు గలదు. దమము అను సాధనము శరీరమును ఇంద్రియములను నియమించుట అని పైన చెప్పబడియె. ఇంద్రియ ములను నియమించి నిలిపినట్లైతే అవి విషయములను వెదకుకొని పోవు. ఇంద్రియములు పరువిడనపుడు మనస్సును పోదు. కనుక ఒక ప్రక్కనుండి మనస్సునకు కలుగు తొందర లేకపోవును. రెండవ తొందర ఏదియనిన మనస్సు తానుగానే పుట్టించుచుండు సంకల్ప ములు. ఆ సంకల్పములు చాలమట్టుకు అరిషడ్వర్గ మైన కామ క్రోధలోభమోహమదమాత్సర్యము అను గుణములను ఆశ్రయించి నవి గానుండు. అట్టి సంకల్పములు పుట్టుటకు అవకాశము నియ్య కుండుటకు శీలమును అభ్యసించి తద్వారా వైరాగ్యమును దృఢ పరిచికొనినపుడు సంకల్పములను ప్రేరేపించు శత్రువులు లేక పో దురు. కనుకనే

ప్రాచ్యోదీచ్యాంగసద్భావే శమ స్సిద్ధ్యతి నా న్యథా ।
తీవ్రా విరక్తిః ప్రాచ్యాంగం ఉదీచ్యాంగం దమో దయః ॥

(సర్వవేదాంత సిద్ధాంతసారసంగ్రహము, ౧౦౧ శ్లో.)

అనగా ముందువెనుక పార్శ్వములందు బలము ఉంటేనే శమము సిద్ధించును. మునుపు పార్శ్వపు బలము తీవ్రవైరాగ్యము, వెనుకటి బలము దమము అని యర్థము. మనస్సునందు తానుగా పుట్టు సంక

ల్పములను శీలము, తీవ్రవైరాగ్యము చేరి పుట్టనీయవు. ఇందువలననే ఆత్మవిచారము, పూర్వభాగమునందు ౮ వ అధ్యాయము ‘‘శీలము’’ అని వ్రాయబడినది. ఆ యధ్యాయమును చదివి మననము చేయ వలయును.

శ్రీ కృష్ణమూర్తి ఉద్ధవునకు ఉపదేశముచేసినపుడు శ్రీమద్భాగవతము, ఏకాదశస్కంధము, ౧౯ వ అధ్యాయమునందు ‘‘శమోమన్నిష్ఠతాబుద్ధిః’’ అని చెప్పిరి. అనగా భగవత్కైంకర్యముచేయుటయందు నిశ్చలమైన బుద్ధికలిగియుండుట యని యర్థము.

నివృత్తిమార్గయాత్రచేయు ఉపాసకుడు ధ్యానాభ్యాసమునందు అమరియుండవలసినవాడు. ధ్యానమునకు పూర్వము ప్రత్యాహారము అను ఏకాగ్రచిత్తతయు ప్రతినిత్యమును ధ్యానము చాలించియుండు సమయమునందు మనశ్శాంతియు అత్యావశ్యకము. ధ్యానాభ్యాసమువల్ల మనస్సునకు ప్రతినిత్యమును వీర్యము అధికమగుచుండును. సంకల్పములకు గాని చిల్లరకోపములు, అసూయలకు గాని అధికమయిన శక్తి కలుగుచువచ్చును. ధ్యానాభ్యాసము చేయువాడు ఎవరినైనను కోపించుకొనినయెడల కోపమునకు పాత్రుడైనవానికి దేహమందు వ్యాధిగాని వేరు తొందరగాని ఆ కోపముయొక్క ఫలముగా సంభవించును. చదువరులారా! వినుదురు కదా! పురాణములయందు కౌశికుడు అను బ్రాహ్మణోత్తముడు ఒకనాడు ఒక వటవృక్షముక్రిందనుండగా ఆ వృక్షము పైనున్న కొంగ యొకటి విష్టించినది తనపైన పడెనని కోపించుకొని ఆ కొంగను చూచినమాత్రమున ఆ కొంగ చచ్చిపడె నని చదివి యున్నాము కదా. తపోబలమువల్ల కౌశికునివలెనే మనకందఱకును

సంకల్పశక్తి వృద్ధిచెందుచున్నది. వీర్యమును సంపాదించిన మనస్సు తో కోపముచేసికొంటే మనచుట్టునుండువారలు మన కోపశక్తిచే చావను సాధ్యమగును. నిరర్గళముగా దిగ్దేశకాలపాత్రజాతికుల గోత్రభేదములను మరిచి ప్రేమప్రవాహముతో లోకేశునియందు భక్తితో లోకహితముచేయవలసినదే చిహ్నముగా గల ముము క్షువులైన ఉపాసకులు తాము మేలుచేయవలసియుండగా "జ్ఞానతః అజ్ఞానతోవా" ఇతరులకు మన కోపఫలరూపమైన ఉపద్రవమా చేయవలెను? చూడుడీ, కనుకనే ఎంత అపరాధము ఒకరు చేసినను కోపమురాకుండునటుల మనస్సును అంకుశమువేసియుంచుట శమముయొక్క ఉద్దేశము. ఇది చెప్పుట సులభము. ఆచరణ కష్టము. ఐనను ఆచరించవలసినదే.

మఱియు వ్రాయుచుండినను చదువుచుండినను మన లేత బిడ్డలు దోగాడుచు మనవద్దికి వచ్చి ఆడుకొనునపుడు శిరాబుడ్డిని దొర్లించిరో, చదువుచున్నపుస్తకమును చించిరో మనకు విసుకుపుట్టునట్లు చేయుట గృహస్థులకు అనుభవమే కదా. అప్పట్లో మనము విసుకును ఆగ్రహమును చూపుటయు మన అనుభవమే. అయ్యా, గమనించినారా? ఆ విసుకు, ఆ ఆగ్రహము వీటి ఫలితార్థముగా మన బిడ్డలు ఏదో జ్వరముతోనో తలనొప్పితోనో జబ్బుపడునదియు మనకు తెలిసిన విషయమే. జబ్బు ఎందువల్ల వచ్చుననగా మహావీర్యవంతమైన మన ఆస్ట్రల్ బాడీయొక్క, విసుకును ఆగ్రహమును కలుగజేసిన, స్పందములు చిన్నబిడ్డయొక్క బల హీనమైన దేహమును తాకినందున లేతశరీరము ఓర్వలేక జబ్బు కలిగినది. ఇట్లు ఇతరులకు ఉపద్రవముకలుగునట్లు నడుచుకొని

అందుల ప్రతిఫలంబుగా పాపము సంపాదించకుండుటకు శమము ముఖ్యము.

కోపసహితవిసుకునుగురించి పైనవ్రాయబడెను. అదేవిధమున ఆతురమును చెడ్డదే. లోకవాడుకయందు "ఆత్రగానికి బుద్ధి మట్టు" అని చెప్పుట కలదు. ఆతురము ఆస్ట్రిల్ బాడీయందు అతివేగములైన స్పందములను కలుగజేసి ఆతురగానియొక్క మనస్సును దృష్టిని గూడ భ్రమింపజేయును. తాను ఆతురపడినాడని.యనుకోక యితరులు మడియతనముతో తనకు కష్టమునో అననుకూలమునో కలుగజేయుచున్నారని వారలపైన కోపము వచ్చును. అది తప్పు. అప్పుడును తనకోపమువల్ల ఇతరులకు శ్రమ కలుగును. పదేపదే కోపగించుకోవడమువల్ల దేహమునందలి నరములు వదులుపడును. నరములు వదిలినపుడు మనస్సునకు స్థైర్యము లేకపోవును. బలహీనములైన నరములుగలవానికి భయము పుట్టును. భయమువల్ల భ్రమ కలుగును. ఇవంతయు ముఖ్యముగా కావలసిన శాంతము అను గుణమును మనయందు దిమడకుండునట్లు చేయును. "కామక్రోధోద్భవం వేగం" అని శ్రీమద్భగవద్గీతయందు చెప్పబడియున్నది.

మనస్సునందు స్థైర్యమును సంపాదించినవానికి ధైర్యము కలుగును. నివృత్తిమార్గయాత్రాపరునికి ధైర్యము అతిముఖ్యము. దుఃఖములు వచ్చినపుడు మనస్సునకు క్షోభకలుగకూడదు. నివృత్తిమార్గయాత్రాపరునికి ఆత్మవిచారము, పూర్వభాగము, 300 వ పుటయందు చెప్పిన ప్రకారము కర్మప్రవాహము క్రోడీకరించి

యివ్వబడును. మహాకష్టములన్నియు వచ్చును. రాకుంటే కర్మ క్షయము కాదు. కనుక కర్మానుభవప్రవాహమునందు "దుఃఖే ష్వనుద్విగ్నమనాః" అని యుండవలసినది. బహిః ప్రపంచము నుండి ఉపాసకునికి కలుగు దుఃఖములు, శ్రమలు, రోగములు, నష్టములు, ఇవన్నియు తృణప్రాయములు అని నమ్మి మనస్సు నందే జనించతగిన శ్రమలను పుట్టనీయక యుండవలయును.

ఉపాసకుడు ఎప్పుడును ఖేదపడకూడదు. కష్టములు వచ్చిన పుడే ఖేదము కలుగును. కష్టములన్నియు పూర్వజన్మములయందు ఉపాసకుడు చేసిన కర్మలయొక్క ఫలములు కదా. కర్మఫలము వచ్చి కర్మక్షయము కావలె నని ప్రార్థించువాడు తన కోరిక ఈడేరినపుడు దుఃఖపడవచ్చునా? మఱియు ఖిన్నుడైనవానిని చూచి ఇతరులు ఖేదము చెందుదురు. వారలను ఖిన్నులుగా జేసిన పాపము ఉపాసకునిని చేరును.

ఈ ప్రకారమే ఇతర మనోవికారములను కూడ జయించి ఖేదమును వదులుకొన్నట్టే యితర వికారములను కూడ జయించుచు రావలయును. ఇదంతయు శమము అనబడును. వికార రాహిత్యమువల్ల పుట్టిన స్తిమితమువల్లనే భగవత్కైంకర్యమును చేయుటయందు నిష్ఠ కలుగును. అపుడే "శమోపన్నిష్ఠతా బుద్ధిః" అనిన వచనము ఫలించును.

దమము అనగా శరీరముయొక్కయు ఇంద్రియములయొక్కయు చేష్టలను ఉపాసకుడు స్వాధీనపరచుకొనుట. శరీరమును సోమరితనమును ఆశించకుండునటుల చేయవలయును. ఇందుకనే సనాతనధర్మమతమునందు పంచపంచ ఉషఃకాలము మొదలు రాత్రి

పదిగడియలవరకును ఆ యా కాలములయందు కాలాతీతము కాకయే అనుష్ఠానములు జరుపవలె నని విధింపబడియున్నది. వృథా కాలయాపనకు గాని అజాగ్రతకుగాని సాధ్యము లేక చేయబడియున్నది. కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, శరీరము అన్నిటికిని కాలోచితకర్మలు నిర్ధారింపబడియుంటే సోమరితనమునకు వీలు లేదు. ఇంతే కాదు. శరీరమును స్వాధీనపరుచుకొనుట అనగా తాము చేయు సకలకార్యములనును సుష్ఠుగా జేయుట. “యోగః కర్మసు కౌశలం” అని చెప్పబడియున్నది. స్వధర్మము అనగా ఉపాసకుడు తాను చేయుదునని ఒప్పుకొనిన కర్మను ఉపేక్షచేయకూడదు. ఇతరులు చేయు కర్మలు తనకు ఎంతరుచికరములుగా నుండినను తన ధర్మమును మరిచి యితరుల ధర్మమును అవలంబించకూడదు. ఉపాసకుడు చేయు ప్రతికార్యమును సుష్ఠుగా చేయవలయును. ధర్మమునకుగా చేయుకార్యము, ఏమి అంతసుష్ఠుగా చేయకపోతే అని అశ్రద్ధచేయకూడదు.

> శ్రుత్వా స్పృష్ట్వా చ దృష్ట్వా చ భుక్త్వా ఘ్రాత్వా శుభాశుభం ।
> నహృష్యతి గ్లాయతి యః స శాంత ఇతి కథ్యతే ॥
>
> (జ్ఞానవాసిష్ఠము, ముముక్షుప్రకరణము)

ఇష్టమైనవో ఇష్టముకానివో అగు విషయములను విని, స్పర్శించి, చూచి, భుజించి, ఘ్రాణించి సంతోషము గాని విసుకు గాని చెందని మనుజుడు శాంతము చెందినవాడు అనదగును. ఈ విధముగా నింద్రియములను శరీరమును స్వాధీనపరుచుకొనినవారికి మనస్సు కూడ స్వాధీనమే. ఇంద్రియములు ఇప్పటిస్థితియందు సూక్ష్మస్పం

దములను గ్రహించుశక్తి పొందియుండలేదు. ఆ శక్తి పొందు నట్లు సిద్ధపరుచు అభ్యాసములకు కూడ దమము అని పేరు.

ఉపరతి యను శబ్దమునకు అర్థము ఇదివరకును ఉపాసకుడు తెలిసికొని యనుభవించి యుండు వృత్తులకు పైగా నిలుచుట. ఇదివరకును ఇచ్ఛ—ద్వేషము, సుఖము—దుఃఖము, ఉష్ణము—శీతము, అను ద్వంద్వములను ఎరిగియుండెను. ఇపుడు ద్వంద్వములకు పై మెట్టులో నిలిచి ద్వంద్వములమార్పులకు లోపడక నిరామయుడు గానుండు స్థితి. అహంకారమమకారములు, స్వపర (అనగా తనవారు పరాయివారు) భేదములు, ఇవన్నియు ప్రవృత్తిమార్గమునం దనుభ వించియుండెను. నివృత్తిమార్గయాత్రయందు నావారు, నావారు కారు, అను వ్యత్యాసములు వదిలి ప్రేమప్రవాహరూపమైన ముము క్షుత్వమును అవలంబించి యుండు ఉపాసకుడు ఉపరతియందు అనగా ద్వంద్వసహిష్ణుతయందు ఎల్లపుడును మనస్సును ఉంచియుండవలెను. దేశాచారములయందు భేదములు ఉండును. కొన్ని తమకు ఇష్ట ముగానుండును, కొన్ని అసూయ కలుగజేయునవిగా నుండును. పై వేషములు దేశములనుపట్టి మారుచుండును. తాను అవలంబించి యుండు వేషభాషలకు విరుద్ధములైన వేషభాషలు గలవారియందు ప్రేమ తక్కువగానుండ కూడదు.

స్వస్థానవేషభాషాభిమతా స్సంతో రసప్రలుబ్ధధియః ।

రసికజనులకు స్వస్థానవేషభాషలయందు అనురాగముండుట న్యా యమే. "జాతినీతికులగోత్రదూరగం నామరూపగుణదోషవర్జితం" అనినట్టు జాతియు, నీతియు, కులమును, గోత్రమును, నామమును, రూపమును మొదలగు బంధములయందు చిక్కక సర్వాతీతుడైన

ఈశ్వరునియొక్క అంశమైన తురీయాత్మను కనుగొనుటకు ప్రయత్నము చేయుచుండు నివృత్తిమార్గయాత్రాపరునికి పై చెప్పిన ఎల్లలు కూడదు గనుక ఉపరతి యను ద్వంద్వాతీతత అవశ్యము. మనకంతయు గల ఎల్లలదాటినవారిని సంన్యాసులు అని చెప్పుట సంప్రదాయము. అందువలననే ఉపరతియను శబ్దమునకు సంన్యాసము అనియు అర్థము కలదు.

ఉపరతి నివృత్తిమార్గనిరతునికే గాని ప్రవృత్తిమార్గనిరతునికి గాదు. "ప్రవృత్తిమార్గనిరతా అవిద్యావశవర్తినః" అను అగస్త్యవాక్యము 3 వ పుటయందు వ్రాయబడియున్నది. వైదికకర్మలు మోక్షసాధనములు గావు. మోక్షసాధనము జ్ఞాన మొక్కటియే. "జ్ఞానా దేవ తు కైవల్యం" అని చెప్పబడియున్నది. జ్ఞానముచేతనే మోక్షము. జ్ఞానము శ్రవణమనననిదిధ్యాసలవల్ల కలుగును. "కామీ కర్మణ్యధికృతః నిష్కామీ శ్రవణే మతః" అని చెప్పబడియున్నది. కర్మఫలాపేక్షగలవానికి కర్మయందధికారము. నిష్కామికి శ్రవణమునందధికారము. నివృత్తిమార్గనిరతుడు నిష్కామి యని సిద్ధాంతమే కదా. కర్మఛాందసమునును మూఢాభిప్రాయములనును వదలవలెను. నివృత్తిమార్గనిరతునికి కర్మలు మూఢాభిప్రాయముల వంటివి.

నిత్యం నైమిత్తికం చాపి సర్వం కర్మ స సాధనం ।
ముముక్షుణా పరిత్యాజ్యం బ్రహ్మభావ మభీప్సునా ॥

ఉపర్యుప ర్యహంకారో వర్ధతే కర్మణా భృశం ।
అహంకారస్య విఛ్ఛిత్తిః శ్రవణేన ప్రతిక్షణం ॥

(సర్వవేదాంతసిద్ధాంతసారసంగ్రహము.)

నిత్యకర్మలు, నైమిత్తికకర్మలు అను సర్వకర్మలనును ముముక్షువైన ఉపాసకుడు వదిలిపెట్టవలయును. ఏలయనగా కర్మలుచేయుచు రాగా అహంకారము వృద్ధియగుచుండును. అహంకారమును పోగొట్టుకోవలె నని ముముక్షువు సర్వప్రయత్నము చేయుచుండగా కర్మములను ఆచరించవచ్చునా. అహంకారఛేదనమునకు కారణమైన శ్రవణమును చేయవలెను. కర్మలు చేయుటవలన కర్మహీనులైన రామాశాస్త్రీ, పూవాడ కుప్పాశాస్త్రిలు, సాతులూరి డుక్కోజిరావు, వీర్లందరికంటె నేనధికుడను కదా యని యహంకారము పుట్టుచుండును. "చిత్తస్య శుద్ధయే కర్మ న తు వస్తూపలబ్ధయే" అని చెప్పబడియున్నది. చిత్తశుద్ధికలిగిన పిమ్మట కర్మలవల్ల ప్రయోజన మేమియు లేదు. ఈ కాలమందు కర్మచేయుటకంటె భిక్షమెత్తి ఆ సొమ్మును సత్కార్యములకు దానముచేయవచ్చును. పురోహితుని సహాయమువల్లనే కర్మలు జరుగవలసియుండును. వసిష్ఠులవారు సూర్యవంశపురాజులకు పురోహితులు. ధౌమ్యాచార్యులవారు పాండవులకు పురోహితులు. గర్గాచార్యులవారు యదుకులమునకు పురోహితులు. ఇట్టి మహానుభావుల పౌరోహిత్యము క్రింద కర్మలు జరుపువారికి క్షేమము తక్క వేరేమి కలుగును. ఇప్పటికాలమందు వేఱు. ఏ విధముననైనా జీవనము జరుపుకోలేని మూఢులగు బ్రాహ్మణవేషధారు లగు వ్రాత్యులు పురోహితులు. వ్యుత్పత్తిజ్ఞానము సున్న. అధ్యయనము అంతకంటె సున్న. యోగ్యతో మొదలే లేదు. "ముఖం దగ్ధం పరాన్నేన హస్తౌ దగ్ధౌ ప్రతిగ్రహాత్ । మనోదగ్ధం పరస్త్రీభిః......" అనిన పరాశరవచనము లన్వయించు పురోహితులే మనకు దొరకువారు.

"అక్రోధనైః శౌచపరైః సతతం బ్రహ్మవాదిభిః" అనిన వాక్య ప్రకారము గుణములు గల పురోహితు డొక్కడైనను దొరుకునా! ఇట్టి పురోహితుల సహాయంబున చేయుకర్మలు భస్మమందు చేసిన హోమముతో సమానము. ఒక ఔపాసనకర్మమైనను సరిగా చేయించు యోగ్యత లేదు. వాచారంభణవికారములే గాని వేరు కాదు. కర్మలను వదలుకొన్నవారికే సంన్యాసు లని పేరు. కనుక ఉపరతికి సంన్యాస మని యర్థము రూఢిగా కలదు. జ్ఞానమువల్లనే మోక్షముగాని కోటికర్మలు చేసినను మోక్ష మబ్బదు.

> కోటీంధనాద్రిజ్వలితోపి వహ్నిః అర్కస్య నార్హాత్యుపకర్తుమీషత్ ।
> యథా తథా కర్మసహస్రకోటిః జ్ఞానస్య కిం ను స్వయ మేవ లీయతే ॥
>
> (సర్వవేదాంతసిద్ధాంతసారసంగ్రహము.)

వంటచెరుకులు కొండంతపొడుగున పేర్చి నిప్పు పెట్టి వెలుతురును కలుగజేసినను ఆవెలుతురు సూర్యుని కాంతితో సమానమవునా? ఆ విధముగా ఎన్ని కర్మలు చేసినా జ్ఞానముతో కలుగు ఫలము లభించునా? ఉపరతిని అభ్యసించువాడు మతవైషమ్యమునకు స్థలమియ్యకూడదు. అన్నిమతములును పరమేశ్వరుని కనుగొను త్రోవలే. కనుక వైషమ్యము కూడదు. ఇట్లు ఉపరతిని అభ్యసించుచురావలెను.

<u>తితిక్ష</u> యనగా సదా సంతోషభరితాంతరంగుడుగా నుండుట. తితిక్షనుగురించి ౩౮ వ పుటయందు వ్రాసినయర్థమును చదివి మననము చేయవలయును. ఉపాసకునికి సంభవించు సుఖదుఃఖములన్నియు పూర్వజన్మములయందు అతడు కలుగజేసిన కారణ

ములకు సంబంధపడినకార్యములే కదా. ఈ అర్థము పరోపదేశ మున కుపయోగమేగాని స్వానుష్ఠానమున కుపయోగపడుట అరు దు. ప్రాక్కర్మయొక్క ఫలితార్థముగా సంభవించున వన్నియు కష్టములుగానే యుండవచ్చును. అప్పటికైనను ఆ కష్టములన్ని యు నుపాసకుడు ముందెపుడో చేసియుండిన కర్మయొక్క ఫలములే కదా. కర్మక్షయమైన గాని నివృత్తిమార్గయాత్రయొక్క ఫలితార్థ మైన నిరంతరాయప్రేమాచరణము జరుగదు. గురుదేవులవారి యింట శుశ్రూషచేయుచున్న శిష్యులకు జాతాశౌచ మృతాశౌచ ములు కూడ లేవు. తనయింటి క్షేమలాభముల తలంపున్నయెడల శుశ్రూష జరుగదు. అదేవిధమున నివృత్తిమార్గమందు బంధ విముక్తి చేసికొనుటకు ప్రయత్నముచేయు నుపాసకునికి కర్మబంధ ముండినయెడల సంకిళ్లు పడినట్టుగానుండును గనుక సర్వకర్మక్షయ ము కావలెను. ఇది నిశ్చయముగా నెఱిగినవానికి కొంత దుఃఖ శాంతి.

ఉపాసకునికి ఒకరెవరో చెడుపుచేసినారని తెలియవచ్చిన పుడు ప్రతిఅపకారముచేయవలె నని మొట్టమొదట తోచును. ఇట్టు తోచుట ప్రవృత్తిమార్గయాత్రాపరునికి ధర్మముగా నుండ వచ్చును గాని నివృత్తిమార్గయాత్రాపరునికి ధర్మము కాచాలదు. ప్రతిఅపకారము చేయుట క్రొత్తగా చేయు కర్మ; ఆగామికర్మ. దాని ఫలమును ఉత్తరోత్తర అనుభవించవలసియే యుండును. కనుక కర్మక్షయము కాలేదు. కర్మవృద్ధి అయినది. కనుక ప్రతి అపకారము తలవకూడదు. ప్రతిఅపకారము చేసితే ఉపాసకుని అహంకారము కొంతమట్టుకు తృప్తిచెంది తనకు కలిగిన దుఃఖ

మును మరుచుటకు ఇష్టపడును. ప్రతిఅపకారము చేయనందున దుఃఖచింతయు, దుఃఖము కలిగినందుకు ఏడ్పును కలుగును. ఇట్టి చింతయు ఇట్టి ఏడ్పును కూడ మంచివి గావు. దీనివలన తనకు కలిగిన దుఃఖముయొక్క జ్ఞాపకమును మరలమరల ఉజ్జీవనము చేయుచుండును. ఇతరుల అపరాధములను మరిచిపోవలసిన ధర్మము కలిగి యుండవలసినపుడు మరుపు రానీయక జ్ఞాపకమునే వృద్ధిపరుచుకొనుచుండుట ఉపాసకుని యుద్దేశమునకు హాని. చింత, దుఃఖము, విలాపము ఇవన్నియు అస్ట్రిలుబాడీకి చేరినవి. అస్ట్రిలుబాడీయందుండు మలినములను పోగొట్టి శుద్ధిచేసికొనుట ముఖ్యము. ఇట్లుండగా ఉన్న మలినములతో కూడ క్రొత్తమలినములను చేరనీయకూడదు.

శ్రీమద్భాగవతము, ఏకాదశస్కంధము, ౨౩ వ అధ్యాయమునందు భిక్షుగీత యని యొక అపూర్వవిషయమునుగురించి వ్రాయబడియున్నది. ఆభాగమును చదువరులు ముఖ్యముగా చదువవలయును. ఈ భిక్షుగీత చదివి తితిక్షను సంపాదించుకోని వారలకు ఇంతకంటె విశదముగా తితిక్షనుగురించి చెప్పు గాథను నేను చదువలేదు.

అస్ట్రిలుబాడీయొక్క సౌష్ఠవమునుగురించి వ్రాయునపుడు తితిక్షనుగురించి కొన్ని వివరములు వ్రాయబడును.

జ్ఞానమార్గమునందు అనుష్ఠానము జరుపుతురాగా నికమీద ఉపాసకునికి తారకోపదేశముచేయగల జీవన్ముక్తులు ఉపాసకుని యొక్క ప్రయత్నములను మరుగునుండే గమనించి ఉపాసకుడు ఎంతతీవ్రముతో శీలమును సంపాదించుచున్నాడో గమనించుచుందురు. జ్ఞానదీక్షజరిగిన పిమ్మట ఉపాసకుని మనస్సునకు అవాఙ్మన

సగోచరము అనునంతశక్తి పుట్టును. శాపానుగ్రహాశక్తి అతిసులభముగా కలుగును. శక్తిపుట్టినపుడు క్షమ లేకపోయినట్లైతే జ్ఞానమార్గమునందు తనకు కలిగిన ప్రేమప్రవాహరూపముగా పరిణమించవలసిన శక్తిని యితరుల యుపద్రవమునకు గానుపయోగించుట సాధ్యమవునేమో. గనుక గురుమహారాజుగారు శిష్యుని అనేక విధములఁబరీక్షించి చూచి తితిక్ష గలవాడా కాడా అని పరిశీలించుచుందురు.

శ్రీ మహాభారతమునందు కిరాతార్జునముష్టియుద్ధమును చదువవలయును. అర్జునుడు పాశుపతాస్త్రము సంపాదించుటకుగా తపస్సు చేసినపుడు పశుపతి కిరాతుని వేషముధరించి అర్జునునితో తగువులుపెట్టుకొని ఆ వ్యాజముతో అర్జునుని దేహబలమును మనోదార్ఢ్యమును పరీక్షించెను. పిమ్మట పాశుపతాస్త్రము నిచ్చెను. కనుక తితిక్షయను సాధనమును శ్రమపడి పరిపూర్ణముగా సంపాదించవలయును. తితిక్షలేనివారికి జ్ఞానశక్తి లభించదు.

<u>శ్రద్ధ</u> అను పదమునకు వివేకచూడామణియందు చెప్పిన అర్థము.

> శాస్త్రస్య గురువాక్యస్య సత్యబుద్ధ్యవధారణా ।
> సా శ్రద్ధా కథితా సద్భిః యయా వస్తూపలభ్యతే ॥

శాస్త్రములయందు చెప్పిన విషయములయందును గురుమహారాజుగారు ఉపదేశించు విషయములయందును నిష్కాపట్యమైన నమ్మకము. నమ్మకము అను పదమునకే చాలమందికి అర్థము తెలియదు. నిప్పు ఉష్ణముకలది అను నమ్మకముయొక్క ఫలము అనుష్ఠానము

నకు నిప్పును తాకితే చేతులు బొబ్బలుపోవును అని ఏవిధముగా తాకమో అట్టిది నమ్మకము. ఎందుకంటే శాస్త్రములు అంత ప్రమాణములు అని ప్రశ్నచేయవచ్చును. ఆత్మవిచారము, పూర్వ భాగము, ౯౨ వ పుట యందు "విససర్జ మహీపీఠం లోక స్యాజ్ఞాన శాంతయే" అని మొదలగు విషయములను గురించి వ్రాయబడి యున్నది. ఆ భాగమును ఇపుడు చదువవలయును. శ్రీసనత్కుమారాది మహర్షులు ప్రజలపైన అనుగ్రహముతో అజ్ఞానమును పోగొట్టి జ్ఞానమును ఇయ్యవలె నని శాస్త్రములను విద్యలను ఇచ్చినారు. ఆ శాస్త్రములు మనయొక్క మేలుకొరకే గనుక అవి ప్రమాణములు. వానియందు దృఢమైన నమ్మకము ఉండవలెను.

గురుమహారాజుగారి వాక్కులయందు ఎందువలన నంటే అంతనమ్మకముండవలె నని యడుగవచ్చును. శ్రీగురుమహారాజు గారికి లోకులయం దందరియందును అవిచ్ఛిన్నప్రేమ యుండును. అయినను వారు తాముగా మనను తనకు శిష్యులు కమ్మని అడుగుకొనలేదు. మనమే సంసారమందు చిక్కులుపడి వారిని శరణు పొందితిమి. రోగార్తుడైన యొకడు వైద్యులను వెదకికొనిపోయి వారివల్ల ఔషధములు పుచ్చుకోవలె నని కోరుకొనినపుడు వైద్యుడు ఇచ్చిన మందులయందలి ప్రయోజనమును పొందనిచ్ఛయించితే వారు విధించిన పథ్యమును సరిగా నడుపుచురావలెను కదా. పథ్యము అశ్రద్ధచేసితే రోగము గుణముకాదు. కనుక వైద్యునివాక్కులు ప్రమాణములు. గురుమహారాజుగారు సాధారణరోగములను నివారణచేయువారు కారు. "యోగీంద్ర మీడ్యం భవరోగవైద్యం" అని గురుమహారాజుగారిని వర్ణించియున్నా

రు. సంసారము అను జననమరణప్రవాహరూపమైన అజ్ఞానదశను పోగొట్టువారని యర్థము. మరియు ఆత్మవిచారము, పూర్వభాగము, ౩౦౯ వ పుటయందు ఆచార్యోపాసనం అను స్థలమునందు శ్రీమద్గురుమహారాజుగారి మాహాత్మ్యమునుగురించి వివరింపబడియున్నది. ఆభాగమును ఇపుడు పఠించవలెను.

"ముక్తస్యేశ్వర రూపత్వాత్" అని చెప్పియున్నది. జీవన్ముక్తులు ఈశ్వరునితో సమానులు. కనుక ఈశ్వరునికిని గురువులవారికిని వ్యత్యాసమేమియు లేదు. ఈశ్వరవాక్కులు శాస్త్రములు. గురువులవారి వాక్యములు ఉపదేశములు. కనుక ఈరెంటియందును దృఢనమ్మకముండవలెను.

ఇక ముందు సమాధానము అను సాధనమును అభ్యసించు సమయమునందు ఉపాసకుని శక్తికి మించినంత భక్తియు, ధ్యానమును, కర్మయోగమును అనుష్ఠించుచురావలసియుండును. అతి సులలితములైన వాక్కులు గురుదేవులవారినుండి వినుచుండుట సులభము. ఆ ఉపదేశములను అనుష్ఠించుట చాల కష్టము. కష్టమైనపుడు ఉపదేశములయందు విశ్వాసము తగ్గవచ్చును. తగ్గినయెడల అనుష్ఠానము జరుగదు. కాలాంతరేణ పతనము సాధ్యము. కనుక దృఢమైన నమ్మకము ఉండవలెను. అపుడే అనుష్ఠానములు నిరంతరాయములుగ జరుగును. కనుక శ్రద్ధ యను సాధనమును బహు దృఢముగా నేర్పరుచుకోవలెను.

ఉపాసకుడు గురుదేవులవారిని వెదకుకొనిపోవుటకు కారణము సంసారతాపమువల్ల కలిగిన బాధ. సంసారబాధనే సుఖము అని భావించినవారికి నివృత్తిమార్గమునందు పనియుండదు. ఉపా

సకుడు ఖిన్నుడై సంసారదుఃఖములను ఓర్వలేక విసికి సంసారము అను సముద్రముయొక్క ఆవలిగట్టెక్కి యిక సంసారబాధకు లోబడకయుండవలె నని గురువులవారియొక్క ఆశ్రయమును వెదకి పోవును. గురుమహారాజుగారిని స్తుతించి వారి అనుగ్రహమును కోరి మనవిచేసుకొన్న విషయములు ఈ దిగువనుండు శ్లోకముల లో వివేకచూడామణియందు వ్రాసియున్నారు.

౧. స్వామిన్ నమస్తే నతలోకబంధో కారుణ్యసింధో పతితం భవాబ్ధౌ । మా ముద్ధ రాత్మీయ కటాక్షదృష్ట్యా ఋజ్వా తికారుణ్య సుధాభివృష్ట్యా ॥

౨. దుర్వారసంసారదవాగ్నితప్తం దోధూయమానం దురదృష్టవాతైః । భీతం ప్రపన్నం పరిపాహి మృత్యోః శ్శరణ్య మన్య ద్యదహం న జానే ॥

3. శాంతా మహాంతో నివసంతి సంతో వసంతవల్లోకహితం చరంతః । తీర్ణా స్స్వయం భీమ భవార్ణవం జనా నహేతునా న్యానపి తారయంతః ॥

౪. అయం స్వభావః స్వత ఏవ యత్ పరశ్రమాపనోద ప్రవణం మహాత్మనాం । సుధాంశు రేష స్వయ మర్కకర్కశ ప్రభాభితప్తాం అవతి క్షితిం కిల ॥

౫. కథం తరేయం భవసింధు మేతం కావాగతి ర్మే కతమో స్త్యుపాయః । జానే న కించి త్కృపయావ మాం ప్రభో సంసారదుఃఖక్షతి మాతనుష్వ ॥

ఈ శ్లోకముల అర్థము——

హే స్వామిన్, తమకు నమస్కారము. తమను శరణుజొచ్చిన వారికి తాము బంధువువంటివారు. కరుణానిధి. తమయొక్క కరుణ అను కటాక్షదృష్టిచే నన్ను సంసారసాగరమునుండి కాపాడుడీ.

అపారమైన సంసారము అను దావాగ్నివల్ల తపింపబడుచు దురదృష్ట
ము అను గాలి ఆ దవాగ్నిని బలపరుచుచు నన్ను కష్టపెట్టుటవల్ల
నేను భయముచెందినవాడను. తమ పాదారవిందములను ఆశ్ర
యించి నాడను. నన్ను మృత్యువునుండి కాపాడవలయును.
స్వామిన్, శాంతులైన మహాత్ములు తమవంటివారు వసంతఋతు
వువలె నిర్హేతుకముగా లోకులయందు దయను చూపుచున్నారు.
తామే మో సంసారసాగరమును దాటి ఆనందానుభవమునందు
మునిగియుండినను మావంటి మూఢులు కోరుకోకయే మమ్మును
కాపాడుటకు సిద్ధముగానున్నారు. ఇది తమవంటి సత్పురుషులు
స్వభావతః ఆచరించు మార్గము. పగట్లో సూర్యకిరణముల వేడిమిచేత
డస్సిపోయిన లోకమును సూర్యాస్తమనానంతరము అప్రార్థితుడు
గానే చంద్రుడుదయించి తన చల్లని కిరణములతో భూమిని చల్లా
ర్చుచుండును గదా. అట్లే తాము అప్రార్థితులుగానే లోకుల
కష్టములను నివారణచేయువారే కదా. స్వామిన్, ఈ సంసారసాగర
మును ఏవిధమున దాటగలను, నాకేమి గతి, ఉపాయ మేమున్నది,
నాకేమియు తెలియదు. కనుక కృపతో నన్ను కాపాడవలయును,
స్వామిన్, అని యర్థము.

సంసారతాపతప్తుడైన శిష్యుడు శ్రీ గురుదేవులవారిని పై
వివరించినప్రకారము స్తోత్రముచేయగా దయార్ద్రచిత్తులైన గురు
వులవారు శిష్యునిదుఃఖమును నివర్తిచేయదలచి ఊరడించి మాట
లాడుదురు.

మా భైష్ట విద్వం స్తవ నాస్త్యపాయః
సంసారసింధో స్తరణేఽస్త్యుపాయః ।

యేనైవ యాతా యతయోఽస్య పారం
తదేవ మార్గం తవ నిర్దిశామి ॥

(వివేకచూడామణి)

హే విద్వాన్, వినుము. నీవు భయపడనక్కరలేదు. నీకు ఒకపుడును అపాయము లేదు. సంసారసాగరమును దాటుట కుపాయమున్నది. ఏ ఒకటే మార్గముగుండా యతులు ఈ సంసారసాగరమును తరించిరో ఆ మార్గమునే నీకు నేను కనుపరుచుచున్నాను. ఆమార్గమునందు జాగరూకతతో నడువవలయును అని ధైర్యము నిత్తురు.

శ్రీ గురుమహారాజుగారి వాక్యములయందు దృఢమైన నమ్మకముండవలయు నని చెప్పినపడు వారు ఇచ్చెడి ధైర్యమునందు నమ్మకముండవలెను. "యేనైవ యాతా యతయోఽస్య పారం" అని సూచింపబడిన మార్గమునకు జ్ఞానతపస్సని పేరు. శ్రీమద్భగవద్గీత నాలుగవ అధ్యాయమునందు ౩౪ వ శ్లోకము "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా । ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్వదర్శినః ॥" అని చెప్పినట్లు శిష్యుడు గురువుల వారిని ఆశ్రయించి ప్రణిపాతమును చేసెను. గురువులవారు జ్ఞానోపదేశము చేయ నారంభింతురు. జ్ఞానము అను పదమునకు అర్థము ౧౦ వ పుటయందు వ్రాయబడియున్నది. జ్ఞానమునే నిష్ఠగా జేసికొనియుండు స్థితికి జ్ఞానతపస్సని పేరు. "బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః" అని భగవద్గీత నాలుగవ అధ్యాయము, ౧౦ వ శ్లోకమునందు చెప్పబడియున్నది. జ్ఞానతపస్సనగా సర్వజీవాత్మైక్య ఆచరణము. జ్ఞానతపస్సువల్ల "మద్భావం" బ్రహ్మభావమును చెందగలరు.

సర్వజీవాత్మైక్యజ్ఞానమునే శ్రీ గురుదేవులువారు ఆచరించుచున్నవారు. “తీర్ణాస్స్వయం భీమభవార్ణవం జనా నహేతునాన్యా నపి తారయంతః” అని ౫౧ వ పుటయందు చెప్పబడియున్నది.

జ్ఞానతపస్సుయొక్క ముఖ్యాచరణము లోకసేవ. ఇది మొదలు ఉపాసకుడు చేయు సర్వకర్మలును శ్రీగురువులవారి కర్మలుగానే యుండవలయును. కనుక సర్వకర్మలును లోకసేవగానే యుండవలెను. స్వప్రయోజనార్థము చేసినపుడు కర్మలను ఎంతజాగరూకతతో చేయుచువచ్చితిమో అంతకంటె నధికమైన జాగరూకతతో లోకసేవాకార్యములను చేయవలయును. శిష్యునికి కండ్లపడకయే గురుదేవులవారు జ్ఞానదృష్టితో ప్రతినిమిషమునందును శిష్యుడు చేయు సకలకార్యములయొక్క ఉద్దేశమునను ప్రతికార్యమును ఎంత సుష్ఠుగాచేయుచున్నాడా యనియును పరీక్షించుచుందురు గనుక శిష్యుడు గురువులవారు సమక్షమమందున్నపుడు ఎంత సుష్ఠుగా చేయునో అట్లు పరోక్షమందు కూడ చేయు నభ్యాసమును సంపాదించవలయును.

పురాణములయందు జ్ఞాననిష్ఠకు ఆరంభించువారిని జ్ఞానమార్గమునందు పోనీయక మరలించుటకుగా ఎన్నియో కామములను మొదలగువాటిని చూపి ధృక్పథమును మార్చుటకు కొందరు దేవతలున్నారని వినుచుందుము. కఠోపనిషత్తునందు “ఇమా రామా స్సరథా స్సతూర్యాః” అను వచనములను చదివినయెడల తెలియవచ్చును. ఇట్టి ప్రత్యవాయములు ఈ శిష్యునికి అనేకములు సంభవించును. అపుడు శ్రద్ధ అను సాధనముయొక్క బలమువల్ల దృక్పథము మారనీయక కాపాడుకొనవలయును. అనేక వేలసంవ

త్సరములకు ముందే శిష్యునియొక్క తురీయాత్మ జ్ఞానమార్గము నవలంబించెద నని నిశ్చయించుకొనెను. శిష్యునియొక్క తురీయాత్మ అను పదములకు అర్థము లేదు. శిష్యుడు తురీయాత్మయే కదా. ఈ పుస్తకము, ౧౬ వ పుటయందు తురీయాత్మయొక్క సత్యత్వమును అనువాదించియున్నది. తురీయాత్మయొక్క తీర్మానమును అనుసరించి ప్రాజ్ఞాత్మ ఇపుడు గురువులవారి సన్నిధియందు శుశ్రూష చేయుచున్నాడు. కనుక తురీయాత్మ యైన శిష్యుడు తన నిశ్చయమును తీర్మానమును మరువకూడదు.

## సమాధానము

> సర్వథా స్థాపనం బుద్ధేః శుద్ధే బ్రహ్మణి సర్వదా ।
> తత్సమాధానం ఇత్యుక్తం న తు చిత్తస్య లాలనం ॥
>
> (వివేకచూడామణి)

అన్ని విధములచేతను శుద్ధమైన బ్రహ్మమునందు సదా సర్వకాలమందును బుద్ధిని నిలుపుటకు సమాధానము అని పేరు. ఈ సాధనము అతి ముఖ్యమైనది. నిత్యానిత్యవస్తువివేకమువల్ల నిత్యమయిన వస్తువునే ఆశ్రయించవలయు నని తెలిసికొనిన శిష్యుడు నిరంతరాయభజనమువల్ల శుద్ధమైన చైతన్యమునే ఆశ్రయించి యుండు ననుట సందేహించవలసియుండదు. ఎల్లపుడును నివృత్తిమార్గయాత్రాపరుడు భగవంతుని ఆశ్రయించి లౌకికకర్మలను చేయుచు చేయు కర్మల నన్నిటిని భగవంతునియందు తనకుగల ఐక్యభావమువల్ల ప్రేరేపింపబడినవి అనియే చేయవలయును. "యద్యత్కర్మ కరోమి తత్త దఖిలం శంభో తవారాధనం" అని భగవంతునికి తాను చేయు కర్మలన్నియు సమర్పించుచు రావలయును. ఈ సందర్భ

మందు ఆత్మవిచారము, పూర్వభాగము, ౫౯౬ వ పుట చదువ వలయును.

> యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వ మిదం తతం ।
> స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః ॥
>
> (శ్రీమద్భగవద్గీత, అధ్యా. ౧౮, శ్లో. ౪౬)

ఈశ్వరుడు అంతర్యామిగానుండి ప్రాణులకు ఉత్పత్తి మొదలగు స్థితులను కలుగజేయును. ఆ ఈశ్వరుడే సమస్తమైన ప్రపంచమును వ్యాపించియుండును. ఆ ఈశ్వరుని మనుష్యులు ఆరాధించుచుండ వలెను. ఆరాధనవిధాయక మేమనగా ఈశ్వరసంకల్పమునందు తనకు గా నేర్పడియుండు కర్మలను శ్రద్ధతో ఆచరించి వానిని భగ వంతునికి అర్పణము చేయుట. ఇట్లు చేసినయెడల మనుజుడు సిద్ధిని చెందును. ఇట్లు చేయు కర్మలకు కర్మయోగ మని పేరు. కర్మ యోగమును గురించి ముందు వ్రాయబడును. కర్మయోగము, భక్తియోగము, ధ్యానయోగము, జ్ఞానయోగము అను యోగ ములన్నియు సమాధానము అను సాధనమును పొందుటకుగా ముఖ్యముగా ఉపయోగము. కొన్ని యోగవిధానములయందు భగవంతునియందు భక్తి అవశ్యమని విధించకపోయినను శ్రీమ ద్భగవద్గీత, ౬ వ అధ్యాయమునందు ౪౭ వ శ్లోకము

> యోగినా మపి సర్వేషాం మద్గతే నాంతరాత్మనా ।
> శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః ॥

చిల్లరదేవతల నుద్దేశించి ధ్యానముచేయు యోగులందరిలోనును నాయందు నిలుపబడిన మనస్సుగలవాడై శ్రద్ధ అను సాధనమును అభ్యసించుచు గురువులవారి ఉపదేశము రీత్యా నాయందు భక్తి

గలవాడై నన్ను సేవించుచున్నాడో (సర్వప్రాణులయందును ప్రేమను చూపి ఆ విధముగా నన్ను భజించుచున్నాడో) అట్టి యోగి అతిశ్రేష్ఠుడని నాయభిప్రాయము.

సర్వవిధములచేతను, మూలాసేచనన్యాయమును అనుసరించి భగవద్భక్తిసహితసర్వప్రాణిసేవనే చేయుచుండవలయును. మూలాసేచనన్యాయ మనగా నొక పెద్ద వృక్షమునందు అనేక ఆకులు ఉండును. ఒక్కొక ఆకును ఒక ప్రాణియను కొందము. మనకు ఇష్టమైన ఒక ఆకును పూజించి, ప్రేమించి, ఆదరించి, దానిని ప్రాణదాయక మైన నీటితో తడుపుచు మిగిలిన ఆకులను అంతగా గమనించకయు ఆకులకన్నిటికి మూలకారణమైన చెట్టును ఉపేక్షించియు నుండిన యెడల నీరు లేమింజేసి వృక్షమే యెండిపోవునట్లైతే మనము ప్రేమించిన ఒక్క ఆకుకూడ వృక్షముతో సహా ఎండిపోవును. కనుక మనము ప్రేమించిన ఒక్క ఆకుకు చేసిన ఉపచారమంతయు వృక్షమునకే చేసియుండినయెడల వృక్షము బాగుగా ఉండియుండును. అప్పట్లో మనము ప్రేమించిన ఆకుకూడ క్షేమముగానుండును. ఈ వాదమునకు మూలాసేచనన్యాయము అని పేరు. కనుక "అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే। ఇతి మత్వా భజంతే మాం బుధాః భావసమన్వితాః ॥" సర్వమునకు కారణమైన భగవంతునియందు భక్తింజేసి సర్వప్రాణుల సేవ చేయవలయును.

పైనచెప్పిన శ్రీమద్భగవద్గీత, ౬ వ అధ్యాయము, ౪౭ వ శ్లోకమునందు "శ్రద్ధావాన్" అనిన పదము గురుభక్తి యుండవలెనని సూచించుచున్నది.

శివప్రసాదేన వినా న సిద్ధిః శివప్రసాదేన వినా న బుద్ధిః ।
శివప్రసాదేన వినా న యుక్తిః శివప్రసాదేన వినా న ముక్తిః ॥
యస్యప్రసాదేన విముక్త సంగాః శుకాదయ స్సంసృతి బంధముక్తాః ।
తస్యప్రసాదో బహుజన్మ లభ్యః భక్త్యేక గమ్యో భవముక్తిహేతుః ॥
(సర్వవేదాంతసిద్ధాంతసారసంగ్రహము)

భగవత్ప్రసాదము లేకనే సిద్ధిగాని, బుద్ధిగాని, యుక్తిగాని, ముక్తి గాని లభించదు. భగవత్ప్రసాదము వల్లనే శుకమహర్షి మొదలగు వారు విముక్తసంగులై సంసారబంధమునుండి తప్పించుకొన్నారు. అట్టి భగవత్ప్రసాదము అనేకజన్మములయందు చేయుచువచ్చిన పూజాఫలము. అదే సంసారబంధమోక్షకారణము. ఇట్టి భగవ త్ప్రసాదము మనకు సులభముగా లభించుటకు " తస్మాత్సర్వేషు కాలేషు మా మనుస్మర " అని చెప్పిన ప్రకారము ఎల్లప్పుడును భగవంతుల వారిని స్మరించు అభ్యాసమును ఏర్పరుచుకొనవలయును.

ఏహ్యేహి బుద్ధే భవభీతిశాంత్యై గచ్ఛాశు గోవిందపదారవిందం ।
యద్యంతరా త్వాం విషయానిహన్యుః క్రోశ త్వమంభోరుహలోచనేతి ॥

ఓ చిత్తమా, రమ్ము. నీకు హితము కావలెనంటే సంసారము వలన కలుగు భయమును పోగొట్టుకొనుటకు శీఘ్రముగా శ్రీకృష్ణ పాదారవిందమును చేరుము. దారిలో విషయములు నిన్ను పీడించు నెడల " అంభోరుహలోచనా " అని స్వామినిగూర్చి మొఱపెట్టు ము. వారి నామస్మరణమువలననే అవి తొలగిపోవును. నీ యభీష్ట ము సిద్ధించును అని యర్థము.

ఇట్లు భగవత్ప్రార్థనచేయుట కొందరికి సాధ్యము; మరి కొం దరికి దృగ్గోచరుండై సకల దైవీసంపద్గుణంబులకును స్థానమై గురు

స్వరూపంబున శిష్యులను కాపాడునుద్దేశంబుతో మానవశరీరధారి యైన భగవంతుడే యగు గురువులవారిని ధ్యానించుట సులభము.

శివ ఏవ గురు స్సాక్షాత్ గురు రేవ శివ స్స్వయం।
ఉభయో రంతరం కించిత్ న ద్రష్టవ్యం ముముక్షుభిః ॥
(సర్వవేదాంతసిద్ధాంతసారసంగ్రహము, శ్లో. ౨౫౫)

ఈశ్వరుడే గురువులవారు, గురువులవారే ఈశ్వరుడు. మోక్షేచ్ఛ గలవారు ఈశ్వరునికిని గురువులవారికిని ఏవిధమైన వ్యత్యాసమును ను చేయకూడదు అని చెప్పియున్నది గనుక ఏ సమయమందైనను విషయములు, ఇంద్రియములు, ఉపాసకుని బాధించినయెడల శ్రీ గురుదేవులవారిని స్మరించవలయును. వెంటనే తనకు సంభవించి యుండు బాధ మానిపోవును. ఈ విధమున గురుధ్యాన ప్రాధా న్యము నెఱిగి భగవద్ధ్యానమును చేయుచురాగా నిరంతరాయముగా చిత్తము, బ్రహ్మము అనగా ఇష్టదేవత పైన నిలిచియుండును.

ఇట్లు శమాది షట్కమును అభ్యసించుచురాగా అన్యోన్యా శ్రయము అనినట్లు సకల సాధనములును ఒకటి నొకటి బలపరు చుచు వచ్చును.

## ముముక్షుత్వము

ఈ గ్రంథము పదియవపుటయందు సాధనములయందెల్ల యు ముముక్షుత్వము మూలకారణ మని చెప్పి అనువాదింపబడెను. ముముక్షుత్వము తీవ్రముగానుండిన యెడల నిత్యానిత్యవస్తువివేకము తీవ్రముగానుండును. ముముక్షుత్వము తీవ్రముగానుండిన యెడల వైరాగ్యము తీవ్రముగానుండును. వైరాగ్యము తీవ్రమైనపుడు

దమము తీవ్రముగానుండును. వైరాగ్యమును దమమును తీవ్ర ములైన యెడల శమము తీవ్రముగానుండును. శమదమములు తీవ్రములైతే ఉపరతి తీవ్రమగును. ఇవన్నియు తితిక్షను బలపర చును. అందువలన శ్రద్ధ దృఢపడి సమాధానము అను సాధనము నిరంతరాయముగా నగును కనుక ముముక్షుత్వము మరి అంత వృద్ధియగును. ఇందుకే అన్యోన్యాశ్రయము అని పేరు. 33 వ పుటయందు వివరించిన ప్రకారము అన్నిసాధనములును ఒకటే కాలమందు అభ్యసించుచు దృఢపరుచుకొనుచుండవలయును. ముముక్షుత్వ మనగా తమ గురువులవారు ముక్తులై లోకసేవ చేయుచుండు విధమున "వసుధైవ కుటుంబకం" అని లోకమెల్ల యు తన కుటుంబమే అని ప్రేమించి పరమేశ్వరుడు లోకసేవ చేయుచున్న విధమునను తనయొక్క గురుమహారాజుగారు లోక సేవ చేయుచున్న విధమునను నిర్హేతుకదయాసింధువుగా లోకులను లోకమును ప్రేమించి ఆదరించి గారాబముతో వారల దుఃఖముల నివారణచేయుచు శ్రీ సనత్కుమారప్రముఖులైన మహీపీఠము వారు జ్ఞానోపదేశము చేయుచున్న తెఱంగున మనమును చరించు చుండుట. ఇదే ముముక్షుత్వము. ఇదే ప్రేమ.

33 వ పుటయందు ప్రస్తావించినట్లు ముముక్షుత్వము ౧. తీ వ్రముముక్షు, ౨. మాధ్యమికముముక్షు, 3. మందముముక్షు, ౪. అతి మందముముక్షు అని నాలుగు విధములుగానుండును.

**అతిమందముముక్షు**

మార్గే ప్రయాతు ర్మణిలాభవ న్మే
లభేతమోక్షో యది తర్హి ధన్యః ।

ఇత్యాశయా మూఢధియాం మతిర్యా
　　సైషాఽతిమందాఽభిమతా ముముక్షా ॥ ౨౩౧ ॥

త్రోవనడుచుచు తనకార్యమును చింతించుచు పోవువానికి ఏదైనను నిధి యొకటి కాలికి తగిలిన యెడల అపుడు ఆ నిధిని వాడు స్వీకరించినట్లు మనుష్యులు తమ హవ్యాసములను గమనించుచుండగా ముముక్షుత్వము సాధ్యమైతే బాగు అని మూఢులు కోరుకొనుట అతిమందముముక్షు.

మందముముక్షు

మోక్షస్య కాలోఽస్తి కిమద్య మే త్వరా
　　భుక్త్వైవ భోగాన్ కృతసర్వకార్యః ।
ముక్త్యై యతిష్యేఽహ మథేతి బుద్ధిః
　　ఏషైవ మందా కథితా ముముక్షా ॥ ౨౩౦ ॥

ఏమండీ, ఇపుడే మోక్షమునకు ఏమి అవసరం. పెండ్లిచేసుకొని బిడ్డలను కని మనవలు మునిమనవలునుగా దామరదంపముగా సంసారమును చూచి ఆనందించి భోగము నంతయు అనుభవించి తరువాత మోక్షమునకు ప్రయత్నము చేయుదము అని అనుకొనుట మందముముక్షు.

మాధ్యమికముముక్షు

తాపత్రయం తీవ్ర మవేక్ష్య వస్తు
　　దృష్ట్వా కళత్రం తనయాన్ విహాతుం ।
మధ్యే ద్వయో ర్లోడన మాత్మనో యత్
　　సైషా మతా మాధ్యమికీ ముముక్షా ॥ ౨౨౯ ॥

తీవ్రములైన దుఃఖములను సంసారమందు అనుభవించుచు విసికి సంసారమును త్యజించి మోక్షమార్గమును వెదకుటకు పోవలె నని ఆశించినను తనయొక్క బంధములను వదులుకొని పోవుటకు ఇష్ట పడక ఉభయ మధ్యస్థముగా ఆశ ముందుకు అభిమానం వెనుకకు లాగుస్థితిలో నుండుటకు మాధ్యమికముముక్షు యని పేరు.

తీవ్రముముక్షు

తాపై స్త్రిభి ర్నిత్య మనేక రూపైః సంతప్యమానః క్షుభితాంతరాత్మా ।
పరిగ్రహం సర్వమ నర్థబుద్ధ్యా జహాతి సా తీవ్రతరా ముముక్షా ॥ ౨౨ ॥
(సర్వవేదాంతసిద్ధాంతసారసంగ్రహము)

అనేకరూపములను ఎత్తి తాపత్రయములు తనను తపించుటకు భయపడి క్షోభచెందినవాడై సంపాదనలు అన్నియు ననర్థకారణ ములే యని విసికి అన్నిటిని త్యజించు మనోజయము కలవాడు తీవ్రముముక్షువు

ఇట్టి తీవ్రముముక్షుత్వ మెవరికి కలదో వాడే అతి శీఘ్రము గా ముక్తుడగును.

ముముక్షుత్వము మనోధర్మము గాని బహిరంగ వేషము కాదు. మోక్షేచ్ఛగలవానిని అతని చర్యలనుపట్టి ఇతరులు గు ర్తించవలెనే గాని వేషభాషలను చూచి కాదు గుర్తించవలసినది. వేషములు మోసపుచ్చును. బ్రాహ్మణ దేహధారులై చండాల కృత్యములుగలవారిని చూచుచున్నాము. అదేవిధమున చండాల దేహధారులై దైవీసంపద్గుణములను మెండుగా గలవారిని కూడ చూచుచున్నాము. కనుక గుణములు ముఖ్యములు గాని శరీర ములు వేషములు ముఖ్యములు గావు.

సాధనచతుష్టయ అభ్యాసమునందు గాని అందుల ఆచరణ ముఖ్యముగాగల సమాధానసంపత్తియందు గాని ఇల్లువిడిచి వెలుపలికిపోను అవశ్యములేదు.

సమాధిస్థానకస్యస్య చేత శ్చేద్వృత్తిచంచలం ।
తత్తస్య తు సమాధానం సమమున్మత్తతాండవైః ॥
ఉన్మత్తతాండవస్థస్య చేత శ్చేత్ క్షణవాసనం ।
తదప్యున్మత్తనృత్యం తత్సమం బుద్ధిసమాధినా ॥
వ్యవహారీ ప్రబుద్ధోయః ప్రబుద్ధో యో వనే స్థితః ।
ద్వావేతౌ సుసమౌ నూనం అసందేహపదంగతౌ ॥
అకర్తా కుర్వ దప్యేత చ్చేతః ప్రతనువాసనం ।
దూరంగతమనా జంతుః కథాసంశ్రవణే యథా ॥
అకుర్వ దపి కర్తైవ చేతః ప్రఘనవాసనం ।
నిష్పందాంగ మపి స్వప్నే శ్వభ్రపాతస్థితా వివ ॥
చేతసో యద కర్తృత్వం తత్సమాధాన ముత్తమం ।
తం విద్ధి కేవలీభావం సా శుభా నిర్వృతిఃపరా ॥
చేత శ్చలాచలత్వేన పరమం కారణం స్మృతం ।
ధ్యానాధ్యానదృశోస్తేన తదేవా నంకురం కురు ॥
అవాసనం స్థిరం ప్రోక్తం మనోధ్యానం తదేవ చ ।
స ఏవ కేవలీభావః శాంతతైవ చ తత్సదా ॥
గృహా ఏవ గృహస్థానాం సుసమాహితచేతసాం ।
శాంతాహంకృతిదోషాణాం విజనా వనభూమయః ॥
యథా విపణిగా లోకా విహరంతో ప్యసత్సమాః ।
అసంబంధా స్తథా జ్ఞస్య గ్రామోపి విపినో పమః ॥
అంతర్ముఖమనా నిత్యం సుప్తో బుద్ధో వ్రజన్ పఠన్ ।
పురం జనపదం గ్రామ మరణ్య మివ పశ్యతి ॥

(జ్ఞానవాసిష్ఠము, ఉపశమనప్రకరణము)

మనస్సునందు వృత్తులను చాలించి అహంకారదోషము తగ్గించు కొనిన వారలు ఇంటిలో ధ్యానమునకు కూర్చున్నను విజనస్థలము నందు కూర్చుండి నట్టే యుండును; అశాంతచిత్తులు వనమునం దుండినను పట్టణములయందుండి నట్టే యగును అని పై శ్లోక ముల తాత్పర్యము.

ఈ కారణములవల్ల ముఖ్యముగా మనస్సును శిక్షించి యుంచవలయును అని ఎరుగవలయును.

ఆధికారికపురుషులుగా నేర్పడిన లోకపాలురందరును ముక్తులే యైనను తాము ఏపరమేశ్వరు నాశ్రయించి జీవన్ముక్తిదశకు వచ్చిరో ఆ పరమేశ్వరుడే లోకమునకంతయు "సుహృదం సర్వభూతానాం" అని శ్రీమద్భగవద్గీతయందు చెప్పినట్టు ప్రత్యుపకారమును నిరీక్షించక యే సర్వభూతములకును హితము చేయుటకుగా నిలిచియుండుటవల్ల తామును వారితో సహ నిలిచి లోకసేవ చేయుచు లోకులపైన నిర్హేతుకమయిన ప్రేమను వర్షించుచున్నారు.

ప్రేమాచరణము రెండువిధములుగా నుండును. మొదటిది ప్రాణులకు హింసకలుగుకార్యములను మానుట. రెండవది ప్రాణులకు హితమును చేయుటకు సందర్భమును నిరీక్షించుచు ఆతురముతో సిద్ధముగా నుండుట. మనయొక్క దినచరియందు "నావిరతో దుశ్చరితాత్" అని వినుచుందుము. దుష్టకార్యములను నిలుపుదల చేయనివాడు సత్కార్యముల నేలాగుచేయును. కనుక ప్రేమాచరణమును అనుష్ఠించుటకుముందు ఇతరులకు మనవలన కలుగు హింసలను పరిశీలించి మనయొక్క ఏ కార్యములు హింసలను కలుగజేయునో ఆ కార్యములను మానవలయును. ఇందువలన

క్రూరస్వభావమును మనము తొలగతోలవలయును. బుద్ధిపూర్వక
ముగా మరియొక ప్రాణికి బాధ కలుగజేయవలెనను ఉద్దేశముతో
చేయునది బుద్ధిపూర్వకముగా చేయబడునది గనుక ఆపాపము
చాలచెడ్డది. మతవిరోధమువల్ల మన దేశమునందు ఆ కాలమందు
అసద్వాదులు అని మెరుగబడిన బౌద్ధులను హిందువులు వేధిం
చినది ఇంతంత కాదు. ఇట్టి క్రూరకృత్యములు ఇపుడును సాధ్యము.
కనుక జాగరూకతతో క్రూరకృత్యములను వదలవలయును.

బుద్ధిపూర్వకముగా కాక యితర విధములుగా కూడ క్రూర
కార్యములు జరుగవచ్చును. ధనకాంక్ష జేసి యితరులకు తాను
అచ్చుకోవలసిన ధనమును అచ్చుకోడు. మరియు కృపణుడు తన
యాలిబిడ్డలకు కడుపుకన్నము సరిగా పెట్టడు.

ఈ విషయములను గురించి పరమగురుచరణసన్నిధియందు
అతి వివరముగా చెప్పియున్నది. ఆ గ్రంథమును చూడవలయును.

నివృత్తిమార్గయాత్రాపరుని జీవితము తనకుగా చేయునది
కానేరదు. లోకసేవార్థము బ్రతుకవలయును. మూలాసేచనన్యాయ
ము (౫౭ వ పుట) ననుసరించి అందరును క్షేమముగానున్న
యెడల మనమును క్షేమముగానుందుము. కనుక లోకసేవయందు
తన్ను తాను మరిచియుండవలయును. మహానుభావుడైన "సుహృ
దం సర్వభూతానామ్" అని పేరు పొందిన భగవంతునికి జనులకు
సహాయము చేయుటకు లెక్కలేనందరు మనుష్యులు కావలెను.
భగవంతునియొక్క నౌకరిగా మన ముండవలయును. వారిచే
ప్రేరేపింపబడిన ప్రేమను మనము లోకులకు ఇయ్యవలయును.
మరియు ముఖ్యముగా నుపాసకుడు సంపాదించవలసినవి ఏవనగా

౧. ఇతరులకు బహువిధముల సహాయము చేయుశక్తినిచ్చు విద్యాస్వీకరణము.

౨. అట్లు స్వీకరించిన విద్యను సరియైన మార్గమున విని యోగపెట్టుటకుగా మనోనిశ్చయము.

3. మనోనిశ్చయమును పునః పునః వృద్ధి పరుచు ప్రేమ.

ఇవన్నియు సంపాదించవలెను. ముముక్షుత్వము అను పదమునకు మోక్షేచ్ఛ యని యర్థము. మోక్షమనగా సత్యమైన వస్తువును చెందుట. సత్యమును చెందు సాధనము ప్రేమ. సత్యము అనగా బ్రహ్మము. "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" అను వాక్యమున్నది. సత్యము అను శబ్దమునకు ప్రేమ అని అర్థమున్నది. ప్రశ్నోత్తరరత్నమాలయందు శ్రీశంకరాచార్యుల వారు చేసిన అర్థము ఏమనగా "కిం సత్యం" ఇందుకు జవాబు "భూతదయా". కనుక భూతదయయే ప్రేమ.

నివృత్తిమార్గయాత్రాపరుడు అభ్యసించు ప్రేమరూపమైన ముముక్షుత్వమునకు ప్రత్యవాయములలో నొకటి ప్రొద్దుపోని మాటలాడుట. దీనికే లోకవార్త యని పేరు. "నిద్రాయా లోకవార్తాయాః కించిన్నావసరం దత్వా" లోకవార్తకు స్థలమియ్యకూడదు. అగ్రహారములందు బ్రాహ్మణులు మధ్యాహ్నము భోజనము అయిన తరువాత గుంపులుగూడి ప్రొద్దుపోనిమాట లాడుచుందురు. లోకవార్తలను పరిశీలించి చూచినయెడల తరుచుగా ౧. పరనింద ౨. ఆత్మస్తుతిగానే యుండును. ఆత్మస్తుతి ఒక్కటియే నివృత్తిమార్గయాత్రాపరునికి లక్ష్యచ్యుతికి కారణము. పరనింద అంతకన్న నధికము. కనుక

లక్ష్యచ్యుతం చే ద్యది చిత్త మీషత్ బహిర్ముఖం సన్నిపతేత్ తత స్తతః ।
ప్రమాదతః ప్రచ్యుత కేళికందుకః సోపానపంక్తౌ పతితో యథా తథా ॥

సమాధానము అను సాధనమును అభ్యసించుచు సర్వవిధములచే తను సర్వకాలములయందును భగవంతునియందు మనస్సును నిలిపి యుండవలసినది విధాయకముగానుండగా లోకవార్తవల్ల తన లక్ష్యమును పోగొట్టుకొని క్రమేణ మెట్టు మెట్టుగా అధోగతి చెందును. ఎటువలెనంటే తమాషాగా ఆటలాడుకొనుటకుగా నుపయోగపడుచుండిన చెండు చేయి తప్పి సోపానము (మెట్లు) లపైన పడగానే ఒకమెట్టునుండి ఎగిరి అంతకు క్రిందిమెట్టు, మళ్లీ అంతకు క్రిందిమెట్టు, ఈ ప్రకారము కట్టకడపటి మెట్టువరకును ప్రేరేపింపబడకయే ఎగిరిపడి చెడిపోయినట్టు గానగును. లోకవార్తయందు, పరదూషణయందు, దుస్సంకల్పములు ఉండును. ఇవియే పాపకర్మలు.

ఇతరులనుగురించి చెడుగు తలంచితే వారలయందుండు చెడుగును వృద్ధిచేసిన వారమగుదుము. అందువలన క్రమేణ లోకులయందంతయు చెడుగు వృద్ధియగును. (ఆత్మవిచారము, పూర్వభాగము, ౧౮౬ వ పుటచూడవలయును). దుస్సంకల్పముల చేయు ఉపాసకుడు తనను తానే చెడుపుకొనును. (ఆత్మవిచారము, పూర్వభాగము, ౧౫౦ వ పుట చూడుడు.)

సాధనచతుష్టయముల అభ్యాసమునందు ఉపరతి యను పదమునకు వేదాంతులు సన్న్యాసము అని అర్థము చేయుచున్నారు. "సన్న్యస్య శ్రవణం కుర్యాత్" అను వచనమున్నది. నివృత్తిమార్గయాత్రాపరునికి క్షేమకరమైన అభ్యాసములు అగు శమము, దమము, మొదలగునవి ప్రవృత్తిమార్గయాత్రచేయు లౌకికజనులు

మరియు లోకులు వీర్ల దృష్టియందు వెఱ్ఱితనముగా కనబడును. ఇంతటి వెఱ్ఱివారలు గలరా. దుఃఖమువచ్చినపుడు ఏడ్చుట కానము. మొన్నటిదినము అతని భార్య చనిపోయినది. అందుకు అతడు దుఃఖించ లేదు. నేటిదినము అతని ముద్దుబిడ్డ చనిపోయినది. అప్పటికైనను ఏడువలేదు. మోక్షమునకు పోవలెనని ఆశించువారికి మనస్సు రాతితో సమానము కావలెనా. తనకుగా దుఃఖము లేకున్నను లోకవాడుకకైనను దుఃఖించి, ఏడ్చి, ఇతరులనైనా తృప్తిపొందించరాదా. ఇది యెక్కడి వైరాగ్యము అని కొందరు ఉపాసకుని శమము, దమము, తితిక్ష, ఇట్టి గుణముల ఆచరణను చూచి హాస్యము చేయుచుందురు. ‹‹ మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ’’ అని చెప్పియున్నది. ప్రవృత్తిమార్గ నిరతులు వేయి మంది యున్నపుడు నివృత్తిమార్గయాత్రాభిలాషి యొకడే ఉండును. సముద్రమునందు ఇంగువకలుపుట అను లోకోక్తి ప్రకారము నివృత్తిమార్గయాత్రాపరుడు లెక్కకే రాడు. ప్రవృత్తిమార్గపరుల ఆచారముల నుద్దేశించి ఈ ఒకడైన నివృత్తిమార్గపరుని ఆచారము హాస్యాస్పదంబుగానుండును. నివృత్తిమార్గమునకు క్రొత్తగా మరలినవాని మనస్సునకు పట్టుదల తక్కువగానుండును. పెక్కుమంది యొక్క హాస్యబలమును జయించగలదిగా నుండదు. ఇట్లు శ్రమలు పడుచు మహామనోధైర్యముపైన నడువతగిన నివృత్తిమార్గాచరణ సరిగానడిపించుటకు గ్రామము, పట్టణము, ఇట్టి సంఘములను వదిలి తన పిచ్చి తనకు ఆనందము అని చెప్పుటకు వీలైన విజనప్రదేశములకు వెళ్లి ‹‹ తే హ్యుపవసం త్యరణ్యే శాంతా విద్వాంసో భైక్షచర్యాం చరంతః ’’ అని అరణ్యమునందు నిష్ఠయందుండిన

యెడల ఇగుగువారు పొరుగువారు లేనందున తన కార్యముల వ్యగ్రతను హాస్యముచేయువారుండరు. మరియు హాస్యముచేయువారు లేనపుడు వార్ల సంకల్పశక్తి తనను ఏమాత్రమైనను చలింపకుండుటకు వీలుగానుండును. అరణ్యవాసము చేసి, నిష్ఠజరుపుచు, భిక్షాచరణమువల్ల శరీరపోషణ చేసికొనుచు ఉండుటకు సాధ్యమైనది సంన్యాసాశ్రమము. కనుకనే "సంన్యస్య శ్రవణం కుర్యాత్" అని చెప్పబడియె.

సంన్యాస మిరు తెఱంగులుగా నుండును. శ్రవణముచేసి మననమును జరిపి నిదిధ్యాస నారంభించుటకు ప్రత్యవాయములు లేకుండుటకుగా గ్రహించు సంన్యాసము ఒక్కటి. ఈ సంన్యాసమునకు వివిదిషా సంన్యాస మని పేరు. వేదాంతార్థములను విచారించి ఆ రహస్యములను గ్రహించి వైరాగ్యాభ్యాసము దృఢమైన పిమ్మట శ్రవణమననానిదిధ్యాసలయొక్క ఫలితార్థముగా విద్వత్త్వము సంపాదించుకొని గ్రహించు సంన్యాసము విద్వత్సంన్యాసము. విద్వత్సంన్యాసి బ్రహ్మవేత్త. వివిదిషాసంన్యాసముతో సాధనచతుష్టయ సంపత్తి నిరాటంకముగా అనుకూలించుచున్నది.

ప్రకృతకాలమందు సంసారములయందే యుండి గ్రామములయందు పట్టణములయందును నివసించుచు నివృత్తిమార్గాచరణ చేయువార నేకులున్నారు. వారలయొక్క కష్టము మితిలేనిదిగా నుండినను ఆ కష్టముయొక్క ప్రతిఫలముగా మనశ్శక్తి అధిక మగును. ఉత్తరోత్తర సమాధి నిష్ఠజరుపుటకు మనశ్శక్తి అతి అనుకూలముగా నుండును. కనుక సంన్యాసము పుచ్చుకోవలసిన అవశ్యము లేదు. సంన్యాసము లేకనే "సుసమాహితచేతసాం" అనియు

"శాంతాహం కృతిదోషాణాం" అనియు ౬౩ వ పుటయందు చెప్పియుండు ప్రకారము మనస్సును జయించి అహంకారమును అణచి వైరాగ్యాది సాధనములను సంపాదించవచ్చును. సాధారణముగా వేదాంతులు నివృత్తిమార్గాచరణచేయువాడు సంన్యాసిగానే యుండవలెనని చెప్పుటవాడుక. సంన్యాసము అవశ్యము లేదు. నివృత్తిమార్గము అనగా నివృత్తరాగమార్గము అని యర్థము. ఏ మార్గమునందు నడుచువానికి రాగము ఉండకూడదో అది నివృత్తి మార్గము. "నివృత్తరాగస్య గృహం తపోవనం" అని చెప్పియున్నది. కాబట్టి రాగనివర్తి కావలెను గాని ఆశ్రమభేదముగాని వేషధారణగాని కాదు. మనస్సునకు పిచ్చిగంతులువేయుట స్వాభావధర్మము. పిచ్చిగంతులు వేయనీయక మనస్సునకు అంకుశమువేసి వంగదీసి స్వాధీనపరుచుకొనిన వానికి ఆశ్రమభేదముతో లాభమేమియు నుండదు. కనుక "శాంతాహం కృతిదోషాణాం" అను వాక్యమును మరువక యుండవలయును.

ఇదివరకును యథాశక్తిగా యథోచితముగా సాధనచతుష్టయవిచారమునుగురించి వ్రాయబడియె. ఈ పుస్తకము ౭ వ పుటయందు ప్రస్తావించిన "అందుపైన" అను వాక్యముయొక్క ప్రయోజనమును బ్రహ్మవిచారమందు జ్ఞానదీక్షలు అను విషయమును గురించి రెండవ అధ్యాయము వ్రాయనగును.

---

## ౨ వ అధ్యాయము

యదా పరానందగురో భవత్పదే
పదం మనో మే భగవన్ లభేత వై ।
తదా నిరస్తాఖిలసాధనశ్రమః
శ్రయేయ సౌఖ్యం భవతః కృపావశాత్ ॥



### జ్ఞానదీక్షలు

లోకమునందు విద్యలు రెండువిధంబులు. పరావిద్య యనునది యొకటి. అపరావిద్య యనునది మఱియొకటి. ఋగ్వేదము మొదలగు నాలుగు వేదములును, ఉపవేదములు, వేదాంగములు, ఇవన్నియు అపరావిద్య యని యెఱుగవలయును. అపరావిద్యాభ్యాసము యథోచితముగా ముగిసిన పిమ్మట సాధారణముగా పరావిద్యాభ్యాసము నారంభింతురు. పరావిద్యయే వేదాంతవిద్య. పండితోత్తములుగా నుండినను వేదాంతవిచారమునందు గురువులవారిని ఆశ్రయించి వేదాంతవిచారము చేయుటకు ప్రయత్నించు నపుడు గురువులవారు శిష్యునియొక్క యోగ్యతను పరిశీలించక యే వేదాంతోపదేశము చేయుట లేదు. ఒక సంవత్సరకాల మైనను గురువులవారియాశ్రమమునందు ఉండి తపస్సు బ్రహ్మచర్యము

మొదలగు వ్రతములు సలిపిన పిమ్మటనే గురువులవారు వేదాంత ములు చెప్పను ఆరంభింతురు. ఇది బహుప్రాచీన సంప్రదాయము.

> సుకేశా చ భరద్వాజః శైబ్య శ్చ సత్యకామః సౌర్యాయణీ చ గార్గ్యః కౌసల్య శ్చాశ్వలాయనః భార్గవో వైదర్భిః కబంధీ కాత్యాయనః తే హైతే బ్రహ్మపరా బ్రహ్మనిష్ఠాః పరం బ్రహ్మాన్వేషమాణాః ఏష హవై తత్సర్వం వక్ష్య తీతి తే హ సమిత్పాణయః భగవంతం పిప్పలాదం ఉపసన్నాః ॥ (ప్రశ్నోపనిషత్తు)

సుకేశుడు మొదలగు ఆఱుగురు శిష్యులు వేదాంతవిచారమునకు సంప్రదాయానుసారముగా సిద్ధమైన బ్రహ్మపరులు బ్రహ్మనిష్ఠులు పిప్పలాదుడు అను మహర్షిని ఆశ్రయించి విద్య నుపదేశము చేయుమని ప్రార్థించిరి.

> తాన్ హ స ఋషి రువాచ భూయ ఏవ తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా సంవత్సరం సంవత్స్యథ । యథాకామం ప్రశ్నాన్ పృచ్ఛథ యది విజ్ఞాస్యామః సర్వం హ వో వక్ష్యామ ఇతి ॥

పిప్పలాదుడు ఏమి చెప్పె ననగా: మీరు బ్రహ్మపరులు బ్రహ్మనిష్ఠులుగా నుండినను మరియొక సంవత్సరకాలము నా యాశ్రమము నందు నివసించుచు తపస్సు బ్రహ్మచర్యము శ్రద్ధ అను గుణములు తమకు గలవని నన్ను తృప్తిచెందించిన పిమ్మట తాము ప్రశ్నలను అడుగవచ్చును, యథాశక్తిగా చెప్పగలను, అని చెప్పిరి. బ్రహ్మపరులు, బ్రహ్మనిష్ఠు లైనను గురువులవారు స్వధాగా పరిక్షించిన పిమ్మటనే వారికి వేదాంతవిద్యోపదేశము చేయుట ఆనుపూర్వీక సంప్రదాయము. ఈ సంవత్సరకాలమును " తే హ్యుపవసంత్యరణ్యే

శాంతా విద్వాంసో భైక్షచర్యాం చరంతః" అనిన ప్రకారము గురుకులవాసము చేయవలయును.

గురువులందరును మహీపీఠమునకు చేరినవారే గనుక యిది మహీపీఠపు సంప్రదాయమే అని చెప్పవచ్చును.

> తతో మామీశ్వరః సృష్ట్వా జ్ఞానే నాయోజ్య చాసకృత్ ।
> విససర్జ మహీపీఠం లోక స్యాజ్ఞాన శాంతయే ॥
> యథాహం ప్రహిత స్తేన తథాఽన్యే చ మహర్షయః ।
> సనత్కుమారప్రముఖా నారదాద్యా శ్చ భూరిశః ॥

ఈ సందర్భమును వాసిష్ఠము, ౨ భా. ౧౧ వ అధ్యాయమునందు చదువవలయును. ఈ ఋషిసంఘమునకు « మహీపీఠము " అని పేరు. పీఠము అనగా జ్ఞానోపదేశము చేయుటకు అధికారము చెందిన జ్ఞానులు ఉండు స్థలము. శ్రీ శంకరవిజయము అను గ్రంథమునందు శ్రీ శంకరాచార్యులవారు అయిదు పీఠములను స్థాపించిరి అని చెప్పబడియున్నది. అందులో శారదాపీఠము, కామకోటి పీఠము, ఇవి కొన్ని. ఇట్టి పీఠములు ఎన్ని ఏ యే మతములయందున్నను వానికన్నిటికన్న నధికమైనదియు, వానికన్నిటికిని ప్రాణమునిచ్చునదియునగు పీఠము « మహీపీఠము ". హిందువుల మతమైన సనాతనధర్మమతము మాత్రము కాదు. ఆ సనాతనధర్మమతములో కూడ నంతర్భాగములైన ద్వైతము, విశిష్టాద్వైతము, అద్వైతము, సాంఖ్యము, వైశేషికము, యోగము అను మొదలుగా గలవన్నియును మాత్రము కావు. క్రీస్తుమతము, బౌద్ధమతము, జోరోష్ట్రియనుమతము, మహమ్మదీయమతము అను అన్ని మతములయందును మతసంబంధమైన విద్యలను జ్ఞానసంబంధములైన

A 10

విద్యలను ఆ యా మతములయందలి వేదములు, ఉపవేదములు, వేదాంగములు మొదలుగా గల సకల విధములైన అపరా, పరా అను భేదముల వ్యవహరింపబడు విద్యలను అన్నిటినిని లోకులకు అందునట్టుగా చేయు మహిమకలది ఈ మహీపీఠము. ఈ మహీపీఠమునకు అగ్రగణ్యులు శ్రీసనత్కుమారులు అను పేర వ్యవహరింపబడు బ్రహ్మమానసపుత్రులు. శ్రీసనత్కుమారులవారు ముఖ్యులై వారిని అనుసరించి అనేకమంది ఋషులు ఈ భూమండలమునందలి జనులయొక్క అజ్ఞానమును పోగొట్టుటకుగా లోకేశుడైన చతుర్ముఖబ్రహ్మచే నియమించబడినారని పైన వ్రాయబడియుండు రెండు శ్లోకములవల్ల తెలియవచ్చుచున్నది. శ్రీమద్భాగవతము, షష్ఠస్కంధము చిత్రకేతూపాఖ్యానమునందు మహీపీఠపు ఋషులలో కొందరి పేళ్లు చెప్పబడియున్నవి.

కుమారో నారద ఋభు రంగిరాః దేవలోసితః ।
అపాంతరతమో వ్యాసో మార్కండేయో థ గౌతమః ॥
వసిష్ఠో భగవాన్ రామః కపిలో బాదరాయణిః ।
దూర్వాసా యాజ్ఞవల్క్య శ్చ జాతుకర్ణ స్తథారుణిః ॥
రోమశ శ్చ్యవనో దత్త ఆసురి స్స పతంజలిః ।
పరాశరోథ మైత్రేయో భరద్వాజ శ్చ వారుణిః ॥
ఋషి ర్దేవశిరా బోధ్యో మునిః పంచశిఖ స్తథా ।
హిరణ్యనాభః కౌసల్యః శ్రుతదేవ ఋతధ్వజః ॥
ఏతే పరేచ సిద్ధేశాః చరన్తి జ్ఞానహేతవః ॥

(శ్రీమద్భాగవతము, షష్ఠస్కంధము, ౧౫ అధ్యా.)

ఈ శ్లోకములలో గుర్తించిన ఋషులును మరియు నితరసిద్ధేశులును జ్ఞానోపదేశము చేయువారని తెలియుచున్నది. మహీపీఠమువారి

యొక్క విధాయకము జ్ఞానదానము మాత్రము కాదు. రాజనీతి, ప్రజాపరిపాలనాదులుకూడ వీరికార్యమే. అపరావిద్యయని సముదాయనామంబునంబరగు వేద, ఉపవేద, వేదాంగ, రూపకమైన విద్యనంతయు లోకులు నేర్చుకొనుటకు తగిన సన్నాహములను చేసి విద్యాప్రదానము చేయుటకు తగిన గురువులను లోకమందు అవతరించునట్లు నియమించుట కూడ ఈ మహీపీఠమువారియొక్క పనియే.

ముండకోపనిషత్తునందు "నిహితాస్సప్తసప్త" అని చెప్పియున్నది. అందును అనుసరించి లోకమందుండు మనుష్యకోటి యంతయు ఏడు తెఱగులుగా ప్రధానభాగమున భాగింపబడుదురు. రాహు కేతువులను వదిలితే గ్రహములు ఏడు. జీవమణులు కూడ ముఖ్యములైన సూర్య, చంద్ర, అంగారక, బుధ, గురు, శుక్ర, శని గ్రహములకు సంబంధించినవి ఏడు. గ్రహములను అనుసరించి ప్రతిమనుజుడును ఏదో ఒక గ్రహముయొక్క ప్రధానరేఖకు చేరియుండును. "నిహితాస్సప్తసప్త" అనిన సప్తరేఖాకారంబుగ మనుష్యకోటి ప్రవాహంబుండును. రేఖ యను పదమునకు ఇంగ్లీషు భాషయందు Ray అని వాడుదురు. ప్రథమరేఖ, ద్వితీయరేఖ, తృతీయరేఖ, చతుర్థరేఖ, పంచమరేఖ, షష్ఠరేఖ, సప్తమరేఖ అని రేఖలను నిర్దేశించుట సంప్రదాయము. ఈ యేడును ప్రధాన రేఖలు. రేఖలనుగురించి ఉత్తరోత్తర వ్రాయనగును.

జ్యోతిశ్శాస్త్రమునందు జాతకనియమమునందు గ్రహముల యొక్క ఫలములు చెప్పుదురు. ఒక్కొక గ్రహముయొక్కయు దశాకాలమొక్కటి కలదు. ఆ దశాకాలమునందు మిగిలిన అన్ని

గ్రహములయొక్కయు అధికారకాలము లుండును. గ్రహముయొక్క దశాకాల మొక్కటి. ఉదాహరణము. సూర్యదశాసంవత్సరములు — ౬-౦-౦. సూర్యదశలో తొమ్మిది భుక్తులు గలవు. అనగా సూర్యునిలో సూర్యుడు, సూర్యునిలో చంద్రుడు, సూర్యునిలో కుజుడు, సూర్యునిలో రాహువు, సూర్యునిలో గురువు, సూర్యునిలో శని, సూర్యునిలో బుధుడు, సూర్యునిలో కేతువు, సూర్యునిలో శుక్రుడు అని. ఈ ప్రకారము రేఖలకు కూడ అన్వయము. జనసముదాయములో కొందరికి ప్రధాన రేఖ ప్రథమ రేఖగా నుండవచ్చును. ఉపరేఖ ద్వితీయ రేఖనో, తృతీయ రేఖనో ఇట్లుండవచ్చును. రేఖలలో కూడ సప్తీకరణ మున్నది.

రేఖలలో ప్రథమ రేఖ — క్షత్రియధర్మమైన శౌర్యము, తేజస్సు, బలము, ధైర్యము, మొదలగు చిహ్నములు గలిగి రాజతంత్రప్రావీణ్యమును కనపరుచును.

ద్వితీయ రేఖ — శమము, దమము, తపస్సు, శౌచము, జ్ఞానము, విజ్ఞానము, ఆస్తిక్యము, స్వాధ్యాయము, ప్రవచనము, వాత్సల్యము మొదలగు సౌమ్యగుణములు చూపును.

ఇట్టి వివరములు ఇతర రేఖలకు కూడ కలవు. వానిని గురించి ప్రకృతమందు వ్రాయవలెననుకొనలేదు. ప్రతి రేఖకును రేఖాచార్యులు ఒక్క మహర్షిగారుందురు. వీరినే సిద్ధేశులని కూడ వాడుదురు. "ఏతే పరే చ సిద్ధేశాః చరన్తి జ్ఞానహేతవః" అని శ్రీమద్భాగవతమునందు చెప్పియున్నది.

ఇట్టి మహర్షులు లోకసేవాపరులై వారిలో కొందరు రాజ్యములేలు అధికారుల మనస్సులయందావేశించి ప్రజాపరిపాలననై

పుణిని వారికి బుద్ధిగోచరంబు గావించుచుందురు. మరికొందరు మహర్షులు స్వాధ్యాయప్రవచనపరులుగానుండు విద్యాగురువులు, జ్ఞానోపదేష్టలగు ఆచార్యులు ఇట్టివారి మనంబులందావేశించియు శిష్యుల మనంబుల యంధకారనివృత్తి గావించియు లోకమునందు మతసంబంధములైన ధర్మములు ప్రబలునట్లు చేయుచుందురు. ప్రకృత కలియుగ సమయమందు ఈ రేఖాచార్యులవారు శ్రీ మైత్రేయమహర్షిగారు. “యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత। అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజా మ్యహం” అనియును “ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే” అనియు శ్రీ గీతాచార్యులవారు సెలవిచ్చినారు. ఈ వాగ్దానము ననుసరించి శ్రీ మైత్రేయమహర్షిగారు అతిత్వరలో భూలోకమునందు ఇప్పుడు కలిగియుండు గోల నుపశమింపజేయుటకై రాబోవుదురని దివ్యజ్ఞానసమాజముయొక్క నమ్మకము.

లోకమందు రాజ్యమేలు రాజులుగాని, ప్రవచనపరులైన గురువులుగాని యెక్కడనైనను మహాప్రజ్ఞావంతులుగాక వట్టి బేలలైనను ప్రథమరేఖాచార్యులవారైన వైవస్వతులు రాజులనును, ద్వితీయ రేఖాచార్యులవారైన శ్రీ మైత్రేయులవారు జ్ఞానదాతలనును ప్రేరేపించి తమ తమ శిష్యసంఘమును నియమించి రాజులయొక్కయు, విద్యాగురువులయొక్కయు ధర్మములను సరిగా నడిపింతురు.

శ్రీమద్భాగవతము, షష్ఠస్కంధము, ౧౫ వ అధ్యాయమునందు “కౌ యువాం జ్ఞానసంపన్నౌ మహిష్ఠౌ చ మహీయసాం। అవధూతేన వేషేణ గూఢా విహ సమాగతౌ ॥” జ్ఞానసంపన్నౌ

లైన తామెవరండీ, మహాపెద్దలకన్నను పెద్దలై అవధూతవేషంబున నితరులకు దృగ్గోచరంబుగాని శరీరంబులతో నాకు కనబడుచున్నారు, అని పైశ్లోకమున కర్థము. రేఖాచార్యులవారందరును జ్ఞానసంపన్నులు, పెద్దలకన్న మహా పెద్దలు, అవధూతాశ్రములు. వారలకు అనేక శిష్యులు జీవన్ముక్తులు గలరు. వారలందరును స్వశిష్యసమూహాములతోడ లోకసేవాపరులై, గూఢులై, ఇష్టానుసారము లోకసంచారము చేయుచుందురు. "చరంతి హ్యనసా కామం బ్రాహ్మణా భగవత్ప్రియాః। మూదృశాం గ్రామ్యబుద్ధీనాం భోధాయోన్మత్తలింగినః॥" మాయట్టి గ్రామ్యబుద్ధిగలవార్లకు నుత్తమమైన బోధచేయటకుగా సాధారణమనుష్యులవలె వేషంబులంబూని మహాత్ములు భూలోకమందు స్వేచ్ఛగా సంచరించుచుందురు అని యర్థము.

ఇట్లు సప్తరేఖాన్వితమైన మహీపీఠంబున కధిపతి శ్రీ సనత్కుమారులవారు. శ్రీ సనత్కుమారులవారు జ్ఞానసముద్రులుగాన శ్రీ దక్షిణామూర్తియే యనవచ్చును. ఇది ద్వితీయరేఖాలక్షణము. వారు లోకేశులై మహాశక్తిమంతులుగాన "షాణ్మాతుర శ్శక్తిధరః కుమారః" అనినట్టు శక్తిధరు లనదగుదురు. ఇది ప్రథమరేఖా లక్షణము. ఇట్లే అన్నిరేఖలశక్తియు వారియందిమిడియుండును. వారే యీ భూమండలంబునంతయు దన హస్తతలంబిడికొని కాపాడు నట్టు పాలించువారు. వారే ఈ భూతలంబునంగల రాజరికమంతయు తన యాయుధమైన శక్తియను దానిమహిమవల్ల జరిపించుచుందురు. ఇట్టి మహానుభావునకన్న నొండు దైవంబుగలడే.

పూర్వాచారంబులయందొక వింత గలదు. దానిని గురించి వ్రాయవలయునని తోచుచున్నది. ఇంగ్లాండు దేశపు రాజుగారికి పట్టాభిషేక మొనర్చినపుడు ఎత్తిన పటము[?]గ్రాపును అనేకులు చూచి యుందురు. వారియొక్క ఒకచేత గుండ్రముగా నొక చెండు గాన వచ్చును. మరియొకచేత నొక కఱ్ఱ కానవచ్చును. ఈ రెండు చిహ్నముల కేమి యర్థమని కొందరికి విచారణకలిగి యుండవచ్చును. అవి పూర్వాచారప్రకారము ఆనుపూర్వికముగా వచ్చిన చిహ్నములు. లోకేశులైన శ్రీ సనత్కుమారు లెట్లు శక్తిధరులో వారి యంశాంశవాహులైన రాజుగారు శక్తికి ప్రతినిధియైన దండమును ధరించి శ్రీ సనత్కుమారులవారి యపరనామంబగు దండాయుధపాణి యనిపించుకొందురు. శక్తిధరులై లోకమును తన కరతలంబున నిడికొనినట్లు రాజ్యమేలు రాజరాజులగు శ్రీ సనత్కుమారులవారు భూమండలమును చెండువలె నుపయోగించినట్లు రాజుగారిచేత గుండ్రమైన ఆకారము కనబడుచున్నది. ఈ పూర్వాచారములు అతి చిత్రములు.

శ్రీ సనత్కుమారులవారే స్కందుడు అని ఛాందోగ్యోపనిషత్తు సప్తమ ప్రపాఠకము, షడ్వింశః ఖండమందు చెప్పబడియున్నది.

మహీపీఠమునందు చేరిన జీవన్ముక్తులే దివ్యజ్ఞానసమాజమును కూడ స్థాపింపచేసినవారు. వీరియుద్దేశమును గురించి ఆత్మవిచారము, పూర్వభాగముయొక్క పీఠికయందు వ్రాయబడియున్నది. ఇట్టి దివ్యజ్ఞానసమాజము "లోకస్యాజ్ఞానశాంతయే" అని లోకమునందు ఉండు మతవైషమ్యరూపకమైన అజ్ఞానమును బోగొట్టి భ్రా

తృభావమును వృద్ధిచేయుటయందు నిరంతర సన్నాహము చేయు చున్నది గనుక శ్రీమహీపీఠమువారి దీవెనలకర్హ్మముగానున్నది.

మహీపీఠమునందు అనేక ఋషులున్నారు. అందులో కొందరు శిష్యస్వీకరణముచేయువారు. అన్ని రేఖలయందును శిష్య స్వీకరణముచేయు జీవన్ముక్తు లున్నారు. చాలమట్టుకు వీరుప్రచ్ఛన్నులుగానే ఉండి భూలోకమందు తమను ఎవ్వరు కోరుకొందురో అట్టివారిని శిష్యులుగా స్వీకరింతురు. గాఢాంధకారము మూసి యుండు రాత్రికాలమందు ఒకరు ఒక గిరిప్రదేశమునందుండి చుట్టునుండు పట్టణమును చూచిన యెడల ఆ చీకటిమధ్యన ఏ ఇంటియందైనను దీపము వెలుగుచున్నయెడల కొండపైనుండువానికి ఆ దీపప్రకాశము అతి సులభముగా కనబడును. పగటియందు కనబడిన పెద్దమిద్దెలు చీకటియందు మిద్దెటిండ్లుగా కనబడక పోయినను ప్రకాశమున్నది మిద్దెటిల్లో గుడిసెయో విమర్శించుటకు అవకాశము లేకయే దీపప్రకాశమున్నస్థలమును మాత్రమే కొండపైనుండువాడు చూడగలడు. దీపప్రకాశమున్నస్థలము గుడిసెగా నుండవచ్చును. అట్లయిన గుడిసెనే కొండపైనున్నవాడు గమనించును. మిద్దెటింటివాడు నన్నెందుకు గమనించలేదని ఆక్షేపించినయెడల నాయనా, నీయింటియందు దీపప్రకాశముండలేదు. కనుక నేను గమనించుటకు వీలు లేకపోయినది అని చెప్పును కదా. అదే విధమున మహీపీఠమునకు సంబంధించిన జీవన్ముక్తులు కూడ ఏ శిష్యులయొక్క హృదయమునందు అంధకారము తక్కువగానుండునో అట్టివారిని తమకు శిష్యులుగా నంగీకరింతురు. “మోహాంధకారే నిస్సారే ఉదేతి స్వయ మేవ హి” అని చెప్ప

బడియున్నది. ఆ ప్రకారము మోహమువల్ల ఉపాసకుని హృదయమునందు జనించిన అంధకారమును నిస్సారముచేసికొనినంతట జ్ఞప్తిదీపము వెలుగును. ఆ వెలుతురును చూచి శిష్యస్వీకరణ చేయుటకు అభిలాషగల జీవన్ముక్తులు శిష్యులను అంగీకరింతురు. మహీపీఠపు గురుపరంపరయందు జీవన్ముక్తులకన్న తక్కువ తరగతుల గురువులు కూడ ఉన్నారు. వీరు సకలజనులును చూచునట్లు లోకవ్యవహారమందు మనుష్యులతో కలిసి మెలసి సంచరించుచుందురు. వారలకును సాధారణ శీలవంతులైన జనులకును వెలుపటివేషమునం దేమియు వ్యత్యాసము కనబడదు. అయితే మోహాంధకారముయొక్క ఉనికియందు మాత్రమే వ్యత్యాసము. నివృత్తిమార్గయాత్రాభిలాషి యైనవాడు తాను గురువులను ఆశ్రయించవలెనని తోచినసమయమందు ప్రాయశః లోకమందు మనుష్యులతో కలిసి మెలసియుండు గురువులవారిని ఆశ్రయించును. ఇట్టిగురువులు శిష్యులను సాధనసంపత్తిమార్గమునందు స్థిరపరుచుచు జీవన్ముక్తులైన గురువులవారు ఉన్నారు, శిష్యా, నిన్ను నీవు బాగుగా చక్కపెట్టుకొనిన వెనుక నీకును జీవన్ముక్తులు అగు గురువులకును అపరోక్షసమాగమము కలుగును అని చెప్పుదురు. జీవన్ముక్తులగు గురువులు సాధారణముగా నీ కలియుగమునందు ప్రాకృతజనులకు కండ్లపడరు. సుమారు ౫000 సంవత్సరములపుడు జరిగిన భారత యుద్ధములోనును తదనంతరము భీష్మాచార్యులవారి ఉత్క్రమణ కాలమందును పరీక్షిన్మహారాజుగారి ప్రాయోపవేశసమయమందును నారదాది మహర్షులు జనులతో కలిసి మెలసి సంచరించుచుండిరని గ్రంథములయందు చదువుచున్నాము. అపుడు ఉండిన ఋషు

లు ఇపుడు లేరా? లేకపోలేదు. ప్రాకృతజనులకు కనబడుచున్నా రా? కనబడలేదు. కారణమేమి? ఋషులకు ఏమైన గర్వము జనించినదా? లేక వారలకు లోకమునందు గల అభిమానము పోయినదా? ఎప్పటికైనను అట్లుండ చాలదు. అయితే వారు జన సమూహముతో కలిసి యుండనందుకు కారణ మేమిగానుండును? జనసమూహమందు కాలక్రమేణ శీలము తగ్గిపోయినది. జీవన్ముక్తుల యందు తపోబలము అధికమై జ్ఞానాగ్నియు తపస్సువల్లపుట్టిన తీవ్ర శక్తియు అధికమై ఊర్ధ్వగతియందు చాల ఎక్కువగా పోయి ఉన్నారు. జనసామాన్యము శీలము తగ్గినందున ౬౭ వ పుట యందు చెప్పిన ప్రకారము సోపానపంక్తియందు పడిన చెండువలె అధోగతిని చెందుచున్నారు. ఆకాశమార్గమున కెగియువారలు జీవ న్ముక్తులు. అధోగతిని చెందువారలు లోకులు. కనుక ఇద్దరికిని దూర మధికమైనది. సన్మార్గమునుండి చ్యుతిని చెందిన కుమా రునియందు తల్లి కభిమానము క్షీణించదు. అదే విధమున జీవన్ముక్తులకు లోకులయం దభిమానము క్షీణించలేదు. అయితే ఏల కనుపడ రను ప్రశ్నకు సమాధాన మేమి? తపోబలముచేత జాజ్వల్యమానముగా వెలుగుచున్న తేజస్సుగలవారు జీవన్ముక్తులు. వారల దేహముల స్పందములు అతి వేగములుగా నుండును. సా ధారణజనులయొక్క దేహములందలి స్పందములు బహుమందము లుగా నుండును. అతివేగములైన స్పందములు గలవారు మందము లైన స్పందములు గలవారిని సమీపించినయెడల వేగములైన స్పందములుగల శరీరముల తీవ్రమును ఓర్వలేక మందములైన స్పందములుగల శరీరములయందలి అణువులు పటాపంచులుగా పరు

గత్తి పోవును. అందువల్ల మందములైన స్పందములుగలవారికి మరణమే సంభవించవచ్చును. లేకున్నను చాల జబ్బుచేయవచ్చును. కనుక ఉపాసకుల క్షేమమును ఉద్దేశించియే జీవన్ముక్తులు వారిని సమీపించరు. ఒక ఉదాహరణమును గమనించవలెను. శ్రీమద్భగవద్గీతయందు శిష్యుడైన అర్జునునికి శ్రీకృష్ణమూర్తి విశ్వరూపము చూపిరి. యోగేశ్వరులు సాధారణ యదుకులమందు పుట్టిన శరీరముతో నుండినపుడు అర్జునుడు "హే కృష్ణ, హే యాదవ, హే సఖే" అని సరసములాడుచుండినను యదుకులజాతశరీరమును వదిలి యోగబలజన్యశరీరముతో దర్శన మియ్యగా "సగద్గదం భీతభీతః ప్రణమ్య" అని ఆ రూపమును చూచి భయపడెను. ఈ విషయమందు కించిత్తు మననము చేసినయెడల జీవన్ముక్తులు మనకు కనుపడకుండుట యే మనకు క్షేమము అని యెరుగగలము.

మరియు గురువులు సాధారణముగా మూడు తరగతులవారు. బ్రహ్మవిద్యోపనిషత్తునందు గురువుల తరగతులను చెప్పుచు "చోదకో బోధక శ్చైవ మోక్షద శ్చేతి" అని చెప్పియున్నది. ౮౧ వ పుటయందు చెప్పిన జీవన్ముక్తులకన్న తక్కువతరగతియం దుండి భూలోకమందు జనులతో కలిసిమెలసి సంచరించుచుండు గురువులు చోదకులు అనబడుదురు. జీవన్ముక్తులు బోధకులనబడుదురు. మోక్షదు లను గురువులు తారకోపదేశ మిచ్చువారు. వీరే దీక్షాగురువులు. కనుక నివృత్తి మార్గయాత్రాపరులు సాధనచతుష్టయసంపత్తిని సంపాదించుటకు ప్రయత్నముచేయుచు "చోదకః" అను గురువులవారిని ఆశ్రయించి వారు చెప్పు విధమున ఉపాసనాక్రమములను నడుపుచుండు కాలమున ఇకముందు "బోధక" గురు

వులవారుగా అపరోక్షమందు దర్శనమియ్యబోవువారు శిష్యుని చర్యలనన్నిటిని పరోక్షమునందుండియే గమనించుచుందురు. అంతే కాక శిష్యునియొక్క ఆస్ట్రల్ బాడీ మెంటల్ బాడీ వీట్లయొక్క ప్రతికృతులను అనగా బొమ్మలను తమ ఆశ్రమమునందుంచుకొని శిష్యుడే యే విధములైన కామములను సంకల్పములను చేయుచున్నాడో గమనించుచుందురు. శిష్యుడు ఇహలోకమునందు చేయు సకలకార్యములవల్ల కలుగు మార్పులన్నియు బోధకగురువులవారి వద్దనుండు ప్రతికృతియందు మార్పులుగా కనబడుచుండును. ఇట్లు కొంతకాలము పరీక్షించి శిష్యుని అర్హతను గురించి తృప్తికరమైన అభిప్రాయము ముదిరినపుడు శిష్యునికి వారి ఆమోదమును చోదకగురువులమూలముగా తెలియపరిచి సన్మానింతురు. అందువల్ల శిష్యునకు హర్షమధికమై మరియునంతధికముగా పరిశ్రమచేసి తనతలంపులను, కామములను, శరీరములను సుష్ఠుగా జేసికొని శుభ్రతచెందునట్లు నడుచుచుండును. బోధకగురువులవారిని సందర్శించు కాలమాసన్నమైనదని యెరిగి వారిదర్శనము లభించు నప్పటికి తన శరీరములు సుష్ఠుగా నేర్పడి వాటియొక్క మందస్వభావముగల స్పందములను తీవ్రస్వభావముగల స్పందములుగా మార్చుకొనుటకు నిజమైన ప్రయత్నము చేయుచు చోదకగురువులవారును బోధకగురువులవారును చేయు లోకసేవకు తాను తోడ్పడి. శిష్యుడు లోకసేవాపరుడై స్వప్రయోజనశీలతను మరచి

> ఏతావజ్జన్మ సాఫల్యం దేహినామిహ దేహిషు ।
> ప్రాణైరర్థైర్ధియా వాచా శ్రేయ ఆచరణం సదా ॥
>
> (శ్రీమద్భాగవతము, స్కం. ౧౦, అధ్యా. ౨౨)

ప్రాణములన్ అర్థములన్ బుద్ధితో వాక్కుతోనును ప్రాణులకెల్ల పుడును మేలుగావించుటయే దేహులకు జన్మసాఫల్యంబు అని శ్రీకృష్ణులవారుచేసిన ఉపదేశప్రకారము లోకసేవ చేయుచుండవలయును. ఇట్లుండుకాలమందు బోధకగురువులవారు చేయుపరీక్ష నిరంతరాయముగా జరుగుచుండును.

ముముక్షుత్వము అను ప్రేమాచరణమువల్ల శిష్యునియొక్క వృద్ధి ఏ విధము జరుగును అని విచారింతము. ఆత్మవిచారము, పూర్వభాగము, ౧౦౬ వ పుటయందు చెప్పబడిన శరీరముల పైకి కామమయశరీరము అయిన ఆస్ట్రల్ బాడీ యందు జనించి పనిచేయుచున్నప్రేమ కామమున స్త్రీపురుషులకు అన్యోన్యప్రేమ నిచ్చుచు ఇద్దరికిని ఏకీభావము పుట్టించుచుండును. ఈ సందర్భమునందు ఏకీభావము స్త్రీత్వమువల్లనును పౌరుషమువల్లనును ప్రేరేపింపబడియుండినను వాస్తవమునందు జీవాత్మకును మరియొక జీవాత్మకును కలిగిన ఐకమత్యము స్థూలశరీరములను ఉద్దేశించి కలిగిన ఐకమత్యము. స్థూలశరీరములలో అంగభేదములవల్ల మొదట జనించిన స్నేహమైనను ౨౦, ౩౦, ౪౦ సంవత్సరములకాలము స్త్రీపురుషులు స్నేహముచేయుచు వచ్చిన వెనుక ముసలితనమును చెందిన దంపతులు తమయొక్క దాంపత్యమును మరచి తాము ఇద్దరు జీవాత్మలును, జీవాత్మలు అయినందున నొకరితో నొకరికి స్నేహము అని నమ్మి స్నేహముతో నుందురు కదా. కనుక మొదట ఏ ఉద్దేశముతో ప్రేమ పుట్టినను ప్రేమ ముదురుచు వచ్చినపుడు దేహములను గమనించకయే దేహాతీతులైన జీవాత్మలకు ప్రేమబంధ మేర్పడెను. ఇట్టి ప్రేమబంధము ఆస్ట్రల్ బాడీయందు మలిన

ముగా నారంభించినది. ఆస్ట్రిల్ బాడీకిని బుద్ధిక్ బాడీకిని ఒక విధము అయిన సామాన్యగుణము కలదు. అశుద్ధమానస శరీరమునకును శుద్ధమానస శరీరమునకును ఒకవిధము అయిన సామాన్యమగు గుణము కలదు. అశుద్ధమానస శరీరమునకును శుద్ధమానస శరీరమునకును సామాన్యగుణము మనస్సు. అదేవిధమున ఆస్ట్రిల్ బాడీకిని బుద్ధిక్ బాడీకిని సామాన్యగుణము ప్రేమ. ఆస్ట్రిల్ బాడీలో పుట్టునట్టి ప్రేమ మలిన ప్రేమ. బుద్ధిక్ బాడీలో పుట్టునట్టి ప్రేమ శుద్ధప్రేమ. శుద్ధప్రేమయే ముముక్షుత్వము అను ప్రేమ. మరియొక చిత్రమున్నది. ఆస్ట్రిల్ బాడీయందు పుట్టిన ప్రేమ స్థూల శరీరసంబంధి. అదే విధమున బుద్ధిక్ బాడి కన్నను క్రిందిమెట్టున నుండు శుద్ధమానసశరీరమును ఉద్దేశించిపుట్టునది బుద్ధిక్ బాడీయందు పుట్టునట్టి ప్రేమ.

ఆత్మవిచారము, పూర్వభాగమునందు సప్తలోకములు స్థూల త్రిలోకి, సూక్ష్మత్రిలోకి యని రెండుగా పంచబడియున్నవి. ఈ రెండుజతల త్రిలోకులకును మధ్యన మహర్లోకము అను లోకాలోకమున్న దని చెప్పబడియున్నది. మరియు శుద్ధమానసశరీరము జీవాత్మకు ఇక చాలకాలము ఉనికిపట్టు అనియు, జీవన్ముక్తిదశ సమీపించువరకును ఈ శరీరము ఉండును అనియును చెప్పబడియె (౧౪౧ వ పుటచూడుడు). స్థూలత్రిలోకియందు ప్రేమ అను గుణమునకు ఉపాధి ఆస్ట్రిల్ బాడీ యను కామమయశరీరము. సూక్ష్మత్రిలోకియందు ప్రేమ అను గుణమునకు ఉపాధి బుద్ధిక్ బాడీ. ఆస్ట్రిల్ బాడీ ప్రేమకు కారణము స్వార్థేహ. బుద్ధిక్ బాడీప్రేమకు కారణము పరార్థేహ. ఇట్లు సూక్ష్మముగా బుద్ధిక్ బాడీయొక్క ఉపయోగము

సూచింపబడియె. జ్ఞానదీక్షులలో బుద్ధిక్ బాడీ చేయు కార్యములు అనేకములు. ఈ విషయమునుగురించి వ్రాత మరల ఆరంభించబడును.

౭౭ వ పుటయందు మహీపీఠమునుగురించి వ్రాసినపుడు ప్రథమ రేఖకు అధిపతి వైవస్వతమనువు అని ప్రస్తావింపబడియె. "షాణ్మాతురశ్శక్తిధరః" అనియు దండాయుధపాణి యనియు నపరనామధేయంబుల నెరుగబడు శ్రీసనత్కుమారులవారు అన్ని రేఖలకును ఆయా అధికారములకును స్థానము అనియు చెప్పబడియె. ఇందునుగురించి మహీపీఠముయొక్క క్షత్రియధర్మమును కొంత విశదీకరించవలసియున్నది. మహాసంకల్పము అనునది యొక అంశము. శ్రీసనత్కుమారులవారి మనస్సునందు ఈ భూగోళమును ఏవిధముగా రాజ్యమేలవలెను అను విషయమై ఒక అభిప్రాయ మేర్పడియున్నది. ఆ అభిప్రాయమును అనుసరించి రాజ విద్యాప్రవీణు లైన మనువులను నియమించి వారిద్వారా రాజరిక కార్యములను నిర్వహించుచుందురు. మన భూగోళమునందు నడుచునట్టి ప్రతివిషయమును శ్రీసనత్కుమాగులవారికి విదితమే. వారి ఆజ్ఞలేనిదే ఏదేశముననైనా చక్రవర్తులు మారరు. యుద్ధములు జరుగవు. భూకంపములు మొదలగునవి సంభవించవు. రాజుల వైభవపరాభవములు, జనుల శాంతిసౌరభ్యములు, దేశములయొక్కయు దేశీయులయొక్కయు స్నేహములు వివాదములు, క్షామములు సుభిక్షములు మొదలగునవి యన్నియు వారి యెరుక లేనిదే ఏవియు జరుగవు. అవి జరిగినపుడు ప్రతిసందర్భమును ముందు రాబోవు సందర్భములకు మహాసంకల్పమున కనుగుణములైన కారణములుగా నుపయోగించుకొందురు.

లోకేశులైన త్రిమూర్తులకు ప్రత్యామ్నాయులుగా నీ భూగోళమునకు ముగ్గురు అధికారులు గలరు. శ్రీసనత్కుమారులు, మైత్రేయ లను పేర నెరుగబడు జగద్గురువులవారు, మహాచోహాను అని టిబెట్టుదేశభాషావ్యవహారనామము వహించిన పెద్దఋషి యొకరు. ఈ ముగ్గురును సప్తరేఖాన్వితమైన లోకంబునకు అధికారులు. శ్రీసనత్కుమారులవారి ప్రథమరేఖాంశమునకు వారి ప్రతినిధి వైవస్వతులు అధిపతి. ద్వితీయ రేఖాంశమునకు జగద్గురువులవారగు మైత్రేయులవారు అధిపతియును శ్రీసనత్కుమారుల వారికి ప్రధానమంత్రియును గానున్నారు. తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠ, సప్తమ రేఖలకు సముదాయాధిపత్యము మహాచోహానుగారికి ఇయ్యబడియున్నది. వీరి అధికారమునకు లోబడిన అయ్యిదు రేఖలలో ప్రతిరేఖకును ఒక రేఖాచార్యులవారు ఉన్నారు.

శ్రీసనత్కుమారులవారి భ్రాతృవర్గమునందు వారికన్న కనిష్ఠులు ముగ్గురుగలరు. ఈ నలుగురు భ్రాతలశరీరములు శుక్రలోకమునుండి వచ్చినవి. వీరును మహీపీఠపు ఋషులలో నగ్రగణ్యులును అనేక లక్షలసంవత్సరములకు మునుపు శుక్రలోకమునుండి భూలోకమునకు "లోకస్యాజ్ఞానశాంతయే" విచ్చేసిరి. ఈ రహస్యములో కొంతభాగము శ్రీమద్భాగవతము చతుర్థస్కంధాంత్యమందు పృథుచక్రవర్తి కథలో సూచింపబడియున్నది. శ్రీ సనత్కుమారులవారి కనిష్ఠభ్రాతలగు సనకులు, సనందనులు, సనాతనులుకూడ శుక్రలోకమునుండి విచ్చేసి తమ జ్యేష్ఠభ్రాత తమకు ఇచ్చిన యుద్యోగమును నడిపించుటకు సిద్ధముగా కాచియుందురు. వీరు మువ్వురును ప్రథమరేఖకు చేరినవారు. వీరుముగ్గురితో సమాన

మైనపదవిని చెందిన మహానుభావులు సిద్ధార్థుడు, గౌతముడు అను నామధేయంబుల వ్యవహరింపబడు బుద్ధులవారు. బుద్ధదీక్షను కైగొన్నపుడు తనకు అదివరకునుండిన జగద్గురువుపదవిని శ్రీమైత్రేయులవారికి ఇచ్చిరి. మహాసంకల్పముయొక్క వివరములన్నియు తన స్వాధీనమందుంచుకొని లోకారాధ్యతవహించియుండు అధికారికి పై చెప్పిన "మహాచోహాన్" అని పేరు. వైవస్వతులు అను మనువుగారు, మైత్రేయులు అను జగద్గురువువారును వరుసను ప్రథమరేఖకును ద్వితీయరేఖకును రేఖాచార్యులు అని ముందే చెప్పబడియే. మిగిలిన అయిదు రేఖలకును సముదాయమున మహాచోహానుగారు రేఖాచార్యులవారు అనియు పైన చెప్పబడియె. కావున వైవస్వతులు, మైత్రేయులు, మహాచోహానుగారు ఈ ముగ్గురును ఒకటే పదవియందుండువారు. సప్తరేఖావృతంబైన లోకమంతయును ఈ ముప్పురియొక్క పాలనమందుండును. ఈ మువ్వురి యధికారమునకు లోబడి ప్రతిరేఖకును రేఖాచార్యులవారుగా నొక్క యధికారి గలరు. వారు జీవన్ముక్తపదవిని పొందినవారు. వీరందరును ఆధికారికపురుషులు. లోకమునంతయు భాగములుగా పంచి ఒక్కొక దేశమును ఒక్కొక జీవన్ముక్తులవారి అధికారమునకు లోబరిచియుందురు. మన భరతఖండపు సర్వాధిపత్యము శ్రీఅగస్త్యఋషిగారికి ఇయ్యబడియున్నది.

పార్వతీపరమేశ్వరుల వివాహకాలమందు దండకారణ్యమునకు అగస్త్యఋషిగారిని పంపినట్టు పురాణములయందున్నది. మహాసంకల్పముయొక్క రహస్యములను పురాణములలో అక్కడక్కడ గుప్తముగా చెప్పియున్నారు. అగస్త్యులవారిని దండకారణ్యమున

కు పంపినది యొక మహాసంకల్పపు రహస్యము. మహీపీఠపువారి మహాసంకల్పమహిమవల్ల ఆ యా దేశమును ఏలుచున్న జీవన్ముక్తులు అక్కడక్కడి చక్రవర్తులను, రాజులను, మంత్రులను, సేనానాయకులను మహాసంకల్పము ఏరీతిగా నడువవలెనో అట్లు నడిపించుటకుగా ఏ విధముగా చదురంగపుపలకపైన పేదాలను, మంత్రులను, గుఱ్ఱములను, మనము జరిపియుంచి చదురంగమాడుచుందుమో ఆ విధమున స్థానములు మార్చుచు సంకల్పనియమములను పరిపూర్తిచేయుచుందురు. మహాసంకల్పమునుగురించి ఈ మాత్రము వ్రాసి చాలించి యిక దీక్షలనుగురించి వ్రాయుటకారంభించుదము.

సాధనచతుష్టయమునుగురించి వ్రాసి అందులో ప్రేమ అనునది ముఖ్యము అని చెప్పబడియె. ప్రేమయు ఉచ్చనీచభేదముల వల్ల ద్వివిధంబు అనియు, కామమయశరీరంబున పుట్టిన ప్రేమ స్వార్థేహాచే ప్రేరేపింపబడిన దనియు బుద్ధిక్ బాడీయందు పుట్టు ప్రేమ పరార్థేహావల్ల కలిగిన దనియు, అందువల్ల శ్రేష్ఠమైనదనియును అందువల్ల అది ఉచ్చస్వభావము కలదనియును చెప్పబడియె. బుద్ధిక్ బాడీయందు పుట్టుప్రేమకు ఎల్లలు ఉండవు. "వసుధైవకుటుంబకం" అను న్యాయప్రకారము లోకులందరును నావారు అని విస్తరించగల శక్తి కలదిగానుండును.

శరీరము సుస్థకావలె నని ఆశగొనినవాడు తన శరీరముతో పరిపూర్ణముగా పనిచేయుచురావలెను. ఉపయోగించుకొలదియు శరీరమునకు శక్తి అధికమగుచుండును. ఏ శరీరమైనను దానియొక్క సౌష్ఠవము ఉపయోగము నాశ్రయించియుండును. స్థూలశరీరము, కామమయశరీరము, అశుద్ధమానసశరీరము, శుద్ధమానసశరీరము ఈ

నాలుగు శరీరముల పెంపునుగురించి ఈ గ్రంథము పూర్వభాగము, ౫ వ అధ్యాయమునందు వివరముగా వ్రాయబడియున్నది. అదే విధమున బుద్ధిక్ బాడీ విషయమందును ఆ శరీరముయొక్క పెంపును గురించి అన్వయించుకోవలెను. చేతికి బలమురావలె నని కోరు వాడు చేతిని చాల విధముల ఉపయోగించుచు రావలెను. ఉప యోగ మధికమైనపుడు పెంపు అధికమగును. పరార్థేహ ప్రేమను ఎంతకెంత మనము ఉపయోగించెదమో అంతకంత బుద్ధిక్ బాడీ పెరిగి పుష్టు అగును. బుద్ధిక్ బాడి పెరుగుచు రాగా జ్ఞాన దీక్ష చెందుటకు ఉపాసకుడు అర్హుడగుచుండును. ముముక్షుత్వము గలవానికే కదా మోక్షము లభించును. పరార్థేహవల్ల పుట్టిన ప్రేమయే కదా ముముక్షుత్వము. మందమధ్యమరూపములైన పరార్థేహ ప్రేమను అనుసరించి జ్ఞానదీక్షలు ఇయ్యబడును.

మహీపీఠమునకు అధికారియైన శ్రీసనత్కుమారులవారి అనుమతిలేకయే జ్ఞానదీక్షలు లభించవు.

> యః పుణ్యైర్దేవతానాం సమజని శివయోః శ్లాఘ్యబీజైకమత్యాత్ ।
> యన్నామ్ని శ్రూయమాణే దితిజభటఘటాః భీతిభారం భజంతే ।
> భూయాత్సోయం విభూత్యై నిశిత శరశిఖా పాటిత క్రౌంచశైలః ।
> సంసారాగాధ కూపోదర పతిత సముత్తారకః తారకారిః ॥

ఏ మహానుభావుడు పార్వతీపరమేశ్వరులయొక్క కనిష్ఠపుత్రుడుగా జనించెనో,: ఏ మహానుభావుని పేరు విన్నమాత్రముననే దితి యొక్క వంశమందుపుట్టిన దైత్యసంఘమంతయు గడ గడ నడరు నో, ఏ మహానుభావుడు గంభీరమైన సంసారకూపమందు పడియుం డు వారలను తరింపచేసి మోక్షము నొసంగునో, తారకాసురుని

వధించిన ఆ మహానుభావుడైన కుమారస్వామి క్షేమమును ఇచ్చు గాక అని యర్థము. వారి అనుమతిని సంపాదించుటకుగా భోధక గురువులవారు యత్నించుదురు. అనుమతిని కోరుటకు పూర్వము తాము ఉపాసకునియొక్క యోగ్యతను బాగుగ పరిశీలించి తృప్తి చెందవలెను కదా. అందుకనే శిష్యునియొక్క కామమయాదిశరీరములయొక్క బొమ్మలను తమ ఆశ్రమమునందు ఉంచుకొని పరీక్షించుచుందురు అని ౮౪ వ పుటయందు చెప్పబడియె. జ్ఞానదీక్షల యందు పదితరగతులు గలవు. అందులో ఐదు అత్యున్నతములు. వాటినిగురించి వ్రాయుటకు ఈ గ్రంథకర్తకు యోగ్యతలేదు. కనుక ప్రకృతమందు మనకు ఐదుదీక్షలు దిగువతరగతివే ముఖ్యములు. చోదకగురువులవారు సాధారణముగా మూడుదీక్షలనో రెంటినో నాలుగింటినో పొందియుందురు. ఐదవదీక్ష జీవన్ముక్తి యను పదవిని యిచ్చునది. బోధకగురువులవారికి ఐదుదీక్షలు అయివుండును. ఆఱవది కూడ అయియుండవచ్చును. బోధకగురువులవారియొక్క పరీక్ష యందు శిష్యునియొక్క పరార్థేహాస్వభావము ఏ మాత్రము ముదిరినది అని విమర్శించి వారు తృప్తిచెందితే వారు శిష్యునికి మొదటి దీక్షను ఇప్పించుటకు ప్రయత్నపడుదురు. ౮౪ వ పుటయందు చెప్పిన ప్రకారము పరీక్షయందు కొంతమట్టుకు తృప్తిచెందిన పిమ్మట చోదకగురువులవారిద్వారా శిష్యునివిషయమందు తమకు గల ప్రసన్నతను బోధకగురువులవారు తెలియపరుచుదురు. ఇవంతయు శిష్యునియొక్క జాగ్రదవస్థలో శిష్యుని కేమియు తెలియక యుండవచ్చును. ఇప్పటికే శిష్యుడు స్థూలశరీరము నిద్రించుచుండుసమయమందు కొంతకాలము కామమయశరీరమందు (ఆస్ట్రల్ బాడీ

యందు) సంచరించి ఆస్ట్రిల్ ప్లేనులో లోకోపకారము చేయుచు ఈ గ్రంథముపూర్వభాగము, ౨౯౯ వ పుటయందు చెప్పినప్రకారము కర్మక్షయము చేయుచుండును. ఇదే విధముగా మెంటల్ ప్లేను నందును కర్మక్షయము చేయుచుండును. ఆస్ట్రిల్ మెంటల్ ప్లేనులయందు సంచరించి లోకసేవ చేయునుపాయమును చాలమట్టుకు చోదక గురువులును కొంతమట్టుకు బోధకగురువులవారును కూడ నేర్పింతురు. ఆస్ట్రిల్, మెంటల్ ప్లేనులలో లోకోపకారము చేయుచు తద్ద్వారా సందర్భము కలిగినపుడు కర్మక్షయము కూడ చేసికొనుచు ప్రేమ అను గుణమును వృద్ధిచేసికొనుచు అపుడపుడు ఆ లోకములయందు బోధకగురువులవారిని కూడ దర్శనముచేసికొనుచు ఆనందించుచు ఆస్ట్రిల్ బాడీ, అశుద్ధమానసశరీరము, శుద్ధమానసశరీరము అను శరీరములను బలపరుచుకొనుచు జాగ్రదవస్థయందు తన శరీరముల సౌష్ఠవమునకుగా కావలసినన్ని ప్రయత్నములను చేయుచు "అహంతా" "మమతా" అను దుర్గుణములను కొంచకొంచముగా విడనాడుచు లోకమునందుండినను లోకమునందు లేనివానివలె గృహమునే తపోవనముగా చేసికొనుచు స్వకర్మచోదితములైన హవ్యాసములను పరమేశ్వరప్రీతిగానును లేక గురుదేవులవారికి ప్రీతిగానును చేయుచు తపస్సుజ్ఞానము అను నిష్ఠలను యథాకాలముగా జరుపుచు వైరాగ్యాది సాధనములను సరిపరుచుకొనుచు జ్ఞానదీక్ష నెదురుచూచుచుండు శిష్యుడు సకల కాలములయందును

సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।
హర్షామర్ష భయోద్వేగైః . . . . విముక్తః . . . . ॥

అయి చరించుచుండును.

ఈ సందర్భమునందు కర్మను పంచిపెట్టు కర్మదేవతలు శిష్యుని ప్రారబ్ధకర్మను మరియునంత అధికముగా పంపుచు తద్ద్వారా కష్టములకు పాలుచేయుచుందురు. ఇట్టి కష్టములు వచ్చినపుడు శిష్యుడేమి అనుకొనుననగా—నేను ఇన్నిదినములకంటె ఇపుడు అతిజాగ్రతగా పాపభీతితో బ్రతుకుచుండగా నాకు ఏల ఇట్టి కష్టములు వచ్చుచున్నవి. పాపులు అనేకులు సుఖముగానుండగా పుణ్యకార్యములను చేయుచు భక్తిని అనుష్ఠించుచుండు నాకా ఇన్నికష్టములు రావలెను అని చింతాక్రాంతుడై తితిక్షయను గుణమును జ్ఞాపకమునకు తెచ్చికొని శ్రమలన్నియు నేను పూర్వమందు చేసిన కర్మల ఫలమేకదా, కర్మదేవతలను నేను ప్రార్థించి నాప్రారబ్ధకర్మక్షయమునకు సహాయపడుడని వేడుకొనియుంటిని గనుక యిన్ని కష్టములు వచ్చియున్నవి అని జ్ఞానము తెచ్చుకొని కర్మానుభవమునకు జడియకయుండును. ఇట్టి తితిక్ష అను గుణమును వృద్ధిచేసుకొనుచుండుటను కూడ బోధకగురువులవారు గమనించి సంతసించుచు శిష్యునికి పరోక్షమునుండియే మనోధైర్యము నిచ్చుచుందురు.

స్థూలశరీరమునకు గర్భాష్టమమందు ఉపనయనము జరుపుట శాస్త్రములయందు విధించియుండు విధమున బోధకగురువులవారు శిష్యునియొక్క కామమయ మనోమయ శరీరములయొక్క బొమ్మలను సిద్ధపరిచి తన ఆశ్రమమునం దుంచుకొనినదిమొదలు ఏడు సంవత్సరముల కాలము శిష్యునియొక్క ఆచరణలను, వృద్ధిని, గమనించి శిష్యుని జ్ఞానదీక్షకు శిఫార్సుచేయుటకు సన్నాహము చేయుచుందురు.

తురీయాత్మ లేక ప్రజ్ఞానాంశువు అను మోనద్దు ఇదివర కును తనయొక్క ప్రతిబింబమైన ఆత్మబుద్ధిమనస్కుడు చేయుచు వచ్చిన కార్యముల వలన జనించిన అనుభవములను తాను తన యందు ఇముడుచుకొనుచుండెను (ఆత్మవిచారము, పూర్వభాగ ము, ౫౧ వ పుట). తనయొక్క ఇష్టానుసారముగా తన ప్రతి బింబమయిన ప్రాజ్ఞాత్మ జరుపుచున్నాడని తురీయాత్మ ఆనందిం చుచు దీక్షాసమయమును ఎదురుచూచుచుండును. ఈ లోపల బోధకగురువులవారు శిష్యుని తనకన్న పై అధికారియొక్క సమ క్షమునకు పిలుచికొని పోయి వారి దర్శనమును ఇప్పించి వారి లెక్కలలో ఈ శిష్యుని నామధేయమును వ్రాయించి అపై అధి కారియైన మహాచోహాను గారికిని శిష్యునికిని గుర్తెరుక చేసి యుంచుదురు. మహాచోహానుగారు అది మొదలు శిష్యుని కొంత కాల మపరోక్షమునుండి పరీక్షించుచు వారి మనస్సునకు శిష్యుడు దీక్షకు అర్హుడని తోచినపుడు దీక్షాప్రదానమునకు తగిన ఏర్పాటు లను చేయుదురు. ముందు ఏర్పాటును అనుసరించి ఒక స్థలము నందు దీక్షాప్రదానముచేయు జీవన్ముక్తులును, ఇతర జీవన్ముక్తులు అనేకులును, శిష్యుడును, శిష్యునియొక్క చోదకగురువులవారును, బోధకగురువులవారును, మరికొందరు బోధకగురువులును, చేరి దీక్షాప్రదానము చేయుదురు. ఇది రెండవ ఉపనయనము. గర్భా ష్టమమందు స్థూలశరీరమునందు ఆత్మబుద్ధిమనస్కుడు స్థిరముగా ప్రవేశించినపుడు ఒక ఉపనయనము. ఈ దీక్ష రెండవ ఉపనయ నము. ఈ రెండవ ఉపనయనకాలమందు శిష్యునికి సిద్ధమైన శరీ రము బుద్ధిక్ బాడీ. ఈ రెండవ ఉపనయనము అను దీక్షావిశేష

మునందు బోధకగురువులవారికిని దీక్షాప్రదాతకును శిష్యుడు కొన్నిప్రతిజ్ఞలు చేసియియ్యవలయును. ఈ ప్రతిజ్ఞలు చేసి యిచ్చుటకుగా తురీయాత్మ స్వధాగావచ్చి శిష్యునియందు ప్రవేశించి తురీయాత్మయే ప్రతిజ్ఞ చేసియిచ్చును. ఆ విధముగా ఇన్ని జన్మములయందును సాక్షీవత్తుగా దూరానుండిన తురీయాత్మ ఇది మొదలు ప్రాజ్ఞాత్మతో కలిసియుండుట కారంభించును. దీక్షా ప్రదానము వరకును శిష్యుడు పోగొట్టుటకు ప్రయత్నించిన బంధములకంటె చాల బలవంతములైన బంధములు కానవచ్చును. ఆ బంధములనన్నిటిని శిష్యుడు దీక్షితుడైన పిమ్మట కొంత కొంతగా పోగొట్టుకొనుచు వచ్చినయెడల బోధకగురువులవారికిని మహాచోహానుగారికిని తృప్తికరముగా నైనయెడల రెండవదీక్ష, మూడవ దీక్ష, నాలుగవ దీక్ష ఈ ప్రకారము దీక్షాప్రదానములు జరుగుటకు వీలుండును. ఈ విషయమును గురించి వ్రాయవలసినది ఎంతో ఉన్నది. వ్రాయువానికి యోగ్యత చాలదు. కనుక ఇంతటితో విరమించి సూత్రత్రిలోకి యందు సంచరించుచు దీక్షితుడైన శిష్యుడు బుద్ధిక్ బాడీని గట్టిపరచుకొనుచు “యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథోమయి” అని సర్వజీవాత్మైక్యమును అనుభవించుచు అనుష్ఠించుచు జీవన్ముక్తి దీక్షను ఎదురుచూచుచు లోకమునందు “మహతాం బహుమానేన దీనానా మనుకంపయా” అని నిరంతరాయముగా ప్రేమను కురిపించుచు శ్రీ జగన్నాథుని యొక్క శిష్యకోటిలో నొకడుగా జీవించియుండును.

దీక్షలలో అనేకతరగతులు కలవనియు అందులోముఖ్యముగా మనకు ప్రకృతములో తెలియవలసినవి ఐదు అనియు పైన

చెప్పబడినది. ఈ దీక్షలయందు హృదయగ్రంథి, బ్రహ్మగ్రంథి, విష్ణు గ్రంథి, శివగ్రంథి అని గ్రంథులు అనేకములు గలవు. ప్రతి మనుజుడును జీవన్ముక్తిదశకు రావలెనని ఆశించువాడు ఈ గ్రంథులను భేదించి పైమెట్టుకెక్కవలెను. గ్రంథిభేదము అతి కష్టమైన సంగతి. గ్రంథులు మాయవల్ల కలిగినవి. మాయాధిపత్యమునకు లోబడిన దైత్యసంఘములు ఆగ్రంథులవద్ద కావలిగానుందురు. ఈ గ్రంథు (అనగా ముళ్లు) లను పగలదీయుటకు అనేకమంది నివృత్తిమార్గ యాత్రాపరులు ప్రయత్నముచేయుదురు. ప్రయత్నముచేయువారందరును జయించుట అసాధ్యము. "యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః" అని చెప్పియున్నది. కనుక గ్రంథులను కాచియుండు దైత్యులు జాగరూకతతో ఏ యుపాసకుడు ధీరుడై గ్రంథిభేదమునందు అతి జాగ్రతగా కృషిచేయునా చూతము అని కాచియుందురు. ధైర్యముతో తన యుద్దేశమును మరువక, లక్ష్యచ్యుతి (౬౭ వ పుట చూడుడు) లేకనే మెట్టు మెట్టు తప్పక ఎక్కుటకు తగు ప్రయత్నముచేయువారు ఎవరు అని పరీక్షించుచు అట్లుప్రయత్నము చేయువారలకు అనేక విఘ్నములను కలుగజేయుచు వారల ఉద్దేశమును ఓడగొట్టుటకు దృఢప్రయత్నము చేయుచుందురు. ఉపాసకుడు తనయందు ముముక్షుత్వము అను గుణముయొక్క శక్తి ఎంత దృఢముగా నున్నదో అంత ధైర్యముతో ఆతంకములను జయించగలడు. ఆతంకములను జయించుకొలదిని దైత్యులయొక్క ప్రయత్నము లధికమగును. కనుక దీక్షచెందినది మొదలు ఉపాసకునికి దైత్యులతో తగవులు అధికమగుచుండును. ఈ దైత్యులనే థియోసాఫికల్ సొసైటివారు "డార్క

బ్రదర్సు" (Dark Brothers) అని చెప్పుదురు. ఈ విధమైన యుద్ధము ప్రతిమెట్టునందును ఉపాసకునికి జరుగుచునే యుండును. మెట్టు మెట్టుకును శ్రమలు కలుగుచుండును. ఉపాసకుడు స్వప్రయత్నమువల్లను తన గురుదేవులవారి యనుగ్రహమువల్లనును జయించుచువచ్చును. ఉపాసకునియందు దాగియుండు శక్తియొక్క ప్రభావమువల్ల ప్రత్యవాయములను దాటవలెనే గాని ఉపాసకునికి ఇతరుల సహాయము ఏమాత్రమైనను ఉపయోగించదు. మన యిండ్లలో లేతబిడ్డలు దోగాడుచు వచ్చి తమకు కావలెనని తోచిన ఏదో ఒక వస్తువును ఎత్తికొనవలెనని ప్రయత్నముచేయుట మనకు తెలిసియున్నది. అపుడు బిడ్డ కోరిన వస్తువును తీసి వేరొక స్థలమునందుంచి ఆ వస్తువునకు మనము అడ్డముగా కూరుచుందుము. అప్పుడు బిడ్డలు ఏవిధముచేతనైనా తమకు సాధ్యమైనన్ని త్రోవలగుండా పోయి తాము కన్ను వేసిన వస్తువును గ్రహించియే తీరుదురు. వస్తువును గ్రహించుటకు కావలసిన ధృతి అను గుణము బిడ్డలయందే స్వభావగా నుండినది కదా. అదే విధముగా శిష్యునియందు ఉండు ధృతివల్లనే తన యుద్దేశమును నిష్ఫలముగా చేయుటకై కలుగు అభ్యంతరములను గెలువవలయును. గురుదేవులవారు కొంతకాలము శిష్యునికి సహాయపడినను "ఉత్తమం స్వార్జితం విత్తం" అను న్యాయప్రకారము శిష్యుడు తాను తన శక్తివల్లనే యుద్ధముచేసి గెలువవలయును. "ఉద్ధరేదాత్మ నాఽఽత్మానం" అన్న ప్రకారము తానే తనశక్తివల్ల గ్రంథులను కాచియుండు దైత్యసేనా నాయకులను గెలువవలయును.

ఈ యుద్ధము ఒకతడవ ఆడితే చాలదు. ప్రతిపదవియం దును సంభవించుచునే యుండును. ప్రతిపదమునందును శిష్యుడు గెలిచియే కావలెను.

ఇది యిట్లుండగా మరియొక విషయమున్నది. అందును గురించి విచారించవలయును. ఏ బోధకగురువులవారు పూర్వము పరోక్షమందుండి శిష్యునియొక్క గుణాగుణములను పరిశీలించు చుండిరో, ఏ మహానుభావులు పరోక్షమందుండుట చాలించి అప రోక్షమందు దర్శనమిచ్చి దీక్షాగురువులగారికిని శిష్యునికిని పరిచ యము చేయించిపెట్టి శిష్యుని తన బిడ్డవలె కాపాడుచువచ్చిరో వారు "కృపయా దృగ్గోచరస్సన్" అనినట్టు ప్రథమ దీక్ష అయిన పిమ్మట కొన్నాళ్లు దృగ్గోచరులుగానే యుందురు. అయితే శిష్యుని యందు స్వశక్తిని దృఢపరుచవలె నని ఉద్దేశించి అప్పటికపుడు కొన్నాళ్లు మరల పరోక్షత వహింతురు. పరోక్షమునుండి యే శిష్యునియొక్క ఉపాసనాశక్తిని, సత్యవ్రతమును, భక్తిశ్రద్ధలనును గమనించుచున్నను శిష్యునికి దృగ్గోచరులుకారు. శిష్యుడు తనకు దుర్లభమైన గురుదేవులవారి దర్శనము లభించినందుకు హర్షమును చెంది కొంతమట్టుకు "కో న్యోస్తి సదృశో మయా" అని నా వంటి భాగ్యవంతుడు నేనే గాని వేరొకరు ఉందురా అని తన యదృష్టమునుగురించి సంతోషపడు రీత్యా ఒక విధముగా గర్వము చెందియుండును. ఇది లోకులు ఎరిగిన గర్వముకాదు గాని గర్వ మేమో గర్వమే.

పురాణములలో గరుడుని గర్వభంగము అనియు హనూమ ద్గర్వభంగ మనియు కథలను వినుచుందుము. రుక్మిణీదేవికి కూడ

గర్వభంగము చేయుటకు ప్రయత్నము జరిగినట్లు శ్రీమద్భాగవతము, దశమస్కంధము, ౬౦ వ అధ్యాయమునందు చెప్పబడియున్నది. గర్వమ ననది అతిసూక్ష్మముగా మనస్సునందు ప్రవేశించును. ఉపాసకుడు కూడ కనుగొనుట అశక్యము. అట్టి గర్వము తనశిష్యులను ప్రవేశించకూడ దని బోధకగురువులవారి యభిప్రాయము గనుక అపుడపుడు తాము శిష్యులను ఉపేక్షచేసినట్లు తాము పరోక్షతవహించుట కలదు.

తాసాం తత్సౌభగమదం వీక్ష్యమానం చ కేశవః ।
ప్రశమాయ ప్రసాదాయ తత్రైవాంత రధీయత ॥

(శ్రీమద్భాగవతము, స్కం. ౧౦, శ్లో. ౪౮)

ఈ శ్లోకమునకు అర్థము — వారికి కలిగిన సౌభాగ్యము, మదము, మానములను అడగించి ఆ విధమున ప్రసాదించుటకును స్వామి ఉన్నటుల ఉండి అంతర్హితుడయ్యెను.

గురువునకును శిష్యునకును గల సంబంధమును గ్రంథములయందు కొంత అలంకారశాస్త్రసంబంధముగా వర్ణించియుందురు. శ్రీమద్భగవద్గీతయందు "పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుం" అని చెప్పియున్నది. తండ్రి కుమారునివరుస, స్నేహవరుస, ప్రియునికి ప్రియకు గలవరుస ఇట్లు వర్ణించుట కలదు. భార్యాభర్తలవరుస తరుచుగా వినుచుందుము. పూర్వ జన్మములయందు మహాయోగులుగానుండినవారలు కొందరు యోగేశ్వరులైన శ్రీకృష్ణులవారి అవతారకాలమునకు సరిగా గోపికావేషంబులతో వ్రజభూమియందు జన్మించిరని పురాణములయందు చెప్పబడియున్నది. అట్లు జన్మించి కామినులు కామోద్రేకముతో

ప్రియుని ఆశ్రయించి కామోపభోగములను అనుభవించినట్టు శ్రీమద్భాగవతమునందు వర్ణించియున్నది. దీని అంతరార్థమును విచారించుటకు ఇది సంసర్భముకాదు. "యోగేశ్వరేణ కృష్ణేన తాసాం మధ్యే ద్వయో ర్ద్వయోః" అని శ్రీమద్భాగవతమునందును, "అంగనా మంగనా మంతరే మాధవో మాధవం మాధవం చాంతరే ణాంగనా । ఇత్థ మాకల్పితే మండలే మధ్యగ స్సంజగౌ వేణునా దేవకీ నందనః ॥" అని ఇతరత్రయు వర్ణింపబడియున్నది. ఇట్లు యోగేశ్వరుడైన జగద్గురువు ఒక ప్రజామండలమధ్యమున నిస్సంగుడుగా నిలిచియుండి వేణునాదంబు గావించెనని పైశ్లోకముల అర్థము. ప్రకృతసందర్భమునుద్దేశించి రాసక్రీడ ప్రస్తావము చేసి తత్పూర్వము గోపికాగీతలనును ఆ గీతలకు కారణమైన శ్రీకృష్ణులవారు అంతర్ధానముచెందిన విషయమునును జ్ఞాపకపరిచి జగత్పతియు యోగేశ్వరుడును జగద్గురువులవారునైన శ్రీకృష్ణమూర్తి తన శిష్యులను విడనాడి అంతర్ధానముచెందినందుకుగా నిచ్చిన సమాధానము మనము గ్రహించి అర్థముచేసికోవలయును. ఎందుకుగా నండీ తాము మమ్మును ఉపేక్షచేసి మరుగైతిరి స్వామీ అని గోపికలు పృచ్ఛచేసినందుకు స్వామివారు

నాహం తు సఖ్యో భజతోఽపి జంతూ న్భజామ్యమీషామనువృత్తివృత్తయే ।
యథాఽధనోలబ్ధ ధనేవినష్టే తచ్చింతయాన్య న్నిభృతో న వేద ॥

ఏవం మదర్థోజ్ఝిత లోకవేదస్వానాం హి వో మయ్య నువృత్తయే ఽబలాః ।
మయా పరోక్షం భజతా తిరోహితం మాసూయితుం మార్హథ తత్ప్రియం ప్రియాః॥

ఇందుకు భక్తాగ్రగణ్యుడగు పోతనామాత్యుడు వ్రాసిన దేమనగా,

మ॥ నను సేవించుచు నున్నవారలకు నే నారూపముం జూప।
జూచిన జాలించి మదించి వారు మది నన్సేవింపరో యంచు।
నిర్ధనికుం డాత్మధనంబు చెడ్డ నెపుడుం దత్పారవశ్యంబుదా।
ల్చిన భంగి న్ననుబాసి మత్ప్రియుడు దా చింతించు నా రూపమున్॥

తరల॥ తగవు ధర్మము జూడనొల్లక దల్లిదండ్రుల బంధుల।
న్మగల బిడ్డల బాసి వచ్చిన మన్నిషక్తుల మిమ్మనే।
దగదు పాసితి దప్పు సైపుడు తద్వియోగభరంబున।
న్వగల బొందుచు మీరలాడిన వాక్యముల్వినుచుండితిన్॥

ఈ శ్లోకంబులయందును పద్యములయందును గల సారాంశము: గురుదేవులవారి సాన్నిధ్యముకలిగినపుడు అవశాత్తుగా అతిసూక్ష్మముగా శిష్యుని మనస్సునందు పుట్టు సంతోషముయొక్క పరిణామము అనేకులు ప్రయత్నముచేసినను నేను కదా గురుదేవులవారి అనుగ్రహామునకు పాత్రుడనైతిని అని తృప్తియు, తదంగత్వేన తన ఆధిక్యము అను దుర్గుణములను పోగొట్టుటకై గురుదేవులవారు దాగియుండి శిష్యునియొక్క ఆలాపప్రలాపములనును తన్మధ్యే తనవిధేయతమైన ప్రేమాచరణమును తనకు కలిగియుండు దుఃఖమును ఇతరులతో చెప్పుకొనుటకుగా కావలసిన కాలయాపన చేయకయే జరుపుచున్నాడా, తితిక్ష యను గుణమును సరిగా ఆచరించుచున్నాడా యని పరీక్షించు నిమిత్తము ఇట్టి మేఘ వ్యాప్తి శిష్యునకు అప్పుడప్పుడు కలిగింతురు.

మేఘవ్యాప్తి యనగా వేసవియందంతయు మహాప్రకాశముతో ప్రకాశించుచుండిన సూర్యుడు వర్షాకాలమందు మేఘములచేత మూయబడి కానకపోవును. అపుడు లోకులకును చరా

చర జీవులకును ఆహ్లాదము తక్కువైయుండును. అదేవిధమున శిష్యుడు నివృత్తిమార్గయాత్రాభిలాషియై సాధనచతుష్టయములను సంపాదించుచు ఒక్కొకసాధనమును సంపాదించినపుడంతయు సంతోషించుచు చోదకగురువులవారి అనుగ్రహమువల్ల బోధక గురువులవారికి తనయందున్న సమీచీనాభిప్రాయమును ఎరిగి హర్షమునుచెంది క్రమక్రమముగా దీక్షితుడగుచుండిన కాలమం దంతయు సూర్యప్రకాశమును అనుభవించిన లోకమువలె తాను ఉప్పొంగుచుండెను. ఇపుడు బోధకగురువులవారు పరోక్షతచెంది నపుడు వారిదర్శనప్రాప్తిలేకయు వారినెన్నడైనను దర్శనముచేసి యుంటినా యనియును కూడ సందేహించు నవస్థ వచ్చినపుడు ప్రతినిత్యమును సూర్యోదయసూర్యాస్తమనములను చూచి సంత సించుచుండిన లోకము సూర్యదర్శనము లేక దుర్దినములను అనుభ వించురీతిని శిష్యుడును దుర్దినములను అనుభవించుచుండును. ఈ స్థితికి మేఘవ్యాప్తి యని పేరు. భక్తులకందరకును అనుభవమే. అయినను తితిక్షయను సాధనమును అభ్యసించుచు తన దుఃఖ మును ఇతరులతో చెప్పుకోకూడకపోయినందున తన దుఃఖము లను తన మనస్సునందు ఇముడుచుకొని పైకి హర్షమును కను పరుచుచుండును. సూర్యుడు ప్రకృతమందు దృష్టిగోచరుడు కాక పోయినను ఇంతకాలమును తాను సూర్యుని కాంతిని అనుభవిం చిన లోకము సూర్యుడు పోగొట్టుపోయెనా ఏమి యని సందేహిం చరు కదా. అదేవిధమున తాను గురుదేవులవారితో కూడియుం డిన ఘడియలను మరిచినను గురుదేవులవారి ఉనికిని సందేహిం చడు. ఐనను ఏవిధముగా గురుదేవులవారిని అపరోక్షమందు సం

ధించవలసినది అనునందుకు భక్తులు మేఘవ్యాప్తికాలమందు ఏ విధముగా నడుచుకొనిరని పురాణములలో విచారించవలయును.

శ్రీమద్భాగవతము, దశమస్కంధమునందు జగద్గురువుల వారైన శ్రీకృష్ణులవారు తమభక్తులతో కూడ రాత్రికాల మందు వనప్రదేశమునందు సంచరించి వారలకు సంతోషము కలుగజేయుచు వారల యెరుకలేకయే అంతర్ధానము చెందిరి. అప్పుడు భక్తులందరును కొంత తడవు దుఃఖించినను దుఃఖమువల్ల సాధించగలదేమియున్న దని బుద్ధినితెచ్చుకొని భగవచ్చేష్టితం బుల తాము ఆచరించిరి.

ఇట్లు వారి కనుమొఱంగి చనిన కరింగానక తిరుగు కరేణుల పెల్లున నుల్లసంబులు తల్లడిల్ల వల్లవకాంతలు తదీయ గమన హాస విలాస విహార వచన రచనానురాగంబులం జిత్తంబులు గోల్పడి వివిధచేష్టలకుం జాల్పడి తదాత్మకత్వంబున నేన నేన కృష్ణుండ నని కృష్ణగుణావేశంబులం జరియించుచు

(శ్రీ పోతనామాత్యకృత భాగవతము)

ఈ భాగమును శ్రీమద్భాగవతమున చదువవలయును. కడపట శ్రీకృష్ణులవారి చర్యలను జ్ఞాపకపరుచుకొని వారు నడిచినట్టు, మాటలాడినట్టు, దుష్టనిగ్రహశిష్టపరిపాలన చేసినట్టు మరియు ననే కవిధంబుల శ్రీకృష్ణులవారి చర్యలను తాము నాటకపాత్రలవలె చరించి క్రీడించి తమ మనంబులయందు తామే శ్రీకృష్ణులు అని భావించి తాదాత్మ్యంబుచెందిరి. అదే విధముగా మేఘవ్యాప్తి జెందిన శిష్యుడు కూడ తాను తన దీక్షాకాలమందు చేసియిచ్చిన ప్రతిజ్ఞలను జ్ఞాపకమునకు తెచ్చుకొని తన గురుదేవులవారు లోక

సేవ చేయగా తాను చూచియుండినట్లు లోకసేవచేయుచుండవల యును. పరోపకారరూపకమయిన లోకసేవసమయమందు తన దుఃఖమునుగురించి చింతించుట కవకాశముండదు.

ఇట్లు తనను తాను మరిచి లోకసేవచేయుచుండు సమయ మందు పరోక్షమునందుండి శిష్యుని సచ్చరితములను గమనించు చుండు గురుదేవులవారు అపరోక్షమున దర్శనం బిత్తురు. శిష్యుడు సంతసించును.

ఈ విధముగా మేఘవ్యాప్తి పదేపదే జరుగుచుండును. జరిగినపుడంతయు గురుదేవులవారియందు భక్తిచేయుచు తనను తాను మరిచి లోకసేవచేయుచు శిష్యుడు మనస్సునకు ధైర్యమును తెచ్చుకొని మహాకష్టసాధ్యమైన నివృత్తిమార్గయాత్రను జరుపు చుండును.

శక్తిపాతము అని యొక యోగశక్తి కలదు. దీక్షాకాల మందు గురుదేవులవారి హస్తము శిష్యుని మస్తకము పైన నుంచ బడును. అపుడు గురుదేవులవారియొక్క శక్తి శిష్యునియందు ప్రవేశించును. ఇది శక్తిపాతము అను శక్తి. ఈ శక్తిని ఉపయో గించి దీక్షితుడైన శిష్యుడు లోకసేవ నిరంతరాయముగా చేయు టకు శక్తి కలవాడుగానుండును. ఈ విషయమునందు వ్రాయవలసి నది ఎంతో యున్నది. అయినను ఇప్పటికి ఈ మాత్రము చాలును.

---

## 3 వ అధ్యాయము

పిండే షాట్కౌశికేస్మిన్ నవవివరపురే పంచభూతేంద్రియాఢ్యే ।
పుంస్త్వేస్త్రిణే చ షాండే శివగురు వచనైర్విజ్ఞాయసే చేత్ ।
కేనాప్యన్నాసు చిత్తప్రమితి నిరుపమానంద కోశాత్తరాశిః ।
స్వం పోఢాభిన్నమూర్తిః పరశివ సబుధో విశ్వరూపత్వ మాయాత్ ॥

### దేహములు, వాని సౌష్ఠవము

పూర్వాధ్యాయమునందు ౯౩ వ పుటయందు దేహములను పరిశుద్ధముగా జేసికొని వానితో లోకసేవ చేయవలెనని ప్రస్తావింపబడియె. మరియు ఆత్మవిచారము, పూర్వభాగమునందు ౧౪౦ వ పుటయొక్క మొదట మనోమయశరీరముయొక్క పారిశుద్ధ్యమును గురించి వ్రాయునట్లు వాక్కు ఇయ్యబడినది. శరీరముయొక్క సౌష్ఠవము అను విషయము చాల ముఖ్యమైన అంశము. యోగశాస్త్రమునందు నాడీశోధన అని యొక విశేషమైన విషయము కలదు. శరీరసౌష్ఠవము అనునది యొక విధమైన నాడీశోధన అనవచ్చును. అనంతుడైన ఆత్మయొక్క శక్తి జాజ్వల్యమానముగా ప్రకాశించునపుడు ఆ ప్రకాశము ఏ యే శరీరములగుండా బహిః ప్రపంచమునందు ప్రవేశించునో ఆ యా శరీరములన్నియు పరిశుద్ధముగా నుండవలయును.

ఈ గ్రంథము పూర్వభాగమునందు ౧౦౪, ౧౦౫ వ పుటలు మరల చదువవలయును. అచ్చట వ్రాసిన విషయమునే కొంత మార్పాటుతో నిక్కడ వ్రాయబడును. ఈ గ్రంథము పూర్వభాగ మునందు గోళములనుగురించి చెప్పబడియున్నది. ఆ విషయ మును మరల చదువవలయును.

అనంతశక్తిమంతుడైన తురీయాత్మ మొట్టమొదట ఆరిక్ ఎగ్గు (Auric Egg) అను శరీరమును సంపాదించె నని పైవివ రించిన పుటలలో చెప్పబడియున్నది. రెండవ శరీరము బుద్ధిక్ బాడీ (Buddhic Body), 3 వది శుద్ధమానసశరీరము (Higher mental Body), ౪ వది మలినమానసశరీరము (Lower mental Body), ౫ వది కామమయశరీరము (Astral Body), ౬ వది స్థూలశరీర ములో నొక భాగమైన ఛాయాశరీరము (Etheric Double), ౭ వది స్థూలశరీరము (Physical Body).

ఈ శరీరములు ఒకటిలోనొకటి ప్రవేశించియుండును. అన్ని శరీరములమధ్యన తురీయాత్మ లేక ప్రజ్ఞానాంశువు అనెడి జీవాత్మ ఉన్నాడు.

౧. మధ్యన జీవాత్మ.

౨. అతని చుట్టును కొంతవిశాలముగా గోళాకారముగా ఆరిక్ ఎగ్గు అను శరీరము.

3. ఆరిక్ ఎగ్గుకన్నను కొంతవిస్తీర్ణము తక్కువై ఆరిక్ ఎగ్గు ఉండు ప్రదేశమునందు చాలభాగమువరకును వ్యాపించి బుద్ధిక్ బాడీ అను గోళము.

౪. బుద్ధిక్ బాడీ అను గోళముకన్న విస్తీర్ణమునందు తక్కువై ఆ తక్కువ విస్తీర్ణముయొక్క ఎల్లవరకును బుద్ధిక్ బాడీయందు ప్రవేశించి ఇరువిధములైన మనోమయశరీరములు అగు గోళము.

౫. మనోమయశరీరపు గోళము కన్న చిన్నదై మనోమయ శరీరపు గోళమును ప్రవేశించి కామమయశరీర మున్నది. సాధారణముగా కామమయశరీరము స్థూలశరీరముకన్న చుట్టును, క్రిందయు పైనయును ఒక మూరెడు దూరమునకు వ్యాపించియుండును.

౬. స్థూలశరీరము మనము చూచుచున్నాము. కామమయశరీరముయొక్క మధ్యన కామమయశరీరమును ప్రవేశించి యుండును. ఛాయాశరీరము స్థూలశరీరముయొక్క భాగమే. మరియొక విధముగా చూచిన ఈ శరీరములు స్థూలశరీరమందు ప్రవేశించి కొంతమించి ఆస్ట్రిల్ బాడీ అను కామమయశరీరమున్నది. స్థూల కామమయ శరీరములు రెంటిలోనును ప్రవేశించి కొంతమించి మనోమయశరీరములున్నవి. స్థూల కామమయ మనోమయ శరీరములయందు ప్రవేశించి కొంతమించి బుద్ధిక్ బాడీ యున్నది. స్థూల కామమయ మనోమయ శరీరములను బుద్ధిక్ బాడీనిమించి ఆరిక్ ఎగ్గు ఉన్నది. జీవాత్మ ఇన్నిటిని ఆవరించుకొని యున్నాడు.

మనోమయః కామశరీరనేతా ప్రతిష్ఠితోన్నే హృదయం సన్నిధాయ.

(ముండకోపనిషత్తు)

జీవాత్మ మనోమయుడై, కామమయశరీరము, స్థూలశరీరము అను శరీరములకు అధిపతియై స్థూలశరీరమునందు హృదయమును ఉనికిపట్టుచేసుకొని యుండును అని యర్థము. కనుక జీవాత్మయొక్క

స్పందశక్తి లోకమునందు ప్రవేశించవలెనంటే ఐదు ఆవరణముల లో దూరి వెలుపటికి రావలెను. జీవాత్మయొక్క స్పందములు శుభ్రములుగా నుండినను ఆ స్పందశక్తి ప్రవేశించు ఆవరణములు శుభ్రముగా లేని యెడల స్పందములు అప్పటముగా నుండవు.

ప్రకాశముగా వెలుగగల దీపమును చక్కని అద్దములతో జోడింపబడిన లాందరులో నుంచినపుడు దీపముయొక్క ప్రకాశము బాగుగ కనుపడును. అటుగాక మలినమునిండిన అద్దములతో జోడించిన లాందరులో శుభ్రమైన దీపమును ఉంచితే దీపమును ఆవరించుకొని యుండు అద్దముయొక్క మాలిన్యము దీపముయొక్క ప్రకాశమును మందగించును. ఈ విధముగా జీవాత్మ అంగీకరించిన దేహములు జీవాత్మను ఆవరించుకొని యుండును. దీపముయొక్క స్వప్రకాశము బహిరంగము కావలసినందుకు చక్కని అద్దములు కావలసినట్టు జీవాత్మయొక్క స్వప్రకాశము ప్రచురము అగుటకు పరిశుద్ధములైన శరీరములు కావలసియుండును. ఉపాసకులు తమయొక్క శక్తిని లోకులయొక్క సేవయందు వినియోగపెట్టవలెనంటే తమయొక్క ఆత్మశక్తి స్వచ్ఛముగా, మలినములేక, తమను విడిచి వెలుపలికి పోవునట్టు చేయవలయును. దీపమును ఉపమానముగా చెప్పినపుడు "ధూమేనా వ్రియతే వహ్నిః యథాఽఽదర్శో మలేన చ" అను గీతా శ్లోకములో చెప్పినప్రకారము మాలిన్యము శరీరములయందు కలుగుచున్నది. పై చెప్పిన ఉపమానమునందు ప్రస్తావించిన అద్దములవలె శరీరములు అచేతనములు కావు. శరీరములను కట్టు అణువులు శక్తిమంతములు. మరియు శరీరాభిమాని దేవతలు, భూ

తాత్మ, ప్రాణాత్మ, (ఆత్మవిచారము, పూర్వభాగము, ౨౧౨ వ పుట చూడుడు) మొదలగునవి చాలశక్తిగలవి. కనుక జీవాత్మ ప్రతినిధి యైన ఆత్మబుద్ధిమనస్సు డను ప్రాజ్ఞాత్మ ప్రయత్నపూర్వక ముగా అనేక జన్మములనుండి అభ్యాసపడి వాసనారూపముగా స్థిరపడిన మాలిన్యములు "దీర్ఘకాలనైరంతర్యేణ" ప్రయత్నపడి పోగొట్టుకొనని యెడల నివృత్తిమార్గయాత్ర ఫలవంతముగా జరుగదు. దీర్ఘకాల మనగా ననేక సంవత్సరముల కాలము. నిరంతర మనగా ఎల్లపుడు. ప్రతినిత్యమును ప్రతినిమిషమందును ఇట్లు అనేక సంవత్సరములకాలము తన శరీరములు సుష్ఠుకావలె నని యత్నము చేయుచురావలయును. శరీరములంతటిలోపల దట్టమై దళమైనది స్థూల శరీరము. ఈ శరీరమును శుద్ధిగానుంచుకొనుటకు ముఖ్యముగా నాహారవ్యవహారములను గమనించవలయును. స్నానపానాదులు కూడ అతిముఖ్యములు. స్థూలశరీరమునందు ఇంద్రియగోళము లున్నవి. శ్రోత్రేంద్రియముయొక్క గోళము చెవి. చక్షురింద్రియముయొక్క గోళము కన్ను. స్పర్శేంద్రియముయొక్క గోళము చర్మము. రసనేంద్రియముయొక్క గోళము నాలుక లేక నోరంతయు సముదాయముగా చెప్పవచ్చును. ఘ్రాణేంద్రియము యొక్క గోళము ముక్కు. ఈ చెప్పబడిన యింద్రియగోళము లన్నియు కర్మేంద్రియగోళములును వాని వాని గుండా మురికిని వెలుపలికి పంపుచున్నవి అని మనకందఱకును తెలిసిన విషయమే. మఱియు స్థూలశరీరమునకు మురికిని ఇయ్యగల కార్యములు మూత్ర పురీషముల విసర్జనక్రియలు. ఇట్టి చర్యలు శరీరమును మురికిగా చేయుచున్నవి. ఈ మురికిని పోగొట్టుకోవలెను. లేకుంటే పరిశుద్ధముగా

నున్నాము అనుకొనుటకు సందర్భము లేదు. శౌచనిధానమునుగు
రించి మనుధర్మశాస్త్రమునందు బహు బాహుళ్యముగా చెప్పబడి
యున్నది. "అద్భిర్గాత్రాణి శుధ్యంతి" అని చెప్పబడియున్నది.
శౌచమునుసరిగా జరుపుచు వచ్చినయెడల దేహమునకు ఏవిధమయి
న జబ్బును సులభముగా రాదు. భోజనమువల్ల కలుగు సుఖములను
గురించి విచారించుటకు మునుపు స్నానమునుగురించి విచారించవల
యును. మూత్రపురీషోత్సర్గాదులకుగా గ్రామమునకు బహిః కొంత
దూరము వెళ్లి ధారాళముగా జలము నుపయోగించి చక్కగా శుద్ధి
చేసికొని స్నానమునకు ఆరంభించవలెను. దంతధావనము విషయ
మందు మనవారలు చాల అజాగ్రతగానుందురు. భోజనకాలమం
దు పండ్లనడుమన దూరి దాగుకొని యుండు ఆహారవస్తువులను
దంతముల మధ్యనుండి "దంతలగ్నాన్నం మృదూపాయేన నిర్హ
రేత్" అని ధర్మశాస్త్ర వచనము. శుభ్రముగా ౧౦, ౧౨ తడవలు
నోరు పుక్కిలించి ఉమ్మవలెను. అపుడు దంతలగ్నాన్నము మృ
దూపాయమువల్ల వెలుపలికి వచ్చును. పుల్లలతో గుచ్చి రక్తము
వచ్చునట్టు చేసి దంతభగ్నము చేసికొనకూడదు. "ద్వాదశ
గండూషై ర్దంతాన్ శోధయేత్" అని ధర్మశాస్త్రవచనము.

భోజనముచేసినవారు ప్రకృతకాలమందు నోరుకడుగుకొను
అవసరమును చూచినయెడల వారు చేయు అశ్రద్ధాసహితములైన
కార్యములు మనకు తెలియును. ఇది శౌచము కాదు. శౌచ
వేషము. కొంత వైరాగ్యము కలిగి నివృత్తిమార్గయాత్ర చేయు
వారలు వీరు అని మనము ఎవ్వరిని చూచి అనుకొందుమో వా
రలుకూడ దంతధావనస్నానములవిషయమందు అశ్రద్ధచేయు

వారు అనేకులు. స్నానమునకు నదులలోనే మునుగుట మొదటి తరగతి. తటాకాదులయందు స్నానము రెండవ తరగతి. ఇంటి యందుండు నూతివద్ద స్నానము మూడవ తరగతి. ఈ ప్రకారము శీతోదకస్నానము ధారాళముగా జలము నుపయోగించి స్నానము చేయవలయును. విధిలేక దేహసౌఖ్యహీనులు ఉష్ణోదకస్నానము చేయుదురు. ఇంద్రియ గోళముల మార్గముగా దేహమునందంతయు మలినము చేరును అని ముందే ప్రస్తావించబడియె.

సాధారణముగా జనులు లోకవార్తలయందు చాల కాలయాపనము చేసి భోజనసమయము తటస్థించినపుడు స్నానమున కారంభించి దేహము పరిపూర్ణముగా కూడ తడియనట్లు స్నానము ముగించి భోజనమునకు సిద్ధమగుదురు. ఇది ప్రవృత్తిమార్గయాత్రాపరుల సాధారణచేష్ట. నివృత్తిమార్గయాత్రాపరు లనుకొనువారు వైరాగ్యాభ్యాసము చేయుచు దేహపారిశుద్ధ్యమును కూడ వైరాగ్యముతో వదులుకొని "యీ కట్టెకు ఎట్లున్న నేమి" అని వైరాగ్య వాక్కులు పలుకుచు దేహము నేమో మలినముగా నుంచుకొను వారలు అనేకులు. సోమరితనమును వదిలి దేహమును చక్కగా రుద్ది మురికిని పోగొట్టుకొని పరిశుద్ధముగానుండు విరాగులు చాల కొద్దిమంది. దేహమాద్యంతము భస్మోద్ధూళనము ముఖ్యమనుచు దేహమున కంతయు విభూతి పూసి ఆ విభూతిని మరియొక స్నాన కాలమందు చక్కగా రుద్ది కడుగకయే వదిలిపెట్టుదురు. చర్మము నందు రోమకూపములున్నవి. రోమకూపములగుండా శరీరాంతర్గతమైన రక్తములో నుండు మలినములు స్వేదరూపముగా వెలుపలికి రావలసినది విధాయకము. విభూతి దట్టముగా పూసినపుడు రోమ

కూపములు మూతపడిపోవును. శరీరములోని మలినములు నిరాటంకముగా వెలుపలికి ప్రవహించక మళ్లీ ఆ మలినములు రక్తము నందే చేరి జాడ్యకారణములగును. కనుక స్నానసమయమునందు దేహము చక్కగా నానిన పిమ్మట చర్మమందు మురికి నిలువనట్లు చక్కగా రుద్ది మలినములను పోగొట్టుకొనవలయును. కండ్లు, ముక్కురంధ్రములు, చెవులు, చంకలు, గజ్జలు, అరిచేతులు, వ్రేళ్ల మధ్యసందులు, అరిగాళ్లు, గోళ్లకును వ్రేళ్లకునుమధ్యన, ఇట్టి సంకోచస్థలములయం దెల్లయు చేరియుండు మురికిని జాగరూకతతో పారదోలవలెను.

స్నానమువల్ల బహిశ్శుద్ధి కలుగును. బహిశ్శుద్ధివల్ల చక్కబడిన శరీరమును సాత్వికాహారములతో కాపాడి పెంచినయెడల నంతశ్శుద్ధికూడ స్థూలశరీరమునకు కలుగును. నాగరికవంతులుగా నుండు కొందరు పెద్దమనుష్యులు మనతో మాటలాడవచ్చునపుడు వారి నోటికంపు వారికన్నను ముందుగా మనకు విదితమగును. కొందరి దేహమందు కలమందకంపు, కొందరి దేహములయందు వేరు వేరు విధములయిన కంపులు, ఇట్లంతయు చూచుచున్నాము. దంతధావనస్నానములు సరిగాచేయనందువలన ఈ అవలక్షణము లన్నియు నగుపడుచుండును. తమ దేహమును తాము పరిశుద్ధముగా నుంచుకోలేనివారు లోకసేవ ఏవిధముగా చేయగలరు. దేహమందలి అశ్రద్ధయే కదా లోకసేవయందు కూడ కలుగును. చోదకగురువులవారు గాని బోధకగురువులవారు గాని వారియొక్క ఆత్మశక్తిని శిష్యునియందు ప్రవేశపెట్టి లోకసేవార్థము ఉపయోగించుము అని ఆశచెందుదురు. గురువులవారి పరిశుద్ధమైన ఆత్మ

శక్తి శిష్యునియందు ప్రవేశించును. శిష్యునికి కూడ లోకసేవాభి లాష బహుబలవంతముగా నుండును. ఐనను మలినమైన దేహము లో ప్రవేశించుచు వెలుపలికి ప్రసరించు ఆత్మశక్తి కూడ మలినమై లోకులకు మేలుచేయుటకు బదులుగా కీడుచేయగలదు. మలినము లైన దేహములలో పరిశుద్ధమైన ఆత్మశక్తిని ప్రవేశపెట్టుట ఎట్లున్న దనగా అధిక నీరువట్టుగొన్నవారికి దాహశాంతి చేయగల మంచి తీర్థమును చాలమురికితో నిండిన పాత్రమునందు పోసి త్రాగుటకు ఇచ్చినట్లు గానుండును. దాహము నిజమే. తీర్థము పరిశుద్ధమైన దే. అయితే పాత్ర అపరిశుద్ధమై నందున దాహము శాంతి చెందించుకొనుటకు ఇష్టపడరుకదా. కారణమేమి? పాత్రయొక్క మలినత. అందువల్ల స్థూలశరీరమునందు కొంచమైనను మలిన ముండునట్లు ఏమరకూడదు.

శరీరమందలి కలమందకంపును మరికొన్నివిధములైన కం పులును ఆహారముయొక్క స్వభావమును పట్టి కలుగును. విదుపక ఉల్లిపాయలు మొదలగు దుర్గంధవస్తువులను తినువారిదేహముల యందు ఆ దుర్గంధము తప్పకయుండును. జ్వరమువచ్చినవారి యొక్క శరీరములయందు ఒకవిధమైన దుర్గంధముండును. ఉల్లిపా యలు మొదలగు పదార్థములు భుజియించుటవల్ల కలుగు దుర్గంధ మునకును జ్వరబాధవల్లకలిగిన దుర్గంధమునకును చాలవ్యత్యాస ముండును. అదే విధమున చాల కోపవంతుల శరీరములయందు ఒక విధమైన గబ్బు ఉండును. కామోద్రేకముచెందిన వారి శరీర ములయందు ఒక విధమైన దుర్గంధము ఉండును. కనుక స్థూలశరీ రముయొక్క మాలిన్యమునకు ముఖ్యకారణములు—౧. స్నానము

చేసి మలినమును నిర్మూలము చేయమి, ౨. దేహారోగ్యమునందు దృష్టియుంచక అశుద్ధములై తామస రాజస గుణములను వృద్ధి చేయు ఆహారములను భుజించుట, 3. కామమయశరీరముతో కలిగించుకొనిన కోపము, క్రోధము, కామము మొదలగు హేయములైన గుణములు, మరియు ౪. మలినమనోమయశరీరముతో తలంచిన దుష్టతలంపులు, ఇవి మొదలగునవి. జ్ఞానదీక్షులుచెందవలెనని ఆశించువారు పైన వివరించిన కారణములకు ఎడము ఇయ్యకయే స్థూలశరీరమును శుద్ధముగానుంచుకోవలెను.

ఇక ఆహారవివరములను గురించి సాత్త్వికాహారమునే భుజించవలసినందులకుగా అనువాదము చేయు నుద్దేశము.

స్థూలశరీరమును పరిశుద్ధముగా నుంచవలసిన విధులలో స్నానమును గురించి చెప్పుట ఆయినది. స్నానమునకు పిమ్మట ఆహారమును గురించి విచారించవలయును. ఛాందోగ్యోపనిషత్తునందు ‟ఆహారశుద్ధా సత్త్వశుద్ధిః” అని చెప్పబడియున్నది. ఆహారశుద్ధి యనగా నేమి? శుద్ధమైన ఆహారమును భుజించుట. ఆహారము మూడు విధములు అని శ్రీభగవద్గీతయందు చెప్పబడియున్నది. నివృత్తిమార్గయాత్రాపరుడై జ్ఞానదీక్షలను ఎదురు చూచువాడు మొట్టమొదట శవములను భక్షించుట మానవలయును. మాంసాహారమంతయు శవభక్షణమే. గొఱ్ఱెలు, పొట్టేళ్లు, కోళ్లు, తిత్తిరులు, మత్స్యములు మొదలగు జంతువులను చంపి ఆ శవములను భక్షించుట కొంచమైనను యుక్తము కాదు. ధాతువర్గములైన గోధుమలు, బియ్యము, పెసలు, మినుములు మొదలగు తరుగుల్మలతాదులను భక్షించవలయును. సంహరించునందువల్ల

దేహశ్రమ, మనస్సుకు దుఃఖము, ఏవర్గమునందు స్వల్పముగా నుండు నో ఆ వర్గము భోజనము చేయుటయందు ఆచారహాని తక్కువగా నుండును.

సాధారణముగా పైరుపెట్టబడు వరి, గోధుములు, కాయ ధాన్యములు మొదలగునవి కొంతకాలము పయిరు పెరిగి, పండి అందుల ప్రయోజనముగా నేర్పడినవి. మనము పయిరును ఒబ్బిడి చేయకున్నను వరి పండి గింజలు రాలిపోవును. అదేవిధమున అన్ని కాయధాన్యములును పండి ఎండును. కనుక వాటిని మనము ఆహారార్థముగా గ్రహించినపుడు ఆ పయిరులకు ఏ విధమైన శ్రమయు లేదు. అదే విధముగా అన్ని ఫలములును. అరటి, మామిడి, నారింజ, నిమ్మ మొదలగు ఫలములు వానంతకు అవియే చెట్లలో నుండి రాలి పడిపోవును. టెంకాయ, బాదాము, ద్రాక్ష మొదలగు నవన్నియు అదేవిధముగా నగును. ఇట్టి పదార్థములను భుజించుట అతి సాత్త్వికము. పరపీడనము లేదు. అనర్గళముగా ఉపాసకుని వద్దనుండి ప్రవహించవలసిన ప్రేమ అను గుణము అతి ముఖ్యద్రవ్య ముగా గల జీవన్ముక్తి పథమును నడువ నిచ్ఛయించువాడు తన శరీరపోషణార్థము బ్రతికియుండు మృగములను శవములుగా జేసి ఆ శవములనా భుజించవలెను.

మృగములను చంపునపుడు అవి పశుబాధయు, కోళ్లను కుత్తుకకోసి నేలపడవైచినపుడు అవి తల్లడిల్లుటనును చూచిన యెడల ఎంతటి రాక్షసులుగాక మరియెవరు ఆ శవములను తిన నిచ్ఛయింతురు. “పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనం” అని పరపీడనము చాల పాపము. పాపహానికిగా ప్రయత్నము చేయు నివృత్తి

మార్గచారుడు శ్రోత్రపాపములను ఆర్జించకూడదు. "నావిరతో దుశ్చరితాత్" అను వాక్యమును జ్ఞాపకముంచుకోవలెను.

మనుష్యుల ప్రతిచర్యకును రెండువిధములైన అర్థములు గలవు. తాను చేయుకార్యములవల్ల తనకు కలుగు లాభనష్టములు. ఆ కార్యములవల్ల ఇతరులకు కలుగు లాభనష్టములు. ప్రకృతమందు ముఖ్యముగా తనకు కలుగు లాభములనుగురించి యోచింతము. కొందరు మాంసాహారము లేనిదే బ్రతుకుట కష్టము అనియు దేహధారణ మాంసాహారమునుద్దేశించియే బాగుగా జరుగును అనియు వాదింతురు. మాంసాహారము లేకయే అనేక లక్షలమంది మనుష్యులు జీవించియున్నారనియు వారు మంచి బాహుబలవంతులుగా కూడ ఉన్నారనియు రుజువు పరచవచ్చును. ఒక వీసెడుకందమూలఫలములను ఒక వీసెడు మాంసమునును పరీక్షించితే కందమూలఫలములయందే అధికమైన బలమును ఇయ్యగల శక్తి యున్నదని రుజువుపరిచియున్నారు. పశ్చిమదేశములయందు బహు ప్రఖ్యాతికెక్కిన డాక్టర్లు ఆహారవస్తువులను పరిశీలించినారు. క్షీరము, కందమూలఫలాదులు అతిశక్తిని యియ్యగలవి అని తీర్మానించినారు. కూనేగారి తీర్మానములు అనేకులకు తెలిసియుండవచ్చును. అందువల్ల వ్యాధి రాదు. మాంసాహారము అనేక వ్యాధులకు ఆస్పదము. ఇందునుగురించి అనేకమంది డాక్టర్ల అభిప్రాయములు ప్రచురింపబడియున్నవి. మహాబలమును చూపు మృగములు, ఏనుగు, గుఱ్ఱము ఇట్టివన్నియు కందమూలఫలాదులను భుజించునవే. కందమూలఫలాహారములు ఎప్పటికిని మాంసాహారముకన్న రాజసము అను గుణమును వృద్ధికానీయవు.

మాంసాహారము కన్న కందమూల ఫలాహారము ధనవ్రయము తక్కువ. చంపునందువల్ల కలుగు దోషము తక్కువ. అంతే కాక పరపీడనము అను పాపము కూడ చాల తక్కువ. పరపీడనము మనమే చేయకయు నితరులచేత చేయించుటను మానుకొనుటవల్ల మనకును ఇతరులకును క్షేమము. ఏ మృగముల మాంసమును భుజించెదరో ఆ మృగముల గుణములు శరీరమునకు కలుగును అనుటయందు యుక్తికి విరోధ మేమియు లేదు. పెద్దపెద్ద డాక్టర్లందరును మనుష్యశరీరముయొక్క కట్టువివరము నాలోచించియు దంతపంక్తియొక్క స్ఫూర్తిని చూచియు మనుష్యుని సృష్టించినపుడు సృష్టికర్త ఉద్దేశము మనుష్యుడు కందమూలఫలాదులనే భుజించువాడుగా నుండవలెనని సృష్టించినట్టు అగపడునట్టు చెప్పుచున్నారు. కనుక "ఆహారశుద్ధౌ సత్వశుద్ధిః" అను వచనము న్యాయమే. నివృత్తిమార్గయాత్రాపరుడు సర్వప్రయత్నేన తన ఉపాసన, ప్రేమ, అనువాటికి విరోధముగా నే కార్యమును చేయకూడదు. చేసినయెడల తన ఉద్దేశమును విడనాడుకొనినవాడగును. ఇదే విధమున పానము కూడ నివృత్తిమార్గనిరతునికి హానికరము. మద్యపానము, పొగచుట్టపట్టుట, పొగాకునములుట, బంగీపీల్చుట, నల్లమందు తినుట, ఈ విధమైన మరియేవస్తువులైనను నివృత్తిమార్గయాత్ర చేసి పొందవలెనను లాభమును మనము పొందనీయక చేయుటయే కాక మరేవిధముననైనా మేలుకలుగునట్టు చేయవు. దేహమును చెడిపివేయును. ఉల్లిపాయలు తెల్లగడ్డలు ఇవి రెండును నివృత్తిమార్గమునందు నడుచువాని ఉద్దేశభంగము చేయునవి. పొగాకువల్ల కలుగు అసందర్భములు అనేకములు.

మొట్టమొదట నోటికంపు. దేహమందుకూడ దుర్గంధము. స్థూలశరీరమునుమాత్రము కాదు పొగాకు చెడుపుట. ఆస్ట్రిల్ బాడీనికూడ చెడుపును. ఇకముందు దూరశ్రవణము, దూరదృష్టి, ఆకాశగమనము మొదలగు యోగసిద్ధులను ఈయగల చక్రమునకు స్ఫురణ తక్కువగునట్టు చేయును. భ్రూమధ్యగతంబైన చక్రము ననుసరించి మెదటియందు పిట్యూటరీబాడీ (Pituitary Body) అను నొక చిన్న అవయమున్నది. ఈ యవయవము ఎంతకెంత పరిశుద్ధముగానుండునో అంతకంత సుష్ఠుగా పైవివరించిన సిద్ధులు లభించును. ఈ సిద్ధులిచ్చుశక్తిగల యింద్రియమునకు పిట్యూటరీబాడీ అనునది గోళము. నేత్రేంద్రియమునకు ఏ విధముగా కండ్లు, ఘ్రాణేంద్రియమునకు ఏ విధముగా ముక్కు గోళములో ఆ విధముగా దూరదర్శన దూరశ్రవణములను ఇచ్చు ఇంద్రియమునకు పిట్యూటరీబాడీ గోళము.

నాగరికతచెందిన మనుష్యులు పొగాకు ఉపయోగించకూడదు. బ్రతికియుండగా పొగాకుపయోగించువానికిని దుష్కర్మయొక్క ఫలరూపముగా అతని సమీపమందుండువారలకును అసూయ కలుగజేయు వస్తురత్నము పొగాకు. మూఢుడై దానిని ఉపయోగించునెడ మరణముచెందిన పిమ్మట కూడ చాల కాలము వాని ఆస్ట్రిల్ బాడీయందు పదును లేక ఉండునట్టు సంభవించును. సారాయి తాగుపోతుయొక్క స్థూలశరీరమును, ఆస్ట్రిల్ బాడీని, మలినమనోమయశరీరమునుకూడ మందగించునట్టు చేసి చుట్టుపట్టు వారలకు కూడ చాల అసందర్భమును కలుగజేయును.

నల్లమందు, పాషాణము, వీటిని కొంద రుపయోగించుదురు. వారలకును పైవ్రాసినమాటలు అన్వయించును.

ఏయే పదార్థములు ఆహారమునకు అర్హములు అను విచారమునందు ఒక విషయము ప్రధానము. ఏయే వస్తువులయందు పెరుగుట అను శక్తి ఇమిడియుండునో అవి శ్రేష్ఠము.

సత్త్వగుణమును వృద్ధిపరచగల పదార్థములా రజోగుణమును వృద్ధిపరచగలవా అని విచారణ జరుపుటకు మునుపు ఏ పదార్థమును మరల భూమియందు నాటితే తనవంటివారిని సృష్టి చేయగలవో అవి ఆహారమునకు ప్రశస్తములు. గోధుములు, వరి, కాయధాన్యములు ఇవన్నియు భూమియందుపడితే మరల మొలిచి పైరు అవును. ఆలాగే మామిడిపండు మొదలగు ఫలములు భూమియందు పూడ్పబడితే తనువంటివాట్లను సృష్టించగలవు. మాంసముగాని, మత్స్యములుగాని ఏమిచేసినను క్షీణించుశక్తిని కలిగియుండునేగాని మరల ఉద్భవించు శక్తి లేనివి. కనుక మాంసాహారము కూడదు.

యోగమార్గమునందు ప్రవర్తించువారి అనుష్ఠానమునకు కావలసిన ముఖ్యమైన భాగములుకొన్ని స్థూలశరీరమందున్నవి. ఈ భాగములకు చక్రము లని పేరు. చక్రములు ఏడు. మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా, సహస్రారములు అని వాని నామధేయములు. పరమాత్మయొక్క శక్తి ఈ చక్రములగుండా మనకు వచ్చును. చక్రములకు దళములు కలవు.

౧. మూలాధారమునందు నాలుగు దళములు. ఇవి చిలువయొక్క ఆకారము కలిగియుండును. ఈ చక్రమునందు కుండలినీ శక్తి దాగియుండును.

౨. స్వాధిష్ఠానము పదిదళములు కలిగియుండును.

౩. మణిపూరకమునందు సూర్యకిరణములనుండి ప్రాణమును ఆకర్షించుశక్తి దాగియుండును. దీనికి ఆరు దళములు.

౪. అనాహతము మహాప్రకాశవంతమైన స్వర్ణఛాయతో పండ్రెండు దళములు కలిగి హృదయస్థానమందుండును.

౫. విశుద్ధ అను చక్రము కంఠస్థానమునందుండును. పదునారు దళములు కలిగి రజత ఛాయతో తటాకోదకముపైన చందమామకిరణములు పడినప్పుడు కనుపడు ప్రకాశమువలె ఉండును.

౬. ఆజ్ఞాచక్రము భ్రూమధ్యంబున ద్విదళయుతంబై ఒకదళము రోజావర్ణముగానును మరియొకటి ఊదావర్ణముగానును ఉండును.

౭. సహస్రారము నడినెత్తిన నుండును. ఈ చక్రము యొక్క వర్ణములు, మాహాత్మ్యము వీట్లను గురించి వర్ణించుట చాల కష్టము. తొమ్మిదినూర్లడెబ్బదిరెండు దళములు కలిగి సహస్రారము అను నామధేయమును సార్థకముగా చేయుచుండును.

ఈ చక్రములన్నియు వానికి సంబంధపడిన నాడులతో కూడి స్థూలశరీరమును బ్రతికియుండునట్లు చేయుచుండును. నాడీశోధన చేసి సద్గురుప్రసాదము గైకొని ఈ చక్రములను మేలుకొలిపినప్పుడు అనేకయోగశక్తులను ఉపాసకుడు పొందగలడు.

ఈ చక్రములు, నాడులు కుండలినీశక్తి అన్నియు స్థూలశరీరమునందుండుటంబట్టియు ఈ చక్రములవల్ల యోగసిద్ధులు కలుగును గనుకయు ఆహారనియమముతో స్థూలశరీరమును పరిశుద్ధముగా నుంచుకోవలెను. మహాపరిశుద్ధమైన దేహారోగ్య ముండినగాని కుండలనీశక్తివలన లాభము కలుగదు. గనుక పరిశుద్ధమైన ఆహారము అతిముఖ్యము.

స్థూలశరీరము సుస్థగానుండవలసినది అతిముఖ్యము. లోకోపకారమందు ఆత్మశక్తి స్థూలశరీరముమార్గముగానే కదా లోకులను అందవలెను. అతిశుభ్రమైన ఆత్మశక్తిని అతిశుభ్రమైన స్థూలశరీరముగుండానే కదా పంపవలెను. నివృత్తిమార్గమునందుండువారలు వైరాగ్యము నాశ్రయించిన వారు గనుక స్థూలశరీరమును అంతగా గమనించవలసినది అవశ్యము లేదు అని సాధారణజనుల అభిప్రాయము. అది సరికాదు.

స్నానముతో పరిశుద్ధి అయిన శరీరమును పరిశుద్ధమైన ఆహారముతో పెంచవలెను. "ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః" అనిన వాక్యముయొక్క ప్రయోజనముగా భోజనవ్యవస్థను విచారించవలెను.

పరిశుద్ధమైన స్థలమునందు కూర్చొని లోకవార్తలు మాని సమాహితుచిత్తులై "ఉపవిశ్య సుఖే నైవ భోక్తవ్యం స్వస్థమానసైః" అని చెప్పబడియున్నది. కూర్చొని నెమ్మదిగలమనస్సుతో సుఖముగా భోజనము చేయవలయును. "హితమితభుక్" అనగా హితమైన పదార్థము (సత్త్వగుణమును ఇచ్చునట్టిది) మితముగా భోజనము చేయవలయును. "స్వస్థమానసైః" అను వచనము అతి ముఖ్యము. భోజనము చేయునపుడు భగవంతుని నామోచ్చారణ చేయుచు "కబళే కబళే గోవింద" అని భుజించవలె నని పెద్దల సంప్రదాయము. కొందరి యభిప్రాయము మౌనముతో భోజనము చేయవలెను అని. ఎందరికెన్ని అభిప్రాయము లుండినా భోజనకాలమందు మనస్సు స్వస్థముగా నుండవలసినది ముఖ్యము. సనాతనధర్మమునందు ధర్మశాస్త్రములయందు విధినిషేధవాక్యము

లు గలవు. వాటికన్నిటికిని కారణములు చెప్పరు. ప్రకృతనాగరికత యందు అన్ని విధులకును కారణ మేమి యని యడుగుట వాడుక.

ఇటీవల పెద్దపెద్దడాక్టర్లు కొన్ని విషయములను పరిశీలించి చూచినారు. డాక్టర్లవద్ద చికిత్సకు వచ్చినవారలలో నెందరికి అజీర్ణరోగము గలదని విచారించి అజీర్ణములకు కారణములను విమర్శించి చూచుచు కొన్ని సంగతులను కనుగొన్నారు. ఎవరు చాల కోపవంతులో మాత్సర్యవంతులో వారలకు అజీర్ణవ్యాధి యున్నదని కనుగొన్నారు. మిగత వేళలలో కోపము అంతగా అన్నము జీర్ణము అగుటకు ప్రత్యవాయము కాకపోయినను భోజన కాలమందు కోపముచేసుకొనువారికి అనేక విధములైన జాడ్యములు రావచ్చును.

సాధారణముగా తిండిపోతులగు మనవారలకు భోజనసమయమునందే ఎక్కడలేని కోపతాపములు ఉద్భవించును. ధప్పళంలో ఇంగువ అధికముగా పడినది, తొక్కులో ఉప్పు చాలదు, ఇత్యాది దుఃఖములతో తమ వంటవాళ్లపైన కోపముచేసుకొనుట అందరియొక్క అనుభవమే. లేక భోజనాత్పూర్వము లోకవ్యవహారమందు ఎవరిపైననో చేసికొనిన కోపముయొక్క శేషమయిన దేహమందలి దడ అప్పటికి తనియకయుండుటచే భోజనమప్పటికి కూడ కామక్రోధోద్భవమైన వేగము అధికముగానుండును. కోపముతో సహా ఓర్వలేమి గాని మాత్సర్యము గాని యుండును.

భోజనసమయమునందు కోపముచేసుకొన్నందువల్ల చెడుపు ఏమిటనగా, ఇటీవల పాశ్చాత్య డాక్టర్ల విమర్శయందు తేలిన వివరమును గమనించవలయును.

మనశరీరమందు కుత్తుకయందు విశుద్ధి యను చక్రమున్నది. అచ్చట థైరాయిడుగ్లాండు అనునది యున్నది. భ్రూమధ్యస్థానము నందు ఆజ్ఞాచక్రస్థానమునందు పిట్యూటరిబాడీ యని యొక గ్లాండు ఉన్నది. ఈ రెంటికి నరముల సంబంధమున్నది. నరములన్నియు మెదటినుండి బయలుదేరి అంగాంగములకు వ్యాపించును. తలంపులు మెదడు అను గోళమునందు జనించును అని డాక్టర్ల యభిప్రాయము. మెదటియందు కోపము, క్రోధము, మాత్సర్యము, వైరము మొదలగు దుష్టస్పందములు పుట్టగానే ఆయా స్పందముల యొక్క మంచిచెడ్డల ననుసరించి థైరాయిడుగ్లాండో లేక పిట్యూటరిబాడీయో తమ మధురగతిని చాలించి రుగ్మత చెందునట. ఆ అవయవములయందు రుగ్మత రాగా మొట్టమొదట జీర్ణశక్తిని తగ్గించుటకు ఆరంభించునట. ఇట్లు పదేపదే కోపించుకొన్నపుడంతయు జీర్ణశక్తి చెడిపోవును. భోజనాత్పూర్వము గాని భోజనానంతరము గాని కోపతాపములు విధిలేక నడువవలసియుండినను కోపతాపములను శమియింపజేసుకొనిన పిమ్మటనే భోజనప్రయత్నము చేయవలయును. దేహారోగ్యము అందరకును ముఖ్యమైనను నివృత్తిమార్గయాత్రాపరుని లోకసేవకు అతిముఖ్యము. ఆరోగ్యహీనమైన స్థూలశరీరమునందు ఆరోగ్యవంతమైన మనస్సు ఉండుటకు వీలులేదు. అనారోగ్యమైన దేహముతో లోకసేవను మనస్సు తనియునంతదాక చేయుటకు వీలుండదు. మోక్షప్రాప్తిహేతువైన ప్రేమాచరణమునకు ప్రత్యవాయము కలుగును. కనుక కోపతాపములు ఎప్పటికిని చెడ్డవైనను భోజనకాలమందు చాల అననుకూలములై రోగదాయకములుగా నుండును. కనుకనే ,, ఉపవిశ్య సుఖే

నైవ భోక్తవ్యం స్వస్థమానసైః" అని చెప్పబడియె. కనుకనే "కబళే కబళే గోవింద." కనుకనే "భోజనకాలే శ్రీ సీతారామ స్మరణ గోవింద" అని లోకోక్తి.

### కామమయశరీరము అను ఆస్ట్రల్ బాడీ

ఈ సందర్భమునందు ఆత్మవిచారము, పూర్వభాగము, ౧౨౬ మొదలు ౧౩౩ వ పుట వరకును, ౨౨౬ మొదలు ౨౫౮ వ పుట వరకును చదువవలయును.

పై వివరించిన పుటలయందు ఆస్ట్రల్ ప్లేను అను కామ లోకమునందు ఏడుభాగములయందు జీవాత్మ, స్థూలశరీరపాతానంతరము, మెట్టుమెట్టుగా సంచరించి, అంతకు పూర్వము భూలోకము నందు తాను ఉండినకాలమందు చేసిన కామప్రేరితములైన కార్యముల యొక్క ఫలములను అనుభవించును అని చెప్పబడియున్నది. మరియు ఆ సందర్భమునకు కావలసినంతమాత్రము ఆస్ట్రల్ బాడీ అను కామమయశరీరముయొక్క నిర్మాణమునుగురించి చెప్పబడినది. ఈ అధ్యాయమునందు ఆస్ట్రల్ బాడీనిగురించియు దానియొక్క సౌష్ఠవమునుగురించియు వ్రాయవలయును. మనుష్యుడు స్థూలశరీరముతో నిరాటంకముగా భూలోకమందు ఏ విధముగా సంచరించునో అదేవిధముగా జీవితకాలమందే స్థూలశరీరమును తనకు ఇష్టమైన స్థలమునందు వదిలిపెట్టి ఆస్ట్రల్ బాడీతోనును అంతకంటె సూక్ష్మములైన శరీరములతోడనును తన యిష్టానుసారముగ కామ లోకసంచారము చేయుటకు వీలగునట్లు ఆస్ట్రల్ బాడీని సుష్ఠు చేసికొనవలసిన విషయమునుగురించి వ్రాయవలసియున్నది. అదే

విధముగా దేహి తన యిష్టప్రకారము కామమయశరీర మను ఆస్ట్రల్ బాడీని కూడ వదిలిపెట్టి మనోమయశరీరము అను మెంటల్ బాడీతోనును అంతకంటె పై శరీరములతోనును సూక్ష్మ లోక సంచారము చేయు శక్తిని సంపాదించుటకు తగినంత గా మెంటల్ బాడీని సుష్ఠుచేసికొనుటనుగురించియు వ్రాయవలసి యున్నది.

నివృత్తిమార్గయాత్రాపరుడు తన జీవితమందు ముఖ్యోద్దేశ మైన లోకసేవాచరణను తనయొక్క చోదకగురువులవారును బోధకగురువులవారును వారలయొక్క ఇతరశిష్యులును తనయొక్క సహపాఠులు అందరును కలిసి ఆచరించు లోకసేవను భూలోకము నందును, ఆస్ట్రల్ ప్లేనునందును, మెంటల్ ప్లేనునందును, చేయవల సినవాడు గనుక అట్టి సేవను అడ్డము లేక చేయు శక్తిగలస్థూల దేహమును సంపాదించుకొని భూలోకమందును, ఆస్ట్రల్ బాడీని చక్కగా నిర్మించుకొని ఆస్ట్రల్ ప్లేనులోనును, మెంటల్ బాడీని సంపాదించుకొని మెంటల్ ప్లేనులోనును, ప్రేమను వర్ధించుచు అట్టి సందర్భమునందు కర్మక్షయమును కూడ జరిపించుకొను చుండును.

భూలోకమందు సేవకు కావలసిన స్థూలశరీరమును స్నానము, ఆహారము, భోజనవిధానము ఇట్టి యుపచారము లతో సుష్ఠుగానును నీరోగిగానును చేసికొనినవిషయమును ౧౧౦ వ పుటమొదలు ౧౨౫ వ పుటవరకును వ్రాసి అయినది. ఇపుడు ఆస్ట్రల్ బాడీని గురించిన వివరములను ఆరంభించు చున్నాము.

## ఆస్ట్రిల్ బాడీయొక్క నిర్మాణము

ఆస్ట్రిల్ ప్లేనునందు ఏడు సబుప్లేనులు కలవు. అనగా ఆస్ట్రిల్ ప్లేనునందుకూడ భూలోకమువలెనే ప్రకృతి ఏడువిధము లైన స్థూలభావమును చెందియుండును (ఆత్మవిచారము, పూర్వ భాగము, ౧౨౭ వ పుట). ప్రతిసబుప్లేనుయొక్కయు ప్రకృతి ఆస్ట్రిల్ బాడీయందు కలిసియుండును. ప్రకృతి యంతయు స్పందశక్తి కలిగియుండును. ప్రతిస్పందమును దానియొక్క వేగమును పట్టి వర్ణమును చూపును. బహిః ప్రపంచమునందలి విషయగ్రహణము వల్ల ఆస్ట్రిల్ బాడీలో కలుగు మార్పులు యోగదృష్టితో చూచు వారికి వర్ణములుగా కనబడును. ఆస్ట్రిల్ బాడీకి అనేకజన్మముల యందు కలిగిన అనుభవములను పట్టి యొక తరహా వాసనాబలము కలుగును. ఆ బలమును అనుసరించి ఆస్ట్రిల్ బాడీయందు వర్ణములు స్థాపింపబడియుండును. కనుక యోగదృష్టిగలవారు ఏ మనుష్యుని చూచినను వాని ఆస్ట్రిల్ బాడీయందు మెరయుచున్న వర్ణములను అనుసరించి ఆ మనుష్యునియొక్క ఆస్ట్రిల్ బాడీకి గల వాసనల పదవినిని, అందును అనుసరించి ఆ జీవునియొక్క పదవినిని కనుగొందురు. వారి వారి ఆస్ట్రిల్ బాడీలయందలి ప్రకాశములను పట్టి మనుష్యులు మందులు, మధ్యములు, శ్రేష్ఠులు అని లెక్కింపబడుదురు. ఈ మూడు తరగతులవారి ఆస్ట్రిల్ బాడీలును వరుసను వర్ణించబడును.

మందుని ఆస్ట్రిల్ బాడీ సరియైన రూపు గొని యుండదు. సాధారణముగా ఆస్ట్రిల్ బాడీ అండముయొక్క రూపు గలిగియుండ వలయును. మందునియొక్క ఆస్ట్రిల్ బాడీ రూపు ఏర్పడక « ఛిన్నా

భ్రము ", ముక్కముక్కగావీడిపోయిన మేఘము, వలె నుండును.
ఆస్ట్రిల్ ప్లేనుయొక్క అన్ని అంతర్భాగముల (Sub-planes) నుండి
అణువులు ఈ ఆస్ట్రిల్ బాడీయందు చేరియుండును. అయితే గరుకు
లైన సబుప్లేనులయందలి అణువులే బాహుళ్యముగా నుండును.
గరుకులైన అణువులు అధికముగానుండునందున, ఆత్మవిచారము,
పూర్వభాగము, ౨౩౪ వ పుట మొదలు ౨౪౮ వ పుట వరకును
చెప్పిన ముతకలైన కామములను మాత్రమే పుట్టించు శక్తి కలిగి
యుండును. గరుకులైన అణువులను ముతకలైన కామములు కద
లించినపుడు మందములైన స్పందములే కదా జనియించును. మం
దములైన స్పందములయొక్క వర్ణములగు ఎఱ్ఱమట్టివర్ణము, మడ్డి
రక్తవర్ణములు, అసహ్యములైన పసురువర్ణములు మొదలగున
వియే మందుని ఆస్ట్రిల్ బాడీయందుండును. స్త్రీపురుషులకామము
లవల్ల మడ్డితనమైన యెఱ్ఱని వర్ణమును, ఆగ్రహమువల్ల ఫళిచ్చు
మని ప్రకాశించు ఎఱ్ఱని అసహ్య వర్ణమును పుట్టును.

సహజముగా ఆస్ట్రిల్ బాడీ స్థూల శరీరముకంటె విస్తీర్ణమునం
దధికముగానుండును అని ముందే చెప్పబడియె. స్థూలశరీరమునం
దుండు ఇంద్రియగోళములయొక్క హక్కుదార్లైన యింద్రియము
లన్నియు ఆస్ట్రిల్ బాడీయందు వస్తువసుల్లవలె గాన్పించుచుండును.
కేవల తమోగుణ ప్రధానులే కదా మందులు. వారి ఆస్ట్రిల్ బాడీ
యందు తమోగుణముయొక్క చిహ్నములైన ప్రమాదము ఆల
స్యము మొదలగునవి బాగుగ గాన్పించుచుండును.

మందునియొక్క అంతరింద్రియమైన మనస్సు ఇదివరకును
ముదరలేదు గనుక మనస్సునందు పుట్టిన తలంపులతో ఆస్ట్రిల్ బాడీ

చుటిగా కానందున బహిఃప్రపంచము నందలి విషయప్రోత్సాహమువల్లనే మేలుకొనవలయును. లోకమునం దేవిధముగా పాషాణమునందు చలనముండదో తరుగుల్మలతాదులయందు చలనము కాన్పించునో ఆ విధముగా మందుని ఆస్ట్రిల్ బాడీ పాషాణవత్తుగా చలనహీనమై యుండును. పిల్లి, కుక్క ఇట్టివి పడి నిద్రపోవుచుండి ఆకలిని అనుభవించినపుడు లేచి సంచరించును. అట్లే మందుని యొక్క ఆస్ట్రిల్ బాడీయును నిద్రపోవుచుండి విషయములు సంధించినపుడు మేలుకొనును.

మనస్సు కొంతవరకు రూపుగొన్నపుడే ఆస్ట్రిల్ బాడీ స్వప్రయత్నమువల్ల మేలుకొనును. ఇట్టి స్థితియం దుండు మందునికి వృద్ధికొరకుగా బహిఃప్రపంచమునుండి బలవంతములైన సుఖములో దుఃఖములో కలుగవలెను. కామము, క్రోధము, లోభము, మోహము మొదలగునవియంతయు మందస్వభావముగలవానికి స్ఫూర్తికలుగజేయును. స్వప్రయోజనపరుడై మందుడు బహిర్వస్త్వాకర్షణ యను శక్తిని సంపాదించి, నాది నావారిది అని మెట్టుమెట్టుగా ఆస్ట్రిల్ బాడీని రూపుపొందునట్టు చేసికొనుచు తన భార్య పిల్లలు మొదలగువారి క్షేమము నుద్దేశించు నపుడు కొంతమట్టుకు నిష్కామత్వమును కూడ నేర్చుకొనును. కోపతాపములు, ఆశాపాశములు, సుఖదుఃఖములు అనునవి యంతయు మందునికి కలిగినపుడు కొంతకొంతగా ఆస్ట్రిల్ బాడీ రూపుపొందునట్టు చేసి దట్టముగా నేర్పడునట్టు చేయును. మంచి కామములు, ఆశలు, ఇచ్ఛలు, ఉన్నతస్వభావములు గల అణువులను ఆస్ట్రిల్ బాడీయందు ఇముడునట్టు చేయును.

స్థూలశరీరమును, దానియొక్క ప్రతిబింబమైన ఛాయాశరీర మును (Etheric double) నిద్రపోవుచుండగా ఆస్ట్రల్ బాడీయును అంతకంటె సూక్ష్మములైన శరీరములును నిద్రపోవుచుండు శరీర ములను వదిలి జీవాత్మతో సహా ఊర్ధ్వలోకములయందు సంచరిం చును. ఇది మందజనునకు స్వప్నావస్థగా నుండును. మందజనుడు నిద్రించునపుడు అతని ఆస్ట్రల్ బాడీ సరిగా రూపు ఏర్పడనందున స్థూలశరీరమును విడిచి చాలదూరము పోదు.

ఇట్లు అనేకజన్మములయందు హీనములైన ఆశాపాశము లను కోపతాపములను అనుభవించి ఆరీత్యా మందుని ఆస్ట్రల్ బాడీ కొంచకొంచముగా రూపు పొందును.

మధ్యములయొక్క ఆస్ట్రల్ బాడీలు యుక్తిచాతుర్యములు, కొంతవిద్యలు, ఇట్టివాని యభ్యాసమువల్ల చక్కగా రూపమును కుదుర్చుకొని, విశాలమైనవై, వర్ణములను అణువులను కొంత నా జూకుగలవాటిని కలిగియుండును. నాగరికతచెందిన కామము నాగ రికతచెందిన రాగద్వేషములు, ఇవన్నియు మంచి స్పందములను కలుగజేయుచు అట్టి స్పందములయొక్క సారాంశముగా ఆహ్లాద కరములైన వర్ణములను కలుగజేయును. మంచి మంచి స్పందము లను పదే పదే పుట్టించుటవల్ల ఆస్ట్రల్ బాడీయొక్క రూపు పరి ష్కారముగా నేర్పడును. స్థూలశరీరము అతి లేతతనమునందు అన గా అయిదారునెలల వయస్సు కాలమందు ఏవిధముగా జీవాత్మ ఉపయోగించుటకు అర్హముగా నుండదో అట్లు మందజనుని ఆస్ట్రల్ బాడీ ప్రత్యేక ఉపాధిగా జీవాత్మ కుపయోగపడదు. అదే శిశువు యొక్క శరీరము కాలక్రమమున పెరిగి ధృఢపడి ౨౦, ౨౫ సంవ

త్సరముల వయస్సుచెందినపుడు జీవాత్మకు ప్రత్యేకమైనదియు స్వతంత్రమైనదియు నైన ఉపాధిగా నుపయోగపడునో అట్లు మధ్యమునియొక్క ఆస్ట్రిల్ బాడీ ప్రత్యేకమైనదియు స్వతంత్రమైనదియు నగు ఉపాధిగా నేర్పడును. మధ్యమునియొక్క స్థూలశరీరము నిద్రించు సమయమునందు ఆతని ఆస్ట్రిల్ బాడీ ముదిరియున్నది గనుక ప్రత్యేక ఉపాధిగా నుపయోగించుటకు అర్హముగానుండును. సందర్భ ముండు నపుడంతయు మధ్యమునియొక్క ఆస్ట్రిల్ బాడీని అతని జీవాత్మ స్వతంత్ర ఉపాధిగా నుపయోగించుకొని ఆస్ట్రిల్ ప్లేనునందు సంచరించు శక్తి పొందుచుండును. ఆస్ట్రిల్ బాడీయందు ఇంద్రియస్థానములును మూలాధారాది సప్తచక్రముల యొక్క స్థానములును చక్కగా నిర్ధారణ ఏర్పడియుండును.

ఆస్ట్రిల్ బాడీని చేష్టలకు ప్రేరేపించునవి ఏవి యనిన, ౧. స్థూలశరీరము, స్థూలలోకమైన భూలోకము, ౨. ఆస్ట్రిల్ ప్లేను, 3. మనస్సు, ఇవన్నియు. భూలోకము పార్శ్వమునుండి తనను తాకునట్టి స్పందములయొక్క శక్తివల్ల పదే పదే మధ్యముని ఆస్ట్రిల్ బాడీ రూపుమారుచు వచ్చినను ఆ స్పందములు అంతరించిన వెంబడే ఆస్ట్రిల్ బాడీ తనయొక్క మామూలు రూపమును అవలంబించును. మనస్సు పార్శ్వమునుండి వచ్చు స్పందములైన జ్ఞాపకము, ఇచ్ఛ మొదలగునవి కూడ ఆస్ట్రిల్ బాడీని గట్టిపరచును.

మధ్యముని ఆస్ట్రిల్ బాడీని పుష్టపరుచు విధము ఏమనగా, ఆ ఆస్ట్రిల్ బాడీ యందుండు గరుకులైన అణువులను రాలగొట్టగల వేగమును పొందిన స్పందములను కలుగు కామము, ఇచ్ఛ మొదలగు వాటిని చింతించి బలపరచుకొనుట. ఆత్మవిచారము,

పూర్వభాగము, ౩౯౭, ౩౯౮ వ పుటలయందు చెప్పినరీతిగా "కామ క్రోధలోభ మోహగర్వకారిన్యాది" దుర్గుణములను "తత్తద్విరోధిసుగుణావష్టంభేన తన్నాశనం" అనినట్టు ఒక్కొక్క నీచగుణమును పోగొట్టుకొనుచుండుట. ఇట్టి యుపాయములచేత ఆస్ట్రల్ బాడీ క్రమక్రమముగా సుష్టు అగుచుండును.

మధ్యముని ఆస్ట్రల్ బాడీనిగురించి మరికొన్ని విషయములు మనము గమనించవలయును. శ్రీభగవద్గీతయందు

> శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్ ।
> కామక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నరః ॥

అని చెప్పియున్నది. కామక్రోధోద్భవమైన దడను మనము జయించలేము. కామము, క్రోధము, మదము, మాత్సర్యము, రాగము, ద్వేషము, ఓర్వలేమి ఇట్టి దుర్గుణములన్నియు కామమయశరీరమును చేరినవి. మధ్యముడు ప్రవృత్తిమార్గమునందు నడుచుచు అతి ఆశాపరవశుడైయుండును. ఆశ యెప్పటికిని దుఃఖకారణము. ధనము నార్జించుటయందు కష్టము, ఆర్జించినధనమును కాపాడుటయందు కష్టము, ధనము నష్టమైపోయినపుడు దుఃఖము, ధనము వ్యయమగుచున్నను దుఃఖము అని లోకోక్తి కలదు. ఒక ధన విషయమునందే యిన్ని దుఃఖములైతే లోకమునందు దుఃఖకారణములు ఎన్నోయున్నవి. పదవి కోరినపుడు పదవి లభించకపోయినను లభించిన పదవి తప్పిపోయినను దుఃఖమే. కామాంధకారము చేత యుక్తాయుక్తజ్ఞానము నష్టమగును. సర్వానర్థకారణమయిన ద్రవ్యమువల్ల క్షోభ విశేషముగా కలుగును. ఇట్లే అనేకవస్తువులు

క్షోభను కలుగచేయును. ఇవన్నియు కామక్రోధములకు కారణములు. కనుక కామక్రోధోద్భవమైన దడ అతి బలశాలి. శరీరమును చాల శ్రమపెట్టించును. లోకులు సాధారణముగా "నా మనస్సు పుండు అయిపోయినది" అందురు; అది నిజమే. కామక్రోధాదులన్నియు ఆస్ట్రల్ బాడీయందు కలుగు మార్పులు. ఆస్ట్రల్ బాడీయందు అనేక వర్ణములుండు నని ముందే చెప్పబడియె. కొన్ని వర్ణములకు కారణము రాగము, ప్రేమ, ఆశ, అనుగ్రహము, స్నేహము ఇట్టివి. ఇవన్నియు మంచి వర్ణములను పుట్టించును. దుఃఖము, తాపము, మాత్సర్యము, వ్యాకులము, ఓర్వలేమి, ఇట్టివి చెడ్డవర్ణములను పుట్టించును. అంతే కాక దుఃఖము తాపము మొదలగునవి ఆస్ట్రల్ బాడీయందు బొబ్బలు ఎగియునట్టు చేయును. కోపము ఒక విధమైన బొబ్బను పుట్టించును. రెండవతూరి కోపము చేసినపుడు రెండవ బొబ్బ పుట్టును. నూరు తడవలు కోపముచేసి కొనినయెడల నూరు బొబ్బలు పుట్టును. కోపమువలన పుట్టిన బొబ్బలన్నియు నొక తరహా బొబ్బలు. వ్యాకులము మరియొక తరహా బొబ్బను పుట్టించు. నూరుతడవలు వ్యాకులములు పుట్టినపుడు నూరు వ్యాకులపు బొబ్బలు పుట్టును.

కామరూపేణ కౌంతేయ దుష్పూరే ణానలేన చ ।

అని చెప్పబడియున్నది. కామమును తృప్తిచెందించుట అరుదు. మరియు కామము అనలము; అనలము అనగా నిప్పు. నిప్పును మనశరీరముపైన ఉంచినయెడల బొబ్బలెగియును. ఇది మన అనుభవము. ఇట్టి అనలములు సాధారణజనునికి ప్రతినిత్యమును ఎన్నో సంభవించుచుండును. ఒక్కొక దుఃఖము గాని, కోపము గాని

సంభవించినపుడంతయు ఒక్కొక బొబ్బ కలుగుచు యోగదృష్టిగల వారు మధ్యముని ఆస్ట్రల్ బాడీని చూచినయెడల వేయి బొబ్బలతో నిబిడీకృతమై పుల్లమోపుటకు కావలసినంత విడిస్థలమైనను లేక ఆస్ట్రల్ బాడీ ఆద్యంతమును బొబ్బలతో నిండియుండును. యోగదృష్టిగలవారలు చూచినపుడు మధ్యమునియొక్క ఆస్ట్రల్ బాడీ స్థూలశరీరమునందు తీటనిండినవారి శరీరమువలె పుండ్లునిండి యుండును. పెద్దరోగమువచ్చినవాని శరీరమునందు పుండ్లు పెద్దవగుచు పురుగులు తినిపోవురీతిని మధ్యముని ఆస్ట్రల్ బాడీ కామక్రోధోద్భవమైన వేగమువల్ల కుష్ఠురోగియొక్క స్థూలశరీరమున్నట్లు కనబడునట. చూచినారండీ, మనమందరమును కోపతాపములు గలవారమే. చాలమంది మనలో అరిషడ్వర్గమును ఆదరించువారమే. కనుక మన ఆస్ట్రల్ బాడీలు ఏమి సౌరభ్యముగా నుండునో కొంతగమనింతురా! స్థూలశరీరమును అలంకారముచేసి తిలకము దిద్ది వాసనద్రవ్యములు పూసి ఉంగరములు పోగులు వేసికొని మినుకుచుండినను మన ఆస్ట్రల్ బాడీలు కుష్ఠురోగగ్రస్తములుగా నుండునటనే. ఇదేమి తలవ్రాత!

మరియొక విశేషమట; విందురా, వినండి. రోగియొక్క శరీరమందుండు కురుపులకు మందు పూయు మని వైద్యులు చెప్పితే రోగులగు మనము మందుకూడ పూయ మట. మనమెంతటి గుణజ్ఞులమో విన్నారా! స్థూలశరీరమునందు పుండ్లు నిండిన వాడు ఔషధమును వేయను అనడు. అయినా ఆస్ట్రల్ బాడీపుండ్లకు ఔషధము పూయుటకు ఒప్పుకోమట. అంతేకాదు. మహాబుద్ధిశాలుర మగు మనము ఆస్ట్రల్ బాడీయం

దుండు పుండ్లలో పుల్లలుదూర్చి గుచ్చియెత్తి కోతిపుండు బ్రహ్మ రాక్షసియను లోకోక్తి ప్రకారము ఆస్ట్రిల్ బాడీలలోని పుండ్లను పెద్దవిగా జేసికొనుచుండు మట. ఏమండీ, ఈలాటి అవమాన ప్రసంగము మాటలాడుచున్నా రని నన్ను తాము అడుగవచ్చును. దయచేసి వినండి.

ఆస్ట్రిల్ బాడీలోని పుండ్లు మానవలెనన్న నౌషధము ఏది? కామక్రోధాదులవలన కదా పుండ్లు కలిగినవి. కామక్రోధాదులకు "తత్తద్విరోధిసుగుణావష్టంభము" అను శాంతశమాదిగుణములయభ్యాసము ఔషధముతో సమానము. శాంతశమాది సద్గుణోపాసనవలన ఆస్ట్రిల్ బాడీయందలి పుండ్లు మాను నట. కోపము, క్రోధము మొదలగు దుర్గుణములను ప్రతినిమిషమునందును చూపుచుండు మనము గాని మనలో నెవ్వరు గాని తటాలుమని కోపము మొదలైనవాటిని త్యజించు యోగ్యతగలవా రున్నారా? ఇట్టివారలే కదా "ఆస్ట్రిల్ బాడీయందలి పుండ్లకు ఔషధము వేయము" అనువారు. మరియు కోపము అభ్యాసమయినపుడు, ఓర్వలేమి అభ్యాసము అయినపుడు ఈ దుర్గుణములను మరల మరల అభ్యసించుటకే వీలు ఉండును గదా. అభ్యసించినపుడంతయు పుంటిలో పుల్లను గుచ్చి కోతిపుంటివలె చేయువారమే కదా. ఇదే విధమున

> అదత్తదోషేణ భవేద్దరిద్రః దరిద్రదోషేణ కరోతి పాపం ।
> పాపా దవశ్యం నరకం ప్రయాతి పున ర్దరిద్రీ పున రేవ పాపీ ॥

దరిద్రుడై పాపములను చేసి నరకమునకు పోయి మరల జన్మమునకు వచ్చి దరిద్రుడుగా పుట్టి మరల పాపములను చేయుచు మరల

దరిద్రుడు మరల పాపి అయినట్టు కోపాదులవల్ల ఆస్ట్రిల్ బాడీ నిండుకు పుండ్లు, మరల మరల కోపము, క్రోధము అను గుణముల యభ్యాసములవల్ల పుండ్లు అసహ్యాముగా నగుట, ఆ పుండ్లను మాన్పగల శాంతశమాదిగుణములను అభ్యాసము చేయుట కిష్ట పడక పోవుట, ఇట్టి దౌర్భాగ్యము మధ్యమునికి కలిగి ఏదో ఒక పుడు సత్సాంగత్యమువల్ల నివృత్తిమార్గ మొకటి యున్నదని తెలిసికొని సాధనచతుష్టయ అభ్యాసము చేయుటకు ప్రయత్నపడి అనేక ప్రయత్నములు వృథాగా పోయినను కట్టకడపటికి కొన్ని ప్రయత్నములైనను అనుకూలించు రీత్యా ఆస్ట్రిల్ బాడీయందలి పుండ్లకు మందులు వేసి పుండ్లను మాన్పుకొనుటకు ప్రయత్నము జరుగునట. ఇదే షట్సంపత్తిని గ్రహించుట యని యర్థము.

సాధారణముగా మందుడు మధ్యముడు ఈ యిద్దరే చాల దుఃఖములపాలగువారు. శ్రేష్ఠునికి దుఃఖములువచ్చినపుడు వివేక ముతో దుఃఖమునకు తనకర్మయే కారణమని ఓర్చుకొనును. మం దుడు, మధ్యముడు ఈ యిద్దరును ఓర్చుకొనుటకు శక్తిలేనివారు; ఖిన్నులై మూల కూలబడి యేడ్చుచుందురు. కనుక తమంతకు తామైనను మేలుపొందుటకు వీలులేక ఖేదమును అనుభవించుచుం దురు. ఖేదము అను పదమునకు ఇంగ్లీషుభాషయందు (Worry) వొర్రి యనిపేరు. ఖేదము మనుష్యులకు ముసలితనమును త్వరగా నిచ్చును. ఖేదమువల్ల సాధించునదేమియుకానము. ఐనను జనులు సాధారణముగా ననేకకారణములబట్టి ఖిన్నులగుచుందురు. హర్ష ము గలవారు ఇతరులకు హర్షమునిత్తురు. దుఃఖముగలవారు ఇత రులయందు పశ్చాత్తాపము కనికరము అను గుణములను మేలుకొలిపి

తద్ద్వారా వారికి దుఃఖము కలుగజేతురు. ఖిన్నులైనవారు ఇతరులకు కూడ తమ ఖేదము అందునట్లుచేయుదురు. లోకమునందు కలరావ్యాధివారు ఇతరులకు కలరానిచ్చునట్లును, బొబ్బల వ్యాధిగలవారు ఇతరులకు బొబ్బలవ్యాధిని ఇచ్చునట్లుగా ఖిన్నులైన వారును తమ ఖేదమును ఇతరులకు ఇత్తురు. భూలోకమునందు ఆరోగ్య అధికారులు ఏవిధముగా పైకన్న రోగములు గలవారిని గ్రామములనుండి పారదోలి విజనప్రదేశములయందు ఉంచుదురో అదే ప్రకారము సదా ఖేదమును పొందుచు మగ్నులైనవారిని కూడ వేరుపరిచియుంచునట్లైతే దేశము సుఖముపడును.

దుఃఖములు, ఖేదములు అనునవి అన్నియు ఆ సమయమునకు అతి ముఖ్యములుగా కనబడునుగాని పది సంవత్సరములకు పిమ్మట వానియొక్క ముఖ్యత పోయి అవి అతి స్వల్పములుగా కనబడును. ఎవనికైనను భార్యచనిపోయినది అంటే నాటి దినము మరుసటిదినము ఆ దుఃఖము భూమ్యంతరిక్షముల నన్నియు నిండినట్లుండును. ఆరునెలలకు పిమ్మట చచ్చిననాడుండినందులో సగమైన నుండదు. పది సంవత్సరములకుపైన దుఃఖమే ఉండదు. కనుక బుద్ధిమంతుడగువాడు తనకు దుఃఖములు గాని శ్రమలు గాని ఇక ౫, ౬ సంవత్సరములకు పిమ్మట ఏమాత్రము బాధకలుగజేయును అని విమర్శించి తత్క్షణమునందే వ్యాకుల హీనులు కావలయును. అట్లయితే ఆస్ట్రల్ బాడీయందు గాయములు, కురుపులు, వ్రణములు తక్కువగానుండును.

మరియొక విశేషమున్నది. అనగా రథోత్సవములు, తిరునాళలు మొదలగు సందర్భములలో జనులు పెద్ద సంఘములు కూడి

నపుడు, భిక్షుగాళ్లు లెక్కలేనన్నిమంది ఆస్థలములయందు కూడు
దురు. కుంటివారలు, గుడ్డివారలు, చేతులునరుకబడి మోచేతుల
వరకు మాత్రము గలవారలు, దేహములయందు మలినము నిండి
చూపుకు విసుకుపుట్టించగలవారలు, దేహమాద్యంతము పుండ్లు,
వానిపై ఈగలు ముసురుచు రసిగారుచునుండు వారు, కుష్ఠురో
గులు మొదలగువారలు లెక్కలేనన్నిమంది అక్కడికి వచ్చి
ధర్మాత్ములైన నాగరికత చెందినవారలవద్ద భిక్షమెత్తువారుం
దురు. ఇది మనకందరకును తెలిసిన విషయమే.

సొగుసైన వస్త్రములను ఆభరణములను ధరించి షోకుగా
తిరునాళ్లకు పోవువారిని చూచుటకు మనకు ఇంపుగానుండును.
ఇంపులనే చూచియు వినియు సొంపుచెందవలయు నని ఆశగొన్న
వారికి ముందుచెప్పిన భిక్షుగాళ్లగుంపు హఠాత్తుగా కండ్లపడును.
సొంపుపోయి అసహ్యము కలిగినను మనోబలమువల్ల తమకు
కలిగిన అసూయ కనుపరచకయుందుముకదా. పదివేలమంది
సొగుసుగాళ్లమధ్యన నూరుగురికన్న నధికముగా భిక్షుగాళ్లుండరు
కదా. అప్పటికే అసూయ కలిగితే ఆస్ట్రిల్ ప్లేనునందు లక్షల
కొలదియునుండు ఆస్ట్రిల్ బాడీలలో కొంచమెక్కువ తక్కువగా
ముప్పాతికపాలు పుండ్లు వ్రణములతో నిండిన ఆస్ట్రిల్ బాడీలు
ఉంటే యోగదృష్టి కలిగి వారలను చూచువారికెందరికి ఎంత
అసూయ కలుగవలయును. అట్టి అసూయ కలుగజేయు మను
ష్యులలో మనముకూడ కలిసినవారమే. మననుచూచి యిత
రులు అసహ్యపడకూడదని మన స్థూలశరీరములను అలంకరించుకొని
మినుకువారికి భూలోకమందుండు అద్దమును చూచి తిలకము

దిద్దుకొనునట్లు ఆస్ట్రిల్ ప్లేను అద్దము నుపయోగించి ఆస్ట్రిల్ బాడీలనుకూడ అలంకారము చేసికొనవలసి యుండును. మన అదృష్ట వశమున మనకు ఆస్ట్రిల్ ప్లేనుదృష్టి రాలేదుగాని తటాలుమని ఇపుడే మనకు ఆస్ట్రిల్ ప్లేనుదృష్టిలభించితే అక్కడి ఘోరరూపములనుచూచి అర్జునునికి భయసంతాపములు కలిగినట్లు మనకును కలుగును.

శ్రీమద్భగవద్గీత, ౧౧ వ అధ్యాయము, ౨౫ మొదలు ౩౦వ శ్లోకమువరకును ఈ సందర్భమునందు చదువవలయును.

ఖేదమును మానుటకు ఉపాయములు కలవు. భార్యచనిపోయినవాడు కొన్ని సంవత్సరములకు తరువాత దుఃఖమును మరుచును అని చెప్పబడియె. బుద్ధిశాలి అట్టి దుఃఖమును అపుడే మరుచుటకు సన్నాహముచేయుచు మనశ్శక్తిని వృద్ధిపరుచుకొవలయును. "ఎల్లుండి మావారు నన్ను కొట్టవత్తురట" అను లోకోక్తి కలదు. ఆ ప్రకారము లేని లేని దుఃఖములను కలుగచేసికొందురు. "మా ఊరిలో పేదరాలుపెద్దమ్మ నన్నుగురించి దూషణలు వెదజల్లుచున్నదట. దాని మాటలు కొందరు నమ్ముదురు. అందువల్ల నాకు అవమానము కలుగవచ్చును. అవమానముతో ఊళ్లో సంచరించుటకంటె చావుమేలు" అని నిజమో భ్రమయో అగు దుఃఖములతో ఖిన్నుడుగాక మనోధైర్యముతో "పేదరాలు పెద్దమ్మ నన్నేమో దూషించుచున్నదట. ఆబిడ ఏమి చెప్పినను చెప్పుకొవచ్చును. అందునుగురించి నేను యోచించను. అయితే ఆమె దుష్కర్మచేయుచున్నది కదా అని నాకు చింతగానున్నది" అని ఆ తలంపు వదిలిపెట్టవలయును.

ఇట్లు అవశ్యములేని చిల్లరవిషయములనుగురించి దుఃఖించు అభ్యాసమును విడిచిపెట్టవలయును. ఈ దుఃఖములన్నియు చాల మట్టుకు మధ్యముని బాధించును గనుక మధ్యముని ఆస్ట్రిల్ బాడీ విషయమై వ్రాయునపుడు ఇవన్నియు వ్రాయవలసివచ్చినది.

శ్రేష్ఠునియొక్క ఆస్ట్రిల్ బాడీ ఉన్నతములైన అణువులతో కట్టబడియుండును. ఉన్నతములైన అణువులు గనుక మంచి రమ్యములైన వర్ణములుండును. మూలాధారాది చక్రముల స్థలములు దేదీప్యమానముగా యోగగ్రంథములయందుపయోగించిన తప్త కాంచనసన్నిభము మొదలగు విశేషణములు సార్థకములుగా నుండును.

ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం సముద్ర మాపః ప్రవిశంతి యద్వత్ ।
తద్వ త్కామా యం ప్రవిశంతి సర్వే స శాంతి మాప్నోతి న కామకామీ ॥
(శ్రీ భగవద్గీత, అధ్యా. ౨, శ్లో. ౭౦)

అన్ని కామములు శ్రేష్ఠుని మనస్సునందు ప్రవేశించి మార్పు లేమియు కలుగజేయకయే అంతరించిపోవును. మంచి యౌవనపురుషుని యొక్క స్థూలశరీరము ఏ విధముగా చక్కగా నిర్మింపబడి ఉపయోగార్హముగా నుండునో అదే విధముగా శ్రేష్ఠుని కామమయ శరీరముకూడ చక్కగా నిర్మించబడి స్వతంత్రముగా ఆస్ట్రిల్ ప్లేనునందు చరించు యోగ్యత కలిగియుండును. స్థూలశరీరమును తనకు ఇష్టమైన స్థలమునందు వదిలిపెట్టి ఆస్ట్రిల్ బాడీని ఉపయోగించి నిరాటంకముగా ఆస్ట్రిల్ ప్లేనునందు సంచరించు శక్తిగలవాడు గానుండును. మందుడు, మధ్యముడు ఈయిద్దరును స్థూల శరీరమును వదిలి వెళ్లుదురు గాని మందుడు స్థూలశరీరమునుండి

దూరానకు వెళ్లలేడు. కనుక ముందుని సంగతిని మనము గమనిం చవలసిన అవశ్యములేదు. మధ్యముడు స్థూలశరీరమును వదిలి ఆస్ట్రల్ ప్లేనులో సంచరించినపుడు ఆస్ట్రల్ బాడీతో సహా స్థూల శరీరములో మరల ప్రవేశించినపుడు తాను ఏమిచేసినదియు జ్ఞాపక మునకు తెచ్చుకో లేడు. మనలో చాలమంది రాత్రులయందు నిద్రించుసమయమునందు స్థూలశరీరమును వదిలి ఆస్ట్రల్ బాడీతో ఆస్ట్రల్ ప్లేనునందు అనేక స్థలములకు వెళ్లి అనేక కార్యములు చేయుచుందుము గాని అట్టి సమయమందు చేసిన కార్యములు మనకు జ్ఞాపకముండవు. అతిస్వల్పముగా స్వప్నమాత్రముగా కొన్నిసంగతులు జ్ఞాపకము ఉండును. శ్రేష్ఠుడు తాను ఆస్ట్రల్ బాడీతో నిలిచి ఆస్ట్రల్ ప్లేనునందు చేసిన కార్యములన్నియు జ్ఞాపకమునకు తెచ్చుకొనుశక్తి కలిగియుండును. ఆస్ట్రల్ బాడీలో ప్ర యాణము చేయగల శ్రేష్ఠుడు అడ్డము లేకయే ఏ యూరికైనను ఏదేశమునకైనను అతివేగముతో పోగలడు. ఇట్టి ప్రయాణవేగ మునకే మనోవేగ మని పేరు. ఆస్ట్రల్ బాడీతో సంచరించునపుడు కొండలు, రాళ్లు, గోడలు, ఇట్టివి మనకు అడ్డము కలుగ జేయవు. కొండలనడుమ దూరి ముందునుండి వెనుకటి భాగమునకు నిరా టంకముగా పోగలము.

స్థూలశరీరమునందు మెదడు మనస్సునకు గోళము అని యిదివరకు చెప్పబడియున్నది. ఆస్ట్రల్ బాడీతో చేసిన కార్యముల యొక్క జ్ఞాపకము మెదటియందు అచ్చుపడితేనే ఆస్ట్రల్ బాడీతో చేసిన కార్యములు జాగ్రదవస్థలో జ్ఞాపకముండును. భూలోకము నందలి విషయములను ఇంద్రియములు గ్రహించి ఆస్ట్రల్ బాడీ

ద్వారా జీవాత్మకు సమర్పించును. జీవాత్మ తానుగా తన మనస్సు నందు తలంచిన తలంపులు ఆస్ట్రిల్ బాడీగుండా దిగివచ్చి మెదటి యందు ప్రవేశించి చేతులు కాళ్లు అను అవయవములను చలింపజేసి కార్యముచేయుటకు కారణ మగును. కనుక జీవాత్మకును స్థూలప్రపంచమునకును ఆస్ట్రిల్ బాడీ సంబంధకర్త యగును. బహిః ప్రపంచమునందలి స్పందములను జీవాత్మకు తీసికొనిపోయి చేర్చియు సూక్ష్మలోకముల స్పందములను బహిః ప్రపంచమున కిచ్చియు ఈ రీతిన వ్యాయామము జరుగుటవలన ఆస్ట్రిల్ బాడీ పెరుగును. పెరుగుట యనగా ఆకారము పెద్దది యగుట, అల్లికయందు సుష్ఠు, రమ్యములైన రంగులు అధికమగుట. ఇవన్నియు పెంపుకు గుర్తులు.

నివృత్తిమార్గయాత్రాపరుడు క్రమేణ తనయొక్క స్థూల కామమయ మనోమయశరీరములకు సంబంధమును గట్టిపరుచుకొను చుండును. సంబంధము గట్టి కాను కాను స్థూలశరీరమును విడిచి పోకనే ఆస్ట్రిల్ బాడీయొక్క ఉపయోగమును సూక్ష్మదృష్టి, దూరశ్రవణము, ఇట్టి విధములగుండా అనుభవించుట కారంభించును. ఈసిద్ధులనుగురించి మెంటల్ బాడీయొక్క సౌష్ఠవ వివరమును వ్రాసినపిమ్మట వ్రాయనగును.

## ఆస్ట్రిల్ బాడీయొక్క సౌష్ఠవము

ఆస్ట్రిల్ బాడీని సుష్ఠుపరుచుటకు కొన్ని వివరములను విచారించవలయును. ఒక నదికి సేతువును కట్టి ఒక గట్టునుండి సేతువు మార్గమున ఎదుటిగట్టుకు పోగలము కదా. అదేవిధమున మనో

మయశరీరముయొక్క స్పందములు బహిఃప్రపంచమును అందవలె నన్నను బహిఃప్రపంచముయొక్క స్పందములు మనోమయశరీర మును అందవలెనన్నను ఆస్ట్రిల్ బాడీ సేతువుగా నుండును అని యిదివరకే చెప్పబడెను. సేతువు సుష్ఠుకావలెనన్నపుడు ఏ విధ ముగా ఇరు ప్రక్కలు అనగా రెండుగట్టులనుండియు మనుష్యులను తేవలసియుండునో అదే విధముగా సేతువైన ఆస్ట్రిల్ బాడీ సుష్ఠు కావలెనన్నపుడు ఒక పార్శ్వము స్థూలశరీరమునుండియు మరి యొక పార్శ్వము మనోమయశరీరములనుండియు సన్నాహము జరుగవలయును.

స్థూలశరీరము పరిశుద్ధమైన ఆహారముతో పెంచబడి పరి శుద్ధముగానుంటే ఆ శరీరమునందు పరిశుద్ధఅణువులు అతి బాహు ళ్యముగా నుండును అని అర్థము. బహిఃప్రపంచమునందలి అణువు లన్నియు ఆస్ట్రిల్ ప్లేను అణువులతో ఆవరింపబడియున్నవి అని ఈ పుస్తకము పూర్వభాగమునందు చెప్పబడియున్నది. బహిఃప్రపం చమునందలి అణువులయొక్క పారిశుద్ధ్యము వానిని ఆవరించుకొని యుండు ఆస్ట్రిల్ అణువులకు ఎక్కి ఆస్ట్రిల్ అణువులను పరిశుద్ధ ముగా జేయును. కనుకనే "ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః" అని చెప్పబడిమె. ఇందుకనే స్థూలశరీరముయొక్క సౌష్ఠవమునందు ఆహారము ముఖ్యమని చెప్పబడిమె. ఆహారశుద్ధియందు స్థూలశరీర సౌష్ఠవము మాత్రము కాదు. ఆస్ట్రిల్ బాడీయొక్క సౌష్ఠవము కూడ లభించును. ఆస్ట్రిల్ బాడీకి మరియొక శక్తి కలదు. తాను ఎట్టి వారి సమీపమందుండునో అట్టివారి గుణములను గ్రహించు శక్తి. అందువలన మన మెరుగవలసిన దేమనగా మనకు వృద్ధియందు

దృష్టియుండినయెడల సత్సాంగత్యమును చేయవలయును. సత్సాం గత్యమువల్ల గలుగు లాభమును గురించి ఆత్మవిచారము, పూర్వ భాగము, ౩౨౬ - ౩౩౨ వ పుటవరకు ఈ సందర్భమునకు కావలసి నంత వ్రాయబడియున్నది. దుస్సంగమును చాలించి నంతట హీన ములైన తలంపులు, ఆశలు, ఇట్టివి మనను అందవు. తద్ద్వారా ఆస్ట్రిల్ బాడీయందు గరుకులైన అణువులు చేరవు. పిమ్మట సత్సం గమునే కోరవలయును. అందువలన సత్పురుషుల స్థూలశరీరముల లోని అణువులు మనశరీరములలో చేరి ఆస్ట్రిల్ బాడీలోని అణువులను శుద్ధిచేయుట యే గాక ఆ సత్పురుషులు తమ నాశ్ర యించినవారియొక్క మనస్సులలో నుండు దుష్టతలంపులను తమ మంచితలంపులతో తొలగదోలుదురు. వారి మంచితలంపులును వారియొక్క పరిశుద్ధములైన కామములును మన ఆస్ట్రిల్ బాడీ యందలి గరుకులైన అణువులను తరమగొట్టి నాజూకులైన అణువు లను చేరునట్లు చేయును. ఈ చికిత్సలు వెలుపలినుండి కాగలవి. లోపలినుండి కాగల చికిత్సలు కలవు. అవి అతి శక్తిమంతములు. అవి ఏవి అనగా: పైనచెప్పిన సేతువుయొక్క ఎదురుప్రక్కనుండి కలుగు సన్నాహము. ఆస్ట్రిల్ బాడీకి స్థూలశరీరము ప్రక్కనుండి కలుగు శుద్ధినిని సత్సంగములవల్ల కలుగు శుద్ధులను కూడ బహిశ్శుద్ధియని చెప్పితిమి. అంతశ్శుద్ధి యేదనగా ఎదురుప్రక్క గట్టుతో సమానమైన మనస్సునందు ఉపాసకుడు చింతనము వల్ల చేయు సన్నాహము. ఆత్మవిచారము, పూర్వభాగమునందు శీలము అను అధ్యాయమునందు చెప్పిన అమానిత్వము, అదం భిత్వము అను గుణములనుగురించి ధ్యానించి మననముచేసి

ఆ గుణములను తనవిగా చేసికొనుచు రాగా ఆ గుణములు గట్టి పడు ద్వారా తద్విరోధములైన కామక్రోధగర్వమత్సరకాఠిన్యాది దుర్గుణములు వీడిపోవును. దుర్గుణములతోసహా వానికి సంబంధించిన గరుకులైన అణువులు రాలిపోవును. సద్గుణములు గట్టిపడుచు రాగా వానికి అనుగుణములైన నాజూకు అణువులు ఆస్ట్రిల్ బాడీయందు చేరును. నాజూకులైన అణువులను ప్రయత్నపూర్వకముగా రాబట్టుకొనుచు రాగా నాజూకులైన వాసనలు ఆస్ట్రిల్ బాడీని ఆశ్రయించును. ఆ వాసనాబలములవల్ల మంచి కామములనే కోరును. మంచికామములను కోరు అభ్యాసము ఏర్పడినపుడు మంచితనమునందే అనురక్తి కలుగును. కనుక ఇట్లు అంతశ్శుద్ధి చేసియు ముందుచెప్పిన బహిశ్శుద్ధి చేసియు ఆస్ట్రిల్ బాడీని (ఇంద్రియాత్మను) సుష్ఠుపరుచుకోవలయును.

ఇందుకనే సత్త్వరజస్తమోగుణముల పైకి తమోగుణము పోగొట్టుకొని సత్త్వగుణమును వృద్ధిపరుచుకోవలసిన దనియు, రజోగుణమును పరిశుద్ధి చేసికొనవలయుననియు గురుదేవులవారి యుపదేశము.

ఇందుకనే ధర్మశాస్త్రములయందు ఆచారములను అనేకముగా చెప్పియున్నారు. ఆస్ట్రిల్ బాడీ స్థూలశరీరములో ప్రవేశించి ఆ శరీరమును మించి ఒక మూరెడు దూరము విస్తరిల్లియుండు నని యిదివరకును చెప్పబడియె. మనయొక్క ఆస్ట్రిల్ బాడీని పరిశుద్ధముగా నుంచుకోవలెనని యభిలాష యుండినయెడల సంఘముల యందు పోవలసి వచ్చినప్పుడు చాల జనసమ్మర్దము గల స్థలములకు పోక యూనవలయును. భోజనసమయమునందు పరిశుద్ధులుగానుండి

పరిశుద్ధమైన ఆస్ట్రిల్ బాడీగల వారల సమీపమందే కూర్చోవల యును. రాముడు అనువాని ఆస్ట్రిల్ బాడీ అతనిని మించి మూ రెడు దూరము విస్తరించియుండును అనినట్టుగానే బ్రహ్మయ్య అను వాని ఆస్ట్రిల్ బాడీయు అతనిశరీరమును మించి మూరెడుదూర మధికముగా విస్తరించి యుండును కదా. అందువల్ల రాముడు, బ్రహ్మయ్య పక్కనపక్కన భోజనమునకు కూర్చొన్నను మరి యే విధముగా కూర్చొన్నను ఆ యిద్దరకును మధ్య రెండుమూరల వెలితిస్థలమైనా విడిచియుండకుంటే వారి ఆస్ట్రిల్ బాడీలు ఒకటి కొకటి స్పర్శ కాకయుండదు. రెండు స్థూలశరీరములు ఒకటితో నొకటి స్పర్శ అయినపుడు మురికి గలవాని శరీరమునుండి వాని దేహమందలి చెమట మొదలగు అపరిశుద్ధవస్తువులు శుద్ధుడు గా నుండు రెండవవాని శరీరమునందు తగులును కదా. అదేవిధమున రెండుమూరలవెలితిస్థలము లేనియెడల రాముడు, బ్రహ్మయ్య అను ఇద్దరి ఆస్ట్రిల్ బాడీలును ఒకటితోనొకటి కలియును. ఈ యిద్దరి లో రాముడు వ్రాత్యుడుగా నుండవచ్చును. బ్రహ్మయ్య నివృత్తి మార్గనిరతుడుగా నుండవచ్చును. అపుడు రాముని ఆస్ట్రిల్ బాడీ యందలి మలినములు బ్రహ్మయ్య ఆస్ట్రిల్ బాడీలో కలియవచ్చును. ఇదే విధమున సంఘస్థలమునందు నిద్రించవలసివస్తే అప్పటికి రాముడు, బ్రహ్మయ్య అను రెండు శరీరములకును రెండుమూరల కన్న నధికమైన వెలితిస్థలముండవలెను. మనము మేలుకొని యుండినపుడు జీవాత్మసన్నిధానమున జాగ్రదవస్థబలమువల్ల కా మమయ శరీరమునందు ఒక విధమైన నిరాకరణశక్తి యుండు ను. ఆ శక్తిమలినములను సులభముగా ఆస్ట్రిల్ బాడీయందు

ఇమడనీయదు. నిద్రాసమయమునందు ఆ నిరాకరణశక్తి యుం డదుగనుక శయనించు సమయమునందు అతి జాగరూకతతో దుష్టకర్మలు జరుగకుండినది యైన శయనస్థలమును నిర్ధారణ చేసికొనవలయును.

ఇట్లు అనేకవిధముల ప్రయత్నము చేసి ఆస్ట్రల్ బాడీయందు మలినము చేరక చూచుకోవలయును. పూర్వాచార మొకటి కలదు. సంఘములయందు దూరి పనిచేసికొని రాగానే దేహ శుద్ధ్యర్థము స్నానము చేసి వేరు వస్త్రములను ధరించుట. ఈ ఆచారములు అన్నియు ఆస్ట్రల్ బాడీని పరిశుద్ధముగా నుంచు కొనుటకుగా నేర్పడినవి యే. ఇందునుగురించి చాలదూరము వ్రా యవచ్చును. అయినను ఇప్పటికి ఇంతటితో ఇచ్చట చాలించ వలెనని తోచుచున్నది.

నిద్రపోవుసమయమందు శయ్యపైకూర్చున్న పిదప తన యిష్టదైవమును ధ్యానము చేసికొని యీ గ్రంథము, పూర్వభాగము, ౧౯౦ వ పుటయందు చెప్పిన ప్రకారముగా కవచమును కట్టి శయ నించవలెను. ఈ కవచముయొక్క శక్తిచేత ఆస్ట్రల్ ప్లేనునందు సంచరించుచుండు దుష్టగ్రహాదులు తన శరీరమును సమీపించవు. ఇష్టదేవతాధ్యానమువల్ల ఇష్టదేవతయందే బద్ధానురక్తులై యుండు టంబటి తాము ధ్యానించిన మూర్తియొక్క సమీపమును చెంది ఆ మూర్తియొక్క మహిమవల్ల తాను చేయతలచుకొనిన లోకసేవ తృప్తికరముగానును ఫలవంతముగానును చేయవచ్చును. పూర్వా చారమందు దుస్స్వప్ననాశకములైన స్తోత్రపాఠములను వల్లించుచు నిద్రనారంభించుట కలదు. దాని యుద్దేశము కూడ ఆ స్తోత్రములకు

విషయమైన మూర్తిని తాను నిద్రసమయమునందు సమీపించవలె నను ఆశయే.

ఈ రీతిగా ననేకస్త్రోవలను వెదకి తనయొక్క కామమయ శరీరమును (ఆస్ట్రిల్ బాడీని) పరిశుద్ధి చేసికొందురు. తాళపత్రము లను చీవువాడు తనకత్తిని పదునుపెట్టుకొనును. తాళపత్రముల మీద వ్రాయనిచ్ఛయించువాడు తనఘంటమును పదునుపెట్టును. అదేవిధముగా జ్ఞానదీక్షలను చెందవలెనని యాశగొన్నవాడు తన దేహములను సుష్ఠుగా జేసికొనవలయును. జ్ఞానదీక్ష లని యీ గ్రంథమందు వ్రాయబడియున్న విషయమునే బ్రహ్మవిద్యాదర్పణ మను గ్రంథమునందు తారకోపదేశము అని వాడబడియున్నది. ఉపదేశముచేయువారు తాము ఉపదేశముచేయు మంత్రముయొక్క స్పందముల తీవ్రమును శిష్యుని శరీరమునందలి స్పందశక్తులు ఓర్వ గలవా అని యోగదృష్టితో చూచి కనుగొని తృప్తికరముగా నున్నయెడలనే ఉపదేశము చేయుదురు. కుచేలునికి ఐశ్వర్యప్రాప్తి మైనటుల నివృత్తిమార్గయాత్రారంభమందు పరిభ్రమించుచుండు వారు జ్ఞానదీక్ష అను తారకోపదేశమును పొంది ధన్యులగుదురు. ప్రయోజనముయొక్క బాహుళ్యమును ఉద్దేశించి శిష్యుడు దేహ ములసౌష్ఠవమునందు చేయు సన్నాహములు గాని తద్విషయమైన శ్రమలుగాని గణనార్హములు గానుండవు. కనుకనే "యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః" అని చెప్పబడియున్న ది. కనుక బంధవిముక్తి నిచ్ఛయించువారికి కామమయ శరీర మును (ఆస్ట్రిల్ బాడీని) సుష్ఠుగా చేసికొనుట కష్టముకాదు. కనుక శ్రద్ధతో ప్రయత్నము చేయవలెను.

## మనోమయశరీరము

ఆస్ట్రల్ బాడీని గురించి వ్రాసిన ప్రకారమే మెంటల్ బాడీ అను మనోమయశరీరమును గురించికూడ మందుడు, మధ్యముడు, శ్రేష్ఠుడు అను మూడువగలుగా వ్రాయవలయును.

ఆస్ట్రల్ బాడీవలెనే మెంటల్ బాడీలు కూడ సప్తవిధములైన ప్రకృతి యణువులతో కట్టబడియున్నవి. ఆస్ట్రల్ బాడీ యందలి స్పందముల వలెనే మెంటల్ బాడీ యందలి స్పందములుకూడ రంగులను కలుగజేయును. ఆస్ట్రల్ బాడీని చూచిన యోగదృష్టిగలవారలు ఆశరీరమును వహించిన జీవాత్మయొక్క స్థితిని కనుగొన్నట్లుగానే మెంటల్ బాడీని చూచు యోగదృష్టిగలవారలు జీవాత్మ ఎంతటి పదవిని చెందియుండునదియు కనుగొందురు. ఈ గ్రంథము, పూర్వభాగము, ౧౩౮ వ పుటయందు Lower Mental Body అను అశుద్ధమనోమయశరీరమును పెంచు విధాయకమును కొద్దిగా వ్రాసియున్నది.

అశుద్ధమనోమయ శరీరము అని నికృష్టమైన నామధేయము ఎందుకువచ్చినదని విచారించవలయును. “ అశుద్ధం కామసంకల్పజం ” అని యుపనిషత్తులలో చెప్పియున్నది. ఇక్కడ అశుద్ధత ఏది యని విచారించ వలయును. ఉపనిషద్వాక్యమునందు “ కామసంకల్పజం ” అని యున్నందున కామము అశుద్ధమని యెరుగవలయును. ప్రకృతమందు లోకులలో ననేకులు కామసంబంధములు కాని తలంపులను తలుచుట అసాధ్యముగా నున్నది. కామవర్జితములైన తలంపులు తలచుట చాల దుర్లభము. ప్రాయశః కామసంకలితములైన తలంపులు అశుద్ధతలంపులుగానే యుండును.

మెంటల్ ప్లేనునందు స్థూలాతిస్థూలము మొదలు నాలుగు సబ్ ప్లేనులయొక్క ప్రకృతి ఆస్ట్రిల్ ప్లేనుయొక్క ప్రకృతికి స్వభావమునందు సామీప్యము జెందియుండును. కనుక ఎంత ప్రయత్నము చేసినను పైచెప్పిన నాలుగు సబ్ ప్లేనులయొక్క ప్రకృతిచేత కట్టబడిన శరీరమునందు కామవివర్జితములైన తలంపులు రావు. కనుక ఈ మనోమయశరీరమునకు అశుద్ధము అను విశేషణ మన్వయించును. ఈ సందర్భమునందు ఈ గ్రంథము, పూర్వభాగము, ౧౩౮—౧౩౯ పుటలు చదువవలయును. మరియు అశుద్ధమనోమయ శరీరమువల్ల చేసిన కార్యముల ప్రయోజనముగా స్థూల దేహ పాతానంతరము మెంటల్ ప్లేనుయొక్క ఏడవ, ఆరవ, ఐదవ, నాలుగవ సబ్ ప్లేనులలో జీవాత్మ భోగానుభవమును పొందును అని యీ గ్రంథము, పూర్వభాగము, ౨౧౭ మొదలు ౨౭౧ వ పుట వరకును వ్రాయబడియున్నది. అచ్చట వ్రాసినప్రకారము ఏ యే విధమున మనస్సునుపయోగించినవారలు ఏ యే విధమయిన భోగముల ననుభవించినారని విమర్శించి అవగాహన చేసికొనవలయును. దీనియొక్క ప్రయోజనము అశుద్ధమనోమయశరీరముయొక్క వ్యవహారమును శుద్ధిచేయు నుపాయము.

అశుద్ధమనోమయశరీరమును కూడ ఆస్ట్రిల్ బాడీ వలెనే మూడు విధములుగా గమనించవలయును. మందుడు, మధ్యముడు, శ్రేష్ఠుడు అను భేదములతో నెరుగవలయును.

మందునియొక్క అశుద్ధమనోమయశరీరము

మందుడు కేవల పశుప్రాయుడు. ఆస్ట్రిల్ బాడీయే అతనికి చెదిరిపోయిన మేఘముల ముక్కలవలె నుండునని చెప్పినపుడు

మనోమయశరీరముయొక్క స్థితిని విచారించవలసిన అవశ్యమే యుండదు. ఇట్టివానికి కేవల రూపేర్పడని మనోమయశరీరమును కొంచెము లేశమాత్రముగా జ్ఞాపకశక్తియు కనబడును. ముందు జరుగబోవు సందర్భములను గురించిన ఆలోచనలు కూడ తోచవు. ఇట్టివాడు శరీరపాతానంతరము నామమాత్రమునకే స్వర్గలోకమునకు బోయి కొద్దికాలమే అచ్చటనుండి తిరిగి జన్మమునకు రాగలడు. వీని మనోమయశరీరములయందు అతి మందములైన స్పందములే కలుగును గనుక అందువలన కలుగు రంగులుకూడ చాల మడ్డిచాయ గలిగియుండును. ప్రతిజన్మమునందును కొంత కొంతగా వృద్ధిచెంది ఈ మందుడు కూడ మధ్యముని స్థితికి వచ్చును.

## మధ్యముని మనోమయశరీరము

ఇట్టివారే లోకమందు జనసామాన్యమునకు చేరినవారలు. బుద్ధికుశలత గలిగి నాగరికమునందు చాలదూరము ఎదిగినవారనుకొనువారు ఈ తరగతికి చేరినవారు. ప్రకృతకాలపు నాగరికము అనగా రాగద్వేషమయమై మోసము, డాంభికము మొదలగు అననుకూలములైన గుణములు కానవచ్చుచుండుటతో ఇతరులతో స్నేహముచేయు శక్తి గలిగి యున్నను ఆ స్నేహమువల్ల తనకు ఏ మాత్రము (స్వ) ప్రయోజనము కలుగును అను రహస్యమైన ఉద్దేశము కలిగి యుందురు. స్వప్రయోజనాభిలాష అధికము కాను కాను కపటము అధికమై తమ మనస్సునందు దాగియుండు ఉద్దేశమును ప్రకటన చేయకూడదను నిగ్రహశక్తి గలిగియుండువారు. ఇట్టివారు రాగద్వేషములచేత ప్రేరితులు గాకయే గ్రంథకాలక్షే

పము చేయగలరు. తర్కశాస్త్రము మొదలగు వాదిగ్రంథములను పఠియించి అందువలన నిశితమైన మనశ్శక్తి కలిగియుందురు. ఇట్టి వారియొక్క మెంటల్ బాడీ క్రమక్రమముగా రూపేర్పడి ప్రత్యేక ఉపాధిగా నుపయోగించు యోగ్యతను సంపాదించుటకు సిద్ధమగు చుండును. ఇకను కొంతకాలము సన్నాహముచే యీ శరీరము స్థిరపడిన పిమ్మట ప్రత్యేక ఉపాధిగా నుపయోగపడవచ్చును.

సంకల్పములన్నియు రూపములు చెందును అని యీ గ్రంథముయొక్క పూర్వభాగమునందు చెప్పబడియున్నది. భావపరివర్తనము, పరేంగితజ్ఞానము అను భాగములను ఇపుడు చదివిన యెడల చాల ఉపయోగముగా నుండును. ఒక్కొక సంకల్పరూపమునకును దానియొక్క స్వభావమును అనుసరించి రమ్యమైనదో అసహ్యమైనదో ఒక వర్ణము ఏర్పడును. మధ్యమునియొక్క మెంటల్ బాడీయందు పుట్టిన సంకల్పరూపములయొక్క వర్ణములు చాల రమణీయములుగ నుండును.

## శ్రేష్ఠునియొక్క మనోమయశరీరము

మందుడు, మధ్యముడుగా నుండినపుడంతయు చేసిన ప్రయత్నములవల్ల మనుజుడు అనేక జన్మములకు తరువాత శ్రేష్ఠుడుగా నగును. కనుక గ్రంథకాలక్షేపము, భగవద్ధ్యానము, పరోపకారచింత, ఇట్టి చర్యలను అభ్యసించుచు రాగా మనోమయశరీరము చక్కగా కట్టబడి, దట్టమై చాల మనోహరములగు రంగులుగలిగి యుండును. గరుకు అణువుల నాకర్షించు శక్తిగల రాజస తామస గుణములు శ్రేష్ఠునియందు చాల తగ్గిపోయియుండును. సత్త్వ

గుణ మభివృద్ధియగుచు రాగా దాని ప్రయోజనముగా సూక్ష్మములైన అణువులే ఆకర్షింపబడును. సూక్ష్మములైన అణువులయొక్క స్పందములు బహువేగము గలవిగా నుండును. వేగములుగల అణువులయొక్క రంగులు అధిక రమణీయములుగా నుండును. యోగదృష్టితో చూచువారు ఈ శరీరమునందలి గాఢమైన అణుసమూహము, అభిరూప్యము, మనోహరములైన సంకల్ప రూపములు, ఇవన్నియు చూచి ఈ శరీరమును ఉపయోగించు జీవాత్మయొక్క పెంపుపదవిని కనుగొందురు. లోయర్ మెంటల్ (Lower Mental) బాడీ అను మనోమయశరీరము (అశుద్ధమనోమయశరీరము) జన్మములు గడువను గడువను వృద్ధిపొంది ఏ విధముగా కనుబడునను వివరము ఇంత వరకును చెప్పబడియె. ఇక ప్రయత్నపూర్వకముగా అశుద్ధమనోమయశరీరమును అది యుండుస్థితినుండి పైస్థితికి తేవలసినందులకు ఉపాసకుడు ఎట్టి ప్రయత్నములను చేయవలెను అను వివరమును విచారించి తద్ద్వారా సౌష్ఠవమునుపొందు విధమును తెలియపరచవలయును.

సాధారణముగా నెఱుంగవలసిన విషయమొకటి కలదు. ఈ విషయమును ఇదివరకే చెప్పియుండినను మరల జ్ఞాపకార్థముగా చెప్పుట అవశ్యమని తోచుచున్నది.

(౧) Mental Body అనగా అశుద్ధమనోమయశరీరము మెంటల్ప్లేనుయొక్క స్థూలాతిస్థూలము మొదలు నాలుగు సబ్ప్లేనుల (Lower Mental Plane) ప్రకృతివల్ల కట్టబడినది.

(౨) ఈ శరీరమునందలి యణువులు జీవాత్మ తలంచిన తలంపులయొక్క స్వభావమును అనుసరించిన గుణములు, స్పందశక్తియు కలవిగా నుండును.

(3) సంకల్పముల స్వభావమును అనుసరించి మెంటల్ ప్లేను నందలి అణువులు మెంటల్ బాడీయందు చేరును. ఉన్నతములై, లోకహితార్థములు అయిన తలంపులు, దైవీసంపద్గుణముల విషయమైన తలంపులు, మరియు బుద్ధిస్ఫూర్తిని ఉద్రేకముచేయు తలంపులు, ఉన్నత స్వభావములుగల సూక్ష్మ అణువులను మెంటల్ బాడీకి లాగును. నీచమైన తలంపులు గరుకులైన అణువులను లాగును.

(౪) ఒక దినమున తలంచిన తలంపులనే ప్రతినిత్యమును తలంచుచువచ్చినయెడల మెంటల్ ప్లేనులోనుండి మెంటల్ బాడీయందు వచ్చిచేరిన అణువులు స్థిరముగా మెంటల్ బాడీయందు ఇముడును. అటుగాక నేడు కొన్నితలంపులను తలచి మరి పది దినములవరకును అట్టి తలంపులను తలువనియెడల మెంటల్ బాడీయందుచేరిన మంచి అణువులు ఆ శరీరమునందు నిలువక వాని యిష్టానుసారము పరుగెత్తిపోవును. కనుకనే యిట్టి అనుష్ఠానమును ప్రతిదినమును జరుపుచురావలెను.

(౫) దేహము గేహము వంటిది. ఇల్లు కట్టుకొనువాడు తాను సుఖపడుటకై ఎట్టి కట్టు, ఎట్టి పూత ఇవన్నియుచేర్చి యింటిని తన యిష్టానుసారముగా కట్టుకొనునో అదే విధముగా దేహియగు జీవాత్మకూడ తనకు ఏ శరీరము ఎట్లుండినయెడల తన యుద్దేశమునకు అనుకూలముగానుండునో అట్టి యణువులను తన శరీరములయందు చేర్చుకొనవచ్చును. ప్రయత్నపూర్వకముగా కృషిచేసి అట్టి మంచి అణువులను తన శరీరములయందు స్థాయిగా నిలుపుకొనవచ్చును.

కనుక నివృత్తిమార్గయాత్రాపరుడు యుక్తిని ఉపయోగించి తన శరీరములను సుష్ఠుగా చేసికొనుటకు ప్రయత్నించవలయును. ప్రతిజన్మమునందును ఉపాసకుడు చేయుచువచ్చిన సచ్చింతనమును అనుసరించి మెంటల్ బాడీ పెద్దదవుచువచ్చును. అనగా నిలువు వెడల్పులు అధికమగుచుండును. జీవాత్మయొక్క సుగుణముల ధికము కానుకాను మెంటల్ బాడీ స్థూలశరీరము "తందిలస్తుందిభ స్తుందీ బృహత్కుక్షిః పిచండిలః" అనినట్టు పొట్టగలవానియొక్క స్థూల శరీరము బహుదొడ్డదైనట్టు పెరుగుచువచ్చును. మెంటల్ బాడీ యొక్క పెంపుకు సాధనములు తలంపులు. మనయుక్తిని చురుకుగా చేసియు, చిత్రపటములు మొదలైనవి వ్రాసియు, శమము, విచారము, సంతోషము, సాధుసంగము, భూతానుకంప, ప్రియవాదిత మొదలగు సుగుణముల నభ్యసించియు, దినేదినే మనము మన మెంటల్ బాడీని పెంచుచుందుము. శ్రవణమననములవల్ల ఏర్పడిన శక్తిచే నితరుల అభిప్రాయములను అంతగా నంగీకరించక జాగరూకతతో మన అభిప్రాయములనే ఏర్పరుచుకొనుచు మహాగ్రంథములను వ్రాసిన వారి బుద్ధిచాతుర్యముతో సమానమైన చాతుర్యమును సంపాదించితే మెంటల్ బాడీ పెరుగును. సదా ఉపయోగించుచుండు ఆయుధములు పదునుగానుండును. ఉపయోగించక మూలపడవైచిపెట్టినవి తుప్పుపట్టి చెడిపోవును. అదే విధముగా మెంటల్ బాడీని ఉపయోగించి మననము చేయుచు రాను రాను అది మహా వీర్యవంతమగుచుండును. ఈ గ్రంథము, పూర్వ భాగమునందు ౧౩౯ వ పుటయందు చెప్పిన ప్రకారము మన తలంపులు అని మనము అనుకొనువాట్లలో సగము ముప్పాతిక

పాలు ఇతరుల తలంపులు. ఇట్టి పిలువని పేరంటాలను మన మెంటల్ బాడీయందు చొరనీయ కూడదు.

చతుర్ముఖబ్రహ్మకు పురాణములయందు ‘మానసధ్యాని’ యని పేరుపయోగింపబడియున్నది. అనగా సృష్టియొక్క ఆదియందు మనసా చింతించి మానసపుత్రులనును, ప్రజాపతులనును, సృష్టినంతయును సృష్టించినారట కావున మానసధ్యాని యని పేరు పొందిరి. అదేవిధముగా మనమును మానసధ్యానులు కావలయును. ప్రయత్నపూర్వకముగా మంచితలంపులను స్థిరపరుచుకోవలెను. చెడుతలంపులను తరుమగొట్టవలెను. ఇది యొక అనుష్ఠానముగా నుంచుకొని ప్రతినిత్యమును అభ్యసించుచుచావలెను. ఈ అనుష్ఠానమువల్ల మెంటల్ బాడీ మంచితలంపులనే తలంచు నభ్యాసమును వహించును. పండితులను పండితులే స్నేహింతురు, పామరులను పామరులే స్నేహింతురు. కనుక మంచితలంపులనే తలంచు వాసనను అభ్యసించిన మెంటల్ బాడీయందు వానియందుండు మంచి తలంపులకంటె నతి స్వచ్ఛములైన సంకల్పములు ప్రవేశించును. దుష్టతలంపులు సమీపించను కూడ సమీపించవు. ఈ అనుష్ఠానమువల్ల దినే దినే మనోమయశరీరము పెరుగును. కాంతిమంతమవును. వీర్యవంతమగును. ఇట్టి ఉపాసకుడు మరణముచెంది ఊర్ధ్వలోకములలో ఈ గ్రంథము, పూర్వభాగము, ౨౫౫ మొదలు ౨౭౧ వ పుటవరకును చెప్పినప్రకారము భోగానుభవమును పొంది లాభము చెందును.

మెంటల్ బాడీని పెంచుటయందు మరియొక సాధనము చిత్తైకాగ్రత నభ్యసించుట. అనగా మనస్సును “తత్సర్వవ్యాపకం

చిత్తం ఆకృష్య ఏకత్ర ధారయేత్ ” అనినట్టు గంతులు వేయు మర్కట స్వభావముగల మనస్సును నిగ్రహించి ఒక వస్తువుపైన నిలిపి అచ్చటనుండి కదలనీయక నిర్ధారణచేయుట.

చిత్తమేకం న శక్నోతి జేతుం స్వాతంత్ర్య వర్తియత్ :
ధ్యానవార్తాం వదన్మూఢః స కిం లోకేన లజ్జతే ॥

(జ్ఞానవాసిష్ఠము)

స్వేచ్ఛగా ప్రవర్తించు స్వభావముగలదియు ధ్యానయోగము నభ్యసించబోవువాడు ముఖ్యముగా వశీకరించుకోవలసిన వాట్లలో ముఖ్యమైనదియునగు మనస్సును స్వాధీనము చేసికోలేకయే ధ్యానయోగముచేయు క్రమము తనకు తెలిసినట్లు మాటలను మాత్రము చెప్పుచు విచారించిన నేమియు తెలియని మూర్ఖుడు తానొక పురుషుడని డంభమాడుట కేల సిగ్గుపడడో.

విషయేభ్యస్సమావృత్త్య విజ్ఞాతాత్మా మనో మునిః ।
చింతయే న్ముక్తయే తేన బ్రహ్మభూతం పరేశ్వరం ॥
ఆత్మభావం నయత్యేనం తద్బ్రహ్మ ధ్యాయినం మునే ।
వికార్య మాత్మనశ్శక్త్యా లోహమాకర్షకో యథా ॥

(విష్ణుపురాణము)

ఆత్మస్వరూపజ్ఞానేచ్ఛగల యోగి మనస్సును విషయములయందు నుండి మరలించి అందువలన స్వాధీనమైన మనస్సుచేత సంసార విముక్తి కొఱకు పరమేశ్వరుని ధ్యానము చేయవలసినది. ధ్యేయమూర్తి అపుడు సూదంటురాయి సూదిని ఆకర్షించినట్టు ఉపాసకుని తనవద్దకు లాగికొనును.

ఇంతే కాక ఎప్పటికైనను మనస్సును తన యిష్టము వచ్చినట్టు ఒక విషయమునుండి మఱియొక విషయమునకు స్వేచ్ఛగా పోనీయకూడదు. మనమే ఇచ్ఛయించినట్టు మన స్సును ఏ విషయమును గురించి చింతించమందుమో, ఏ విధము గా ఎంతకాలము చింతించమందుమో ఆరీతిగా చింతించునట్టు సిద్ధపరచవలయును.

ఉదాహరణము :—

రాజవిద్యా రాజగుహ్యం పవిత్రం ఇదముత్తమం ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం కర్తుం సుసుఖ మవ్యయం ॥

అను శ్లోకమునందు చింతనకు రాజవిద్యా అని ఏల పేరువచ్చినది.

రాజగుహ్యం అని యెందుకుగా చెప్పబడినది.

పవిత్రం ఎందువల్ల అపవిత్రము కాదు.

ఉత్తమం ఎందువల్ల ఉత్తమము. ఇంతకంటె ఉత్తమమైన విద్యలు లేవా.

ప్రత్యక్షావగమం ఎట్లు ప్రత్యక్షావగమము. మిగతవిద్యలు ప్రత్యక్షావగమములు కావా.

ధర్మ్యం యోగములన్నియు ధర్మ్యములే కావా.

ఈ విధమున తర్కించి చింతించి జవాబులు సమాధానము లు వెదకికొనుచు మననముచేయు వాడుక ఏర్పడవలయును. ఇట్టి మననమువలన అశుద్ధమానసశరీరము (Lower mental Body) నందు ఉన్నత తరహా అణువులుచేరి వానియొక్క స్పందశక్తిచేత రమణీయములైన రంగులును శరీరముయొక్క బింబము అభిరూప్యము చెందుటయు బింబము పెద్దదగుటయు సందర్భించును. ఈ విధ

ముగా అశుద్ధమానసశరీరము ప్రత్యేక ఉపాధిగా జీవాత్మ ఉపయోగించుటకు సిద్ధమగును.

శుద్ధమానసశరీరము

మెంటల్ప్లేనుయొక్క సూక్ష్మ, సూక్ష్మతర, సూక్ష్మాతి సూక్ష్మ అణువులతో కట్టబడి జీవాత్మకు అనగా ప్రాజ్ఞాత్మకు ప్రథమోపాధియైయుండును. తైజసవైశ్వానరుడు (Lower Self) అనువాడు సంపాదించిన అనుభవములన్నియు జన్మజన్మమునందును ప్రాజ్ఞాత్మనుచెంది ప్రాజ్ఞాత్మవృద్ధిపొందుచు వచ్చును. ఇట్లు వృద్ధిపొందుచు జీవాత్మ సర్వజీవాత్మైక్యజ్ఞానమును సంపాదించి జ్ఞానదీక్షను చెంది బుద్ధిక్ బాడీ (Buddhic Vehicle) ని సంపాదించువరకు శుద్ధమానసశరీర ముపయోగించుచుండును.

దేహములను సుష్ఠుచేసికొనుట అనుట ఒక యోగభాగము. ఇంతమాత్రముననే దూరశ్రవణ దూరదృష్టి అను మొదలుగాగల సిద్ధులు చేకూడివచ్చును. కనుక సిద్ధులనుగురించి కొద్దిగా వ్రాయవలయును.

యోగసిద్ధులు

శరీరములను శుద్ధిపరుచుకొనుటకు యోగము అని పేరు. యోగముయొక్క అంగము అయిన నాడీశోధనమువల్ల శరీరమునందు గల తామస రాజస అణువులన్నియు రాలిపోయినందున మిగిలియున్న సాత్త్విక అణువుల శక్తివల్ల యోగి స్పందమయంబైన లోకంబునందు సూక్ష్మస్పందములను గ్రహించుశక్తిని సంపాదించుకొనును.

స్వరములన్నియు వర్ణములన్నియు వస్తుతః స్పందములే యని వ్రాయబడియె. ఈ గ్రంథము, పూర్వభాగమునందు తెల్ల వర్ణమును ప్రకృతిశాస్త్రజ్ఞులు పగలదీసి ఏడు వర్ణములుగా కను పరిచియున్నా రని ప్రస్తావించబడియె.

నేత్రేంద్రియమునకు వర్ణములు విషయములు. వర్ణములు ఏడు విధములు. (౧) ఎరుపు red, (౨) గౌరవర్ణము orange, (౩) పసుపు yellow, (౪) పసురు green, (౫) నీలము blue, (౬) గాఢనీలము indigo, (౭) ఊదావర్ణము violet. పృథ్వీ తత్త్వపు అంతర్భాగములైన వాయు ఆకాశ తత్త్వములయందు పరమేశ్వరునియొక్క "బహుస్యాం" అను స్పందము ప్రవేశించి నందువల్ల కలిగిన చిల్లరస్పందములయొక్క వేగములను అనుసరించి ఎరుపు మొదలు ఊదావర్ణమువరకును గల వర్ణములు ఏర్పడును. వర్ణములను కలుగజేయు స్పందములు చక్షురింద్రియగోళములైన నేత్రములను స్పర్శించి వర్ణములుగా కనబడును. ఒక విగడియకు ఎన్ని స్పందములు అని లెక్కించుట వాడుక. ఉదాహరణముగా అవగాహనార్థము ఒక లెక్కను ఉపయోగింతము. ఒక విగడియకు లక్షస్పందములు కలిగితే అవి ఎరుపువర్ణముగా నేత్రములకు అగు పడును. ఒక విగడియకు రెండులక్షలస్పందములు అయిన యెడల అవి నేత్రములకు గౌరవర్ణముగా కనబడును. ఒక విగడియకు మూడు లక్షల స్పందములుగా నుండిన యెడల పసుపు వర్ణముగా నగుపడును. ఒక విగడియకు నాలుగు లక్షల స్పందములుగా నుం డిన యెడల పసురు వర్ణముగా నగుపడును. ఒక విగడియకు ఐదు లక్షల స్పందములుగా నుండినయెడల నీలవర్ణముగా నగుపడును.

ఒక విగడియకు ఆరు లక్షల స్పందములుగా నుండినయెడల గాఢ నీలవర్ణముగా నగుపడును. ఒక విగడియకు ఏడు లక్షల స్పందములైన యెడల ఊదావర్ణ మగుపడును. ఈ విధముగా వర్ణములున్నవి. ఇన్ని వర్ణములును ఇంద్రధనుస్సునందు కనబడును. వర్షఋతువునందు సూర్యుని కిరణములు మేఘములపైన పడినపుడు ఇంద్రధనుస్సు ఏర్పడును. దానియందు పైచెప్పిన ఏడువర్ణములనును చూడవచ్చును. సూర్యుడు సప్తాశ్వములు గలవాడని వాడుక. అగ్నికి

> కాళీ కరాళీ చ మనోజవా చ సులోహితా యా చ సుధూమ్రవర్ణా ।
> స్ఫులింగినీ విశ్వరూపీ చ దేవీ లేలాయమానా ఇతి సప్తజిహ్వాః ॥

అని యేడు జ్వాలలు. సూర్యుడు ప్రకాశము నిచ్చువాడు. అగ్నియు ప్రకాశము నిచ్చువాడే. ప్రకాశమునందు ఏడు వర్ణములున్నవని పై మంత్రము సూచించుచున్నది అని అనుకొనుచున్నాను.

వర్ణములను కలుగజేయు స్పందములకంటె మందములైన స్పందములు శబ్దమును కలుగజేయును. శబ్దము కూడ ఏడు విధములుగా నుండును. సంగీతశాస్త్రమునందు ఉపయోగించు స్వరములు స. రి. గ. మ. ప. ధ. ని. అనునవి ఏడును శబ్దముల యొక్క మార్దవమునందు ఆరంభించి స్తంభనమునకు మెట్టుమెట్టుగా వెళ్లును. స. స్వరమునకు కావలసిన స్పందముల కన్న చాల అధికముగా రి. స్వరమునకు కావలయును. ఇదే ప్రకారముగా పూర్వస్వరమునకంటె అధికమైన స్పందములు ఉత్తరోత్తరస్వరములకు కావలయును. ని. అను స్వరమునకంటె అనేక అంతలు వేగ

ములైన స్పందములు శబ్దములను కలుగజేయలేక వర్ణములలో మందమైన ఎరుపువర్ణమును కలుగజేయును.

పాము ముదిరితే గ్రద్ద అగును అని లోకోక్తి కలదు. మంచిపాముకు వేయి సంవత్సరములు ఆయుస్సు అనియును అట్టి కాలము ముగియునప్పటికి పాముయొక్క నిడివి తగ్గుచువచ్చి రెక్కలు పుట్టును అని లోకోక్తి. ఆ విధముగా శబ్దము ముదిరితే వర్ణము అగును. అయితే మనుష్యులయందు శబ్దమును గ్రహించు ఇంద్రియము చెవి. వర్ణమును గ్రహించునది కన్ను. పాములకు చూపుకును వినికికిని కన్ను ఒకటే అవయవము అని లోకోక్తి.

యోగశక్తివల్ల సూక్ష్మశ్రవణము లేక దూరశ్రవణము అను సిద్ధియు సూక్ష్మదృష్టి లేక దూరదృష్టి అను సిద్ధియును కలుగును.

శ్రోత్రేంద్రియముకంటె చక్షురింద్రియము అతి వేగముగా పనిచేయును. దూరమున కలుగు శబ్దమును గ్రహించుటకు కొంత తడవు కావలయును గాని దూరమునందుండు వెలుతురును అతి త్వరగా గ్రహించుట వాడుక. పెండ్లిండ్లు ఉత్సవములు మొదలగు సందర్భములయందు బాణవేడుక జరుగును. అపుడు బాణవేడుక జరుగు స్థలమునందు ఉండువారు బాణము చిట్లిన శబ్దము ఢమాలు మని వినిన వెంబడే ఫళిచ్చు మని బాణముయొక్క వెలుతురును ఉత్తరక్షణమునందు చూచుదురు. సమీపమందుండువారికి నక్షత్ర బాణము చిట్లిన శబ్దమును బాణములోని నక్షత్రముల వెలుతురును ఏకకాలమందే గ్రాహ్యము. అదే బాణమును ఒక మైలుదూర మున నుండి చూచువారికి ఆకసమునకు ఎగిసిన నక్షత్రముల వెలుతురు కనబడి ఆ నక్షత్రములు మాసిపోవుచుండగా బాణము

చిట్లినధ్వని వినబడును. దీని వాస్తవము ఏమి? శబ్దమును కలుగ జేసిన స్పందములు ఒక మైలుదూరమునకు ప్రయాణము చేయు టకు కావలసిన కాలములో అర్ధకాలమునందే నక్షత్రములను పుట్టించిన వెలుతురు ప్రయాణముచేయును. వాతావరణ సముద్ర మందు శబ్దపు అలలు నిదానముగానును వెలుతురుయొక్క అల లు చురుకుగానును ప్రయాణము అగును అని చెప్పుటకు ఇది రుజువు.

అతిచురుకుగా పోవు అలలు చక్షురింద్రియముచేత గ్రహిం చబడును. యోగమునందు పరిశ్రమముచేయని సాధారణజనుల నేత్రములు అనేకతరగతులుగా నుండును. సూక్ష్మగ్రాహినేత్రము లు కొందరికి. మందగ్రాహినేత్రములు కొందరికి. ఎరుపువర్ణమును చూచి పసుపువర్ణము అని భ్రమపడు నేత్రములు కొందరికి. ఈ విధము చూపులో తారతమ్యములు కలవు. పైన చెప్పినరంగుల పైకి ఎరుపురంగుకంటె మందమైన రంగులును కలవు. ఊదావర్ణ మునకంటె చురుకైన రంగులును కలవు. సాధారణముగా జన సమూహము గ్రహించగల రంగులు పైన చెప్పిన ఏడు అని యెరుగవలయును.

సప్తవర్ణములకు వేరుగానుండు ఇతరవర్ణములగు (ultra violet) ఊదావర్ణమును దాటిన వర్ణములనును, ఎఱ్ఱవర్ణమునకు క్రింది వైన (infra red) వర్ణములనును స్వభావజన్య నేత్రములతో చూడ గలవారు కొందరు మనుష్యులున్నారు. అట్టి వారల నేత్రేంద్రియ ముల నరములకు సూక్ష్మస్పందములను గ్రహించుశక్తి పుట్టుకతో కూడ వచ్చియున్నది అని యెరుగవలయును.

రంగులను చూచుశక్తి మనుష్యులలో వ్యత్యాసపడియుండు నట్టుగానే శబ్దములును వినునట్టి శక్తికిని తరగతు లేర్పడియుండును. సారిణితంతెను మీటినపుడు ఇతరులు వినలేని కొన్నిశబ్దములను కొందరు వినగలరు. మందరమునందు కూడ కొందరు వినలేని స్వరములను కొందరు వినగలరు. మరియు గబ్బిలములు వేయు సూక్ష్మకేకలను కొందరు వినగలరు. అదేశబ్దమును చాలమంది వినలేరు. ఇందువల్ల మన మెరుగతగిన దేమనగా మనుష్యుల ఇంద్రియముల శక్తులు అందరికిని ఒకటే విధముగా నుండవు అనిన ముఖ్యమైన విషయము.

యోగశక్తిలేని మనుష్యులకు స్వభావజన్యముగా (సూక్ష్మ) దూరదర్శన శక్తి కొందరికి కలదు. ఎరుకలవారలు, ఏనాదివారలు, విద్యాహీనులైన కొందరు కొండలయందు నివసించు చెంచులు మొదలగువారికి ఈ శక్తికలదు. మరియు పిల్లి, కుక్క, గుఱ్ఱము మొదలగు మృగములకు కూడ ఈ శక్తికలదు. మృగములకును క్రొత్తగా మనుష్యశరీరములను సంపాదించుకొనిన జీవాత్మలకును ఈ శక్తియొక్క అతిస్థూల స్వభావమైన భాగము స్వథాగా కలదు. ఎరుకలవారు గద్దెలు చెప్పుదురు. మనకు ఇది అనుభవమువల్ల తెలిసియున్నది. వారలు చెప్పుగద్దెలలో కొన్ని నిజము గాకపోవును. మరియు మనుష్యులు భయంకరమైన ఏవస్తువునును చూడని స్థలము నందు గుఱ్ఱము ఏదో ఒక చూపును చూచి బెదురును. గుఱ్ఱపు సవారి చేయువారికి ఈ అవస్థ అనుభవమే. బెదురుస్వభావములేని గుఱ్ఱము మనము చూడని యేదో ఒక వస్తువును చూచినట్లు ఉలికి పడి అపుడు సవారిచేయుచుండు మన చేతికళ్లెము ఊడిపోవునట్టు

ఎగిరిపడును. ఇందుకు గుఱ్ఱమునకు గల సూక్ష్మదృష్టియే కారణము. ఇదేవిధమున పిల్లియు, కుక్కయు కూడ బెదురును. ఈ తరహా (సూక్ష్మ) దూరదృష్టిని మనము గమనించవలసినది లేదు. ఈ తరహా దృష్టి మనుష్యులయందు నాగరికము అధికము కాను కాను మరిగిపోవును.

యోగసిద్ధులలో నొకటియైన (సూక్ష్మ) దూరదృష్టినిగురించియే ఇపుడు విచారించవలయు నని యుద్దేశము.

సూక్ష్మదృష్టి యనగా ఫిజికల్ ప్లేనునందు కాక సూక్ష్మములైన ఆస్ట్రిల్ ప్లేనునందును, మెంటల్ ప్లేనునందును ఉండువస్తువులనుగాని జరుగు చర్యలనుగాని చూచునట్టి శక్తి. స్థూలమైన భూలోకమునందు ఇకముందు జరుగబోవు సంగతులు అంతకుపూర్వము అనేక కాలమునకు మునుపే ఆస్ట్రిల్ ప్లేనులోనును అంతకంటె మరికొంత అధిక కాలమునకు మునుపే మెంటల్ ప్లేనులోనును సంభవించును. ఈ విషయమునుగురించి శ్రీమద్భగవద్గీత, ౧౧ వ అధ్యాయమునందలి శ్లోకముల కొన్నిటిని చదివి మననము చేయవలయును.

(౧) "మయైవైతే నిహతాః పూర్వమేవ"

(౨) "కేచిద్విలగ్నా దశనాంతరేషు సందృశ్యంతే చూర్ణితైరుత్తమాంగైః"

(3) "తథా తవామీ నరలోకవీరాః విశంతి వక్త్రాణ్యభివిజ్వలన్తి"

అని మొదలగు శ్లోకములను మననము చేసినయెడల భూలోకమునందు అదివరకును జరుగకుండు సంగతులు ఆస్ట్రిల్ ప్లేనులోనును

మెంటల్ ప్లేనులోనును జరిగి అయిపోయినవని యెరుగవచ్చును. మరియొక పరీక్ష. ఛాయాపురుషలక్షణము అని యొక విచారము కలదు. అనుభవజ్ఞులు చెప్పుట ఏమనగా—స్వదేహఛాయయందు ఎవనికైనను ఏదో ఒక అంగము కనుపడదట. తల కనుబడకుండా తన దేహఛాయను ఒకడు చూచితే ఇక ఆరుమాసములలో అతడు చనిపోవునట. ఇట్టి విషయములయొక్క రహస్యమును విచారించితే సూక్ష్మలోకములయందు అనేక దినములకుముందు అతని మరణము సంభవించినదని కదా అర్థము.

ఫిజికల్ ప్లేనులో ఇండ్లు, దేవళములు మొదలగునవి కట్టబడి యుండునట్టుగానే భూలోకమునందు నడిచిన సంగతుల బొమ్మలు (పొటగ్రాపులు) ఆస్ట్రల్ ప్లేనులో నిలిచియుండును. స్థూల శరీరము అనేకవేల సంవత్సరములగా పెరిగి పెరిగి ఇంద్రియగోళముల యందు పృథివిఆకాశతత్త్వమునందలి సూక్ష్మాంశములు ఇముడుచు వచ్చినవి! ఆకాశతత్త్వముయొక్క సూక్ష్మాంశములు ఇంద్రియ గోళములలో ఎంతకెంత అధికముగానుండునో అంతకంతగా ఇంద్రిములు సూక్ష్మాంశములను గ్రహించును. నేత్రేంద్రియమునందు పృథివిఆకాశతత్త్వపు (Ether) సూక్ష్మాంశములు అధికము కానుకాను సూక్ష్మ దృష్టిజనియించి ముదురుచువచ్చును. అదేవిధమున శ్రోత్రేంద్రియగోళమైన చెవియందుకూడ ఆకాశ (Ether) తత్త్వపు సూక్ష్మాంశములు అధికము అయ్యేకొద్ది చెవి సూక్ష్మ శబ్దములను గ్రహించును. ఇది మన అనుభవములో తెలసియున్నది.

అందరును గ్రహించలేని విషయసూక్ష్మములను కొందరు కేవల స్థూలశరీరమందలి ఇంద్రియగోళములతో గ్రహించగలిగి

యుంటే ఆస్ట్రిల్ బాడీని సుష్ఠుగా జేసికొని ఆ మూలకముగా సుష్ఠు అయిన ఫిజికల్ బాడీ (స్థూలశరీరము) ని సంపాదించుకొని ఆస్ట్రిల్ బాడీకిని ఫిజికల్ బాడీకిని అన్యోన్యసంబంధమును అధికముగా నేర్పరచుకొనియుండువారు స్థూలశరీరమందే ఉండి జాగ్రదవస్థలో ఆస్ట్రిల్ బాడీయందలి యింద్రియములతో విషయములను గ్రహించుట యేమి అరుదు.

ఇంతేకాక మనోమయశరీరములనుకూడ సుష్ఠుపరుచుకొని తద్ద్వారా మనోమయశరీరమునకును ఆస్ట్రిల్ బాడీకిని అన్యోన్య సంబంధము నేర్పరుచుకొనియుండువారు తమకు ఇదివరకే ఆస్ట్రిల్ బాడీకిని ఫిజికల్ బాడీ (స్థూలశరీరము) కిని ఆన్యోన్యత యేర్పడియున్నది గనుక స్థూలశరీరమందు జాగ్రదవస్థయందే ఉండియు ఆస్ట్రిల్ బాడీతో ఇచ్ఛవచ్చినట్టు ఆస్ట్రిల్ ప్లేనులోని సంగతులను మెంటల్ బాడీతో మెంటల్ ప్లేనునందు గల ఫొటగ్రాపులను చూడగలరు అనుటయందు అతిశయోక్తి యేమియున్నది. చదువరులరా, దయచేసి వినండి. యోగశాస్త్రములయందు చెప్పిన నాడీ శోధనమును సాధించినా సరే, యీ గ్రంథమునందు ఇదే అధ్యాయమునందు చెప్పిన దేహముల సౌష్ఠవమును సాధించినా సరే జాగ్రదవస్థయందే స్థూలశరీరమునందు నిలిచియుండియే ఆస్ట్రిల్ ప్లేనులోనుండు ఫొటగ్రాపులను మెంటల్ ప్లేనులో ఉండు ఫొటగ్రాపులను ఇచ్ఛామాత్రమున చూడవచ్చునండీ. ప్రయత్నము చేసితిరంటే మీకు మీరలే సాక్షులగుదురు. ఈ విషయమందు జైగీషవ్యోపాఖ్యానమును చదువుడు. దేహసౌష్ఠవమును అనుష్ఠించుచువచ్చినందువల్ల దేహములయందలి తామసరాజస

అణువులు రాలిపోయి సాత్త్విక అణువులు మాత్రము నిలుచును. కనుక ఆకాశసూక్ష్మ అణువులు శరీరమందలి ఇంద్రియగోళముల యందు చేరును. అప్పటికి సూక్ష్మ (దూర) శ్రవణము, సూక్ష్మ (దూర) దృష్టియును ఇంక ననేక శక్తులును గలుగును. ఈ శక్తుల నే సిద్ధులు అని వాడుదురు. ఈ శక్తులు కలుగుట ఏమి అతిశయము కాదు.

శ్రద్ధాహీనము, అపనమ్మకము, దురభిమానము, ప్రమాదము ఇట్టి అవస్థలవల్ల దేహసౌష్ఠవమునందు కావలసినంత ప్రయత్నము చేయలేము గాని చేసినయెడల ఆస్ట్రల్ ప్లేనుయొక్క దృష్టి కలుగుననుట అతి నిశ్చయము. ఈ సిద్ధిని సంపాదించుట కుపాయములను ఈ విషయముయొక్క చివరను సంగ్రహముగా వ్రాయబోవుచున్నాను. ప్రకృతమందు దూరశ్రవణ దూర దర్శనములు ఎన్నితరహాలగా నుండును అను విషయమును విచారించ వలయును.

దూర (సూక్ష్మ) దర్శనము, శ్రవణము మూడు విధములుగా నుండును.

౧. సాధారణ దూర (సూక్ష్మ) దర్శనము, శ్రవణము,

౨. దిక్ సంబంధి దర్శనము, శ్రవణము,

3. కాలసంబంధి దర్శనము, శ్రవణము,

అని మూడు విధములు. ఈ మూడు విధముల దూర దర్శనము (సూక్ష్మ దర్శనము) లలో ఒక్కొక విధమును గురించియు కొంత వ్రాయబడును.

“బహుస్యాం” అను స్పందము యొక్క ఫలితముగా అది వరకును అఖండమూర్తిగా నుండిన సచ్చిదానందమూర్తికి రెండు

బంధములు కలిగినవి. "దిక్కాలాద్యనవచ్ఛన్న చిన్మాత్రానంత మూర్తయే" అని యొక ధ్యానశ్లోకార్థము కలదు. దిక్కు, కాలము అనునవి పరమేశ్వరునియొక్క "బహుస్యాం" అను స్పందముయొక్క పరిణామములు. దిక్ అనగా ఇంగ్లీషుభాష యందు స్పేస్ (Space) అను పదము. కాలము అనగా ఇంగ్లీషు భాషయందు టైమ్ (Time) అను పదము. దిక్కాలములు ఇంగ్లీషు భాషయందు Space and Time అని వాడబడును. ఇవి రెండును ఆదిబంధములు.

దిక్ అనగా తూర్పుకాదు, దక్షిణముకాదు, పడమర కాదు, ఉత్తరముకాదు, ఆగ్నేయముకాదు, నిరుఋతిమూల కాదు, వాయవ్యముకాదు, ఈశాన్యమును కాదు. ఇవన్నియు ప్రత్యేక ప్రత్యేకములుగా కాకపోయినను అన్నియును కలిసి ఈ యెనిమిదింటితో కూడ ఊర్ధ్వము, అధస్సు, అవాంతరము అను నవి యన్నియు నగు పదునొక్కండు దిశలును సముదాయముగా దిక్ అను పేరునకు అన్వయించును.

కాలము అనగా భూతకాలము మాత్రము కాదు, భవిష్యత్కాలము మాత్రము కాదు, వర్తమాన కాలము మాత్రముకాదు. నిరంతరముగా భూతభవిష్యద్వర్తమానముల మించి భూతభవిష్యద్వర్తమానములకు మాతృవత్తుగానుండు నిరంతరత. దీని శక్తికి చిక్కని వ్యక్తులే లేవు. పరబ్రహ్మము తప్ప ఈశ్వరుడు మొదలు అనామధేయమైన నుశి పురుగు వరకును దిక్కాలము లను బంధములకు లోపడినవి. ఈ ముఖ్యాంశమును జ్ఞాపకముంచుకొని యుండవలయును.

## మొదటితరగతి దైన సాధారణ (దూర) సూక్ష్మ దర్శనము

అనునది అంతవిశేషమును అపురూపమును అయిన సిద్ధి కాక పోయినను సిద్ధి ఏమో సిద్ధియే. ఫిజికల్ ప్లేను అను భూలోకము ఆస్ట్రిల్ ప్లేనుకంటె విస్తీర్ణమునందు చిన్నది అనియును ఫిజికల్ ప్లేను అను గోళములో నిడివిన వెడల్పున ఉన్నతమున లోతున అన్ని పార్శ్వములయందును ప్రవేశించి ఫిజికల్ ప్లేను అను భూగోళము నందుండు ప్రతి అణువునును ఆవరించుకొని ఆ అణువును ప్రవేశించి ఆస్ట్రిల్ ప్లేను ఉన్నదనియు నిదివరకు చదివినసంగతిని జ్ఞాపకమునకు తెచ్చుకోవలయును. మరియు ఆస్ట్రిల్ ప్లేనునందు భూలోక వాసులు అయిన ధాతుతరుగుల్మలతాదులయొక్కయు మృగములు మనుష్యులు మొదలగు అందరియొక్క ఆస్ట్రిల్ బాడీలుండుట యే కాక భూలోకమందు మరణావస్థను చెంది స్థూలశరీరమును పోగొట్టుకొనిన మనుష్యులు మృగములు అందరును ఆత్మవిచారము, పూర్వభాగమునందు చెప్పిన చంద్రాత్మవర్గమంతయును మరియును అనేకకోట్ల లెక్కగల అదృశ్యచేతనములును నివసించుచున్నవి. సాధారణ సూక్ష్మ (దూర) దృష్టి అను సిద్ధికలిగినపుడు తన సమీపమందు తనచుట్టును ఆస్ట్రిల్ ప్లేను నందుండు చేతనములను కనుగొను శక్తివచ్చును.

క్రొత్తగా పుట్టినబిడ్డ భూలోకమునందుగల వస్తువులను తన సమీపమందుండు వానిని మాత్రమే చూడగలదు. ఆ చూచిన వస్తువులయొక్క తత్త్వమును కూడ కనుక్కొను శక్తికలిగియుండదు. అదేవిధముగా ఆస్ట్రిల్ ప్లేనుయొక్క దృష్టి, శ్రవణము అను సిద్ధులను క్రొత్తగా సంపాదించిన ఉపాసకుడు కూడ తన సమీప

మందు ఉండు వస్తువులను, చేతనములను కనుగొనును. అస్ట్రిల్ ప్లేనులోనే అతిదూరమందుండు చేతనములను గాని ఫొటగ్రాఫు లనుగాని భూతభవిష్యద్వర్తమానముల బొమ్మలనుగాని కనుక్కొను శక్తి యిదివరకు రాలేదు. ఈ తరహా దూర (సూక్ష్మ) దృష్టిని సంజ్ఞార్థముగా లేత దూర (సూక్ష్మ) దృష్టి అని చెప్పెదము. ఈ లేత దృష్టితో చూడను సాధ్యమైన కొన్ని విధములను వివరించు చున్నాము. చూచుశక్తితో వినునట్టి శక్తికూడ కలిసియుండును.

౧. ఈ దృష్టికి కనుపడు వస్తువులన్నియు అద్దముతో చేసిన వస్తువులవలె కనుపడును. చక్కగా ఒక అంగుళముదళము గల అద్దముతో చేసిన పెట్టెలోని వస్తువులను మనము భూలోకపు దృష్టి తో ఏ విధముగా విశదముగా చూడగలమో అదేవిధముగా నొక తలుపు మూయబడియున్న గదిలోనుండు వస్తువులు ఇట్టివి, ఇట్టివి అని కనుగొనవచ్చును.

౨. లకోటా చేసి మూయబడియుండు కవరులోనుండు కాకితముల యందు వ్రాసియుండు విషయములను చదువవచ్చును.

౩. మూయబడియుండు పుస్తకములో ఏదో ఒక పుటలో ఏమి అచ్చువేయబడియున్నది అను విషయమును చదువవచ్చును.

౪. తేటనీళ్ల కొలనులో ఇద్దరుమనుష్యుల లోతున నీళ్ల క్రింద ఉండు గవ్వలను మనము కనుక్కోగలము కదా. అదే విధమున మనము నిలపడియుండు భూమిని చూచినయెడల అనేక గజములలోతువరకును చూచి అక్కడ ఉండు ఊటలు, రాళ్లు, గనులు, రత్నములు మొదలగువానిని అతి వివరముగా చూడ వచ్చును.

౫. మనుష్యశరీరములను చూచితే శరీరములలోపల ఉండు నరములు, రక్తనాళములు, కలేజము మొదలగు భాగములు స్పష్టముగా కనబడును.

౬. మనుష్యులను చూచినపుడు వారలు తలంచు తలంపులను రంగులుగా చూడగలరు. ప్రేమ, కృప, కటాక్షము ఈ గుణములను రోజావర్ణముగానును, భక్తిని నీలవర్ణముగానును, స్వార్థత అను గుణమును మొద్దు ఎఱ్ఱమట్టి వర్ణముగానును, కోపమును నలుపు కలిసిన దాడిమ పూ వర్ణముగానును, శత్రుత్వము, అసూయ అను వాటిని నల్లవర్ణముగానును చూడగలరు.

౭. స్థూలశరీరమును మరణమువల్ల పోగొట్టుకొని ఆస్ట్రిల్ ప్లేనునందుండు మనుష్యులను చూడగలరు.

౮. స్థూలశరీరధారలై ఆస్ట్రిల్ ప్లేనుకు పోయి ఉండువారినిని చూడవచ్చును.

౯. ఈ శక్తిని ఉపయోగించి అనేకులకు ఆస్ట్రిల్ ప్లేనునందు దృశ్యసహాయులుగానును ఫిజికల్ ప్లేనునందు (భూలోకమునందు) అదృశ్యసహాయులుగానును కైంకర్యము చేయువచ్చును. మరియు ఆస్ట్రిల్ ప్లేను నందలి విశేషములను అనేకములను తెలిసికొనవచ్చును.

ఆస్ట్రిల్ ప్లేనును గురించియే ఒక చిన్నపుస్తకము వ్రాసినయెడల చదువరులకు ఉపయోగముగా నుండును. ఈ గ్రంథము వ్రాసి ముగించిన పిమ్మట శ్రీ గురుమహారాజుగారి అభీష్టము ఆ విధముగా నుండినయెడల ఆ గ్రంథమును ఈ గ్రంథకర్త వ్రాయునేమో—ఇపుడు వాగ్దత్తము అవశ్యములేదు.

## రెండవతరగతి సూక్ష్మ దర్శన శ్రవణములు

అనునవి దిక్సంబంధి. ఈ సిద్ధిని సంపాదించిన వాడు తన సమీపమందు ఉండు వస్తువులను, విషయములను మాత్రమే కాదు. తానుండు స్థలమునకు చాల దూరమందుండు వస్తువులను, విషయములనును తన స్థూలశరీరమును విడిచిపోకనే చూడగలడు, వినగలడు.

౧. అతిరహస్యస్థలములన్నియు నతనికి బట్టబైలుగా నుండును. అనేకవేల ప్రాకారపు కోటలమధ్యన ఉండు వస్తువులను ఆ ప్రాకారములవలని అడ్డమేమియులేకనే చూడ గలడు. అక్కడి శబ్దములను కూడ వినగలడు.

౨. ఏ మనుష్యుడు ఏ కాలమందు ఏ స్థలమందున్నాడని ఇష్టమువచ్చినపుడు కనుకొనవచ్చును. అదేవిధమున ఏ వస్తువు ఎక్కడ ఉన్నదని కూడ కనుకొనవచ్చును.

౩. తానువెదకి కనుకొనవలసిన మనుష్యుడు తనకు గుర్తెరుకలేని వాడైతే ఆ మనుష్యుడు ఉపయోగించుచుండిన ఏ వస్తువునైనను చేత తీసికొనినయెడల ఆ సంబంధముగుండా ఆ మనుష్యుని కనుకొనవచ్చును.

ఈ విషయమందు వ్రాయతగినవి అనేక విషయములున్నను ఇచ్చట ఇప్పట్లో ఇంతమాత్రము చాలును.

## మూడవతరగతి కాలసంబంధి సూక్ష్మ దర్శన శ్రవణములు

ఈ సిద్ధి ముఖ్యముగా రెండు తరగతులకు చేరినవిగా నుండును. అవి అనగా ౧. భూతకాలసంబంధి. ౨. భవిష్య

త్కాల సంబంధి. ఈ సిద్ధికికూడ స్థూలశరీరమును విడిచి పో నక్కరలేదు.

౧. భూతకాలసంబంధి సూక్ష్మ (దూర) దర్శనము, శ్రవణము. ఈ సిద్ధి ఎపుడు లభించును అనగా ఉపాసకుడు మెంటల్ ప్లేనునందు సంచరించుశక్తిని సంపాదించిన పిదప తేజస్తత్త్వమునకు అంతర్భాగమైన ఆకాశతత్త్వపు అణువులను చూడగలిగినపుడు కలుగును. ఇందువల్ల అనేక వేల సంవత్సరములకు మునుపు ఏ దేశమందైనను జరిగిన చరిత్రలను విమర్శించిచూచి చెప్పవచ్చును. తేజస్తత్త్వపు అంతర్భాగమైన ఆకాశమందు, అంతకంటె సూక్ష్మములైన ప్రకృతి అణువులయందు, పూర్వకాలపు చర్యలు, చరిత్రలు, మొదలగు విషయముల బొమ్మలు ముద్రింపబడియుండును. ఒక గోడపైన చిత్రమును వ్రాసినట్టు సృష్టి ఆరంభమునుండి నడిచిన సంగతులబొమ్మలన్నియును సూక్ష్మ ఆకాశము అను గోడపైన చిత్రవులుగానుండును. భూతకాల సంబంధి సూక్ష్మదృష్టి అను సిద్ధిని సుష్ఠుగా సంపాదించినవారు ఆ చిత్రవులను చూడగలరు.

చిత్రవులు ఏ విధముగా సూక్ష్మాకాశమందు ముద్రితములై యుండును అను సందేహము మనలో కొందరికి కలుగవచ్చును. అందుకు ఒక ఉదాహరణమునిచ్చిన అవగాహన అగును. అనగా, ఈ కాలమందు గ్రామోఫోను (Gramo-phone) అను ఒక యంత్రమున్నది అను సంగతి అనేకులకు తెలిసిన విషయమే. ఆ యంత్రమునందు ఒక తట్టనుపెట్టి ఒక సూదిని ఆ తట్టకుతగిలించిన యెడల ఆ యంత్రము పనిచేయ నారంభించును. అపుడు ఆ తట్ట లోనుండు పల్లములు మిట్టలు వీటిపైన సూది ఎక్కుచు దిగుచు

గిర గిర తిరుగుచురాగా సొగసైన సంగీతములు అతి ధ్వనితో మ్రోగును. ఆ ధ్వనులు, పాటలు ఇవన్నియు ఆ తట్టలో చిత్రితములై యుండినవి కదా. మన కండ్లకు ఆ చిత్రములు తెలియలేదు. చెవుల సమీపమునకు ఆ తట్టనుమాత్రము తీసుకొని వెళ్లితే ఆ ధ్వనులు వినలేదు. ఆ తట్టను (Gramo-phone) గ్రామోఫోను యంత్రమునందు బిగించి సూదిని మోపినపుడు సంగీతము మొదలగు ధ్వనులు వినవచ్చినవి. ఈ విధముగానే సూక్ష్మాకాశపు అణువులయందు పురాతనచరిత్రములన్నియు ముద్రితములైయుండును. ఈ ముద్రితములైన సంజ్ఞలకు ఇంగ్లీషుభాషయందు ఆకాశిక్ రికార్డు (Akashic Records) అని పేరు. ఆకాశిక్ రికార్డులను చదువుశక్తికి కాలసంబంధి సూక్ష్మదృష్టి అని పేరు.

ఈ చిత్రములను చూచునపుడు ఆ చిత్రములకు సంబంధించిన మనుష్యులు మాటలాడుచుండిన మాటలనుకూడ వినవచ్చును. వారల తలంపులనంతయు నెరుగ వచ్చును. వారల ఉద్దేశములను కూడ తెలిసికొనవచ్చును.

ఈ శక్తివచ్చినపుడు తనయొక్కయు ఇతరులయొక్కయు పూర్వజన్మములనను ఆ యా జన్మములయందు చేసిన కార్యములు మొదలగు వాటినిని ఎరుగవచ్చును.

౨. భవిష్యత్కాలసంబంధి సూక్ష్మదృష్టి, సూక్ష్మశ్రవణము.

జ్యోతిషమందు అంతర్భాగమైన ప్రశ్నశాస్త్రమందు రాబోవు సంగతులను ముందుగా చెప్పుచున్నారు అని మనకు అనేకులకు తెలిసియున్నది. గ్రహములస్థితినిని వాని బలాబలములనును గుర్తించి లెక్కవేసి ఆరూఢము చెప్పుదురు. దీనివలెనే సూక్ష్మ

మైన ఆస్ట్రల్ ప్లేనునందు కొన్ని విషయములు ముందు కొద్ది కాలములో జరుగబోవునవి ఫొటగ్రాఫులుగా నేర్పడియుండును. శ్రీమద్భగవద్గీతయందు ఏకాదశాధ్యాయమునందు అర్జునునికి "దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరం" అని శ్రీ కృష్ణులవారు దయచేసి యిచ్చిన ఆస్ట్రల్ ప్లేను దృష్టిని ఉపయోగించి "తథా తవామీ నరలోక వీరాః విశం . . . " అని అర్జునుడు రాబోవు సంగతులను సూక్ష్మదృష్టితో కనుకొనెను. మెంటల్ ప్లేను దృష్టిని ఉపయోగించిన యెడల పది దినములకు బదులు పదిమాసములు గడచినపిదప జరుగగల సంగతులను చూడవచ్చును.

లోకమందు జరుగు సంగతులన్నియు పైలోకములయందు కర్మ అనేక దినములకుముందుగా నిర్ధారణచేసిన సంగతులు. మెంటల్ ప్లేనులో కూడ హైయర్ మెంటల్ ప్లేనులో సంచరించి చూచిన యెడల ఇక అనేకనూర్ల సంవత్సరములకు మునుపు భూలోకమునందు నడువబోవు సంగతులన్నియు నడిచినట్టుగానే యుండును.

భవిష్యత్కాల సూక్ష్మదృష్టిగాని సూక్ష్మశ్రవణముగాని సుష్ఠుగా నడిపించుటకు మెంటల్ బాడీయందును శుద్ధమానసశరీరమునందును సంచరించగల యోగ్యత వచ్చినపుడే సాధ్యము.

సూక్ష్మదృష్టి విషయమై ఇంతకంటె ననేక విషయములను గురించి వ్రాయవచ్చును. ఐనను ఇప్పట్లో ఇచ్చట ఇంతమాత్రము చాలునని విరమించవలసియున్నది.

## సూక్ష్మ (దూర) దృష్టి, సూక్ష్మ (దూర) శ్రవణములను సంపాదించు విధము

ఇదివరకును నాగరికము ముదరని జాతులయందు కొందరు మత్తువస్తువులను భుజించియో లేక ధూపములు వేసి ఆ పొగను పీల్చియో మైమరచినపుడు సూక్ష్మ దృష్టిశక్తి కనుపడును. సూక్ష్మ శ్రవణశక్తి కూడ చూడగలము. నాగరికము చెందిన వారలైన హిందువులలో కొందరు ప్రాణాయామముచేసి కుంభకావస్థయందు సూక్ష్మశ్రవణ సూక్ష్మదృష్టులను పొందగలరు.

కొందరు తమకుగల ప్రస్వాపన సిద్ధివల్ల ఇతరులను నిద్ర పోవునట్టు చేసి నిద్రాస్థితిలో నుండువారిమూలముగా దూరదేశ ములయందును, ఇతర లోకములయందును జరుగు సంగతులను తెలిసికొందురు. ఈ విధముగా ఇతరులను నిద్ర చెందునట్టు చేయుట క్షేమముకాదు.

నిస్సంశయముగా ‹‹ అనపాయినీ ’’ అయిన మార్గమేమనగా సత్సంప్రదాయవంతులైన గురువులవారిని ఆశ్రయించి ‹‹ తేనోపది ష్టార్థ సమాహితాత్మా ’’ అనగా వారిచేత ఉపదేశమును పొంది వారు విధించిన అనుష్ఠానములను ఆచరించి ఈ సిద్ధిని పొంద వలయును. సత్సంప్రదాయవంతులైన గురువులవారు మా కెట్లు లభించగలరు అని అడిగితే ఆప్రశ్నకు జవాబు ఈ గ్రంథము, ౨౦ వ పుటయందు మహీపీఠము అను విషయమును చూడవలయును.

నాడీ శోధనము అని యోగశాస్త్రములయందు చెప్పబడు దేహముల సౌష్ఠవమును అభ్యసించి స్థూలశరీరము, ఆస్ట్రల్ బాడీ, మెంటల్ బాడీ అను శరీరములను ఇంతకుముందు ఈ అధ్యాయము

నందుచెప్పిన రీతిగా శుద్ధిచేసికొనినయెడల ఈ సూక్ష్మ (దూర) దృష్టియు, సూక్ష్మ (దూర) శ్రవణమును మరియు ఇకముందు వివరింపబడు ఇతర సిద్ధులను "అనపాయినీ" అనునట్టుగానును పరోపకారార్థమును లభించును.

సంకల్పశుద్ధియు, సదాచారమును లేనివారికి "అనపాయినీ" అయిన సిద్ధి లభించదు. సూక్ష్మదృష్టి సిద్ధిని సంపాదించినవారు సంపాదించిన క్రొత్తలో అనుభవించు దుఃఖములును పరితాపములును లెక్కింప సాధ్యములు కావు. అర్జునుడు దుఃఖపడినట్లు దుఃఖపడి స్వామీ, నాకు ఈ సిద్ధి వద్దండీ అని విలపించవలసినట్లు ఏర్పడును.

## సూక్ష్మశ్రవణము

ఈ గ్రంథము ౧౬౦ వ పుటయందు శబ్దము మందములైన స్పందములవల్ల కలిగినదనియు, వర్ణము తీవ్రములైన స్పందములవల్ల కలిగినదనియు చెప్పబడియె. సూక్ష్మదృష్టికి కావలసిన స్పందగ్రహణశక్తికంటె సూక్ష్మశ్రవణమునకు అతిమందమైన శక్తికావలసియుండును గనుక సూక్ష్మదృష్టిని సంపాదించుటకంటె సూక్ష్మశ్రవణమును సంపాదించుట చాల సులభము. కనుక సూక్ష్మదృష్టిని గురించి వ్రాసినదంతయు సూక్ష్మశ్రవణమునకు అన్వయించునని యెరుగవలయును. కనుక సూక్ష్మశ్రవణమునుగురించి వేరుగా వ్రాయవలసినది అవశ్యము కాదు.

## హెచ్చరిక

సూక్ష్మదృష్టి సూక్ష్మశ్రవణము అను సిద్ధులును ఇతర సిద్ధులును ఒకనికి లభించినపుడు అతడు అధోగతిఁజెందుటకు అనేక

సందర్భములు కలుగును. లోకులయందు కుచేష్టగలవారు మెం డుగానుందురు. తనంతకు తన వ్యవహారములను గమనించి ఇతరుల వ్యవహారములయందు అభిరుచిపొందక యుండవలసినది ధర్మము. ఇతరులకు సహాయముచేయుటకు ఇష్టము ఉన్నపుడు మాత్రమే ఇతరుల వ్యవహారములనుగురించి విచారించుట తప్పుకాదు. అటు గాక inquisitiveness వల్ల ఇతరుల వ్యవహారములను తెలిసి కొనవలయుననికోరి తనకు లభించిన సూక్ష్మదృష్టి అను సిద్ధిని ఉపయోగించితే ఆర్థికవిషయములయందు దొంగతనముతో సమా నమైన పాపము చేసినవారగుదురు. దొంగతనము అనగా తనది కానిదియు ఇతరులదియునైన సొత్తును స్వంతదారుల అనుమతి లేకయే మరియు కొన్నిసమయములయందు వారి ఎరుకకూడ లేక యే తాను ఆక్రమించుట. ఇతరుల వ్యవహారములు తమవికావు. మనము తెలుసుకొనుట వారికి ఇష్టముండదు. తెలుసుకోవలెనని కోరుట నివృత్తిమార్గయాత్రాపరునికి ధర్మముకాదు. కనుక అట్టి సందర్భములయందు సూక్ష్మదృష్టిని ఉపయోగించినయెడల ఆ సిద్ధి మాసిపోవచ్చును. మాసిపోక దుర్వినియోగపెట్టుటకు వీలు కలిగిన యెడల ఉపాసకునికి అతి క్రూరకర్మ ప్రాప్తించుచుండును.

మహీపీఠపు గురువులు తమ శిష్యులలో నెవరికైనను ఈ సిద్ధులు లభించునట్లైతే అపుడే కొన్ని నిబంధనలను ఏర్పరుతురు. అవి యేవి అనగా :—

౧. ఇతరుల వ్యవహారములను వారికోరికలేకయే చూడ కూడదు.

౨. ఈ శక్తిని స్వప్రయోజనార్థము ఉపయోగించ కూడదు.

3. తనకు ఈ శక్తి కలదని యితరులకు రుజువుపరచుట కూడదు. రాజయోగమార్గమందు చరించువారికి ఇట్టి నిర్బంధములు అనేకములు గలవు.

## యోగసిద్ధులు—ప్రస్వాపనసిద్ధి

## (Mesmerism or Hypnotism)

ప్రతివస్తువునందును ప్రతిశరీరమునందును విద్యుచ్ఛక్తి యున్న దని పాశ్చాత్యప్రకృతిశాస్త్రజ్ఞులు రుజువుపరచియున్నారు. సూర్యబింబమునుండి ప్రాణశక్తి విస్తరిల్లి లోకమునందంతయు తేజరిల్లును. ప్రతి రాయి, ప్రతి చెట్టు, ప్రతి మృగము, ప్రతి మనుజుడును ఈ ప్రాణశక్తిని గ్రహించి తనలో ఇముడుచుకొనుచుండును. సూర్యుడు ప్రకాశముతో వెలుగునపుడు ఒక తామ్రపు తంతె తెచ్చి దానియొక్క ఒక కొనను ఎండలో పెట్టి మరియొక కొనను గాఢాంధకారమునిండిన ఒక గదిలోపలికి తీసికొనివెళ్లితే సూక్ష్మదృష్టిగలవారు (ఇందుకు యోగదృష్టి అవశ్యములేదు) చీకటింటనుండు తంతెకొనయందు సన్నవెలుతురును కనుగొందురు. సూర్యునియొక్క వెలుతురు తంతెగుండా చీకటింటిలోపలికి పోయినది అని కదా మనము నిశ్చయించుకోవలెను. అదేప్రకారము మనుష్యుడు సూర్యప్రకాశమునుండి సంగ్రహించిన ప్రాణశక్తి తాను ఇష్టపడినను ఇష్టపడకున్నను అతనిచేతులవ్రేళ్లు కాళ్లవ్రేళ్లు అగు దేహముయొక్క కొనలనుండి బైటికి పోవుచుండును. ఇది సాధారణముగా అందరిశరీరములయందు నుండియు పోవుచుండును. యోగశక్తిని పొందినవారలు ఇష్టపడితే తమ ప్రాణశక్తిని

పూర్ణప్రవాహముతో నితరుల దేహములయందు కుమ్మరించ గలరు. ఇట్లు ఇష్టపడి ప్రాణశక్తిని ఉపయోగించి ఇతరులను తన శక్తికి లోపరుచుకొనవచ్చును. ప్రాణశక్తిని అధికముగా నొకని పైన ప్రవహింప చేసినయెడల అతడు నిద్రవచ్చినట్టు స్మారకము తొలగిపోయి నిద్రించును. నిద్రను కలుగచేయు శక్తి లేక సిద్ధి గనుక దీనికి ప్రస్వాపనశక్తి యని పేరు.

నిజముగా యోగమును అభ్యసించకయే మనస్సును మాత్రము చక్కగా ఏకాగ్రము చేసికొనగలిగినవారు అనేకులు ఈ ప్రస్వాపనసిద్ధిని అభ్యసించుచున్నారు. పరోపకారమునకుగానే ఈ శక్తిని ఒకరు ఉపయోగించవలసినదిగాని స్వప్రయోజనార్థము గాని కేవల "పరస్య ఉత్పాదనార్థము" గాని ఈ శక్తిని ఎపుడును ఉపయోగించకూడదు. ఉపయోగించిన యెడల క్షీణగతిని చెందుదురు.

### నరములు

ఆత్మవిచారము, పూర్వభాగము, ౧౨౫ వ పుటయందు స్థూలశరీరమునందు కొన్ని నరములు ఉన్నవనియు వానికంతయు మూలస్థానము మెదడు అనియు చెప్పబడియె. ఈ నరములగుండా ప్రాణము సంచరించును అనియు చెప్పబడియె. మన శరీరములయందు నరములను ఆశ్రయించి ప్రాణశక్తి రెండు విధములుగా సంచరించును. ౧. నరముల తేజస్సు అనునది ఒకటి. ౨. సూర్యునినుండి వచ్చిన ప్రాణశక్తి. ఈ రెండవజాతిశక్తి శరీరముచే సూర్యకాంతి నుండి ఆకర్షింపబడి నరముల తేజస్సుగుండా రోజావర్ణముగల అణువులుగా సంచరించును.

ఆత్మవిచారము, పూర్వభాగము, ౧౨౮ వ పుటయందు చెప్పిన ఛాయాశరీరము (Etheric Double) అనునది ఈ నరముల తేజస్సునకును ప్రాణశక్తికిని ఉపాధి. నరముల తేజస్సును ఏకారణము చేతనైనా స్థూలశరీరమును అందక పోవునట్లు చేసినయెడల స్థూలశరీరమునందు స్పర్శేంద్రియము పనిచేయదు. అనగా మనను ఎవరు తాకినను మనకు తెలియదు; సూదితో గుచ్చినను నొప్పి తెలియదు. స్పర్శేంద్రియగోళము అయిన చర్మమునందు స్మారక ముండదు. అపుడు కత్తితో చర్మమును తునియలుగా కోసినను బాధ ఉండదు. వెలుపలికి తరమకొట్టబడిన నరముల తేజస్సు మరలశరీరములో ప్రవేశించినపుడు గాయమువల్ల కలిగిన బాధ తెలియును.

పాశ్చాత్యప్రకృతిశాస్త్రజ్ఞులు నరముల తేజస్సు అనునది యొకటి కలదా అని పరీక్షించి ఈ నరముల తేజస్సు ఉండనియెడల నరములు సరిగా వాటిపనిని నడిపించవు అని నిర్ధారించియున్నారు.

సూర్యబింబముచుట్టును ప్రాణశక్తి పెద్ద సముద్రమువలె నుండును. మనుష్యుల దేహములు దుర్గతవల్ల కృశించిపోయినపుడు సూర్యనమస్కారములు చేయింతురు. రోగికి బలమువచ్చును. ఇది లోకానుభవము. అపుడు ఏమి జరుగును అనగా సూర్యబింబము చుట్టునుండు ప్రాణశక్తిసముద్రమునుండి ప్రాణశక్తిని రోగి మంత్రబలమువల్ల ఆకర్షించును. చక్కని ఆరోగ్యముగలవాని శరీరమునందు ప్రాణశక్తి అపరిమితముగా నుండును. ఆరోగ్యవంతమైన దేహమునుండి ఆకాశబాణములు వేగముతో పైకి ఎగిరినట్లుగా ప్రాణశక్తి బయటికి అన్నిదిక్కులయందును ప్రవహించుచుండు

ను. నిండినచెరువులోని నీళ్లు తూములగుండా వేగముతో బయలు వెడలి పయిర్లను పోషించిన రీతిగా ఆరోగ్యవంతుడైన దేహియొక్క శరీరమునుండి వేగముతో వెదజల్లు ప్రాణశక్తి అతనికి తెలియకయే ఇతరులకు కూడ నారోగ్యము కలుగజేయును. అదేవిధమున దేహారోగ్యము లేని వారును దేహదార్ఢ్యము తక్కువగా గల ముసలివారును తమకు తెలియకయే ఇతరులశరీరములయందలి ప్రాణశక్తిని అపహరించి తాము బలవంతులగుదురు. ఇందుకనే ఆత్మవిచారము, పూర్వభాగమునందు బిడ్డలను ముసలివారలవద్ద ఇయ్యకూడదు అని చెప్పబడియె.

ఆరోగ్యవంతుల శరీరములనుండి స్వధాగా వెలుపటికి వేగముతో ప్రవహించునట్టి ప్రాణశక్తి ఆరోగ్యవంతులకు తెలియకయే ఇతరులశరీరములలో ప్రవేశించి వారలకు ఆరోగ్యమును బలమును ఇచ్చునని పైన చెప్పబడియె. ఇది సాధారణము. ప్రయత్నపూర్వకముగా ఆరోగ్యవంతుడు తన దేహమందలి ప్రాణశక్తిని క్రోడీకరించి బలహీనుల శరీరములయందు వారలకు తెలియకయే చొప్పింప చేయవచ్చును. బలహీనులకు బలము వచ్చును. ఇట్లు తమ ప్రాణశక్తిని ఇతరులకు ఇచ్చినందువల్ల ఆరోగ్యవంతులకు ఏవిధమైన నష్టమును లేదు.

మన దేహములనుండి ప్రాణశక్తి యథేచ్ఛముగా వెలుపలికి పోవుచుండును. గనుక ఆ శక్తి పోవు మార్గములైన చేతుల వ్రేళ్లు కాళ్లవ్రేళ్లు మొదలగు అవయవములను అతి పరిశుద్ధముగా నుంచుకొనియుండవలయును. అపరిశుద్ధములు గానుండిన యెడల ఆ అపరిశుద్ధము ప్రాణశక్తియందు కలిసి ప్రాణశక్తిని అపరిశుద్ధ

ముగా జేయును. అపరిశుద్ధమైన ప్రాణశక్తిని యితరులు ఆకర్షించునట్టు చేసిన పాపము ఆరోగ్యవంతుని చేరును. కనుకనే ఈ పుస్తకము, 3 వ అధ్యాయమునందు స్నానము, ఆహారము అను విషయములనుగురించి అంత విపులముగా వ్రాయవలసివచ్చెను.

ఈ సిద్ధియందు మనస్సుయొక్క శక్తి ముఖ్యమైనది. అధిక శక్తిగల మనస్సుగలవానిని "యజమానుడు" అను సంజ్ఞవల్ల గుర్తింతము. తక్కువశక్తిగల మనస్సుగలవానిని "నీరసుడు" అను సంజ్ఞవల్ల గుర్తింతము. సాధారణముగా పశ్చిమదేశములయందు "నీరసుడు" అను సంజ్ఞవల్ల గుర్తింపబడు వారు "యజమానుడు" అను సంజ్ఞవల్ల గుర్తింపబడు వారివద్దకు ఏదో చికిత్సకు వెళ్లుదురు. అపుడు "యజమానుడు" అనువాడు "నీరసుడు" అనువానిని ఒక సుఖమై స్థిరమైన స్థలమునందు కూర్చుండపెట్టి తన మనశ్శక్తివల్ల "నీరసుడు" అను వానికి నిద్రస్థితి గలుగవలసినది అని దృఢముగా భావించును. భావించి తన మనస్సును ఏకాగ్రపరుచుకొని తన చేతులను చాచి "నీరసుని" ముఖముయొక్క సమీపమునకు తీసుకొనిపోయి తన శరీరములోని ప్రాణశక్తిని "నీరసుని" యందు పోసి (చొప్పించి) "నీరసుని"కి నిద్రవచ్చునట్టు చేయును. మరియు అందుపైన "యజమానుడు" మరికొంచెము తనయొక్క ప్రాణశక్తిని ఉపయోగించి "నీరసుని" నిద్ర అతిగాఢనిద్ర అగునట్టు చేయును.

మనశాస్త్రములయందు ఈ విద్యనుగురించి ఎక్కడ చెప్పియున్న దని నాకు తెలియదు. అథర్వణవేదమునందు శస్త్రాస్త్ర విద్యలనుగురించి చెప్పియుండు స్థలమునందుండవలయును. అథర్వణ

వేదవేత్తయగు గురువులవారిచేత శిక్షితుడైన అజమహారాజు యొక్క చరిత్రమును వ్రాయునపుడు రఘువంశమునందు శ్రీకాళిదాసు ఇందుమతీదేవియొక్క స్వయంవరమును వర్ణించియున్నారు. అచ్చట ౫, ౬ శ్లోకములయందు ఈ సిద్ధినిగురించి వ్రాసియున్నారు. ప్రస్వాపనాస్త్రమును తన శత్రురాజులపైన ప్రయోగించినారనియును, ఆ రాజులకందరకును నిద్రవచ్చి నేలగుంపులుగుంపులుగా పడినారనియు, అపుడు అజమహారాజు శత్రురాజసమూహము మధ్య ప్రదేశమునకు వెళ్లి శంఖవాద్యముచేసినను వారలు ఒకరైనను మేలుకోలేకపోయినారనియు వ్రాసియున్నది. ఆ భాగము రఘువంశమునందు చూడవలయును. అస్త్రబలముచే నిద్రవచ్చెననగా మంత్రబలముచేవచ్చెనని యర్థము. ఇది మంత్రబలమునకు బదులు మనోబలముచే నిద్రరమ్మనట్టు చేయుశక్తి. ఈ శక్తికి ఇంగ్లీషు భాషయందు "హిప్నోటిసం" (Hypnotism) అని పేరు. ఇదే ప్రస్వాపనసిద్ధి.

మనదేశమునందు ఆసుపత్రులలో డాక్టర్లు గడ్డలుకోయుటయు విరిగిన చేతులు కాళ్లు మొదలైన అవయవములను దేహమునుండి ఛేదించి తీసివేయుటయును చూచియున్నాము. రోగికి కలిగిన బాధ అపుడు నివారించును. కత్తితో కోయుటకు ముందుగా డాక్టర్లు మైకపుద్రావకమును (క్లోరోఫారం=chloroform) ఇచ్చి రోగికి నిద్రవచ్చునట్టు చేయుట మనకు తెలిసిన విషయమే కదా. అపుడు ఏమి జరుగుచున్నదనగా మైకపుద్రావకము రోగియొక్క శరీరమందు ప్రవేశించి ఇంతకుముందు చెప్పిన నరముల తేజస్సును రోగియొక్క శరీరమునుండి వెలుపలికి తరమకొట్టును. ఈ పనిని "యజమానుని" యొక్క మనశ్శక్తి చేయగలదు.

గాఢనిద్రకలిగినపుడు " నీరసుని " యొక్క దేహమందు ఏ అవయవమును కోయవలయునో అట్టి అవయవమునందుండు నరముల తేజస్సును " యజమానుడు " తరమకొట్టి ఆ అవయవమును కత్తితో కోసి చికిత్సచేయును. ఇట్టి చికిత్సలు పశ్చిమదేశములయందు ఈ కాలమందు జరుగుచున్నవి. ఈ విధముగా పరోపకారార్థము యోగశక్తిని ఉపయోగించవచ్చును.

ప్రస్థాపనసిద్ధిని ఉపయోగించుట మరియొక విధముకలదు. నరముల తేజస్సు అనునది ప్రతిశరీరమునందు ఒకటి యున్నదనియు, ఆ తేజస్సు మూలకముగానే నరములు పనిచేయుననియు, నరముల యొక్క చర్యవల్లనే శరీరమునందుండు ఇంద్రియగోళములు ఆ యా ఇంద్రియముయొక్క చర్యకు అవకాశము ఇచ్చియుండుననియు నిదివరకే చెప్పబడియె. " యజమానుని " యొక్క మనశ్శక్తివల్ల " నీరసుని " యొక్క దేహమందలి నరముల తేజస్సును బైటికి పారదోలి తనయొక్క నరముల తేజస్సును " నీరసుని " శరీరమందు ఉంచితే " నీరసుడు" " యజమానుని " నరముల తేజస్సునే కదా ఉపయోగించుకోవలసి వచ్చును.

నరముల తేజస్సునకు రెండు అధికారములు గలవు. ౧. దేహి కోరిన ప్రకారము స్థూలదేహమును నడిపించుట. అనగా చేతులు జోడించుకోవలెనని దేహి ఇచ్ఛయించిన యెడల దేహియొక్క మనస్సునందుపుట్టిన ఈ ఇచ్ఛవల్ల నరముల తేజస్సునందు చలనము (స్పందము) కలిగి నరములను కార్యోన్ముఖములుగా జేయును. నరములు కార్యము నారంభించగానే వేరు వేరుగా నుండిన రెండు చేతులును ఒకటి సమీపమునకు మరియొకటి తేబడును. అపుడు

చేతులు జోడింపబడినవగును. నరములయందు విద్యుచ్ఛక్తియున్న దని ముందే చెప్పబడియె. విద్యుచ్ఛక్తి ఒక నిమిషమున లక్షుల లెక్కగలన్ని మైళ్లు దూరముపోగల వేగము కలది గనుక ఇంత చర్యయు నొక విఘడియలో జరిగినట్లుండును. ఈ విషయములు పాశ్చాత్య ప్రకృతిశాస్త్రములయందు ప్రకృతమందు విశదముగా చదువవచ్చును. ౨. బహిఃప్రపంచమునందు విషయములను సమీపించి ఇంద్రియములు తమకు సంబంధించిన నరములకు చేరిన నరముల తేజస్సుకు విషయముల వివరమును తెలుపును. నరముల తేజస్సు ఆ వివరమును తన మూలకారణమైన మెదడునకు తెలుపును. మెదడు మనస్సు అను నంతరింద్రియమునకు సంగతి తెలుపును. మనస్సునకు అవగాహన ఐనపుడు దేహికి తెలియును.

"నీరసుని" యొక్క దేహమునందలి నరముల తేజస్సుకు బదులు "నీరసుని" దేహమందు "యజమానుని" దేహమునందలి నరముల తేజస్సును స్థాపించినయెడల "యజమానుడు" తలచినదంతయు "నీరసుని" దేహము చేయును. "యజమానుని" అభిప్రాయములనన్నియు నీరసుని కర్మేంద్రియములు జ్ఞానేంద్రియములు మనస్సు అన్నియు చేయును. "నీరసునికి" "యజమానుడు" ఒక వేపకాయ ఇచ్చి తినుము అని చెప్పిన యెడల "నీరసుడు" ఆ వేపకాయను తినును. "యజమానుడు" తన మనస్సులో ఆ వేపకాయ తియ్యగా నున్నది అనుకొంటే "నీరసుని" నోటిగుండా "ఈ కాయ తియ్యగానున్నది" అను మాటలు బైలు వెడలును. ఈ విధముగా "నీరసుడు" స్వధాగా

చేయనొల్లని కార్యముల నంతయు "యజమానుడు" అతనిచేత చేయించవచ్చును.

ఈ సిద్ధిని లోకోపకారార్థమే ఉపయోగించవలెను గాని స్వప్రయోజనార్థము ఉపయోగించ కూడదు. ఎంతపేదవాడైనను ఎంత స్వల్పుడైనను అతను మనఃపూర్తిగా చేయుటకు ఇష్టపడని కార్యమును అతనిచేత బలవంతముగా చేయించుట నివృత్తిమార్గయాత్రాపరుని వృద్ధికి పెద్ద ప్రత్యవాయము.

(Hypnotism) అను ప్రస్వాపమునుగురించి అనేక గ్రంథములు ఆంగ్లభాషయందు వ్రాయబడియున్నవి. ఇకముందు ఎవరైనను మహానుభావులు ఆ గ్రంథములను తెనుగున వ్రాసి ఆంధ్రులకు వెల్లడిపరుతురని కోరుతున్నాను. ఈ సిద్ధినిగురించి యింత మాత్రము చెప్పి చాలించుచున్నాను.

టెలెపతి (Telepathy) లేక మైండు క్యూరు (mind cure) అను సిద్ధి. టెలెపతి అను శబ్దమునకు అర్థము, దూరస్పర్శ అని యెరుగవలయు. దూరదర్శనము, దూరశ్రవణము అను విధమున దూరస్పర్శయనియు నొక సిద్ధి కలదు. మైండు క్యూరు (mind cure) అను పదమునకు "మనసా చికిత్స" అని యర్థము. రోగికి వ్యాధి నివారణ చేయవలయునని కోరునట్టి వైద్యుడు రోగి సమీపమునకు వెళ్లి రోగిని పరీక్షించి అతని దేహమును కుదుర్చుటకు చికిత్స నారంభించుట మనకు తెలిసిన విధము. దూరస్పర్శము అను దూర చికిత్సనుగురించి విచారించుటకు మునుపు మనము ఏ విధముగా సంకల్పములను కలుగజేసి కార్యములను జరుపుతున్నాము, మన స్థూలదేహమునందు మనస్సు ఏ విధముగా పనిచేయుచున్నది

అను వివరములనుగురించి పాశ్చాత్యతత్త్వశాస్త్రజ్ఞులు చెప్పిన విషయములను విచారింతము.

విషయసంగము కలిగినపుడు విషయమును మనస్సు ఏ విధమున అవగాహన చేసికొని కర్మేంద్రియముగుండా కార్యము జరుపుచున్నది అను వివరమును విచారించవలయును. వేడిమి గల పదార్థమును మనము స్పర్శించి చేతికి తీసుకొందుము. అదే విఘడియయందు ఆ పదార్థము వేడిగా నుండునందున చేతినుండి జారవిడుచుదుము. ఇది చాలమందికి అనుభవమే కదా. స్పర్శించుట, గ్రహించుట, త్యజించుట అను ఈ కార్యములు ఒకటే విఘడియయందు జరిగినను ఏయే మెట్లగుండా ఈ మూడు చర్యలు సంచరించినవి అనువివరమును ప్రకృతి శాస్త్రజ్ఞులు చెప్పునట్టు తెలిసికొనవలయును.

నరములే సకల విషయజ్ఞానమునకును, కార్యములను చేయుటకును, కారణము అని యిదివరకే చెప్పబడినది. ఉష్ణమైన వస్తువును చేతులు పట్టుకోగానే ఆ పదార్థముయొక్క వేడిమిని చేతి నరములు తెలిసికొని తమకు అధిపతియైన మెదటికి ఆ నరములు తాము తాకిన పదార్థము ఉష్ణమైనది అని సమాచారము అంపును. వెంటనే మెదడు "ఆ పదార్థమును వదలిపెట్టుడు" అని బదులు సమాచారమును అంపును. అపుడు చేతినరములు అనగా చేయి ఆ పదార్థమును జారవిడుచును. ఇన్ని సంగతులును ఒక విఘడియలోపల జరిగినవి. ఇది విద్యుచ్ఛక్తి వేగము. ఈ సంగతిని ప్రస్వాపన సిద్ధి అను విషయమును వ్రాసినపుడు ప్రస్తావించియుంటిని. అదే విధమున సంకల్పములుకూడ ఒకరి మెదటియందు

నుండి వెడలి మరియొకరి మెదటిని ప్రవేశించును. ఇదే యీ గ్రంథముయొక్క పూర్వభాగమునందు పరేంగితజ్ఞానము అని వాడపడియె. టెలిపతి యనగా అనేక నూర్లమైళ్లదూరమున నుండు నొకని మనస్సునందు మన మనస్సునందలి ఇంగితమును ప్రవేశపెట్టుట. దీనిని భావపరివర్తనము అని వాడితిమి. ఆ భాగమును మరల చదివితే ఉపయోగముగా నుండును.

ఈ రహస్యమును అనుసరించియే

౧. ఒక సంసారమందు ఒకానొకడు అతిహర్షముతో నుండినయెడల అతని హర్షస్పందము ఆ సంసారమునందుండు ఇతరులకు కూడ హర్షమునిచ్చును. అదే విధమున ఒకడు అతిఖిన్నుడుగా నుండినయెడల అతని సమీపమందుండు ఇతరులు కూడ ఖేదమునుచెందుదురు. ఇది దూర స్పర్శయొక్క చర్య.

౨. ఎవనియొక్క ప్రియులైనను చనిపోయినయెడల వారలను తలంచి బ్రతికియుండువాడు సంతోషతలంపులు తలచినయెడల చనిపోయినవారికికూడ సంతోషము కలుగును. దుఃఖించినయెడల చనిపోయినవారికి కూడ దుఃఖము కలుగును.

కనుక టెలెపతి (దూరస్పర్శ) యనగా ఒకని మనస్సునందు పుట్టిన తలంపులు అను స్పందములను అతి దూరమునందుండు మరియొక్కని మనోమయశరీరమును స్పర్శించి ఆ మనస్సునందు తనవంటి స్పందములను కలుగజేసి ఆ స్పందముల పరిణామమైన తలంపును పుట్టించుట. దీనినిగురించి యీ గ్రంథము, పూర్వభాగమునందు చాల వివరముగా వ్రాసియున్నది.

మనసా చికిత్స వేరు వేరు తరహాలగా నుండును.

౧. తనకు రుగ్మతే రాలేదు, రానేరదు అని యొక్కడు దృఢనమ్మకముతో నుండినయెడల మనస్సుయొక్క దృఢస్వభావము గల స్పందములు స్థూలశరీరమునందు ప్రవేశించి స్థూల అణువుల యందలి జాడ్యమును విదిలించి ఆరోగ్యమునిచ్చును.

౨. దృఢమైన మనశ్శక్తిగలవాడొకడు రుగ్మతచెందిన వానిని చూచి ఆరోగ్యమైన ప్రాణశక్తిని రోగియొక్క శరీరము పైన కుమ్మరించుట. అందువల్ల రోగియొక్క రోగము కుదురును.

3. రోగియొక్క రోగము ఇట్టిదని దృఢమైన మనస్సు గల వాడు తెలిసికొని ఏ అవయవమునందు ఆ రోగము పుట్టియుండునో ఆ అవయవమును మనసా చింతించి అది పరమ ఆరోగ్య స్థితియందున్నట్లు సంకల్పించి మనోరాజ్యమును ఉపయోగించినయెడల ఆ అంగము ఆరోగ్యముచెంది రోగి నీరోగి యగును.

నివృత్తిమార్గయాత్రాపరుడు పై వివరించిన విధమున అవిచ్ఛిన్నమైన లోకోపకారము చేయుచుండుట సాధ్యము; చేయుటయు మంచిది.

పరోపకారమును చేయునపుడు ఈ ఉపకారము ఫలానా మనుష్యుడు చేసినాడని ఉపకారము పొందినవానికి తెలియవలసిన అవశ్యము లేదు. కష్టపడినవాడు మేలుపొందితే చాలును. కనుక నివృత్తిమార్గయాత్రాపరుడు మనసా ఇతరులకు చేయు సహాయములకు కృతజ్ఞతావార్తలను వినుట అరుదు. నివృత్తిమార్గయాత్రాపగునికి స్తుతిగాని కృతజ్ఞత వార్తలుగాని లాభకరములు

కావు. పరిపూర్ణముగా మాసిపోని అహంకారతత్త్వము స్తుతివల్ల అంకురించి నివృత్తిమార్గయాత్రాపరుని వృద్ధిని చెడిపివేయును.

ఇతరులకు తెలియకయు తనకు చక్కగా తెలిసియు మనః పూర్వకముగా కాలహరణము చేయక పరోపకారము మనసా అవిచ్ఛిన్నముగా చేయుచుండవలయును.

మరియొక సిద్ధి యున్నది. ఆంగ్లభాషయందు ఆ సిద్ధికి సైకామెట్రి (Psychometry) అని పేరు. అనగా యోగి ఒకానొక పదార్థమును చేతతీసుకొని కొంతతడవు దానియందు మనస్సును ఏకాగ్రపఱిచి ఆ వస్తువుయొక్క పుట్టు పూర్వోత్తరములన్నియు తన మనసా కనుగొనుట. అనగా ఆ వస్తువుపైన ధారణచేసి ఆ వస్తువుతో తాదాత్మ్యముచెంది తానే ఆ వస్తువు అని అనుభవ జ్ఞానము తెచ్చుకొని ఆ వస్తువు ఎపుడు మొట్టమొదట పుట్టినది, ఎన్ని ఊళ్లలో ఎందరు మనుష్యులచేతులు మారినది, ఎవరెవరికి ఆ పదార్థమువల్ల మేలో కీడో కలిగినది మొదలగు విషయరూపమైన ఆ పదార్థముయొక్క చరిత్రమంతయు తెలిసికొనుట. అంతే కాదు. ఆ పదార్థము ఉండిన దేశములలో ఆ కాలమందు ఎవరెవరు రాజ్యమేలుచుండిరి, దేశముయొక్క నాగరిక మెట్లుండినది, ఇట్టి వివరములన్నియు యోగదృష్టికి తెలియును.

ద్వారకానగరము సముద్రమందు మునిగిపోయిన దని వినుచున్నాము కదా. ఆ పట్టణముయొక్క కోటలు గోడలు శిఖరములు ఇన్నిటిలో దేనిలోనుండియైనను ఒక యిటిక దొరికితే యోగబలమువల్ల ఆ దృష్టితో "సైకామెట్రి" గుండా శ్రీ కృష్ణులవారి చరిత్రమునంతయు వ్రాయవచ్చును.

## పరకాయప్రవేశవిద్య అనుసిద్ధి

కాయము అనగా దేహము. దేహము గేహము వంటిది. గేహము అనగా ఇల్లు, ఇల్లు అనగా నివాసస్థలము. ఇల్లు వేరు, ఇంటియందు కాపురముండువాడు వేరుగా నున్నట్టుగానే స్థూల దేహము వేరు, స్థూలదేహమును ధరించిన ఆత్మ వేరు అను విష యము సంజ్ఞార్థముగా జ్ఞాపకపరచవలసి యున్నది. గుఱ్ఱమును సవారిచేయు రాతు కొంతకాలము ఒక గుఱ్ఱమును సవారిచేయుచు మరునాడు మరియొక గుఱ్ఱమును సవారి చేయునట్టుగానే దేహాత్మ భావము అను అజ్ఞానమును దాటినవారు తన దేహమును వదిలి ఏ దేహమునందైనను ప్రవేశించి పనిచేయవచ్చును. దేహాత్మ భావము అనగా దేహమే తాను అను మాయాభిప్రాయము. దేహము వేరు, జీవాత్మ వేరు, ఇంద్రియములన్నియు ఆస్ట్రల్ బాడీ యందున్నవి అనియు, ఆ ఇంద్రియములయొక్క గోళములన్నియు స్థూలశరీరమునందున్నవనియు నిదివరకు పలుమారు చెప్పబడియె.

సీ ॥ రథము మే నెల్లసారథి బుద్ధి యింద్రియ
 గణము గుఱ్ఱములు పగ్గములు మనము ।
ప్రాణాది దశ విధ పవనంబు లిరుసు
 ధర్మా ధర్మగతులు రథాంగకములు ।
బహుళతరంబైన బంధంబు చిత్తంబు
 శబ్దాదికములు సంచారభూమి ।
లభిమాన సంయుతుండైన జీవుడు రథి
 ఘనతరప్రణవంబు కార్ముకంబు ॥
గీ ॥ శుద్ధజీవుండు బాణంబు సుభగమయిన ।
 బ్రహ్మమంచిత లక్ష్యంబు పరులు రాగ ।

భయమదద్వేషశోకలోభప్రమోహ ।
మాన మత్సరముఖములు మానవేంద్ర ॥
(శ్రీమదాంధ్రభాగవతము, ౭. స్కంధము)

ఈ పద్యమునందు కఠోపనిషత్తు నందలి యర్థమునును, ముండకోప నుషత్తునందలి యర్థమునును ఉపదేశించియున్నారు. శరీరము రథము. శరీరి యగు జీవుడు రథియను వివరమును ఈ పద్యమువల్ల బాగుగా నెఱుగవలయును.

మనము భూలోకమునందు జన్మించినపుడు శిశుశరీరము నందు ప్రవేశించి శిశుశరీరము స్వధాగా నిలిచి జీవునియొక్క చర్యలకు తగు ఉపాధిగా కానందున పరాధీనులమై యుంటిమి. కాలక్రమమున శిశుశరీరము ముదిరి యౌవనపురుషుల మైనపుడు పరాధీనము మాని స్వాతంత్ర్యమును సంపాదించుకొంటిమి గదా. స్థూలశరీరము అను గుఱ్ఱము మనకు ప్రత్యేక వాహనముగా పని చేయుచున్న విధముగానే ఆస్ట్రిల్ బాడీయను గుఱ్ఱము ఒకటి యున్నది అనియును ఆ దేహమును కూడ సుష్ఠుగా పెంచినపుడు ఆస్ట్రిల్ బాడీ ప్రత్యేకవాహనముగా నుపయోగించునని యీ గ్రంథ మునందు ౧౩౦ వ పుటయందు చెప్పబడియె. సుష్ఠు అయిన ఆస్ట్రిల్ బాడీ ఎవ్వనికి ఉన్నదో అట్టివాడు ఇచ్ఛకలిగినపుడు స్థూల శరీరమును తగుమైనస్థలమునందు పదిలపరచివైచి తాను తన ఆస్ట్రిల్ బాడీలో నిలిచి ఆస్ట్రిల్ బాడీ అను గుఱ్ఱమును సవారిచేయు చు లోకసేవ చేయగలడు. అదేవిధమున మెంటల్ బాడీ అను గుఱ్ఱమును సిద్ధపరచుకొనిన అదృష్టవంతుడు స్థూలశరీరమును, ఆస్ట్రిల్ బాడీని ఈ రెంటిని వదిలి మెంటల్ బాడీ అను గుఱ్ఱమును

సవారిచేయుచు లోకాంతరముల యందు సంచరించి లోకోప
కారము చేయును.

స్థూల దృష్టిమాత్రము గలవారికి ఆస్ట్రిల్ బాడీ గాని మెం
టల్ బాడీగాని కనుపడవు. ఆస్ట్రిల్ దృష్టిని మాత్రము సంపాదించి
మెంటల్ దృష్టి సంపాదించని వారికి మెంటల్ బాడీ అగపడదు.
లోకోపకారము చేయు నవసరమునందు ఉపకారము పొందతగిన
వారు దూర దేశములలో నున్నయెడల లోకోపకారి తన స్థూల
శరీరమును అట్టి దూర దేశమునకు తీసుకొనివెళ్లుటకు ఎంతటి
వడిగల బండ్లైన ఆ సందర్భమునకు కావలసినంత వడిగా పోచాలవు
గనుక స్థూలశరీరమును ఏదో యొక స్థలమునందు వదిలిపెట్టి సంద
ర్భానుసారం ఆస్ట్రిల్ బాడీతోనో మెంటల్ బాడీతోనో దూర
ప్రాంత్యములకు వెళ్లి లోకోపకారము చేయవలసియుండును. అట్టి
లోకోపకారము చేయు సందర్భమునందు సూక్ష్మదృష్టిలేని జన
సమూహము తన మాటలను వినవలసినట్టు అవశ్య మేర్పడిన
యెడల ఆస్ట్రిల్ బాడీయందో మెంటల్ బాడీయందో ఉండు వారు
ఒక స్థూలశరీరమును సంపాదించుకోవలసి వచ్చును.

స్థూలశరీరమును సంపాదించుకొనుట రెండు విధములుగా
జరుగవచ్చును. ౧. తానే తన క్రియాశక్తివల్ల స్థూల అణువులను
ఆకాశమునందుండువాటిని ఆకర్షించి ఒక స్థూలశరీరమును కలుగ
జేసికొనుట. ఇట్లుచేయుటకు కొంత ప్రయత్నము, సన్నాహము,
కావలయును. ౨. ఆస్థలమునందుండు వారలలో నెవ్వడైనను
నివృత్తిమార్గశీలు డున్నయెడల అతనిని ఆశ్రయించి అతని శరీర
మును కొన్నినిమిషముల కాలము అప్పుతీసికొనవచ్చును. అనగా

అతనిని తన స్థూలశరీరమును వదిలి వెలుపలికి పొమ్మని తాను ఆ శరీరమునందు ప్రవేశించి ఆ శరీరమునందలి వాగింద్రియ గోళము నుపయోగించి తాను చెప్పతలచుకొన్నన్ని సంగతులను మాటాడి కార్యము ముగియగానే ఆ శరీరమును తాను వదిలి స్వంతదారుని స్వాధీనము చేయవచ్చును. ఈ సిద్ధికి పరకాయప్రవేశసిద్ధి యని పేరు. ఇందును గురించి మరియు ననేకసంగతులు వ్రాయవచ్చును. గ్రంథ విస్తరభీతిచే విరమించవలసియున్నది.

పరకాయ ప్రవేశసిద్ధి అనునవుడు ఈ సిద్ధికి సహకారి యైనది మరియొక సిద్ధి కలదు.

## స్వదేహారిక్తీకరణము

అనగా తన దేహము గేహమును వలె ఖాలీచేసి తాను వెలుపల నిలిచియుండి తన అనుమతిపొందిన ఇతరులను తన శరీరమును ఉపయోగించునట్లు ఒప్పుకొనుట. స్వదేహారిక్తీకరణము అను సిద్ధి దేహసౌష్ఠవమును సంపాదించిన అందరికిని సాధ్యమే. దీనికే స్వఛందమరణసిద్ధి అనియు పేరు. అనగా తనయొక్క ఇచ్ఛ వచ్చినపుడు తన శరీరమును ఖాయముగా వదిలి పోవుట.

మన పురాణములయందు అనేక స్థలములయందు ఋషులు మొదలగు వారు పామరజనులకు సహాయము చేయగోరి వారి ఆస్ట్రిల్ బాడీలతోనో, మెంటల్ బాడీలతోనో లేక అంత కంటె నధికమైన బుద్ధిక్ బాడీతోనో తాము సహాయము చేయదలచు కొన్నవారికి అగపడుచుండిరి అని చెప్పియున్నది. శ్రీమద్భాగవతము, షష్ఠస్కంధమునందు చిత్రకేతూపాఖ్యానము అని యొక

గాధ కలదు. అందుచిత్రకేతువునకు ఇద్దరు ఋషులు గూఢులుగా కనబడిరి అనియు, వారలను చిత్రకేతువు "అవధూతేన వేషేణ గూఢా విహ సమాగతౌ" అని ప్రశ్నించెననియు చెప్పియున్నది. సంస్కృత శ్రీమద్భాగవతమునం దీభాగమును చదివిన యెడల అనేక రహస్యములు తెలియును. అయినను భక్తుండగు కవివరుండు "యతి వేషములు పూని యతి గూఢగతి నిందు నేతెంచినట్టి మీరెవ్వరయ్య" అని ముద్దుగా నొక సీసపద్యమును వ్రాసియున్నారు. ఇందు "గూఢగతి" అను పదమునకు అర్థమును విచారించితే స్థూలేతర శరీరమేదో యొకటిని యుపయోగించి కనుబడిరి యని యెరుగగలము.

శరీరముల సౌష్ఠవము అను నీ యధ్యాయమునందు అనేక అపూర్వవిషయములను మనము ఎరుగవచ్చును. స్థూలశరీరమును శుద్ధిచేసికొని నాడీశోధనంబని యోగశాస్త్రములయందు చెప్పిన విషయమును తేటగా నుపదేశించు ఆస్ట్రిల్ బాడీ మెంటల్ బాడీల యొక్క సౌష్ఠవమును సంపాదించిన మహనీయులు సూక్ష్మ (దూర) దృష్టి, శ్రవణము, ఆకాశగమనము అను ఆస్ట్రిల్ బాడీతో లోకసంచారము, మొదలగు ననేక సిద్ధులను లోకోపకారార్థముగా చేయగలరు. స్వప్రయోజనార్థము అణుమాత్రమైనను ఉపయోగించినయెడల సిద్ధులు మాసిపోవును. కనుక లోకసేవాపరులమై

భూతాని విష్ణోః స్సురసేవితాని తద్ధర్మలింగాని మహాద్భుతాని ।
రక్షంతి తద్ధర్మపరాన్ పరేభ్యో మత్తోపి సర్వా.నథ సర్వతశ్చ ॥

లెక్కకు నెక్కువై కసటులేని మహాద్భుత తేజమెల్లడన్ ।
విక్కటిలం జరింతు రతి భీమ బలాఢ్యులు విష్ణుభూతముల్ ।

చక్కని ధర్మశాంతు లతిసాహసవంతులు దేవపూజితుల్ ।
గ్రిక్కిరి సీ జగంబునను గేశవ సేవక రక్షణార్థమై ॥

(అజామిళోపాఖ్యానము)

పైన చెప్పినప్రకారము ఆస్ట్రిల్ బాడీని సృష్ఠుచేసికొనిన యెడల మన చుట్టునుండు ఆస్ట్రిల్ ప్లేనునందుండు వస్తువులను జీవులను కూడ చూడగలము. మరణము అను స్థితిని అందరును చెందవలసి యున్నను ప్రకృతమందు మరణానంతరము జీవుడు ఎక్కడ ఉండును, ఏమిగా నుండును అను సంగతులను గురించి జనబాహుళ్యమునకు తెలియదు గనుక మరణము అను స్థితి సంభవించపోవుచున్న దన గానే జడిసి దుఃఖించనారంభింతురు. జనసముదాయములో చాల మందికి సూక్ష్మలోకములయొక్క ఉనికియందు నమ్మకము లేదు. మరియు ననేక లక్షలమందికి స్థూలలోకము—పృథివీ (భూ) లోక మునకన్న, వేఱుగా లోకములుగాని వస్తువులుగాని ఉన్నవా అని విచారము ఐనను జనించదు. ఈ అపనమ్మకమును విశ్వాసహీన మంతయు నెట్లు నశించునని విచారించవలయును. ఆస్తికులలో నూర్లకొలది మనుష్యులు ఆస్ట్రిల్ బాడీని సృష్ఠుచేసికొని పై వివరించిన సూక్ష్మదర్శనము మొదలగు యోగశక్తులను సంపాదించినపుడు స్థూలశరీరపాతానంతరము జీవాత్మ మిగిలియుండునా అని సందేహించరు. సూక్ష్మదృష్టిని సంపాదించినవారు తమచుట్టును ఉండు ఆస్ట్రిల్ ప్లేనులో సంచరించుచుండు ప్రేతలను చూచుచుందురు. చనిపోవురీత్యా స్థూలశరీరమును పోగొట్టుకొనిన పిమ్మట ఆస్ట్రిల్ బాడీయందు నివసించుచుండు వారికి ప్రేతలని పేరు. వారలను చూచుటయే గాక వారలతో మాటలుకూడ ఆడగలరు. స్వథాగా

చూచినప్పుడు మరణానంతరస్థితిని గురించి గ్రంథములలో చదివినదంతయు అనుభవమునకు వచ్చును. ఇప్పట్లో వాదమునకు మాత్రము విషయములగు అనేక విషయములు ఆస్ట్రల్ ప్లేనుకు సంబంధించినవరకు శ్రవణజన్యజ్ఞానముగాక యే అనుభవజన్య జ్ఞానము కూడ అగును.

చిల్లర దేవతలు, భూతములు, పిశాచములు ఇవన్నియును కండ్లకు తెలియును. వానియందు ప్రకృతమునందు ఆరోపితమై యుండు దౌష్ట్యమును అందుల ఫలితార్థమైన భీతియు ద్వేషమును సూక్ష్మదృష్టి వచ్చినతరువాత మనము స్వథాగా చూచుటవల్ల అట్టి దౌష్ట్యములేమింజేసి వానిపై ప్రేమ జనియించును. ప్రేమ జనియించుటంబట్టి సర్వజీవాత్మైక్యరూప జ్ఞానము కలుగును.

మరియొక ఫలితార్థ మేమనగా మనము ఇతరులకు సహాయముచేయు విషయమై మనతోకూడ నుండువారలు, మనకన్న తక్కువ స్థితియందుండువారలును, మనవల్ల లాభముచెందునట్లు నడుచుకో వచ్చును. ఆస్ట్రల్ బాడీని సుష్ఠుపరచుకొని తత్ఫలితమైన సూక్ష్మదృష్టిని సంపాదించినవారి సంఖ్య వేలకొలది ఏర్పడునట్టి సమయమందు ఇతరుల మనస్సులలోని వ్యాకులమును, దుఃఖములనును మనము కనుక్కొని దుఃఖితులచేత నప్రార్థితులయ్యు, వారలకు సహాయము చేయుటకు పూనుకొందుము. డాక్టర్లగానుండు వారికి సూక్ష్మదృష్టి కలిగి యుండినప్పుడు తాము చికిత్సచేయుచుండు రోగికి రుగ్మత ఏ విధముగా ఏ అంగమునందు కలిగినది తెలిసికొని తదనుగుణమైన చికిత్సను చేసి అతిత్వరితమునందే ఆరోగ్యము నియ్యగలరు. ఇతరులకు సహాయము చేయవలెనని ఆశగొన్న

వారలు అనేకులు గ్రుడ్డితనముతో సన్నాహము చేయక తెలివితో ప్రయత్నించి సహాయమును చేయు శక్తి కలిగియుందురు.

కుఱ్ఱవాండ్ర విద్యాభ్యాస విషయమునందు లోకమున ప్రకృతమందు చాల "ఇదమిత్థం" అనగా ఇది ఈ విధముగా చేయవలయునని తెలియకయే తమకు తోచినట్లంతయు ప్రయత్నము చేయుచున్నారు కదా. సూక్ష్మ దృష్టిని సంపాదించినవారు కుఱ్ఱవాండ్రను చూడగానే ఈ బాలునికి ఈ విద్య సమ్మతము అని విమర్శించు శక్తినిపొందినవారుగా నుందురు. అందువల్ల బాలుర యొక్కయు బాలికలయొక్కయు విద్యాభ్యాసమునందు ప్రకృతము నందుండు చిక్కులు తగ్గును.

ఇతరులయందు ఉండు దుర్గుణములను సూక్ష్మ దృష్టితో కనుగొని వారలకు తెలియకయే ఆ దుర్గుణములను పోగొట్టుటకు ప్రయత్నము చేయవచ్చును. ఇట్లు చేయుటవల్ల లోకమునందు దుర్మార్గుల సంఖ్య తగ్గి సన్మార్గుల సంఖ్య అధికమగును. సన్మార్గుల సంఖ్య అధికముకాగా జనసమూహమునకు సుఖప్రాప్తియగును.

స్వర్గమున్నదా, నరకము కలదా అని అనేకులు సందేహించుచుండగా స్వర్గనరకములను సూక్ష్మదృష్టి గలవారలు చూచి నరకముల విషయములలో పురాణములలో చెప్పిన భయంకరములైన అతిశయోక్తుల వల్ల కలుగు చెడుపును మాన్పగలరు.

సంగీతశాస్త్రమునందు ఏ యే స్వరము ఏ యే రంగులను పుట్టించును అని తెలిసికొన గలము. భక్తిరసమునకు తగిన స్వరములను భక్తులకు, పౌరుషమునకు కావలసిన స్వరములను పౌరుషము కోరువారికి, అనుకంప కోరువారికి అనుకంప అను రసమును

పుట్టించు స్వరములు గల కీర్తనలనును, పాడి వినిపించి వారిని వృద్ధికి తేవచ్చును. సూక్ష్మ దృష్టితో స్వరములకును వర్ణములకును స్వభావములకును కలిగియుండు సంబంధమును తెలిసికోగలము.

సూక్ష్మదృష్టిని సంపాదించినవారు మాంసభుక్కులుగా నుండనోపరు. పశువులను చంపు సమయమునందు ఆ పశువులు పడుశ్రమ, వానియొక్క రోషము, ఈర్ష్య, క్రోధము మొదలగునవి అంతయు గుమిగూడి కోటానుకోట్ల మృగములు చంపబడు సమయమునందు అన్ని మృగములయొక్క క్రోధరససముద్రము లోకులకు ఎన్ని రోగములను కలుగజేయునో ఆ దుఃఖమును సూక్ష్మదృష్టి గలవారు చూతురు గనుక మృగముల వధను మానుకొందురు. వేటలాడుట, మృగయావినోదము అను మొదలగు విధవత్వ ములు లోకమునందు తగ్గిపోవును. ఇవన్నియు ఆస్ట్రిల్ బాడీయొక్క సౌష్ఠవమువల్ల జనించు సూక్ష్మదృష్టివల్ల కలుగగల లాభములు.

కనుకనే శ్రీమద్భగవద్గీతయందు “యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాఽధికం తతః” అని యోగమునుగురించి చెప్పినది.

మనుజుడు ఆస్ట్రిల్ బాడీని సుష్ఠుచేసికొని సూక్ష్మదృష్టిని సంపాదించినపుడు తాను తన స్నేహితులను చూచునపుడు వారల స్థూలశరీములు మాత్రమే కాదు, ఆస్ట్రిల్ బాడీలనుకూడ చూడగలడు. ఇతరుల ఆస్ట్రిల్ బాడీలను చూడగలిగినశక్తిని సంపాదించుట ఎంతటి గొప్ప అను సంగతి అనుభవించినగాని తెలియదట. ఆస్ట్రిల్ బాడీయొక్క సౌష్ఠవమువల్ల ఈ మాత్రము గొప్పసందర్భమును సంపాదించినారు అన్నయెడల, మెంటల్ బాడీనికూడ సుష్ఠు

గా జేసికొని మెంటల్ ప్లేను సంబంధియైన సూక్ష్మదృష్టినికూడ సంపాదించినయెడల లోకోపకారమునకుగా పాటుపడుటకు ఎన్ని స్తోత్రోవలు సంపాదింపబడినవి అని చెప్పుట వాచామగోచరము.

మెంటల్ ప్లేను సంబంధి అనగా మెంటల్ బాడీ సౌష్ఠవము వల్ల కలుగు సూక్ష్మదృష్టి క్రమక్రమముగా సాధువులు సంపాదించు సమయమున అట్టివారు సర్వదా స్వర్గవాసులుగానే యుండియు భూలోకమునందుకూడ జనసముదాయముతో కలిసిమెలిసి యుందురు. ఈ శక్తిని ఎప్పటికిగాని స్వప్రయోజనార్థముగాని స్వదురభిమానప్రదర్శనమునకుగా గాని యుపయోగించ కూడదు, ఉపయోగించరు. ఈ దృష్టిని సంపాదించినవారు చాలమట్టుకు పృథగ్భావమును మరిచినవారు. సర్వజీవాత్మైక్య జ్ఞానముయొక్క అంకురమును పొందినవారు గనుక ఇతరులు, తాము అను (స్వపర) భేదమును మరచినవారుగా నుందురు. ఈ దృష్టిని సంపాదించిన వారు దివ్యతరముగా పరోపకారము చేయుటకు శక్తిమంతులగుదురు.

ఇట్టి శక్తులు ఉపర్యుపరి పెరుగుచురాగా (శక్తి అధికము కాను కాను) నమ్రతయును భ్రాతృభావమును అధికమై భగవత్కైంకర్యమును అతిమేలిమితో చేయుటకు అర్హులగుదురు. ఇట్టి వారే 'సాధువు లనబడుదురు.

శ్రీమద్భాగవతము, పంచమస్కంధమునందు ఋషభావతారమునుగురించి చదువుచు అచ్చట కొన్ని యోగసిద్ధులను గురించి చెప్పియుండు అంశమును చూడగా

సర్వేషాం భూతానా మాత్మభూతే భగవతి వాసుదేవే ఆత్మనోఽ వ్యవధానా నంతరోదర భావేన సిద్ధసమస్తార్థ పరిపూర్ణ యోగైశ్వర్యాణి వైహాయస మనోజవాంతర్ధాన పరకాయప్రవేశ దూరగ్రహణ శ్రవణాదీని యదృచ్ఛ యోపగతాని

అని చెప్పియున్నది. దీనియర్థము—సర్వభూతములకు నాత్మయు, స్వతః పరమాత్మయునైన వాసుదేవుని యెడ నాత్మతాదాత్మ్యమునం జేసి భేదబుద్ధిలేకయే స్వతస్సిద్ధములై తాను కోరకయే లభించిన యోగసిద్ధులగు ౧. ఆకాశగమనము, ౨. మనోవేగ గమనము, 3. అంతర్ధానమగుట, ౪. పరకాయప్రవేశము, ౫. దూరగ్రహణము, ౬. దూరశ్రవణము మొదలుగాగల సిద్ధులను పొందెను.

ఇట్టి సిద్ధులు ఉపాసకుడు కోరకనే యోగ బలమువల్ల సిద్ధించును. ఇదంతయు విని మననము చేసినయెడల మనలో ఎవ్వరండీ ఈ శక్తులను కేవల లోకోపకారార్థముగా సంపాదించుటకు ప్రయత్నపడరు. కనుక ప్రయత్నపడుదము. స్వగౌరవముగాని స్వప్రయోజనముగాని కోరకూడదు.

మాలినీ ॥ సరసహృదయవాసా చారులక్ష్మీవిలాసా ।
భరితశుభచరిత్రా భాస్కరాబ్జారి నేత్రా ।
నిరుపమఘనగాత్రా నిర్మలజ్ఞాన పాత్రా ।
గురుతరభవదూరా గోపికా చిత్తచోరా ॥

---

# ౮ వ అధ్యాయము

తే ప్రభామండలై ర్వ్యోమ ద్యోతయంత స్తపోధనాః ।
సారుంధతీకా స్సపది ప్రాదురాసన్ పురః ప్రభోః ॥

(కుమారసంభవము)

## ప్రభామండలము

సప్తఋషులును అరుంధతీసమేతులై తమ ప్రభామండలముల కాంతితో ఆకాశమును అంతయు వెలుగుతోనింపి పరమేశ్వరుని సన్నిధానమునందు చేరిరి అని యర్థము.

మన దేశమునందు స్వామి ఉత్సవ విగ్రహములు గ్రామసంచారమునకు సిద్ధమగునపుడు సింహప్రభ యని యొక ఆవరణమును విగ్రహములకు చేర్చి కట్టుదురు. ఇది ప్రభామండలికి సూచకము.

ప్రభ అనగా ప్రకాశము. మండలము అనగా గుండ్రముగా నేర్పడిన ప్రకాశావరణము. ఆవరణముయొక్క అర్థమును సూచించునది ప్రభ.

భగవత్ప్రకాశము లోకమునంతయు నావరించుకొని యుం డును. అక్షరమును అనిర్దేశ్యమును అయిన బ్రహ్మముయొక్క ప్రకాశము సర్వవ్యాపకముగా నుండినను భక్తజనానుకూలార్థము గా స్థూలీకరించబడిన విగ్రహములయొక్క ప్రభ విగ్రహములను ఆవరించియుండును.

> గతం తిరశ్చీన మనూరుసారథేః ప్రసిద్ధ మూర్ధ్వజ్వలనం హవిర్భుజః ।
> పత త్యధోధామ విసారి సర్వతః కిమే త దిత్యాకుల మీక్షితం జనైః ॥
>
> (మాఘకావ్యము)

నారదులవారు ఆకాశమార్గమున సంచరించుచు భూమివద్దకు దిగివచ్చుచుండగా వారియొక్క ప్రభ సూర్యకాంతివలె నుండెనట. అది చూచి అక్కడిజనులు ఈ కాంతియెక్కడది. సూర్యునికాం తియే కాబోలు. కాదు కాదు. సూర్యునికాంతియైనయెడల తూర్పునుండి పడమటికి పోవలెనే గాని ఊర్ధ్వమునుండి భూమికి ఏలా దిగును అని మరికొందురు ఆక్షేపించిరట. ఇందువలన భగవదంశములైన జీవాత్మలలో నారదమహర్షివంటి దేవర్షులకు సూర్యప్రభాభాసురంబైన ప్రభావరణమున్న దని తెలియుచున్నది. ఈ అధ్యాయమునందు ప్రభామండలి యనునది యేమి అని విచారించు సందర్భములో భగవదంశములైన మానుషజీవాత్మలును వారికన్న తగ్గిన వర్గములైన మృగవర్గము, వనౌషధివర్గము, ధాతువర్గ ము మొదలగు వానికి కూడ ప్రభామండలి యున్నది అని తెలియ వచ్చును.

ప్రభామండలమును బ్రహ్మవిద్యాదర్పణమునందు తేజస్సు అని యుపయోగించి యున్నారు.

న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం
నేమా విద్యుతో భాంతి కుతో యమగ్నిః ।
త మేవ భాంత మనుభాతి సర్వం
తస్య భాసా సర్వ మిదం విభాతి ॥

(ముండకోపనిషత్తు)

అచ్చట సూర్యునికి ప్రకాశము లేదు. నక్షత్రసహితుడైన చంద్రునికికూడ ప్రకాశము లేదు. కండ్లకు కనబడు మెరుపు (విద్యుత్తు) లకుకూడ ప్రకాశము లేదు. ఈ మనయెదుటనుండు నగ్నికి ప్రకాశ మెక్కడిది. మహాప్రకాశవంతమైన ఆత్మను అనుసరించి ఇవన్నియు ప్రకాశించుచున్నవి అని యర్థము. అగ్నికంటె ప్రకాశవంతములైనవి మెరుపులు, చంద్రుడు, సూర్యుడు, వీరందరును పరమాత్మయొక్క ప్రకాశమునందు లేశమాత్రభాగమును గైకొని ప్రకాశించుచుందురు. పరమాత్మ మహాప్రకాశముతో మండుచుండు జ్వాలయనియు ఆ జ్వాలనుండి వెలువడిన మిణుగురులతో సమానము జీవాత్మలనియు నుపనిషత్తులు ఘోషించుచున్నవి.

జీవాత్మయొక్క ప్రకాశము దేహముల ప్రకాశముకంటె నధికము. ప్రకృతిజన్యములైనవి దేహములు. ప్రకృతియందుకూడ భూలోకపు అణువులు ప్రకాశమునందు మాంద్యముకలిగియుండును. ఫిజికల్ ప్లేనుకు భూలోక మని పేరు. ఇంతకంటె సూక్ష్మ అణువులతో నేర్పడినది ఆస్ట్రిల్ ప్లేను. మన శాస్త్రములయందు ఆస్ట్రిల్ ప్లేనుకు చంద్రలోక మని యొక పేరు. అక్కడి అణువులతో కట్టబడిన బింబములు అన్నియు చంద్రుని వెలుతురువంటి వెలుతురు కలిగియుండును. అంతకుపైన మెంటల్ ప్లేను అనునది

యున్నది. మెంటల్ ప్లేనుకు మనశాస్త్రములయందు సూర్యలోక మని యొక పేరు. మెంటల్ ప్లేనునందు రూపములు, బింబము లన్నియు సూర్యప్రభాభాసురంబులై యుండును. ఇదే విధమున పైకి పోను పోను కాంతిమంతములైన లోకములు రూపములును నిండియుండును. ఈ మాత్ర మవగాహన చేసికొనిన పిమ్మట దేహములయందలి తేజస్సునుగురించి విచారించవలయును.

స్థూలశరీరము మనకు దృష్టిగోచరమై యున్నది కదా. ఈ శరీరమునందే పేదవారియొక్క స్థూలశరీరము స్థూలదృష్టికే కాంతిహీనముగా నుండును. కొంతమట్టుకు పోషణ అధికముగా నియ్యగలవారి స్థూలశరీరము కాంతిమంతముగా నుండును. స్థూలేతర శరీరములయందు కాంతులు ఎట్లుండుననియు జీవాత్మ ఎట్టి ఉపాసనచేయుచు వచ్చినయెడల ఆ శరీరములయందలి కాంతులు మాంద్యము మాని రమణీయములైన కాంతులు కలిగి యుండుననియు నింతకు పూర్వపు అధ్యాయమునందు వివరముగా చెప్పబడియె. విశేషమైన ప్రయత్నముచేసి శరీరములను సుష్ఠుగా చేసికొనకపోయినను స్వయముగా స్థూలేతరశరీరములయందు ఆ యా ప్లేనుకు సంబంధపడిన కాంతులు ఉండనే ఉన్నవి.

ఈ పుస్తకము, ౧౦౭-౧౦౮ వ పుటలయందు జీవాత్మ మధ్య ఉండి అతనిచుట్టు వరుసను ౧. ఆరిక్ ఎగ్గు, ౨. బుద్ధిక్ బాడీ, 3. శుద్ధమానసశరీరము, ౪. మలినమానసశరీరము, ౫. కామ మయశరీరము, ౬. ఛాయాశరీరము, ౭. స్థూలశరీరము అను శరీర ములు అన్నియు గోళాకారములుగా జీవాత్మనావరించి యున్నవని జ్ఞాపకపరచ బడియె. ఈ శరీరములన్నియు వేర్వేరు వర్ణములు

గలవై ఒకశరీరము మరియొక శరీరమునాచ్ఛాదించి యున్నపుడు ఆచ్ఛాదింపబడినశరీరముయొక్క వర్ణముతో నాచ్ఛాదించినశరీరము యొక్క వర్ణము మిళితమై క్రొత్త క్రొత్త వర్ణములను ముత్యపు చిప్పలయందలి కాంతులవలె గాన్పించుచు చూడచూడ వేడుకలై యుండునట. యోగదృష్టిగలవారు వ్రాసిన పుస్తకములను చదివిన యెడల ఈ సంగతులు హృద్యములై ఆశ్చర్యకరములుగ తెలియును. ఆ మాత్రము అజ్ఞానతిమిరాంధులమైన మనము తెలిసికోలేము. ఇట్టి సౌరభ్యములన్నియు సామాన్య శరీరములయొక్క కాంతుల మేళనమును గురించి యే విందుము. అందులో నాడీశోధన మొదలైన అనుష్ఠానములవల్ల సుష్ఠులైన శరీరములయందలి దీప్తివంతములైన కాంతులయొక్క సమ్మేళన మెట్లుండునో ఊహించుకొనవలయును. శరీరములనుమాత్రము చూచినపుడు మంచి అద్దములతో జోడించిన లాందరులవలె కనబడును. ఆ లాందరులో దీపమును వెలిగించక ఉండగా అద్దముల ప్రకాశముమాత్రము యత్కించిత్ గా కనబడు విధమున ప్రకాశించుచుండును. అధికస్య అధికం ఫలం అని దీపము కూడ ఆ లాందరులో వెలిగినయెడల ప్రాణములు లేని చిత్రపులలో వ్రాసిన బొమ్మలే వెలుగుచుండగా ఆ బొమ్మలకు విజ్ఞానము నిచ్చు ప్రాణమును కూడ వాటియందు ప్రవేశపెట్టినట్టు మహాద్భుతముగా నుండును.

శరీరములన్నియు నున్నపుడు,

తస్య మధ్యే మహానగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతో ముఖః । . . . .
సంతాపయతి స్వం దేహం ఆపాదతలమస్తకం । తస్య మధ్యే వహ్నిశిఖా

అణీ యోర్ధ్వా వ్యవస్థితా । . . . తస్యా శ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః ॥ (నారాయణీయయాజ్ఞిక్యుపనిషత్తు)

ఆ శరీరసమూహముయొక్క మధ్యనుండు స్థూలశరీరముయొక్క మధ్యప్రదేశమందు బహుప్రకారంబుల వెలుంగు అగ్ని యున్నాడు. ఆ అగ్ని శరీరమందు అన్నిభాగములయందును వేడిమి కలిగించుచుండును. ఆ అగ్నిమధ్యన జ్వాల; ఆ జ్వాలయొక్క అగ్రమందు పరమాత్మాంశమైన జీవాత్మ ఉన్నాడు.

పైన చెప్పిన ఉపమానముయొక్క అర్థము ఈ ఉపనిషద్వాక్యమునందున్నది. శరీరములే జ్వలించుచుండగా అందులో మహా ప్రకాశవంతుడైన జీవాత్మ కూడ ప్రవేశించినందున తేజస్సు అధికమైనది. కనుక సూక్ష్మదృష్టిగల జ్ఞానులు మనలో నెవ్వరినైనను చూచినపుడు చూచువా రేవిధమైన సూక్ష్మదృష్టి కలిగియుందురో ఆ దృష్టియొక్క శక్తికి తగినంతమాత్రముగా మనశరీరములను చూడగలరు. ఛాయాశరీరపు సూక్ష్మదృష్టిగలవారు ఛాయాశరీరప్రభను మాత్రము చూడగలరు. ఆస్ట్రిల్ ప్లేను సూక్ష్మదృష్టి గలవారు ఆస్ట్రిల్ బాడీ ప్రభవరకు మాత్రము చూడగలరు. మెంటల్ ప్లేను సూక్ష్మదృష్టిగలవారు మెంటల్ బాడీల ప్రభవరకు మాత్రము చూడగలరు. బుద్ధిక్ ప్లేనుదృష్టి గలవారు బుద్ధిక్ బాడీ ప్రభవరకును చూడగలరు. నిర్వాణిక్ ప్లేను సూక్ష్మదృష్టి గలవారు నిర్వాణిక్ బాడీ అయిన ఆరిక్ ఎగ్గు యొక్క ప్రభను కూడ చూడగలరు.

సూక్ష్మదృష్టిలో అనేక తరగతులు గలవు. శ్రీ మహాభారతము నందు తీర్థములను గురించి వర్ణించుచు వచ్చినపుడు “దేవల

తీర్థము" అను మహా తీర్థమును వర్ణించుచు అచ్చట చెప్పియుండు పురాతన ఇతిహాసమునందు దేవలుడు జైగీషవ్యుడు అను మహర్షి మాహాత్మ్యమును కనుగొనుటకుగా బ్రహ్మలోకమువరకు పోయినా డనియును దేవలునికంటె అధికమైన వేగముతో జైగీషవ్యఋషి అంతకంతకు పైలోకములకు పోవుచుండెననియు చెప్పియున్నది కదా. దేవలుడు మొట్టమొదట కొంచము సాధారణమైన సూక్ష్మ దృష్టిని ఉపయోగించినాడు. ఆ దృష్టితో చూచుటకు అసాధ్య మైనపుడు మరియు నధికమైన దృష్టిని ఉపయోగించినాడు. ఇది నివృత్తిమార్గపువారు నడుచు విధము. సూక్ష్మతరమైన దృష్టితో చూడవలె నన్నపుడు శక్తిని మరికొంత అధికముగా నుపయోగ పెట్టవలెను. శక్తివినియోగమందు అతి జాగ్రతగానుంచుట సంప్ర దాయము. సాధారణముగా భూలోకదృష్టి మాత్రము గల మన వంటివారము కూడ ఇదేవిధముగా నడుచుచుందుము. ఏదైనను ఒకవస్తువును చూడనిచ్ఛయించినపుడు ఉత్తకండ్లతో చూతుము. ఉత్తకంటి దృష్టికి ఆ వస్తువు సరిగా గోచరము కానపుడు ముక్క ద్దము తగిలించుకొని చూతుము. అందుకుకూడ సరిగా తెలియక పోయినపుడు భూతఅద్దమునో లేక దూరపువస్తువులను చూడుశక్తి నియ్యగల దుర్బిణి యను అద్దమునో ఉపయోగింతుము కదా. ఇది సంప్రదాయము.

సూక్ష్మదృష్టిగలయోగులు పైవిధముగా మనలను చూచి నపుడు మనము ఏమాత్రము దైవీసంపత్తును సంపాదించినాము అని కనుగొందురు. సాధారణముగా ప్రాతస్స్నానసంధ్యావందనాద్యను ష్ఠానంబులన్ మరువక ఆచరించుచు నౌపాసనాది కర్మలను చేయు

చుండువారి ముఖమునం దపూర్వమైన తేజస్సు కనబడుచుండును. లేక భక్తులుగా నుండువారు ధ్యానాదికార్యంబులను జరుపుచు భగవంతునియందు జ్ఞాపకముంచుకొని యుండువారియొక్క ముఖములయందు ఒకవిధమైన తేజస్సుండును.

చరాచరవస్తుజాలంబునం దంతయు తేజస్సు నిండియుండును. కొంతటియందలి తేజస్సును మనము ఎఱుగగలము. రత్నములయందు నీరు మిక్కుటము గానుండుటంబట్టి జీవరత్నము లని పేరు పొందియున్నవి. ఉపాసకుడు ఏయే రత్నములుగల ఆభరణముల నుపయోగించవలసినది గురువులవారు చెప్పవలెను. తులసీదళములయందు ఒక విధమైన తేజస్సుండును. వైష్ణవసంబంధియైన తేజస్సు అని ఆ ప్రభకు పేరు. కనుక తులసీదళములు శ్రీ మహావిష్ణువుగారికి పూజార్హములు. బిల్వదళములయొక్క ప్రభ శైవ తేజస్సు. కనుక శివునికి పూజార్హములు. ఇదే విధమున లోకమునందలి చేతనాఽచేతనంబులగు వస్తువులయం దన్నింటియందును తేజస్సుండును. ఈ గ్రంథము, ౭౫ వ పుటయందు చెప్పిన సప్త రేఖామయమైన లోకమునందు రేఖానుగుణ్యముగా ప్రభ సప్తవిధములుగా నిండి సప్తీకరింపబడియుండును.

ఈ సందర్భమునందు ఒక రహస్యమును చెప్పవలసియున్నది. వాస్తవముగా శిష్యులయొక్క అజ్ఞాననాశనంబు జేయు యోగ్యతగల గురువులు శిష్యునియొక్క ప్రభను పరిశీలించి అతని రేఖకు అనుగుణమైన మంత్రము నుపదేశింతురు. శిష్యవిత్తాపహారణము మాత్రము చేయుయోగ్యతగల గురువులు కొందరు గురువులుగాక లఘువులుగానేయున్నను డబ్బు ఆశకుగాని సన్మానాపేక్ష

త్రోనో గాని ఏదో తమకు తెలిసిన మంత్రమును నమ్మినవారికి ఉపదేశము చేసి ఆ మంత్రపురశ్చరణవల్ల శిష్యులు శ్రమలుపడు చుండగా శ్రమలకు కారణములు ఏవి యనియైనను ఎరుగలేకయే అశక్తులై శిష్యులను శ్రమలపాలు చేయుచుందురు. వైష్ణవసంబంధి మైన తేజస్సుగలవారలకు శైవమంత్రముల నుపదేశించిన యెడల శైవమంత్రముయొక్క ప్రభను వైష్ణవతేజస్సుగల శిష్యులు ఓర్వ లేమింజేసి శ్రమపడుదురు. శిష్యుడు శైవప్రభగలవాడా వైష్ణవ ప్రభగలవాడా యని ఉపదేశకర్తయైన సాధారణగురువు కనుకోక లేడు. శిష్యుని ముఖాన విభూతిని చూచి శిష్యుడు శైవుడు అనుకో కూడదు. త్రిపుండ్రములను దాల్చినవారు మహావైష్ణవశిరోమణు లుగా నుండవచ్చును. వైష్ణవమా శైవమా అను ప్రసక్తి జీవాత్మ యొక్క రేఖాపరీక్షవల్ల నెఱుంగవలసిన విషయమే గాని దేహము యొక్క వేషమును చూచి ఎఱుగతగినది కాదు. కర్మవశమున దేహము జన్మజన్మమునకు మారవచ్చును. దేహసంబంధమైన రేఖ శైవముగా నొకజన్మమందును వైష్ణవముగా మరియొక్క జన్మమందు నుండును. ఎల్లపుడు నొకటే స్వభావము గలవాడు జీవాత్మ. కనుక జీవాత్మ శైవుడా వైష్ణవుడా అనునది యెఱిగి మంత్రోప దేశముచేయు యోగ్యతగల గురువునే ఆశ్రయించవలయును.

మంత్రములు వానియందలి అక్షరముల లెక్కనుపట్టి వివిధ శక్తిమంతములుగా నుండును. ౧. విష్ణుషడక్షరమంత్రము, ౨. నృ సింహషడక్షరమంత్రము, ౩. రామషడక్షరమంత్రము, ౪. కృష్ణ షడక్షరమంత్రము, ౫. సుదర్శనషడక్షరమంత్రము, ఇట్లు వైష్ణ వమైరన షడక్షరమంత్ర భేదము లున్నవి. మరియు నష్టాక్షరి, దశా

క్షరి, ద్వాదశాక్షరి, చతుర్దశాక్షరి, షోడశాక్షరి, అష్టాదశాక్షరి, చతుర్వింశత్యక్షరి, షట్త్రింశదక్షరి అను భేదంబుల మంత్రరాజంబులనేకంబులు గలవు. శిష్యునిశక్తిని యెఱింగి యెంత వీర్యవంతమైన మంత్రము నుపదేశము చేయవచ్చునో అది యెరిగి ఉపదేశము చేయ నారంభించవలెను. శిష్యుని ప్రభయొక్క వీర్యమును పరీక్షించి మంత్రముయొక్క ప్రభకు గల వీర్యమును పరీక్షించి యీ రెంటికి పొంతనములు కుదిరియుండు మంత్రము నుపదేశించు వారే గురువులు.

మంత్రములకు ప్రభ ఉన్నట్టుగానే జపమాలికలకు కూడ ప్రభ ఉన్నది. ౧౬, ౩౨, ౫౪, ౧౦౮ పూసలుగల మాలలకు వేరు వేరు విధములు అయిన ప్రభలుండును. తులసిపూసలమాల, స్ఫటికపుమాల, రుద్రాక్షమాల, తామరపూసలమాల, పగడముల మాల, ఇట్టి మాలలకు వేరువేరు బ్రభలు గలవు. కనుక ౧. శిష్యుని ప్రభ, ౨. మంత్రముయొక్క ప్రభ, ౩. మాలయొక్క ప్రభ, వానివాని వీర్యములు ఇవన్నియు నేకగ్రీవముగా నుండునట్టు ఉపదేశకర్త చూచుకొనవలయును.

మనుష్యులు, మంత్రములు, మాలలు వీనికి ప్రభయుండునట్టుగానే ఇతర చిల్లరవస్తువులకు కూడ తేజస్సు ఉన్నది. మఱియు మనుష్యుల ప్రభను అనుసరించి వారలకు దర్భాసనమా కృష్ణాజినాసనమా వ్యాఘ్రాజినాసనమా ఇట్టి వివరములను గమనించి యనుష్ఠించవలయును.

మనము ఉపయోగించు వస్త్రములు, పాత్రములు, ఆభరణములు ఇవి యన్నియు వాని ప్రభను మనకు ఇచ్చి మనయొక్క

ప్రభను అవి పుచ్చుకొనును. మనము సదా ఉపయోగించు వస్తువులు, వస్త్రములు, శయ్య, ఆసనము, పాత్రము ఇవన్నియు మన యొక్క తేజస్సును పీల్చి తమయందుంచుకొనియుండును. అట్టి శయ్యాసనవసనపాత్రములను ఇతరులుపయోగించితే అందువలన వారలకు రేఖాభేదమును అనుసరించి మేలో కీడో కలుగవచ్చును గాని మనశయ్యాసనవసనపాత్రములను ఇతరు లుపయోగించిన యెడల నివృత్తిమార్గానుష్ఠానము గల మనము మరల వాటిని ఉపయోగించకూడదు. కాబట్టి ధర్మశాస్త్రములయందు "ఆసనం వసనం శయనం పాత్రం" అని నిర్దేశించియున్నారు. ఈ మాటలు విను లౌకికజనులు ఇదేమి హాస్యమా అనుకొందురు. అంతమాత్రమువనే శాస్త్రము అబద్ధము కాలేదు.

ఆస్ట్రిల్ బాడీనిని మనోమయశరీరమునును గురించి వ్రాసినపుడు సౌష్ఠవమధికము కాను కాను ఈ శరీరములు బింబమునందు పెరుగును అని చెప్పబడియె. సాధారణజనుని తేజస్సు అతని శరీరముల బింబముల కొలతను అనుసరించి విశాలమునుపొందియుండును అనినపుడు సాధారణముగా కుడితట్టు రెండుమూళ్ల దూరమును ఎడమతట్టు రెండుమూళ్లదూరమును ఎదురుతట్టు రెండు మూళ్లదూరమును వెనుకటితట్టు రెండుమూళ్లదూరమును ఒకని ప్రభ వ్యాపించియుండును. ఇట్టివా రిద్దరు ఒకరికొకరు ఎదురుపడినపుడు ఆ యిద్దరి స్థూలశరీరములకు మధ్యన నాలుగు మూళ్లదూరమున్నయెడల ఒకరి ప్రభ మరియొకరిని స్పర్శించకయుండును. అంతకంటె సమీపమునకు వచ్చినయెడల స్పర్శించును. అందువలన వైదికబ్రాహ్మణుల సంప్రదాయమునందు మైలవారికిని మడుగు

వారికిని మధ్యన ఒకకాడిమానిదూరమైన నుండవలెనందురు. కాడి మాను సాధారణముగా నాలుగుమూళ్ల నిడివియుండును. ఇవన్ని యు పూర్వాచారపు మాటలు. యుక్తియుక్తములే.

ఉపాసకుడు నిష్ఠయందు స్థాయిగానిలిచి మెట్టుమెట్టుగా నెక్కు చు జ్ఞానవైరాగ్యభూతదయలలో కోపకారస్వభావములు భాసిల్లను భా సిల్లను నాలుగుమూళ్లవిస్తీర్ణము గల ప్రభ నలువదిమూళ్లవిస్తీర్ణమై అతి మనోహరములైన రంగులతో నిండి నిబిడీకృతమై కాంతిమంత మును శక్తిమంతమునుగా నగుచుండును. జ్ఞానదీక్షలు చెందినవారి యొక్క ప్రభ దీక్షలను అనుసరించి విస్తీర్ణమునం దధికమగుచుం డును. జీవన్ముక్తులుండు ఆశ్రమములయందు వారి ప్రభ మైళ్లకొలది ని విస్తరించి యుండును. ఆ విస్తీర్ణమునకులోపల వారియొక్క మాహాత్మ్యము నిండియుండును. వారి శాంతి అంతదూరము ప్ర సరించియుండును.

ఇట్టి గురువులవారిని ఆశ్రయించిన శిష్యులు గురుకులవాస ము చేయుచుండుటచే నెల్లపుడు తమ గురుదేవులవారి ప్రభామండ లాంతర్గతులై వసియించుటవలన శ్రీ గురుమహారాజుగారి దేహ ముల స్పందములతో సరిగానుండు స్పందశక్తిగల అణువులు మాత్రము శిష్యులశరీరములందు నిలుచును. అందుకు అనుగుణ ము గాని స్పందములు గల యణువులు శిష్యుల శరీరముల యందునుండి రాలిపోవును. రాలిపోయిన అణువులయొక్క స్థలము నందు శుభ్రమైన అణువులు వచ్చిచేరును. ఈ రహస్యమును గమ నించియే శిష్యులుగా తమవద్దకు వచ్చి యుపదేశమిమ్మని ప్రార్థించు శిష్యులను గురువులవారు తమ యాశ్రమములయందు ఒక సంవ

త్సరకాల మైనను నివసించియుండవలెననియు ఆ సంవత్సరకాల మును "తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా" అనినట్టు తపస్సు, బ్రహ్మచర్యము, శ్రద్ధ అను అనుష్ఠానములను అనుష్ఠించుచు నుండ వలె నని చెప్పుట సంప్రదాయము. (ఈ గ్రంథము ౭౨ వ పుట చూడుడు.)

> నిరారంభా హ్యపి వయం పుణ్యాశీలేషు సాధుషు ।
> పుణ్య మే వాప్నుయా మేహ పాపం పాపోపసేవనాత్ ॥
> అసతాం దర్శనాత్ స్పర్శాత్ సంజల్పాచ్చ సహా సనాత్ ।
> ధర్మాచారాః ప్రహీయంతే సిద్ధ్యంతి చ న మానవాః ॥
> బుద్ధి శ్చ హీయతే పుంసాం నీచై స్సహ సమాగమాత్ ।
> మధ్యమై ర్మధ్యతాం యాంతి శ్రేష్ఠతాం యాంతి చోత్తమైః ॥

ప్రతివస్తువునకును, ప్రతి దేహమునకును ఆబ్రహ్మస్తంబపర్యంతము అయిన ప్రతి దేహికిని ప్రభామండలి యున్నదనియును ఆ ప్రభా మండలి యనునది దేహములు, జీవాత్మ, వీర్ల పరిపాకమును అనుసరించి రమణీయములో తదితరములో అగు వర్ణములను కలిగి యుండును అనియు నెఱుగవలయును.

> ఇందీవరేంద్రమణిసుందర మిందిరేశం ।
> మందీకృతేంద్ర రిపుబృందమ మందవీర్యం ।
> మందస్మితప్రసర నందిత లోకబృందం ।
> వందే దినేంద్ర కులనందన రామచంద్రం ॥

---

## ౧౨ వ అధ్యాయము

అద్యైవ త్వత్పదనళినయో రర్పయా మ్యంతరాత్మ ।
న్నాత్మానం మే సహపరికరై రద్రికన్యాధినాథ ।
నాహం బోద్ధుం శివ తవ పదం నక్రియాయోగచర్యాః ।
కర్తుం శక్నో మ్యనితరగతిః కేవలం త్వాం ప్రపద్యే ॥

## శ్రవణమనననిదిధ్యాసలు

"బహుస్యాం" అను సంకల్పమునందు గల ఇచ్ఛవల్ల "ఏకం వ్యానేకం" అయినందున ప్రజ్ఞానాంశువులు అను మోనడ్డులు లక్షలకొలదిని బయలువెడలి ప్రవృత్తిమార్గమునందు ప్రవేశించి "భుక్త్వా భోగాన్" అని సంసారమందు సుఖరూపకములైన దుఃఖములను అనుభవించి విసికి నివృత్తిమార్గము ఒకటి యున్నదని దైవవశాత్తుగా విని నివృత్తిమార్గమును ప్రవేశించవలయునని ప్రయత్నము చేసినపుడు రెండుతరహాల సాధనములను సాధించవలసి యుండును. ఒక తరహా సాధనము శ్రవణాదిత్రితయము. ఇది సాక్షాత్సాధనము. రెండవ తరహా సాధనము సాధనచతుష్టయము. ఈ రెండు సాధనములపైకి రెండవసాధనమైన సాధనచతుష్టయమును సంపాదించిన పిమ్మటనే బ్రహ్మవిచారము అనగా శ్రవణము. (ఈ

A 28

విషయమును ౭ వ పుటయందు చూడవలయును.) కనుక సాధన చతుష్టయ సంపత్త్యనంతరము శ్రవణమననముల నారంభించుట సంప్రదాయము. సాధనచతుష్టయముల పైకి శమాదిషట్కసంపత్తిలోచేరిన సమాధానము అను సాధనమును శ్రవణాదిత్రితయము పైకి నిదిధ్యాసయనునదియు సమకాలానుష్ఠేయములుగా నుండును. ఇపుడు శ్రవణాదిత్రితయముయొక్క అర్థమును వ్రాయనగును.

శ్రవణము అనగా వినుట. అట్లనగా శిష్యుడు తనయొక్క శేఖకు సంబంధించిన గురుమహారాజుగారియొక్క ప్రతినిధియైన చోదకగురువులవారిని ఆశ్రయించును. (ఈ పుస్తకము ౮౩ వ పుట చూడవలయును.) వారు శిష్యుడు మరిచిపోయిన ప్రమేయములను జ్ఞాపకపరుచునట్టి వేదాంతగ్రంథములను వినిపించి శిష్యునియొక్క మనస్సునందు పుట్టిన ౧. కోహం, ౨. కుతస్త్వ్యః, ౩. కుత్రత్యః, ౪. కిముద్దిశ్య సమాగతః, ౫. కోనామ బంధః, ౬. కథమేష ఆగతః, ౭. కథం ప్రతిష్ఠాఽస్య, ౮. కథం విమోక్షః, అను ప్రశ్నలకు అన్నిటికిని సమాధానము చెప్పి చేయు నుపదేశమును వినుటకు శ్రవణము అని పేరు.

మననము. "మననం నామ యుక్తిభి రనుచింతనం" అని చెప్పబడియె. విన్నవాక్కులను చదివినగ్రంథములనును యుక్తి నుపయోగించి చింతించి గూఢార్థములను వెలిదీసి తెలిసికొనుట.

నిదిధ్యాస. "ధ్యాతు మిచ్ఛా దిధ్యాసా," "నితరాం దిధ్యాసా నిదిధ్యాసా". ధ్యానము చేయుటకుగా కలిగిన యిచ్ఛకు దిధ్యాస యని పేరు. నితరాం అనగా నెల్లపుడును ధ్యానముచేయునిచ్ఛకు నిదిధ్యాస యని పేరు. అనగా ధ్యానము అని యర్థము. నిదిధ్యాస

యోగము

యను పదమునకు కొందరు నిశ్చయజ్ఞానముతో ధ్యానము చేయుట అని అర్థమును వ్రాసియున్నారు. కనుక ధ్యానము అను అర్థమును అనుసరించి యోగములన్నియు గణింపబడును.

యోగము అనగా:

జ్ఞానేంద్రియాణి సర్వాణి నిగృహ్య మనసా సహ ।
ఏకత్వభావనా యోగః క్షేత్రజ్ఞపరమాత్మనోః ॥
యదా పంచా వతిష్ఠంతే జ్ఞానాని మనసా సహ ।
బుద్ధిశ్చ నవిచేష్టతే తా మాహుః పరమాం గతిం ॥
తాం యోగ మితి మన్యంతే స్థిరాం ఇంద్రియ ధారణాం ।
అప్రమత్త స్తదా భవతి యోగో హి ప్రభవాప్యయౌ ॥

అనగా క్షేత్రజ్ఞుడైన జీవాత్మ తనను బంధించియుండు తత్త్వము లైన జ్ఞానేంద్రియములు, మనస్సు అను వాటిని నిగ్రహించిన పిమ్మట తాను ఏ పరమాత్మయొక్క అంశయో ఆ పరమాత్మతో ఐక్యభావమును అనుభవించుటకు చేయు ప్రయత్నము.

యోగములు ముఖ్యములైనవి నాలుగు.

౧. అష్టాంగయోగము. (ధ్యానయోగము)
౨. కర్మయోగము.
౩. భక్తియోగము.
౪. జ్ఞానయోగము.

ఈ నాలుగింట ఏ ఒక యోగమును అనుష్ఠించుట కారంభించి నను ఆ యోగమును నడుపుచురాగా మిగిలిన అన్ని యోగములు ను ప్రయత్నము లేకయే అనుష్ఠింపబడుచున్న యోగమునందు

కలిసిపోవును. అష్టాంగము అను ధ్యానయోగమును గురించి మొదట వ్రాయబడును.

## అష్టాంగయోగము

యమ నియమాసనప్రాణాయామప్రత్యాహార ధారణా ధ్యాన సమాధులు అని అంగములు ఎనిమిది. యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము అనునవి బహిరంగ సాధనములు అనియు, ధారణా ధ్యాన సమాధులు అంతరంగ సాధనములు అనియు వాడుదురు.

ఎనిమిది అవయవములు కలది గనుక ఈ యోగమునకు అష్టాంగయోగమని పేరు. ప్రతి అంగమును ముఖ్యము. కొన్ని అంగములు అంతే ముఖ్యములు కావు అని కొందరు చెప్పుదురు. అది సరికాదు. వంటచేసి భోజనముచేయుటకు కావలసిన ఉపకరణములయందు తండులములు ముఖ్యములు, వంటపాత్రలు ముఖ్యములు, అగ్ని ముఖ్యము, వంటచెరుకులు కూడ ముఖ్యములు. "కుట్టిణీ పేషణీ చుల్లీ ఉదకుంభీ చ మార్జనీ" అనగా రోకలి, సన్నికల్లు, గుండ్రాయి, ప్రొయ్యి, నీళ్లకడవ, ఇవన్నియు అవశ్యములే గనుక అష్టాంగములందు అనావశ్యకములు కొన్ని అనునది లేదు.

### యమము

> అహింసా సత్యమస్తేయం అసంగో హ్రీర సంచయః ।
> ఆస్తిక్యం బ్రహ్మచర్యం చ మౌనం స్థైర్యం క్షమాఽభయం ॥
>
> (శ్రీమద్భాగవతము. స్కం. ౧౧., అధ్యా. ౧౯)

అనునవి యమములు.

అష్టాంగయోగము—యమము

అహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహాః యమాః ।
(పాతంజలసూత్రములు)

ఇంతకంటె వివరముగా శాండిల్యోపనిషత్తునందు చెప్పబడియున్నది.

తత్రాహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్య దయాఽఽర్జవ క్షమా ధృతి మితాహార శౌచాని చేతి యమా దశ ॥

తత్రాహింసా నామ — మనోవాక్కాయకర్మభి స్సర్వభూతేషు సర్వథా క్లేశాజననం ॥

సత్యం నామ—మనోవాక్కాయకర్మభి ర్భూతహిత యథార్థాభిభాషణం ॥

అస్తేయం నామ—మనోవాక్కాయ కర్మభిః పరద్రవ్యేషు నిస్పృహా॥

బ్రహ్మచర్యం నామ—సర్వావస్థాసు మనోవాక్కాయకర్మభిః సర్వత్ర మైథునత్యాగః ॥

దయా నామ—సర్వభూతేషు సర్వత్రానుగ్రహః ॥

ఆర్జవం నామ—మనోవాక్కాయకర్మణాం విహితావిహితేషు జనేషు ప్రవృత్తౌ నివృత్తౌ వా ఏక రూపత్వం ॥

క్షమా నామ—ప్రియాప్రియేషు సర్వేషు తాడనపూజనేషు సహనం ॥

ధృతిర్నామ—అర్థహానౌ స్వేష్టబంధువియోగే తత్ప్రాప్తౌ సర్వత్ర చేతసస్థాపనం ॥

మితాహారం నామ—చతుర్థాంశావశేషక సుస్నిగ్ధ మధురాహారః ॥

శౌచంనామ—తద్ద్వివిధం ; బాహ్యమాభ్యంతరంచేతి. తత్ర మృజ్జలాభ్యాం బాహ్యం ; మనశ్శుద్ధిరాంతరం, తదధ్యాత్మ విద్యయా లభ్యం ॥
(శాండిల్యోపనిషత్తు)

యమము అతి ముఖ్యమైనది. యమము సిద్ధించకయే నియమము ఉపయోగము లేదని శాస్త్రములు ఘోషించుచున్నవి. యోగాభ్యాసమువల్ల ఉపాసకునికి కలుగు శక్తులు బహుమెండు. నిరర్గళమైనశక్తి కలిగినపుడు "సర్వం బ్రహ్మేతి" భావన లేకపోయి స్వార్థపరాయణులైనయెడల ఇతరులను తొందరపెట్టుటకుద్యుక్తులు కావచ్చును. అట్టి దుస్థితిని రానీయకయు తద్ద్వారా ఉపాసకునికి చ్యుతిలేకయు ఉపాసకునియందు మంచిగుణములను వృద్ధిపొందునట్టు నడిపించి క్షేమము నిప్పించవలయును. కనుక అహింస యను సుగుణము ముఖ్యము. త్రికరణశుద్ధిగా సర్వవిధములచేతను సర్వభూతములకును దుఃఖము కలుగనీయకుండుట అహింస.

సత్యము—త్రికరణములచేతను సర్వకాల సర్వావస్థలయందును భూతహితమైన సత్యమునే మాటలాడుట. అప్రియములైన సత్యములను మాటలాడకుండవలయు.

అస్తేయము—త్రికరణశుద్ధిగా పరద్రవ్యాపేక్ష లేకుండవలయును.

బ్రహ్మచర్యము—త్రికరణశుద్ధిగా అనగా కర్మేంద్రియ జ్ఞానేంద్రియముల చేతను స్త్రీసంగము వదలుట.

దయ—సర్వభూతములయందును మావారు, మా జాతివారు, మీయూరివారు అను భేదములేకయే అందరియందును అన్నిటియందును అనుగ్రహ ముండుట.

ఆర్జవము—తనకు విహితులనిగాని విరోధులనిగాని గమనించక యెల్లవారియందును నిష్పక్షపాతముతో నడుచుకొనుట.

అష్టాంగయోగము—యమము

క్షమ—ప్రియులుగాని అప్రియులుగాని ఉపాసకుని దూషించినను గాని భూషించినను గాని మనస్సున ప్రియములైనవి గాని అప్రియములైనవిగాని యైన కలతలు కలుగకుండుట.

ధృతి—తనయొక్క సొత్తు నష్టమైనపుడుగాని బంధు వియోగమునందుగాని ఖిన్నుడుగా కుండుట.

మితాహారము—"హితమితభుక్" అనినట్లు రుచికరములైన పదార్థములు లభించినపుడు మితిలేక భుజించుట మానవలయును. అనగా రసనేంద్రియమును స్వాధీనపరచుకొని యుండుట. యమనియమముల నభ్యసించి ఆసనమును కుదుర్చుకొని ప్రాణాయామము నారంభించువాడు ఎన్నడో అతి సమీపకాలమందే సమాధిదశకు రావలసినవాడు. సమాధి సమయమందు దేహమును గారాబముతో గమనించుటకు వీలుండదు. దేహమునకు "అనేక దోషదుష్టస్య కాయస్యైకో మహాన్ గుణః। యో యథా ప్రవర్తతే తం తథాఽను వర్తతే ॥". కనుక ఆహారములు, కాఫీలు, చిరుతిండ్లు ఇచ్చి పెంచినపుడు ఆ యా ఘంటకు ఆ యా ఆహారము కావలెనని కోరును. అందువల్ల ఉపాసకుడు ధారణాధ్యానములను విడిచి దేహమును గమనించవలసివచ్చును. ధర్మాచరణమునకుగా సంపాదించుకొనిన దేహము ధర్మ ప్రత్యవాయకారిగా నేర్పడును. కనుక మితాహారము నిచ్చి దేహమునకు గల ఆహార తృష్ణను మరువగొట్టవలెను. ఇందుపైన శౌచం అను గుణమును గురించి ఈ గ్రంథము పూర్వభాగము, ౩౧౧ వ పుట చూడవలయును.

నియమము అనునది రెండవ అంగము

తప స్సంతోషా స్తిక్య దానేశ్వరపూజన సిద్ధాంతశ్రవణ హ్రీ మతి జప వ్రతాని దశ నియమాః ॥

తపోనామ—విధ్యుక్త కృచ్ఛ్రచాంద్రాయణాదిభి శ్శరీరశోషణం ॥

సంతోషోనామ—యదృచ్ఛాలాభతుష్టిః ॥

ఆస్తిక్యంనామ—వేదోక్తధర్మేషు విశ్వాసః ॥

దానంనామ—న్యాయార్జిత ధనధాన్యాదేః శ్రద్ధయా అర్థిభ్యః ప్రదానం ॥

ఈశ్వరపూజనంనామ—ప్రసన్న స్వభావేన యథాశక్తివిష్ణురుద్రాది పూజనం ॥

సిద్ధాంతశ్రవణంనామ—వేదాంతార్థవిచారః ॥

హ్రీర్నామ—వేదలౌకిక మార్గే కుత్సిత కర్మణి లజ్జా ॥

మతిర్నామ—వేదవిహితమార్గేషు శ్రద్ధా ॥

జపోనామ—విధివద్గురూపదిష్ట వేదావిరుద్ధ మంత్రాభ్యాసః । స ద్వివిధః । వాచికో మానసశ్చేతి । మానసస్తు మనసా ధ్యానయుక్తః । వాచికో ద్వివిధః । ఉచ్చైరుపాంశు భేదేన । ఉచ్చైరుచ్చారణం యథోక్త ఫలం । ఉపాంశు సహస్రగుణం । మానసం కోటిగుణం ।

వ్రతంనామ—వేదోక్త విధినిషేధానుష్ఠాననైయత్య మితి ।

యమములు ముఖ్యముగా శీలమును స్థిరపరుచును. నియమములు ముందు సంపాదింపబడిన శీలయుతమైన అంతఃకరణముతో చేయబడు తపస్సులు, వ్రతములు మొదలైనవి. తపస్సు అనగా కొంత మట్టుకు స్థూలదేహమును శోషించునట్టు చేయుట. ఇక ముందు ఉపాసకుడు ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణా ధ్యానంబుల

అష్టాంగయోగము—నియమము

నాచరించి సమాధిస్థితికి వచ్చినపుడు అపూర్వానుభవమైన సమాధి భాగ్యము కుదిరి మై మరచి యుండవలసిన సమయమందు స్థూల శరీరము తనకు కాఫీ కావలెనని గాని రుచులు గల ఆహారములు కావలెనని గాని కోరి ఉపాసకుని అనుష్ఠానమునకు విరోధము కలుగనీయ కుండుటకుగా తపస్సులు ముఖ్యము. "యదృచ్ఛాలాభసంతుష్టః" అని శ్రీమద్భగవద్గీతయందు చెప్పిన ప్రకారము "ఆశా పిశాచీ మవమానయంతం" ఆశ యను పిశాచిని తనను ఆశ్రయించక దిట్టపరిచియుండుట ఉపాసకునికి అవశ్యము.

దైవభక్తిలేనివాడు యోగమునకు ప్రయత్నపడడు అని చెప్పుటయందు అతిశయోక్తి లేదు. ఇకముందుమెట్టు ధ్యానము గనుక ఆస్తిక్యము, ఈశ్వరపూజనము ఆవశ్యకములు. ఆస్తిక్యము లేని ధ్యానము అరుదు.

వేదాంతశ్రవణమునందు అభిరుచి ఉండవలెను. మఱియు అధర్మమును ఆచరించునట్టు దుర్బుద్ధి ప్రేరేపించినయెడల అధర్మ కార్యములను చేయుటకు సిగ్గుచెందునట్టుగా మనస్సును సిద్ధపరచి యుంచవలెను. గురువులవారియొక్కయు శాస్త్రములయొక్కయు వచనములయందు శ్రద్ధ యుండవలెను. "నిద్రాయా లోకవార్తాయాః కించి న్నావసరం దత్వా" అనినట్టు తూగుపోతుతనమునకు గాని లోకవార్తకుగాని ఆస్పదమునియ్యక జపమునందు అమరియుండుట నియమమని పేరుపొందును.

ఆసనము—హఠదీపికయను గ్రంథమునందు ఎనుబది నాలుగు విధముల ఆసనములను చెప్పియున్నారు. అందులో వీరాసన

స్వస్తికాసన పద్మాసన యోగాసన భద్రాసన సిద్ధాసనము లనునవి ముఖ్యములు.

"స్థిరసుఖమాసనం" అని పాతంజల సూత్రములయందు చెప్పినట్టు స్థిరమైనదై కొంతతడవు నిశ్చలముగా కూరుచుండుటకు అనుకూలమైన ఆసనమునందు కూర్చొని యమనియమయుతుండై యోగమును అనుష్ఠించవలయును. "ఆసీనస్సంభవాత్" అని యొక సూత్రమున్నది. నిలపడికాని పండుకొనిగాని సంచరించుచు గాని ఉపాసన అసంభావితము. కూరుచున్నపుడే మనస్సును స్థిరముగా నుంచుకొనుటకు సాధ్యము. నిలపడినట్లైతే యోగమునకు కావలసినంత సంతత ఏకాగ్రత అసాధ్యము. పండుకొని ఏకాగ్రముచేయవలెనంటే నిద్రవచ్చును.

ఆసనములనుగురించి విపులముగా వ్రాయనవశ్యము కనపడలేదు. సుఖాసనము అనగా వాని వానికి సుఖము ఎట్లో అట్లుకూర్చొనుట. ఆసనముల నియమమునందు ముఖ్యోద్దేశము ఒకటియున్నది. దేహమందలి విద్యుచ్ఛక్తి దేహశాఖాగ్రములైన చేతికొనలు కాళ్లకొనలు అగు చేతివ్రేళ్లు కాళ్లవ్రేళ్లగుండా ఎల్లపుడును బైటికిపోవుచుండును. ఇట్లుపోతే యోగము సమకూరదు. విద్యుచ్ఛక్తిని ఎంత భద్రముగా దేహమునందే సంచరించుచుండునటుల చేయుదుమో అంతమట్టుకు యోగమునకు అనుకూలము. ఆసనములయందు ఒక కాలిపాదమును మరియొక తొడకు తాకునట్టుచేసి నమస్కార రూపముగా చేతులు మొగిడిచినయెడల విద్యుచ్ఛక్తి దేహమందే సంచరించుచు యోగమునకు ఉపయుక్తమైనంత విద్యుచ్ఛక్తి దేహమునందే నిలిచియుండును. ఇదే ఆసనముయొక్క ప్రయోజనము.

అష్టాంగయోగము—ఆసనము

ఆసనమునుగురించి చెప్పునపుడు యోగమునకు కూర్చొనుటకు అనుకూలమైన స్థలమునుగురించి ప్రస్తావించవలసియున్నది. శ్రీ భగవద్గీతయందు "శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసన మాత్మనః" అని చెప్పబడియున్నది. "వివిక్తదేశే చ సుఖాసనస్థః" అని కైవల్యోపనిషత్తునందును "సమే శుచౌ శర్కరవహ్నివాలుకావివర్జితే శబ్దజలాశ్రయాదిభిః। మనోనుకూలే నతు చక్షుపీడనే గుహానివాతాశ్రయణే ప్రయోజయేత్" అని శ్వేతాశ్వతరమునందును చెప్పబడియున్నది.

వివిక్తదేశమనగా జనసమ్మర్దముగాని స్థలము. మిట్టపల్లములుగాని, పరిశుద్ధికాని గులకరాళ్లు, అగ్ని, ఇసుక, ఇట్టివి ఉండని స్థలమునందును, శబ్దమధికముగానుండి అందువలన ఏకాగ్రతకు భంగము కలుగునది కానిస్థలమును, నీరు నిలిచి తేమ ఏర్పడిన స్థలమును కూడదు. ఆ స్థలము మనస్సున కాహ్లాదము కలుగజేయునదిగా నుండవలెను. కండ్లు పెరుకగల దోమలు ఈగలు లేనిదిగా నుండవలెను. పెనుగాలికొట్టితే అది ఉపాసకుని శరీరమునకు తగిలి ఏకాగ్రతను చెడుపునట్టుగా నుండకూడదు.

"యదాసనం యస్య సులభం సుఖావహంచ తత్సుఖాసనమితి జ్ఞేయం." ఏ ఆసనము ఎవ్వనికి సులభమో ఆ ఆసనము అతనికి సుఖాసనమని పేరు.

యోగమునకుగాని జపమునకుగాని నిత్యాహ్నికమునకుగాని ప్రతినిత్యమును ఉపయోగించిన రీత్యా ఆహ్నిక స్పందములు, ఆహ్నిక తేజస్సు వీట్లతోనిండిన స్థలమునే నియతముగా నేర్పరుచుకోవలెను. దినప్రతిదినమునకు ఏలాటి కార్యమునకు ఏ స్థలము

నుపయోగించుచుందుమో ఆ స్థలమునందు ఆ కార్యముచేయుట సులభము. కనుక నియతమైన స్థలమునందు సుఖాసనమునందు కూర్చొని ఆహ్నిక క్రియలు జరుపవలయును. ఇందుకుదాహరణముగా అనేకుల అనుభవమునందుండు సంగతి యొకటి యున్నది. అనేకులకు ఒక అభ్యాసము కలదు. వారలు ప్రతిరాత్రియు నిద్రించు స్థలము ఏదో ఒక కారణముతో మారవలసివచ్చినట్లైతే క్రొత్త స్థలమునందు వారలకు నిద్ర పట్టదు. ఇదేవిధముగా జపమును చేయువారికికూడ అనుభవము.

ప్రాణాయామము—శ్వాసప్రశ్వాసయోర్గతివిచ్ఛేదః ప్రాణాయామః అని సూత్రమున్నది. "అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే। ప్రాణాపాన గతీరుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః" అని గీతలలోనును చెప్పబడియున్నది. ఆసనస్థైర్యమును సంపాదించుకొని ఊపిరిని పీల్చియు లోపల కొంతతడవు నిలిపియు లోపల నిలుపబడిన ఊపిరిని వెలుపలికి విడిచియునిట్లు అనుష్ఠించుటకు ప్రాణాయామ మని పేరు. ప్రాణాయామములు అనేక విధములు. ప్రాణాయామాభ్యాసము వల్ల అనేక లాభములున్నవి గాని సరియైన గురువులవారివద్ద నేర్చుకొని అభ్యసించినయెడలచాల అనుకూలము.

ప్రాణాయామమునందు భాగములు మూడు. ౧. పూరకము, ౨. కుంభకము, ౩. రేచకము.

పూరకము—వెలుపటి వాయువును లోపలికి పీల్చుట.

కుంభకము— పీల్చినగాలిని లోపల నిలిపియుంచుట.

రేచకము—పీల్చి లోపల నిలిపియుంచిన వాయువును బైటికి విడుచుట.

అష్టాంగయోగము—ప్రాణాయామము

ఈ మూడు కార్యములును చేరి ప్రాణాయామము అగును. దేహమునందు రొమ్మునందు శ్వాసకోశములు ఉన్నవి. రొమ్మునందు హృదయము అను పేర నెఱుగబడు గుండెకాయ ఉన్నది. గుండెకాయయొక్క నిరంతర ఆయామవ్యాయామముల వల్ల దేహమంతయు రక్తము ప్రవహించుచుండును. గుండెకాయ, శ్వాసకోశములు, నరములు ఇవన్నియు నన్యోన్యాశ్రయములు. ఈ మూటిలో నేది పనిచేయుటను మానుకొన్నను మిగిలినవి రెండును పనిచేయుట మందగించును. నిద్రాసమయమునందు మనుష్యులకు వారి వారి దేహతత్త్వములకు అనుకూలమై నట్టుగా పూరక కుంభక రేచకములు జరుగుచుండును. నిద్రపోవు వారిని గమనించిచూచినయెడల వెలుపలి గాలిని లోపలికి పీల్చి కొంత తడవు లోపల నిలిపి పిమ్మట బైటికి పారదోలునట్టు కన బడును. పూరకమునందు వెలుపలనుండు ఆరోగ్యమైన వాయువును పీల్తుము. రక్తము గుండెలోనుండి బయలు వెడలి దేహములో రక్తనాళముల వెంబడి ప్రవహించి అచ్చటచ్చట ఉండిన మలినము నంతయు తనలో నిముడ్చుకొని మరల గుండెను ప్రవేశించును. గుండెకు ఇంగ్లీషు భాషయందు హార్టు (Heart) అందురు. సంస్కృతమునందు హృదయము అందురు. హృదయమునందు నాలుగు గదులుగా భాగములున్నవి. రెంటిలో పరిశుద్ధమైన రక్తమును రెంటిలో మలినమైన రక్తము నుండును. హృదయస్థానమందుండి పరిశుద్ధమైన రక్తము బైటికి వెళ్లి రక్తనాళముల త్రోవన సంచరించుచు మలినములనంతయు తనలో నిముడుచుకొని పోవుచు మలిన

రక్తమును హృదయమునకు తీసుకొని పోవునట్టి రక్తనాళములలో పడును. రక్తనాళములు రెండు విధములుగా నుండును. శుద్ధరక్తమును కలిగినవి ఒక విధము, మలినరక్తమును కలవి మరియొక విధమైనవి. శుద్ధరక్తమును తీసికొని పోవు రక్తనాళములు హృదయస్థానమునుండి బైలువెడలును. మలిన రక్తముగల రక్తనాళములు హృదయము నందు ప్రవేశించును. ఇట్లు రెండు విధములైన రక్తనాళములగుండా ఎల్లపుడును ఎడతెగక రక్తము అధిక వేగముతో ప్రవహించుచుండు ను. హృదయమునకు తిరిగికొని పోయిన మలినరక్తమును శ్వాసకోశ ములలోని శుద్ధవాయువు శుద్ధిచేయును. శ్వాసకోశము, హృదయ ము ఇవన్నియు నరములయొక్క బలమువల్ల ఆయామవ్యాయామ ములు నెరవేర్చుచుండును. ఇట్లు నరములు, శ్వాసకోశములు హృదయము ఇవన్నియు నన్యోన్యాశ్రయము గలవి అని యిదివరకే చెప్పబడెను.

నిద్రపోవువానియొక్క శ్వాస ఆ దేహతత్త్వమును అనుస రించి అనగా ఎన్ని స్పందములు ఆ శరీరము ఓర్చునో ఆ ప్రకారము పూరకము, కుంభకము, రేచకము ఇట్టి ప్రాణాయామమును అప్ర యత్నముగా జరుపుచుండును. మరియు శ్వాసకును మనస్సునకును అతి సామీప్యసంబంధముకలదు. నిద్రాకాలమందు మనస్సు పని చేయలేదు గనుక ఉచ్ఛ్వాసనిశ్వాసలు నెమ్మదిగా నుండును. జాగ్రదవస్థయందు మనస్సు పనిచేయుచుండును గనుక శ్వాస యొక్క నెమ్మదిచెడి ఏరుపేరులేర్పడును. మనస్సునకును శ్వాస కును ఉండు సంబంధమును పట్టియే ప్రాణాయామమును అభ్య సించినయెడల అందుకు పై అంగమైన ప్రత్యాహారము సిద్ధించును.

అష్టాంగయోగము—ప్రాణాయామము

ప్రాణాయామమువల్ల వాత పిత్త శ్లేష్మములు దేహము నందు సమధాతువులుగా నిలుపవచ్చును. మంచి పదునైన కత్తి తో వ్యవహారము ఎంత జాగ్రతతో నడుపవలసియుండునో అట్లు ప్రాణాయామముతో వ్యవహారము. పదునుగల కత్తితో పండ్లు తరుగు సమయమునందు కొంచెము అజాగ్రతగా పనిచేసినయెడల చేతిని కోసుకోవచ్చును కదా. అదేవిధముగా ప్రాణాయామము నందు కూడ పూరకము యొక్క ప్రమాణమును అనుసరించి రేచక కుంభకములు నడువకపోయినా గాని లేక ఉపాసకుని రేఖకు విరోధమైన మాత్రావిశేషముతో ప్రాణాయామము జరిపినాగాని అజీర్ణము గాని తలనొప్పి గాని లేక క్షయరోగము గాని సంభవించును. ప్రాణాయామములు ఉపాసకుల రేఖలను అనురేఖలను ఉద్దేశించి అనేక విధములుగా నుండును. శిష్యుడు ఏ రేఖకు చేరిన వాడు, ఏ అనురేఖ (ఉపరేఖ) కు చేరినవాడు అను సంగతిని కనుగొను యోగ్యతగల గురువులవారే గాని యితరులు సరియైన ప్రాణాయామమును ఉపదేశించలేరు. తెలిసి తెలియని గురువులు ప్రాణాయామములను ఉపదేశించినపుడు శ్రద్ధతో శిష్యుడు అనుష్ఠించుచు వచ్చినయెడల రావలసిన ఫలము రాకపోయినను లేని శ్రమలైనను కలుగవచ్చును. కనుక ప్రాణాయామ విషయము నందు అతి జాగరూకతతో నిర్దేశించుకోవలెను.

ప్రాణాయామ సందర్భమునందు ఇడా, పింగళా, సుషుమ్నా, కుండలినీ, మేరుదండము అను కొన్ని పదములయొక్క అర్థమును విచారించవలెను.

పాదాద్బ్రహ్మరంధ్రాంతం యదస్తి కీలకోపమం ।
చతుర్దశానాం లోకానాం మేరుదండః ప్రచక్షతే ॥

పాదములు (అనగా నడుము) మొదలు బ్రహ్మరంధ్ర పర్యంతమును పూసలుగుచ్చినట్టు వెన్నెముక యున్నది. దానికి మేరుదండము అనియు వీణాదండము అనియు పేళ్లు.

ఇడా చ పింగళా చైవ తస్యవామే చ దక్షిణే ।
బుజ్వీభూతే శిరే తేచ వామదక్షిణభేదతః ।
సర్వ పద్మాని సంవేష్ట్య నాసారంధ్రగతే శుభే ॥

మేరుదండముయొక్క ఎడమ ప్రక్కన ఇడా అను నాడియు కుడి ప్రక్కన పింగళా అను నాడియు ఉన్నవి. అవి మూలాధారచక్రము మొదలు సకల చక్రములనును వేణీబంధక్రమముగా అనగా జడ వేసినట్టుగా పెనవెట్టికొని యున్నవి. ఇవి ఎడమ ముక్కురంధ్రమునందు ఇడగానును కుడి ముక్కురంధ్రమునందు పింగళగానును ప్రత్యక్షమగుచున్నవి. అనగా మనము శ్వాస విడుచునపుడు కొంత కాలము ఎడమ ముక్కుగుండానును కొంతకాలము కుడి ముక్కుగుండానును శ్వాస విడుచుచుందుము. ఎడమ ముక్కున చరించు వాయువునకు ఇడ యనియు కుడిముక్కున సంచరించు వాయువునకు పింగళ యనియు పేరు. కనుక యీశివల్ల యోగ శాస్త్రముల యందు "ఇడయా వాయు మారోప్య" అనునపుడు ఎడమముక్కు అనియు "పింగళయా వాయు మారోప్య" అనగా కుడిముక్కు అనియు సంజ్ఞావాచకములుగా నుపయోగింతురు.

వామగా యా ఇడా నాడీ శుక్లా చంద్రస్వరూపిణీ ।
శక్తిరూపా హి సా దేవీ సాక్షా దమృత విగ్రహః ॥

అష్టాంగయోగము—ప్రాణాయామము

> దక్షే తు పింగళా నామా పుంరూపా సూర్యవిగ్రహా ।
> రౌద్రాత్మికా మహాదేవీ దాడిమీకేసరప్రభా ॥

ఎడమప్రక్క నుండునది ఇడా అను నాడి ; ఇది స్త్రీరూపిణీ ; చంద్రఛాయారూపిణి. కుడిప్రక్కనుండునది పింగళా అను నాడి ; ఇది పురుషరూపిణి ; దాడింబపూవన్నె గలది.

> మేరోర్వామే స్థితా నాడీ ఇడా చంద్రామృతాశివే ।
> దక్షిణే సూర్యసంయుక్తా పింగళానామ నామతః ।
> తద్బాహ్యేతు తయోర్మధ్యే సుషుమ్నా వహ్నిసంయుతా ॥

మేరుదండమునకు ఎడమపార్శ్వమున ఉండు నాడియైన ఇడా అనునది చంద్రనాడి అనబడును. కుడిప్రక్కననుండు నాడియైన పింగళా అనునది సూర్యనాడి అనబడును. ఈ రెంటికిని మధ్యన సుషుమ్నానాడి యున్నది. దీనికి అగ్నినాడి యని పేరు.

> ఇడాయాం యమునా దేవీ పింగళాయాం సరస్వతీ ।
> సుషుమ్నాయాం వసేద్గంగా తాసాం యోగ స్త్రిధా భవేత్ ॥
> సంగతా ధ్వజమూలేచ విముక్తా భ్రూవియోగతః ।
> త్రివేణీయోగః సాప్రోక్తా తత్రస్నానం మహాఫలం ॥

ఇడా నాడి యమునానది యనియు, పింగళా నాడి సరస్వతి యనియు, సుషుమ్నానాడి గంగానది యనియు నెఱుగవలయును. గంగా యమునా సరస్వతీ నదుల సంగమమునకు త్రివేణీసంగమము అని పేరు. ప్రయాగయందు ఆధిభౌతిక త్రివేణీసంగమమున్నదని వాడుక. కాశీయాత్ర చేయువారలందరును త్రివేణీ సంగమమున స్నానము చేయుచున్నారని ఖ్యాతి. అయితే ప్రయాగక్షేత్రమునందు సంగమ

స్థానమునందు సంకల్పము చెప్పు పురోహితులు "గంగాయాం యమునాయాం చ అంతర్హితాయాం సరస్వత్యాం చ తాసాం సంగమే" అని చెప్పుదురు. అనగా కండ్లకు కనబడు గంగానదియందును యమునానదియందును కండ్లకు కనబడని (దాగియుండు) సరస్వతీనదియందును ఈ మూటియొక్క సంగమమునందును స్నానము చేయుచున్నాను అని సంకల్పము.

ఇట్టి అంతరార్థములతో నిండియుండు చిహ్నము లన్నియు యోగశాస్త్రమును అనుసరించినవే యని యెరుగవలయును.

మనశాస్త్రములలో నంతటయు, ముఖ్యముగా యోగగ్రంథములలో, రహస్యార్థములు అనేకములు గలవు. "శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే" ఇత్యాది వచనములు గలవు. కర్నూలు జిల్లాలో నుండు శ్రీశైలమునకు వెళ్లి గోపురశిఖరమును చూచిన వారికి పునర్జన్మ లేదు, మోక్షమునకు పోదురు అను అనేక పురాణాతిశయోక్తులు కలవు. అయినను వాటికంతయు రహస్యార్థములున్నవి. రహస్యార్థములను ఆమోదించని యెడల ఈమాటలు హాస్యాస్పదంబవును.

శ్రీపర్వతం శిరఃస్థానే కేదారం తు లలాటకే । వారాణసీ మహాప్రాజ్ఞ భ్రువోర్ఘ్రాణస్య మధ్యమే । కురుక్షేత్రం కుచస్థానే ప్రయాగం హృత్సరోరుహే । చిదంబరం తు హృన్మధ్యే ఆధారే కమలాలయం । ఆత్మతీర్థం సముత్సృజ్య బహిస్తీర్థాని యో వ్రజేత్ । కరస్థం స మహారత్నం త్యక్త్వా కాచం విమార్గతే ॥

(దర్శనోపనిషత్తు)

శ్రీశైలదర్శనాన్ముక్తిః వారాణస్యాం మృతస్యచ ।
కేదారోదక పానేన . . . . . . . . ॥

(యోగశిఖోపనిషత్తు)

అష్టాంగయోగము—ప్రాణాయామము

దీనియర్థము—దేహమందు శిరస్సు ప్రదేశము శ్రీశైలము, నొసలు కేదారము, కనుబొమలకు క్రిందయు ముక్కుకుపైన నుండుస్థలము కాశీక్షేత్రము, రొమ్మునందు (కుచస్థానము) కురుక్షేత్రము, హృత్పద్మము ప్రయాగ, హృత్పద్మముయొక్క మధ్యప్రదేశము చిదంబరము, మూలాధారస్థానము కమలాలయము. ఇట్లు సకలతీర్థములును స్వదేహమునందే యున్నవి. వానికి ఆత్మతీర్థములని పేళ్లు. ఆత్మతీర్థములను విడిచి ఆధిభౌతికతీర్థములకు పోవువారు కరతలమందుండు మహారత్నమును త్యజించి గాజుపెంకును వెదకువారితో సమానము.

పురాణములు సాధారణముగా వేదవేదాంత జ్ఞానమును సంపాదించుశక్తి లేనివారికిగా వ్రాయబడినవి. అందు అతిశయోక్తులు అర్థవాదములు ఉండును. వేదవేదాంత జ్ఞానమును సంపాదించినవారు చదివినయెడల మాటలసందున దాగియుండు అర్థము బైలుపడును. అట్టివారికి శ్రీపర్వతము లేక శ్రీశైలము, అనగా శిరఃస్థానము అని యర్థమగును. శ్రీశైలశిఖరమనగా శిరస్సునందు అతి ఉన్నత ప్రదేశము. అట్లనగా బ్రహ్మరంధ్రము అని యర్థమగును. “శ్రీశైలశిఖరం దృష్ట్వా” అనగా బ్రహ్మరంధ్రముగుండా శరీరమును విడిచిపోవువారికి పునర్జన్మలేదు అని యర్థము.

సర్వద్వారాణి సంయమ్య మనోహృది నిరుధ్యచ ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ మాస్థితో యోగధారణాం ॥
ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మా మనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజన్ దేహం సయాతి పరమాం గతిం ॥

అని శ్రీభగవద్గీతలయందు చెప్పియున్నది. కనుక "శ్రీశైలశిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే" అనిన వాక్యము నిజమే.

ఇడా, పింగళా, సుషుమ్నా అనునవి మూడు ప్రధాననాడులు అని చెప్పబడియె. మేరుదండము ఏదియనియు చెప్పబడియె. కుండలినీ అనునది యొక మహాశక్తి. యోగాభ్యాసమునందు యమనియమములను అభ్యసించనివారికి కుండలినీశక్తి మేలుకొనదు. ప్రాణాయామము అభ్యసించి ఒకవేళ ప్రాణాయామ వేగమువల్ల కుండలినీశక్తి మేలుకొనెనంటే అనర్థప్రాప్తినిశ్చయము. ఎంతో జాగ్రతతో ఉపయోగించినగాని కుండలినీశక్తివల్ల కలుగవలసినంత సుఖములు కలుగవు. కొంచెము అజాగ్రతయైనను ఉపాసకుని దేహము ఛిన్నాభిన్నములుగా పోవును.

ఒక పాములాటగాడు పామును ఒకటిని ఒక బుట్టలోవేసి మూతపెట్టి యుండెనట. వాని యింట్లో దొంగతనముచేయు నిచ్ఛతో దొంగ ప్రవేశించి వస్తువులను పరిశీలించుచు ఈ బుట్టలో ఏమో ఉండునని మూతతీయగానే పాము బుసలుకొట్టుచు పైకి వచ్చినదట. ఆ విధముగా తగుమైన గురువుల ఉపదేశములేక యోగిరామచరక అను మొదలుగాగల పేర్ల వ్యవహరింపబడు వారలు వ్రాయు పుస్తకములను చదివి ప్రాణాయామము అభ్యసించువారు పడరాని శ్రమలు పడుదురు.

ఇంగ్లాండు, జర్మనీ, అమెరికా మొదలగు దేశములయందు ప్రకృతిశాస్త్రజ్ఞులు "బ్రీతింగు ఎక్సరుసైజెస్సు" (Breathing Exercises) అని కొన్ని విధములైన ప్రాణాయామములను పరిశీలించి శిఫార్సు చేసియున్నారు. అట్టివానిని నిర్భయముగా నభ్య

సించవచ్చును. ఒక నిమిషకాలము పూరకము, ఒక నిమిషకాలము కుంభకము, ఒక నిమిషకాలము రేచకము, ఇట్లు ఆచరించవచ్చును.

> ప్రాణం ప్రాగిడయా పిబేన్నియమితం భూయోన్యయా రేచయేత్ ।
> పీత్వా పింగళయా సమీరణమథో బధ్వా త్యజేద్వామయా ।
> సూర్యాచంద్రమసో రనేన విధినాభ్యాసం సదా తన్వతాం ।
> శుద్ధానాడి గణాభవంతి యమినాం మాసత్రయాదూర్ధ్వతః ॥
>
> (శాండిల్యోపనిషత్)

ప్రాణాయామమందు పూరక కుంభక రేచకములయొక్క క్రమమును పై శ్లోకమునందు వివరించియున్నది. యుక్తమైన ఆసనమునందు స్థాపితుడై కూర్చున్నయెడల స్థూలదేహమునుగురించి ఉపాసకుడు గమనించ నక్కరలేదు. ప్రాణాయామప్రత్యాహారధారణాధ్యానసమాధులకు (పూర్వాంగము) ప్రారంభము నిర్విఘ్నముగా ప్రయత్నము అనుకూలించినయెడల ప్రాణాయామము ఆరంభించినవాడు సమాధిదశను చెందవలసియుండును. అపుడు దేహమును గమనించుట అసాధ్యము. కనుక స్థిరమైన ఆసనమునందు కూర్చొని కండ్లుమూసికొని (తమంతకుతాముగానే కండ్లుమూతపడును) ఇడానాడి అనగా ఎడమ ముక్కురంధ్రము గుండా వాయువును లోపలికి పీల్చి అట్లు పీల్చబడిన వాయువును రొమ్మునందు నిలిపియుంచి కుడిప్రక్కని నాసారంధ్రము (ముక్కు ద్వారము) గుండా రేచకము (వెలుపటికి విడుచుట) ను చేయవలయును. పిదప కుడిముక్కుగుండా పీల్చి, కుంభకమున నునిచి

ఎడమప్రక్క ముక్కుగుండా వెలుపలికి విడువవలయును. ఈ ప్రకారము ఇడా పింగళా నాడులకు పూరక కుంభక రేచకములవల్ల సమాగమము (సంయోగము) కలుగచేయుటకు సాధ్యమైతే సుషుమ్నా నాడియందలి మలమోచనమగును. ప్రాణాయామము అతి పదునుగల కత్తితో సమానము అని ఇదివరకే హెచ్చరిక ఇయ్యబడెను. ప్రాణాయామాభ్యాసమునందు ఆతురపడకయే నెమ్మదిగా కొంచ కొంచముగా నభ్యసించవలయును.

> యథా సింహో గజో వ్యాఘ్రో వశ్య శ్శనై శ్శనైః ।
> తథైవ సేవితో వాయు రన్యథా హంతి సాధకం ॥
> యుక్తం యుక్తం త్యజేద్వాయుం యుక్తం యుక్తంచ పూరయేత్ ।
> యుక్తం యుక్తేన బధ్నీయాత్ ఏవం సిద్ధి మవాప్నుయాత్ ॥

సింహము, ఏనుగు, పెద్దపులి ఇటువంటి క్రూరమృగములను సాకి వానికి సహజగుణమైన క్రౌర్యమును మరిపించువారు కొంత కొంతగా నవసరపడకయే మెల్ల మెల్లగా ఆ మృగములను స్వాధీనపరుచుకొందురు. వానియొక్క క్రౌర్యము పరిపూర్ణముగా మరిచిపోయినది అని నిశ్చయమగుటకు చాలకాలము పట్టును. అవసరపడినందు మాత్రముచేతనే ఆ మృగములు తమయొక్క స్వభావమును మార్చవు. ఆప్రకారము ప్రాణాయామ సిద్ధికిగా నెమ్మదిగా దినాల పేరట కొంచము కొంచముగా ప్రయత్నముచేసి వాయువును స్వాధీనపరుచుకోవలెను. లేక అవసరపడినయెడల ఉపాసకునికి మరణము సంభవించును. కొంచ కొంచముగా వాయువును పీల్చవలయును. కొంచ కొంచముగా బైటికి విడువవలయును. అదే ప్రకారము కొంచముగా కుంభకము నభ్యసించవలెను. ఏమాత్ర

అష్టాంగయోగము—ప్రాణాయామము

మైనను నియతమైన కొలతను పూరకమునందైనా, కుంభకము నందైనా, రేచకమునందైనా మించినయెడల మరణమే సంభవించును. లేక తొలగని తలయేరు సంభవించును. కొందరి దేహతత్త్వమును అనుసరించి వారికి పిచ్చిపట్టును. రుగ్మత ననుభవించుచు జపతపములు చేయుటకు యోగ్యత లేక బ్రతికియుండుటకంటె మరణము మేలు. కుల్లుకు మన మెఱుగవలసిన దేమనగా ప్రాణాయామము అను కత్తిమీదిసామును ఉపాసకుడు అలక్ష్యము చేయకయే అతి జాగ్రతతో నభ్యసించవలెనను విషయమే.

ఇంతకుముందు ౨౩౭ వ పుటయందు పూరక కుంభక రేచకములకు కొలతలు ఉన్నవని చెప్పబడియె. కొలత అనగా పూరకమునకు ఎన్ని విగడియలుపట్టెనో అన్ని విగడియలే కుంభకమునకును అన్ని విగడియలే రేచకమునకును ఉపయోగించవలెనని యర్థము. మరియొక విధము కలదు. పూరకము ఇన్నిమాత్రల కాలము, కుంభకము ఇన్నిమాత్రల కాలము, రేచకము ఇన్నిమాత్రల కాలము అను నియమము కలదు. మాత్ర యను శబ్దమునకు అర్థము కనురెప్పవేయు కాలము లేక చిటికవేయు కాలము. "శాస్త్రార ఏక మాత్రా లఘో గురోర్ ద్వి మాత్రే ఇతి వదంతి". లఘువునకు ఒక మాత్ర యనియు గురువునకు రెండు మాత్రలకాలమనియు ఛందశ్శాస్త్రజ్ఞులు చెప్పుదురు. సులభముగా అర్థముకాను హ్రస్వాక్షరములు లఘువులు, దీర్ఘాక్షరములును జడ్డక్షరపూర్వాక్షరములును గురువులు. మాత్రలను లెక్కపెట్టి కాలమును నిర్ణయించుట కష్టము గనుక ప్రాణాయామము అభ్యసించువారికి ఒక మంత్రమును

గురువులవారు ఉపదేశింతురు. ఆ మంత్రమునందు గల అక్షర ములను పట్టి ఇన్ని మాత్రలకాలము అని యేర్పడును. ఆ మంత్ర మును ఒకతూరి జపించుచు పూరకము ఒకతూరి జపించుచు కుంభ కము ఒకతూరి జపించుచు రేచకమును చేయుమని చెప్పియిత్తురు. ఇందులో ఏమాత్రమైనను జవదాటక నడుచుకోవలెను.

ప్రాణాయామముయొక్క రహస్యములను సద్గురువులవారి నుండియే వినవలెను. కనుక ఇంతకంటె నధికముగా వ్రాయుటకు సమంజసము కాదు. కావలసినంతమాత్రము హెచ్చరికమాటలను మాత్రము చెప్పవలసి చెప్పుటమైనది.

ప్రత్యాహారము అనగా

"స్వవిషయాసంప్రయోగే చిత్తస్య స్వరూపానుకార ఇవేంద్రియాణాం ప్రత్యాహారః ॥"

అని సూత్రము. ఈ సూత్రమునకు అర్థము—ఇంద్రియములు వాని వాని విషయములను వెదకికొనిపోవు స్వభావము కలవియైనను, చిత్తము ఏ విషయమునందు లగ్నమైయున్నదో ఆ విషయమునే ఇంద్రియములు కూడ భజించుట. "మధుకరరాజానం యథా మక్షికాః చలంతం అనుచలంతి, స్థితమనుస్థితా భవంతి, తథా చిత్తానుసారీ ణీంద్రియాణి చిత్తనిరోధేనైవ నిరుధ్యతే, న యత్నాంతరేణ" అని చెప్పబడియున్నది. తేనెటీగరాణి పోయిన స్థల మునకు అన్ని ఈగలును పోవును. ఆ ఈగరాణి చలించిన ఈగలన్నియు చలించును. ఈగరాణి చలింపకున్న ఈగలన్నియు చలనము మాని నిలుచును. ఆ విధముగా నింద్రియములన్నియును

అష్టాంగయోగము—ధారణా

చిత్తమును అనుసరించి చరించును. చిత్తము నిరోధింపబడిన యెడల ఇంద్రియములు కూడ నిరోధింపబడియుండును అను రహస్యమును తెలిసికొని,

> శబ్దాది ష్వనురక్తాని నిగృహ్యాక్షాణి యోగవిత్ ।
> కుర్యా చ్చిత్తానుకారీణి ప్రత్యాహారపరాయణః ॥

(విష్ణుపురాణము)

శబ్దాది విషయముల వెంబడి వెళ్లు స్వభావముగల ఇంద్రియములను నిగ్రహించి చిత్తము స్వాధీనము చేయుటకు ప్రత్యాహారమని పేరు.

ధారణా అనగా

> దేశబంధః చిత్తస్య ధారణా ॥

(పాతంజలసూత్రము)

ఉపాసకుడు వెదకి నిర్ధారించిన స్థలమునందు నిలుపబడిన చిత్తము ఇటు అటు కదలక నిలిచియుండు స్థితికి ధారణ అని పేరు.

> ప్రాణాయామేన పవనం ప్రత్యాహారేణ చేంద్రియం ।
> వశీకృత్య తతః కుర్యాత్ చిత్తస్థానం శుభాశ్రయే ॥
> మూర్తం భగవతో రూపం సర్వోపాశ్రయ సంయుతం ।
> ఏషా వై ధారణా జ్ఞేయా యచ్చిత్తం తత్ర ధార్యతే ॥
> తచ్చమూర్తం హరే రూపం తద్విచింత్యం నరాధిప ।
> తచ్ఛ్రియతా మనాధార ధారణా నోపపద్యతే ॥

ప్రాణాయామముచేసి వాయువును సాధించి ప్రత్యాహారాభ్యాసమువల్ల ఇంద్రియములను నిగ్రహించి చిత్తమును నియమించుటకు ధారణ యని పేరు. చిత్తమును నియమించి, నియమము అను

అంగమునందు చెప్పిన ఈశ్వర పూజనమును చేయుటకుగా సాకారమైన దేవతలను లక్ష్యముగా నుంచుకోవలయును. దీనికి ఆధార ధారణ అని పేరు. అనాధార ధారణ యొకటి కలదు. అది లభించుట శ్రమ. అనాధార ధారణయే నిర్గుణధ్యాన మనబడును. దీనిని గురించియే "అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే" అని శ్రీ భగవద్గీతయందు చెప్పబడెను.

ధ్యానము అనగా

"శ్రవణమనన జనిత వాసనామయస్య వస్తునః మనసా అవలోకనం ధ్యానం." అనగా శాస్త్రములను పఠించి మననము చేసి ఏ వస్తువు ఉన్నదని తెలిసికొంటిమో ఆ వస్తువును మనస్సుతో చూచుట అని యర్థము.

తత్ర ప్రత్యయైకతానతా ధ్యానం ॥

అని సూత్రమున్నది. దీని యర్థము: ధారణవల్ల స్థిరీకరింపబడిన చిత్తముయొక్క వృత్తులను యత్నము లేకయే ఏక విషయమునందే పని చేయించుట.

ధ్యానము రెండు విధములు. సగుణ ధ్యానము, నిర్గుణ ధ్యానము అని. "సగుణం మూర్తిధ్యానం, నిర్గుణ మాత్మ యాథాత్మ్యం." సగుణ ధ్యానమనగా "తచ్చమూర్తం హరే రూపం తద్విచింత్యం నరాధిప." భగవంతునియొక్క రూపము ధ్యానించుట. నిర్గుణధ్యానమనగా ఆత్మయొక్క యథార్థమును తెలిసికొనుట.

అష్టాంగయోగము—సమాధి

సమాధి అనగా

తదేవార్థమాత్రనిర్భాసం స్వరూపశూన్య మివ సమాధిః ।

విజాతీయవృత్తి విచ్ఛిన్నాధారణా, అవిచ్ఛిన్నం ధ్యానం ధ్యేయ ధ్యాన ధ్యాతృ స్ఫూర్తిమధ్యే ధ్యేయమాత్రస్ఫూర్తిమార్గా సమాధిః ॥

దీనికి సంబంధించినవి,

"త్రయమేకత్ర సంయమః" "త్రయమంతరంగం పూర్వేభ్యః" అని రెండు సూత్రములున్నవి.

ఈ రెండు సూత్రములయొక్క అర్థము:

పంచ యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహారాః । సంప్రజ్ఞాతసమాధేః ప్రతిబంధకస్య చిత్తకాయేంద్రియమలస్య నివృత్తిద్వారా బహిరంగాని । ధారణాది త్రితయంతు అంగినః సమానవిషయతయా సాక్షాత్స్వరూపోపకారకత్వా దంతరంగా నీతివిభాగః ॥

యమము మొదలు ఎనిమిది అయిన యోగాంగములపైకి మొదటి అయిదింటికిని బహిరంగ సాధనము లని పేరు. మిగిలిన మూడు అంగములైన ధారణాధ్యాన సమాధులకు అంతరంగ సాధనములు అని పేరు.

యోగము అను పదమునకు కలియుట అని అర్థము. అనగా "మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః" అని శ్రీమద్భగద్గీతయందు చెప్పినప్రకారము అంశమైన జీవాత్మను అంశిమైన పరమాత్మతో కలుపుట. "సమాధి స్సమతావస్థా జీవాత్మ పరమాత్మనోః" అని యోగముయొక్క ఎనిమిదవ అంగమయిన సమాధిదశను అనుభవించినవారలు పృథగ్భావమును మరుతురు.

"తం విద్యా ద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితం." అనగా పూర్వము "బహుస్యాం" అని ఈశ్వరుడు ఇచ్ఛయించినందున పుట్టిన స్పందశక్తివల్ల ప్రజ్ఞానాంశువులు వేరుపడినపుడు. అవిద్య అను దుఃఖము ప్రజ్ఞానాంశువులకు సంయోగమైనది. అవిద్యవల్లనే కదా పృథగ్భావము కలిగినది. యోగము నారంభించి సంప్రజ్ఞాత సమాధిని అనుభవించి అంతకుపైన తత్త్వసాక్షాత్కారోత్పత్తి ద్వారా అనుభవించగల ఉత్తమసమాధుల ననుభవించినప్పుడు అవిద్యానాశన మగును. ఆరీత్యా దుఃఖసంయోగమునకు వియోగము కలుగును. అట్టి దశయందుకూడ దుఃఖనివృత్తి కాచాలదు.

న యత్ర శోకో న జరా న మృత్యుః నాఽర్తి ర్నచోద్వేగఋతే కుతశ్చిత్ ।
యచ్చిత్తతోదః కృపయాఽనిదం విదాం దురంతదుఃఖప్రభవాను దర్శనాత్ ॥
(శ్రీమద్భాగవతము, స్కం. ౨, అ. ౨, శ్లో. ౨౭)

అక్కడ (బ్రహ్మలోకమందు) ఉండువారికి ఆ లోకమును సంపాదించలేక సంసారమందు మునిగియున్న ఇతరులనుచూచి మనస్సు కరిగి అక్కటా వీరు అంతములేని దుఃఖములకు పాలగుచున్నారు కదా యని దయయు అనుకంపయు అందువలన కలిగిన శోకము దక్క వేరు శోకముగాని ముదిమిగాని చావుగాని దైన్యముగాని భయముగాని ఎందువల్లనును కలుగదు.

ఉపాసనాబలమువల్ల పృథగ్భావమును పోగొట్టుకొని బంధవిముక్తినిచెంది బ్రహ్మలోకమును చేరినవారికి ముక్తులని పేరు. అట్లు ముక్తులయ్యు తమ స్థూలశరీరములు మరణము చెందనందున ఇహలోకమునందు మనుష్యమాత్రులుగా బ్రతికియుండువారికి జీవన్ముక్తులు అని పేరు. (జీవత్ + ముక్తులు).

యోగాస్త్రయో మయా ప్రోక్తాః నృణాం శ్రేయోవిధిత్సయా ।
జ్ఞానం కర్మ చ భక్తిశ్చ నోపాయోన్యోస్తి కశ్చన ॥
(శ్రీమద్భాగవతము, స్కం. ౧౧, అధ్యా. ౨౦, శ్లో ౬).

అవిద్యావశవర్తులై సంసారములయందు మునిగియుండువారికి సంసారబంధమును పోగొట్టు నుపాయమునకు యోగమని పేరు అని యిదివరకే చెప్పబడెను. అట్టి యోగములు మూడుగా తాను విధించినట్టు శ్రీ కృష్ణులవారు ఉద్ధవునకు ఉపదేశించిరి. శ్రీమద్భగవద్గీతయందు ౧౮ అధ్యాయములు. ప్రతి అధ్యాయమునకును ఒక యోగమని పేరు ఇచ్చియుండినను పదునెనిమిది యధ్యాయములును పై చెప్పబడిన కర్మయోగ భక్తియోగ జ్ఞానయోగములు అను మూడు యోగములనే యుపదేశించునట్టు భాష్యకారులు వ్రాసియున్నారు.

చిత్తస్య శుద్ధయే కర్మ న తు వస్తూపలబ్ధయే ।
వస్తుసిద్ధిర్విచారేణ న కించిత్కర్మ కోటిభిః ॥
(వివేకచూడామణి)

కర్మను ఆచరించుటవల్ల చిత్తశుద్ధి కలుగుననియును చిత్తశుద్ధి కలిగినందువల్ల జ్ఞానముపుట్టుననియు అట్లుపుట్టిన జ్ఞానమువల్లనే మోక్షము కలుగుననియు శాస్త్రములు చెప్పుచున్నవి. “జ్ఞానాదేవతు కైవల్యం” అని శ్రుతివాక్యము. కనుక ఏ జ్ఞానమువల్ల మోక్షము కలుగునో అట్టి జ్ఞానముపుట్టుటకు కావలసిన చిత్తశుద్ధిని కలుగ జేయుశక్తిగలది గనుక కర్మకు పరంపరా సాధనము అనియు జ్ఞానమునకు సాక్షాత్సాధనమనియు పేరు.

భక్తియోగముకూడ సాక్షాత్సాధనము కాదు అని శాస్త్రకారుల యభిప్రాయము. "మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే। సగుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే ॥" అనియు "భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః" అనియు "బహూనాం జన్మనాం అంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" అనియు చెప్పియుండుటవలన భక్తియు పరంపరా సాధనమనియును జ్ఞానమే సాక్షాత్సాధనమనియును అర్థమగుచున్నది. ఫలితార్థమందు ఏ ఒక యోగము పరిపూర్ణముగా కుదిరినను మిగిలిన రెండు యోగములును కుదురును అని యెరుగవలయును.

శ్రీమద్భగవద్గీతయందు మొదటి ఆఱు అధ్యాయములును కర్మయోగమును గురించి చెప్పిన యుపదేశము అని భాష్యకారులు యుక్తితో రుజువుపరిచియున్నారు. ఆఱవ అధ్యాయమునకు అనేక పేళ్లుగలవు. ఆత్మసంయమయోగము అని కొన్ని ప్రతులలోను ధ్యానయోగమని కొన్ని ప్రతులలోనును అధ్యాత్మయోగము అని మరికొన్ని ప్రతులలోనును ఈ యధ్యాయమునకు పేళ్లు ఇచ్చియున్నారు. ఏ పేరు మనము అంగీకరించినను ఈ అధ్యాయమునందు ముఖ్యముగా వివరింపబడిన యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణా ధ్యాన సమాధులను అష్టాంగములుగల యోగమునే వివరించియున్నారని యెరుగగలము. శ్రీమద్భగవద్గీత పదియవ అధ్యాయము, ౧౧ వ శ్లోకమునందు ప్రస్తావించిన జ్ఞానదీపము అనునది శ్రీమద్భగవద్గీత ఆఱవ యధ్యాయమునందు వివరించిన ధ్యానయోగమును ప్రతినిత్యమును అనుష్ఠించుచు వచ్చి

నందున జనియించునట్టు శంకరభాష్యమునందు చెప్పబడియున్నది. కనుక జ్ఞానము పుట్టుటకు ధ్యానము సాధనమని యూహించవలసి యున్నది. ఈ అధ్యాయముయొక్క అంశము శ్రవణ మనన నిదిధ్యాసలు. నిదిధ్యాస అను విషయము సమాధానము అను విషయమునకు జతపడును అని ఇంతకుముందే చెప్పబడియె. సమాధానము అనునది సాధనచతుష్టయముయొక్క అంతర్భాగమైన "షట్సంపత్తి" యందు ఒకటి. ఈ గ్రంథముయొక్క ౫౭ మొదలు ౫౯ వ పుటలలో భగవదర్చన ప్రస్తావింపబడియె. సమాధానము అను సాధనమును అభ్యసించువారలు సగుణధ్యానమును చేయుచు తదంగత్వేన విగ్రహారాధన చేయుటవల్ల సమాధానము అను సాధనము సిద్ధించును అను విషయము కొందరికి అనుభవసిద్ధమే. ధ్యానయోగమును చెప్పవలసి తదంగమైన విగ్రహారాధనను గురించి ముందుగా చెప్పి అర్చాపూజా విషయమును ఆచరించుచు ఏవిధముగా ధ్యానమునందు ఆ పూజ పరిణమించునో ఆ వివరమును గురించి వ్రాయు నభిప్రాయమున్నది.

## అర్చాపూజా

అర్చా అనగా పూజకు ఉపయోగింపబడు విగ్రహము. అట్టి విగ్రహమునకు పూజ అర్చాపూజ. దీనినే విగ్రహారాధన అందురు. ప్రతినిత్యమును చేయవలసిన కర్మలలో దేవతార్చన యొకటి. కర్మలను ఆరంభించువాడు తొలుదొలుత దంతధావనాది కృత్యములను దీర్చి దేహశుద్ధ్యర్థముగా స్నానంబొనర్చి పూజ

నారంభించవలయును. భౌతిక జలముతో స్నానముచేయువారలు మనసా కల్పిత జలములలో కూడ స్నానము చేయవలయును. ప్రతి కర్మయు కర్మేంద్రియములతో చేయబడుటకంటె అంతరింద్రియమైన మనస్సుతో కూడ చేసినయెడల మిగుల శక్తివంతముగా నుండును అను సంగతిని చెప్పవలసినదే లేదు. స్నానము కూడ భౌతికజలములతో జేయుచు మనస్సుతో కల్పించుకొనిన జలములతో చేయవలయును. దీనికి మానసికస్నానమని పేరు. ఇది మహా శ్రేష్ఠము.

మానసికస్నానమును గురించి యీదిగువ కనుపరిచిన శ్లోకములు గంభీరభావము గలవి.

వ్యోమస్థం ప్రభుమీశానం సోమసూర్యాగ్ని లోచనం ।
సర్వమంత్రాత్మకం దేవం సర్వతీర్థమయం స్మరేత్ ॥ ౧ ॥
జటాపటలకోటీర గంగాపూర విరాజితం ।
కుందేందు శంఖపాటీర పాండురాంగం సదాశివం ॥ ౨ ॥
వటభూజాది నికటే నిషణ్ణం పరమేశ్వరం ।
విజ్ఞాన ముద్రాం దధతం దక్షిణామూర్తి మవ్యయం ॥ 3 ॥
భూతికర్పూర సంయుక్తం దివ్యాంగం నాగకంకణం ।
హారాయిత ఫణీశాన ఫణామణి విరాజితం ॥ ౪ ॥
భాస్వద్వ్యాల మృణాళాది కోమలావయవం శివం ।
అజానుబాహుం శ్రీకంఠ మకుంఠం చంద్రశేఖరం ॥ ౫ ॥
కోటిసూర్య ప్రతీకాశం గజదైత్యాజినాంబరం ।
పాశత్రిశూల ఖట్వాంగ కురంగధర మీశ్వరం ॥ ౬ ॥
ప్రసన్నవదనం శ్రీమత్కుండలీశ్వర కుండలం ।
పావనం సర్వలోకానాం భక్తాభీప్సిత దాయకం ॥ ౭ ॥

అర్చాపూజ—మానసికస్నానం

విశ్వేశ్వరం విశ్వమయం శాశ్వతైశ్వర్య బంధురం ।
నారదాది మహాయోగిబృందసంసేవితం సదా ॥ ౮ ॥
కపాలమాలా కలితం మృత్యుంజయ మనామయం ।
మృత్యుసంసార పాథోధి కర్ణధారం మహేశ్వరం ॥ ౯ ॥
శాంతం శాశ్వత మాద్యంతశూన్యం సదసదాత్మకం ।
మూర్తిత్రయాత్మకం శంభుం చిదానందమయం విభుం ॥ ౧౦ ॥
స్మేరాచితాననాంభోజకరుణాపూరితేక్షణం ।
వందారు బృందారకాళిమాళిసిరాజితాంఘ్రికం ॥ ౧౧ ॥
గళంతీం తత్కపర్దాంతాత్ గంగాం త్రైలోక్యపావనీం ।
నిపతంతీం స్వోత్తమాంగే భావయేత్తాం త్రిమార్గగాం ॥ ౧౨ ॥
ప్రవిశంతీం బ్రహ్మనాడ్యా శరీరం స్వం విచింతయేత్ ।
సంశోధయేత్తయాఽశేషం అంతరాత్మగతం మలం ॥ ౧౩ ॥
మర్త్యః క్షణా ద్వీతరజాః భవేత్స్ఫటికనిర్మలః ।
బ్రాహ్మే ముహూర్తే చోత్థాయ భస్మోద్ధూళిత విగ్రహః ॥ ౧౪ ॥
ఏవం భావయిత్వా మర్త్యో మృత్యుం తీర్త్వా స జీవతి ।
ప్రక్షాళితాఘజంబాలః పూత ఏవ న సంశయః ॥ ౧౫ ॥
నమశ్శివాయై గంగాయై శివదాయై నమోనమః ।
నమస్త్రిపథగామిన్యై విశ్వమూర్త్యై నమోనమః ॥ ౧౬ ॥
ఇడాసరిద్వరాదివ్యా పింగళా శమన స్వసా ।
నాడీతన్మధ్యగతా పుణ్యా సుషుమ్నాఖ్యా సరస్వతీ ॥ ౧౭ ॥
జ్ఞానాధారే ధ్యానతోయే రాగపంకవిశోధకే ।
యస్స్నాయాన్మానసే తీర్థే స గచ్ఛేచ్ఛివసన్నిధిం ॥ ౧౮ ॥

మేఘమండలమందు ఉన్నతప్రదేశమున ఉన్నవారినిగా నీశ్వర రూపమును స్మరించి, ఈశ్వరునియొక్క జటాజూటములను మనసా

భావించి, ఆ జటాజూటములనుండి స్రవించుచున్నట్లు గంగానదిని భావించి ఆ ధార తనయొక్క శిరస్సుపై పడి శిరస్సు మధ్యననుండు బ్రహ్మరంధ్రముద్వారా దేహములో ప్రవేశించి సకలరక్తనాళముల గుండా ప్రవహించి తనయొక్క దేహమందును అంతరాత్మయందు ను నిలిచిన మలములను పారదోలి తనయొక్క దేహమును పరి శుద్ధిచేసినట్టుగా భావించవలయును.

అరుణోదయకాలమందు అనగా బ్రాహ్మముహూర్తము నందు నిద్ర మేలుకొని పరిశుద్ధుడై భస్మోద్ధూళిత దేహుడై పై వివరించిన ప్రకారము మనసా కల్పించిన గంగాతీర్థమునందు స్నానము చేయువాడు అత్యంత నిర్మలుడగును.

ఇట్లు నిర్మలుడై పూజనారంభించవలయును. ఈ పూజా విధానమును శ్రీకృష్ణులవారు తన శిష్యుండైన యుద్ధవునకు ఉపదేశించిన వివరమును శ్రీమద్భాగవతము, ఏకాదశస్కంధమునందు ఇరువదియేడవ యధ్యాయమునందు చూడవలయును. అచ్చట చెప్పిన విషయమే ఇక్కడ సంగ్రహముగా వ్రాయబడుచున్నది.

చెప్పనలవిగాని భగవదారాధన విధికి ఎప్పటికైనను అంతము గలుగదు. పూర్వాచారప్రకారము సంక్షేపముగా మాత్రమే వ్రాయతగును.

దేవపూజలు మూడు విధంబుల పెద్దలు చేయుచున్నారు. ౧. వైదికమార్గము. ౨. తాంత్రికమార్గము. ౩. రెండు మార్గములును కలిసిన మార్గము. పూజచేయువారలకు ఏ యే మార్గం బభిమతంబో ఆ యా తీరున పూజింపనగు. సర్వాంతర్యామియై సర్వవ్యాపకుడగు బ్రహ్మమును మనసా విషయీకరించుకొనుట

అర్చాపూజ

దుస్తరము. అవ్యక్తమగు బ్రహ్మమును పూజచేయు మార్గమునందు కష్టములు బహుమెండు. కనుక భగవద్విభూతులు వ్యక్తీకరింప బడియుండు కొన్ని వస్తువులు లోకమునందు గలవు. అవి యేవన

ఆర్చాయాం స్థండిలేగ్నౌ వా సూర్యేప్సు హృది వా ద్విజే ।

విగ్రహము, స్థండిలమనగా భూమి, అగ్ని, సూర్యుడు, జలము, స్వహృదయము అనునవి కొన్ని భగవద్విభూతిని కనపరుచునవి. వీటిలో దేనినైనను పూజించవచ్చును. భక్తితో మాయను వదిలి ఆత్మగురువైన భగవంతు నర్చించ వలయును. అర్చలు ఎనిమిది విధంబులు.

శైలీ దారుమయీ లౌహీ లేప్యా లేఖ్యాచ సైకతీ ।
మనోమయీ మణిమయీ ప్రతిమా అష్టవిధా స్మృతా ॥
(శ్రీమద్భాగవతము, స్కం. ౧౧, అధ్యా. ౨౭)

శిలామయము అనగా రాతితో చేయబడినవి. లేక సాలగ్రామముల వలె రాళ్లే. దారుమయము అనగా ఏపి, చందనము మొదలగు మ్రాకులతో చేయబడినవి. లోహమయము అనగా బంగారు, వెండి, తామ్రము లేక ఆగమశాస్త్రవిధానముతో అయిదు లోహములును గలిపి "పంచలోహములతో" చేయబడినవి.

లేప్యా అనగా మన్ను, చందనము మొదలగు లేపనములతో చేయబడినవి; లేఖ్యా అనగా చిత్రముతో వ్రాయబడినవి; సైకతీ అనగా నిసుకతో కలిసి చేయబడినవి; మనోమయము అనగా మనస్సుతో కట్టబడినవి; మణిమయీ అనగా నొక్క మణితోగాని

అనేకమణుల సంకలనమువల్లగాని కట్టబడినవి; అని ప్రతిమలు ఎనిమిది విధంబులు. భగవత్ప్రతిష్ఠార్హమైన ప్రతిమ చలమనియు అచలమనియు రెండు విధంబులు. పైన వివరించిన యెనిమిది విధ ప్రతిమలలో నొక్కటిదక్క, అనగా మనోమయప్రతిమ గాక మిగిలినవి చలము అచలము అను భేదంబుల బరగు. స్థిరములన గా నాగమ శాస్త్రోక్తరీత్యా దేవాలయాదులయందు ప్రతిష్ఠచేయ బడినవి.

<u>ఆవాహనము</u> అనగా పూజాంగములలో ఆవాహనంబనియు విసర్జనంబనియు రెండు అంగములు గలవు. ఆవాహనంబనగా నదివరకును అచట ఉండని యొకశక్తిని మంత్రబలముచే రప్పించి విగ్రహమునం దమర్చుట. అమరిచియుండిన చైతన్యమును పూజించి పూజ ముగియగానే పూజింపబడిన ప్రతిమనుండి తొలగించుటకు విసర్జనంబని పేరు. ఉద్వాసనంబనియు చెప్పుదురు. అచలములై ఆగమశాస్త్రవిధానంబున స్థాపింపబడిన విగ్రహములకు ఆవాహ నంబుగాని ఉద్వాసనంబుగాని అనావశ్యకంబులు. షోడశోపచార పూజయని సాధారణముగా నన్ని పూజలందును కలదు. పదునారు ఉపచారములలో నభిషేకము అను స్నానమొక్కటి. లేప్యా, సైకతీ, లేఖ్యా అను ప్రతిమలకు అభిషేకము కూడదు. మార్జనము మాత్రము చాలును. భగవదారాధనయం దుపయోగింపబడు ద్ర వ్యంబులు చక్కనివి, ఉత్తమములైనవి, శ్రేష్ఠములైనవియుగా నుండవలయును. ప్రతిమకు స్నానము అలంకారము మొదలగు నవి అతిముఖ్యములు. పూజించువాడు శుచియై పూజాద్రవ్యముల నెల్ల సాధించికొని పూజనారంభించవలయును. పూజ చేయువాడు

అర్చాపూజ—మంత్రము

అతిశ్రేష్ఠములైన పూజాద్రవ్యములనే సంపాదించి పూజ చేయవలయును. ప్రతి ద్రవ్యమును తన జాతిలో అంతకన్న నధికములైనవి లేవు అనునట్టుగా నతిశ్రేష్ఠములుగా నుండవలయును. భక్తుడు పూజించు విషయమునందు అతనికి సాధ్యమైన వస్తువులను సంపాదించి పూజించవచ్చును. తక్కువపడిన వాటిని అతని మనస్సునందలి భక్తి సరిచేయును.

పూజలలో ముఖ్యాంగములు మూడు.

౧. మంత్రము. ౨. ముద్ర. 3. ద్రవ్యము.

మంత్రము అనగా ‹‹ మననాత్త్రాణాచ్చైవ మంత్ర ఇత్యభిధీయతే ’’ అని శాస్త్రము. అనగా జపము చేయుటవల్ల తరింపచేయగల శక్తికల వాక్కులకు మంత్రము అని పేరు.

ముద్ర అనగా చేతులవ్రేళ్లను శాస్త్రోక్తరీత్యా జోడించి యొక రూపేర్పరుచుటకు ముద్రయని పేరు. ధేనుముద్ర, గరుడ ముద్ర, చిన్ముద్ర మొదలగునవి.

ద్రవ్యము అనగా నేదైన నొక వస్తువు. భగవద్విగ్రహాంగసంగియై తదీయ విభవమును తనలో గ్రహించుకొని తనను స్పర్శించు వారలకెల్ల భగద్విభవము నియ్యగల శక్తిని పొందిన వస్తువు. బహుశః జలము ఇట్టి ద్రవ్యము కావచ్చును. అభిషేకజలమును తీర్థము అని పుచ్చుకొనుట కలదు. పూజించిన పుష్పములను ప్రసాదమని ముడుచుకొనుట కలదు. ఇవన్నియు ద్రవ్యములు.

పూజకు ఆరంభించుటకు మునుపు కలశము అను సంజ్ఞకు సరియైనయొక పాత్రమును జలముతోనించి దాని నభిమంత్రించి

ఆ నీటిని మూడు చిన్నపాత్రములలో నుంచుకొని పాద్యమునకు ఒకపాత్ర, అర్ఘ్యమున కొకపాత్ర, ప్రోక్షణమున కొకపాత్ర, ఈ తీరున మూడు చిన్నపాత్రలను అమర్చి, ప్రోక్షణపాత్రలోని జలముతో పూజాద్రవ్యములను దేవపూజాస్థలమును తనను ప్రోక్షించికొని గాయత్రీమంత్రమును జపించి అర్చ (విగ్రహము) ను స్పృశించి శుద్ధిచేసి ఆ అర్చ (విగ్రహమున) కు షోడశోపచార పూజ నారంభించవలయును. షోడశోపచారము—ధ్యానము, ఆవాహనము, ఆసనము, పాద్యం, ఆచమనం, స్నానము, వస్త్రం, గంధం, పూజ, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలం, నీరాజనము, పుష్పాంజలి సహిత స్తోత్రము, జపము, పూజానంతరము విసర్జనము లేక ఉద్వాసనము. షోడశోపచారపూజలలో ధ్యానము మొదటిది. ధ్యానము అనగా "శబ్దాదిభ్యో విషయేభ్యః శ్రోత్రాదీని కరణాని పరావృత్య మనస్యుపసంహృత్య మనశ్చ ప్రత్యక్చేతయితరి ఏకాగ్రతయా యచ్చింతనం తత్ ధ్యానం". దీని యర్థము—శబ్దస్పర్శరూపరసగంధము లనునవి విషయములు. ఈ విషయములను గ్రహించు ఇంద్రియములు శ్రోత్రము, చక్షుః, స్పర్శనం, రసనం, ఘ్రాణం అనునవి. ఇంద్రియములను విషయముల పార్శ్వము పోనీయక అంతరింద్రియమైన మనస్సునందు ఇముడిచి ఆ మనస్సును ఆత్మయందు స్థిరముగా నిలిపి దీర్ఘకాలము ఇతర వ్యాసంగము లేమియు లేకయే ఉంచియుంచుట. మనస్సును ఉంచియుండుట అనగా ఆత్మను గురించి చింతించి చింతించి ఆత్మకును తనకును గల సంబంధమును మనస్సు తెలిసికొనునట్టును, ఆత్మకును పరమాత్మకును గల సంబంధమును ఆత్మ తెలిసికొనునట్టును చేయ

అర్చాపూజ—తన్మయత

వలసిన యోగము. షోడశోపచారపూజలో ప్రథమోపచారమైన ధ్యానమును గురించినవివరము శ్రీమద్భాగవతము, ౧౧ స్కం., ౨౭ వ అధ్యాయమునందు చెప్పబడియున్నది.

> పిండే వాయ్వగ్ని సంశుద్ధే హృత్పద్మస్థాం పరాం మమ ।
> అణ్వీం జీవకళాం ధ్యాయే న్నాదాంతే సిద్ధభావితాం ॥
> తయాఽఽత్మభూతయా పిండే వ్యాప్తే సంపూజ్యతన్మయః ।
> ఆవాహ్యార్చాదిషు స్థాప్య న్యస్తాంగం మాం ప్రపూజయేత్ ॥

పిండమనగా నుపాసకుని స్థూలశరీరము. ఈ దేహమును వాయువు, అగ్ని వీట్లచే. శుద్ధిచేసికొని ధ్యానము నారంభించవలెను. వాయువుచే శుద్ధియనగా ప్రాణాయామము చేసి యని యర్థము. అగ్నిచే శుద్ధియనగా, మూలాధార చక్రమునందుండు అగ్నిని మేలు కొలిపి తద్ద్వారా శుద్ధిచేయుట. అందును గురించి వ్రాయుటకు నాకు తెలియదు. వాయువు, అగ్ని వీట్లచే పరిశుద్ధమైన స్థూల దేహమునందు హృదయ కమలమునందు మనస్సును నిలుపవలయును.. ఇచ్చట అతి జాగ్రతగా నుండవలెను. మనయొక్క గుండెకాయపైన మనస్సును నిలుపకూడదు. నిలిపినయెడల మరణమే సిద్ధించవచ్చును. కనుక అతి జాగ్రతతో నడుచుకోవలయును. గురువులవారు ఇందును గురించి యుపదేశించిన తీరున హృదయ కమలమును చింతించి అచ్చట ఉండునట్టి అణుమాత్రమై పరాశక్తియుతమైన జీవకళను (శ్రీమన్నారాయణమూర్తిని) చింతించవలయును. ఈ జీవకళను సిద్ధేశ్వరులు ప్రణవోచ్చారణ ద్వారా కనుగొందురు. ప్రణవమునందు అనేకరహస్యములున్నవి. ప్రణవో

చ్చారణ విషయమందు గురూపదేశప్రకారము ఉపాసకుడు నడుచుకొనవలయును. "దీర్ఘఘంటానినాదవత్" అని యుపనిషత్తులలో ప్రాయశః చెప్పబడియున్నది. అకార ఉకార మకార బిందునాదంబులని ప్రణవమున పంచాంశంబులు గలవు. ఆ యైదింటిలో నాదాంతమునందు సిద్ధేశ్వరులు శ్రీమన్నారాయణ మూర్తిని ధ్యానింతురు. అట్టి జీవకళయైన నారాయణమూర్తిని ధ్యానించి ధ్యానించి ధ్యానాధిక్యముచేత అదివరకును అంతర్హితమై యుండు జీవకళను వ్యక్తీకరింపజేసి ఆ కళకు మనసా సర్వోపచారములుచేసి పూజించి ఉపాసకుడు తన్మయుడై తరువాత ఆ జీవకళను "అస్య ప్రాణాః ఇహ ప్రాణాః, అస్య వాఙ్మనశ్చక్షుశ్శ్రోత్రాణీహైవాగత్య సుఖం చిరం తిష్ఠంతు స్వాహా" అని మంత్రమును చెప్పి అందుకు అనుగుణమైన ఆవాహనస్థాపనముద్ర నుపయోగించి తనయెదుట ఉండు ప్రతిమయందు ప్రవేశపెట్టవలయును. ఈ చర్యకు ఆవాహనమని పేరు. "స్వామిన్ సర్వజగన్నాథ యావత్పూజావసానకం । తావత్త్వం ప్రీతిభావేన బింబేస్మిన్ సన్నిధిం కురు ॥ అని ప్రార్థేయపడి వేడుకొనవలయును.

ఉపాసకుడు జీవకళతో తన్మయుడు కావలెనని పైన చెప్పబడియె. తన్మయుడగుటకు రెండు విధములు గలవు. తన్మయుడగుట అను చర్యనే అంగన్యాసకరన్యాసములు అను అనుష్ఠానములవల్ల సులభముగా ఉపాసకులు సాధించగలరు. మరియొక విధము ధ్యానాభ్యాసముచేసి సమాధియందున్నతభాగమునకు ఎక్కితే అప్పటికి ఉపాస్య ఉపాసక సామ్యంబు జనియించి తన్మయతను అనుభవింపగలరు. ఈ ధ్యానయోగముగుండా చెంద

అర్చాపూజ—తన్మయత-అంగన్యాసము

గల తన్మయతను గురించి చెప్పుటకు ముందు కరన్యాసముగుండా తన్మయతచెందుమార్గమును చెప్పవలయు నని తోచుచున్నది. తన్మయత రెండు విధములు. ఆత్మ సంబంధమైన తన్మయత మొద టిది. రెండవది శరీరసంబంధమైనది.

జ్ఞానవాసిష్ఠమునందు ప్రహ్లాదుని చరిత్రమునందు—

ప్రహ్లాదః ॥ అస్మాన్నిమేషా దారభ్య నారాయణ మజం సదా ।
సంప్రపన్నోఽస్మి సర్వత్ర నారాయణమయో స్మ్యహం ॥
అవిష్ణుః పూజయన్ విష్ణుం న పూజాఫలభాగ్భవేత్ ।
విష్ణుర్భూత్వా యజే ద్విష్ణు మయం విష్ణు రహం స్థితః ॥

శ్రీవసిష్ఠః ॥ ప్రహ్లాద ఇతి సంచింత్య కృత్వా నారాయణీం తనుం ।
పున స్సంచింతయామాస పూజార్థం అసురద్విషః ॥
నావిష్ణుః కీర్తయే ద్విష్ణుం నావిష్ణు ర్విష్ణు మర్చయేత్ ।
నావిష్ణు స్సంస్మరే ద్విష్ణుం నావిష్ణు ర్విష్ణు మాప్నుయాత్ ॥

ఏ దేవతను ధ్యానముచేసినను శరీరము ఆ దేవతామయమైన గాని ఆ ధ్యానము ఫలవంతముకాదు అని పై శ్లోకముల తాత్పర్యము.

దేవతారాధనయందు ప్రతిదేవతకును ఒకమంత్రముండును. ఆ మంత్రమును ఉచ్చరించినపుడు ఆ దేవతను పిలిచినట్టు ఆ దేవు నికి తెలియును. పిలుపుయొక్క స్వభావమును అనుసరించి దేవత వచ్చును. పిలిచినవానియొక్క అవసరము, భక్తి, శ్రద్ధ, మంత్రము యొక్క ఆవర్తి, జపము, ఉచ్చారణ సౌష్ఠవము, ఇత్యాదుల ననుస రించి దేవుడు ఆవిర్భవించును. దేవతను ఆహ్వానము చేయుటకు ముందుగా మంత్రమునకు గల ఋషి, ఛందస్సు వీట్లను గమనించి

ఆ మంత్రమును యథోక్తరీత్యా తునియలుగా చేసి చేతుల వ్రేళ్ల గుండా ఉపాసకుడు తన శరీరములోనికి ప్రవేశ పెట్టును.

ఉదాహరణము.

సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥

అనునది చరమశ్లోకము

అస్య చరమశ్లోకమహామంత్రస్య పార్థసారథి ఋషిః, అనుష్టుప్ఛందః, పరమాత్మా శ్రీకృష్ణో దేవతా,

"సర్వధర్మాన్ పరిత్యజ్య" ఇతి అంగుష్ఠాభ్యాం నమః
"మామేకం" తర్జనీభ్యాం నమః
"శరణంవ్రజ" మధ్యమాభ్యాం నమః
"అహంత్వా" అనామికాభ్యాం నమః
"సర్వపాపేభ్యః మోక్షయిష్యామి" కనిష్ఠికాభ్యాం నమః
"మాశుచః" కరతలకరపృష్ఠాభ్యాం నమః

మంత్రమును ఆరు తునియలుగా జేసి అయిదు తునియలను ఐదు వ్రేళ్లగుండా శరీరములోనికి పీల్చి కరతలకరపృష్ఠాభ్యాం నమః అని అరిచేయిమీాచేయి వీట్లయొక్క సమాగమమువల్ల ఆరవతునియను శరీరములోపలికి లాగికొనుట. ఇది కరన్యాసము. ఈ విధముగా మంత్రమును దేహమునందు చొప్పించు రీత్యా మంత్రరూపక దైవముకూడ దేహమునందు చొచ్చును. ఆ విధముగా చొచ్చుట వలన దేహము తన్మయమగును. ఇది రెండవ తరగతి తన్మయత.

<u>ఆత్మపూజ—ఉత్తమాధికారి-తన్మయత</u>

కరన్యాసమార్గముగా తన్మయతను చెందుట మధ్యమాధికారులకుగా నేర్పడినది. ధ్యానయోగపరుడై జీవాత్మపరమాత్మల సామ్యమును అనుభవించి ఆరీత్యా తన్మయతను చెందుట ఉత్తమాధికారికి మాత్రమే సాధ్యము.

యోగమార్గమునందు ప్రయత్నముచేయువార్లకు అధికారులని పేరు. వారలలో ఉత్తములు, మధ్యములు, మందులు, మందతరులు అని నాలుగు తరగతులు గలవు.

ధ్యానే నాత్మని పశ్యంతి కేచి దాత్మానమాత్మనా ।
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥
అన్యే త్వేవ మజానంతః శ్రుత్వా న్యేభ్య ఉపాసతే ।
(శ్రీమద్భగవద్గీత, అధ్యా. ౧౩, శ్లో. ౨౪-౨౫)

ఉత్తమాధికారులైన కొందరు ధ్యానేన=“విజాతీయ ప్రత్యయానంతరి తేన సజాతీయ ప్రత్యయప్రవాహేణ శ్రవణమననఫలభూతేన ఆత్మచింతనేన, నిదిధ్యాసనశబ్దోదితేన, ఆత్మని=బుద్ధౌ, పశ్యంతి=సాక్షాత్కుర్వంతి, ఆత్మానం=ప్రత్యక్చేతనం, ఆత్మనా=ధ్యానసంస్కృతే నాంతఃకరణేన కేచిదుత్తమా యోగినః.” బుద్ధియందు దాగియుండు స్వస్వరూపమును అనగా ప్రజ్ఞానాంశువును కనుగొందురు. ప్రజ్ఞానాంశువు గుండా ఈశ్వరుని తెలిసికొందురు.

మధ్యమాధికారులు సాంఖ్యము అను యోగముచేత అనగా శ్రవణముచేసిన శాస్త్రములను మననముచేసి నిత్యము అనిత్యము అను వివరణజ్ఞానముచేత లోకమంతయు గుణత్రయముయొక్క అనగా సత్త్వరజస్తమోగుణములయొక్క త్రివృత్కరణములవల్లను

ప్రకృతిపురుషసమాగమమునను కలిగిన పరిణామములు. నేనేమో ద్రష్టను, అనగా చూచుచుండువాడను కనుక సాక్షిని, నిత్యుడను, గుణాతీతుడను అగు ఆత్మను అను భావముచేత క్రమముగా ధ్యానయోగమును చేయు యోగ్యతను సంపాదించి బుద్ధిగుహాయందు దాగియుండు ఆత్మను కనుగొందురు.

మందాధికారులు కర్మయోగమువలన ముక్తిచెందుదురు. కర్మల నాచరించి వానియొక్క ఫలము తనకు అవశ్యము లేదని ఆ ఫలమును ఈశ్వరార్పణము చేయుట అను చర్యకు కర్మయోగమని పేరు. ఇట్టి కర్మయోగము చేయుచు చిత్తశుద్ధిని సంపాదించి శ్రవణ మననములుచేసి నిదిధ్యాసనమువల్ల బుద్ధిగుహాయందు దాగియుండు ప్రజ్ఞానాంశువును కనుగొందురు.

మందతరులైన అధికారులు అయితేనో పైనచెప్పిన మూడు మార్గములలో దేనినైనను అభ్యసించుట కసమర్థులై గురువులను ఆశ్రయించి గురూపదిష్టమార్గముగా మెట్టుమెట్టుగా నెక్కి పరంపరా సాధనములవలన ఆత్మసాక్షాత్కారమును పొందుదురు.

## ధ్యానయోగము

అనగా యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణా రూపకంబులైన సోపానములను ఎక్కి తద్ద్వారా శబ్దాదివిషయములనుండి శ్రోత్రాదీంద్రియములను మరల్చి మనస్సునందు నిలిపి మనస్సును బుద్ధియందు లంకించి ధ్యానముచేయుట. “ఉపాస్యస్య అర్థస్య మనసా విషయీకరణేన తత్సామీప్య ముపగమ్య ,సంతత తైలధారావ దవిచ్ఛిన్నేన మార్గేణ, సజాతీయ ప్రత్యయప్రవాహే

అర్చాపూజ—ధ్యానయోగము

ణ, విజాతీయప్రత్యయానంతరితేన దీర్ఘకాలం యచ్చింతనం తద్ధ్యానం". తాను ఏ మూర్తిని ధ్యానించవలెనని యిచ్ఛయించినాఁడో ఆ మూర్తియొక్క రూపమును శాస్త్రములలో చెప్పిన ప్రకారము మనసా చింతించి మనస్సుతో ఆ రూపమును కట్టి ఆ రూపము యొక్క గుణకర్మలను శ్రవణముచేసియుండినందుకు అనుకూలము లైన తలంపులను మాత్రము తలచుచు తదితరములైన తలంపులను మనస్సులో ప్రవేశించకచేయుచు ఒక పాత్రలోనుండి మరియొక పాత్రలోపలికివంచబడిన నూనెయొక్క ధార ఏవిధముగా నెడ తెగక యుండునో ఆ విధముగా నెడతెగని తలంపులసంతతితో దీర్ఘకాలము చింతించుచుండుటకు ధ్యానము అని పేరు. ఈ ధ్యానమునందు మానసికరూపము ముఖ్యము.

పూజా విగ్రహములు (అర్చలు) ఎనిమిది విధములు "శైలీ దారుమయీ లౌహీ లేప్యా లేఖ్యా చ సైకతీ। మనోమయీ మణిమయీ త్వర్చా అష్టవిధా స్మృతా॥" అను శ్లోకము ఇదివరకే చెప్పబడెను. ప్రతిమలు, విగ్రహములు, అర్చలు అను నవి యన్నిటిని శాస్త్రములయందు భగవంతుని లీలారూపములను వర్ణించియుండు ప్రకారము అంగాంగములను ఆభరణములను ఆ యుధములను కల్పించి తదనురూపమైనట్టు చేయింతురు. అట్టి విగ్రహములు చలములు స్థిరములు అని రెండు విధములు. అచలములై స్థిరములైన విగ్రహములు దేవాలయములయందుండును. దేవాలయములను నిర్మించువారు అనేక సంవత్సరములకాలము తపస్సుచేసి పీఠప్రతిష్ఠచేసి ఆ పీఠము పైన విగ్రహమును స్థాపింతురు.

స్థాపకస్య తపోయోగాత్ పూజాయా శ్చాతిశాయనాత్ ।
అభిరూప్యా చ్చ బింబస్య సదా సన్నిహితో స్మ్యహం ॥

(బ్రహ్మాండపురాణము, శ్రీరంగమాహాత్మ్యము.)

విగ్రహమును స్థాపించినవారియొక్క తపశ్శక్తిననుసరించియు విగ్రహమునకు చేయు పూజలశక్తిననుసరించియు విగ్రహము ఎంత కన్ను ముక్కు తీరుగా నాభిరూప్యము చెందియుండునో ఆ విషయములను అనుసరించి నేనెల్లప్పుడును ఆ విగ్రహములయందుందును అని భగవంతుడు చెప్పెనట. పై చెప్పబడిన తపోబలము, పూజాశక్తి ఆభిరూప్యము అను నీ మూడు సిద్ధులును పై వివరించిన ఎనిమిది విధములైన అర్చలకును అన్వయించును. ఏ విగ్రహమందైనను (భౌతిక మానస విగ్రహములయందంతట) ఆభిరూప్యము ముఖ్యము. ఆభిరూప్యమును మనోవిగ్రహములకు ఏర్పరుచుట చాల కష్టము. ప్రతినిత్యమును ప్రయత్నపడి భగవద్రూపమును మనస్సునందు కట్టి కట్టి పాదములుకట్టునప్పటికి కాలివ్రేళ్లు మాసిపోవుచు, ఊరువు, కటి ఇట్టిప్రదేశములకు పోవునప్పటికి పాదములు మాసిపోవుచు, ఈ ప్రకారము కట్టిన రూపము మాసిపోవుచుండగా విసుకుకొనకయే మళ్లీ మళ్లీ విగ్రహమును మనసా కట్టుచు ఏండ్లకొలది ప్రయత్నముచేయుచురాగా నదృష్టవశమ్మున నెన్నడో యొకనాటికి రూపేర్పడి మాసిపోయి మరల ఏర్పడి ఇట్లు బహుదీర్ఘకాలమునకు ఆభిరూప్యము తక్కువైన రూపేర్పడును. విసుకులేని వ్యాసంగమువల్లను పదే పదే పునఃపునర్జాయమానమైన ఉత్సాహముతోను రూపమును కట్టుచురావలయును. పూర్వజన్మములయందు మూఢావస్థయందు ఏ మహానుభావుడు ధ్యానము చేయు

చుండగా మనము ఆ ధ్యానమునకు ప్రత్యవాయములు కలుగ జేసితిమో అట్టి పాపకృత్యములకు ప్రతిఫలముగా మన ధ్యానమునకు భంగము కలుగజేయు స్థూలలోకమందలి దోమలు, చీమలు, ఎండ, గాలి, యిట్టి ప్రత్యవాయములను సూక్ష్మలోకములందలి ప్రమాదాలస్యనిద్రాదులను ఏకాగ్రచిత్తమును శిథిలముచేయు ఆశాపాశశతంబులను నిరాకరించి ధ్యానావస్థయందు స్థిరచిత్తుడై కూరుచొని మనోమయవిగ్రహమును ఆభిరూప్యముతో కట్టికటి స్థాపించి పూజించి పూజించి తన్మయత చెందు ధన్యులు కావలయును.

ఇహలోక సుఖములయందలి అభిలాషను బొత్తిగా మాని మనోరథజాలమును నిరాకరించిన గాని మనోమయవిగ్రహమును కట్టుట సాధ్యముకాదు. కట్టినవిగ్రహమును ధారణ (అనగా నిలుపుకొనుట) చేసియుంచుకొనుట అంతకన్ననధికమైన కష్టము. కనుక

మనోరథానాం న సమాప్తి రస్తి వర్షాయుతై రప్యథ వాపి లక్షైః ।
పూర్ణేషు పూర్ణేషు పున ర్నవానా ముత్పత్తయ స్సంతి మనోరథానాం ॥
పద్భ్యాంగతా యౌవనిన శ్చ జాతా దారై శ్చ సంయోగ మితాః ప్రసూతాః ।
దృష్టా స్సుతా స్తత్తనయప్రసూతిం ద్రష్టుం పునర్వాంఛతి మేంతరాత్మా ॥
యజ్జీవతో నైవ మనోరథానా మంతోఽస్తి విజ్ఞాత మిదం మయాద్య ।
మనోరథాసక్తిపరస్య చిత్తం న జాయతే వై పరమార్థసంగి ॥

(విష్ణుపురాణము, సౌభర్యుపాఖ్యానము.)

పదివేల సంవత్సరములకైనను లక్షసంవత్సరములకైనను మనోరథములు ముగియవు. మొదట పుట్టినవి నెఱవేఱ నెఱవేఱ మఱల మఱల మనోరథములు పుట్టుచుండును. నా సుతులు నడవ నారం

భించిరి, పిమ్మట యౌవనము వచ్చినది. భార్యలను సంపాదించిరి. వారలతో సమాగమము కలిగినది. వారి సంతతిని చూడవలెనని మరల మనోరథములు పుట్టుచున్నవి. బ్రతికియున్నంతవరకును మనోరథములకంతము కలుగదను రహస్యమును నేనిప్పుడు తెలిసి కొంటిని. మనోరథములయందాసక్తి కలవానికి చిత్తమెన్నడును స్థిరము కాచాలదు. కనుక పరమార్థచింత యే కలుగ దని నా యభిప్రాయము అని యర్థము.

మనోరథములను తగ్గించియుంచినయెడల చిత్తభ్రమణకు కారణములు తగ్గును. ఇట్టి చిత్తస్థిరీకరణమును చేగాని మానసికముగా విగ్రహమును నిర్మించుటకు ప్రయత్నపడవలయును.

ఉపాసకునికి ఏ మూర్తియందిష్ట మున్నదో ఆ మూర్తి యొక్క రూపమును మనస్సునందు కట్టవలయును. మనసా విగ్రహమును నిర్మించుట చాల కష్ట మనియు బహుదీర్ఘకాలప్రయత్నమున నేగాని సాధ్యముకాదనియును ఇదివరకే చెప్పబడెను.

విలిఖిత మివ రూపం చిత్తభిత్తౌ మురారేః ।
సుమన ఇవ మనో యై రర్పితం తత్పదాబ్జే ।
ప్రతిపద ముదయద్భి స్సాత్త్వికై రంకితాంగాః ।
త ఇహ భవపయోధేః పార ముల్లంఘయంతి ॥

నిర్గుణోపాసనమునకు పూర్వపదవియైన సగుణోపాసనను వివరించు శ్లోకము. ఎవ్వడు పరమాత్మకు శాస్త్రోక్తమైన యొకరూపమును కల్పించుకొని అట్టి రూపమును కరచరణాద్యవయవములతోడను సాయుధసాంరాజ్యముతోడను గోడలమీద లోకులు చిత్రములు వ్రాయునపుడు ప్రతి అంగమును ప్రతి ఆయుధమును జీవకళతో

అర్చాపూజ—ధ్యానయోగము

కలిపి వ్రాయుదురో అట్లు నిదానముగా నిశ్చయముగా మనసు లనెడు గోడలపైన వ్రాసి భగవంతుని భౌతికవిగ్రహములకు మల్లికాది పుష్పములను సమర్పించినట్టుగానే మనోమయవిగ్రహము యొక్క పాదారవిందములయందు తమ మన స్సనెడు పుష్పమును సమర్పించి భక్తిరసద్రావము చేయుచు అందువలన ప్రతిక్షణమందును కలుగు నానందబాష్పములు రోమాంచములు మొదలగు సాత్త్వికచిహ్నములను శరీరమునందనుభవించు మహానుభావు లిదే జన్మమునందే సంసారసముద్రమును దాటగలరు అని తాత్పర్యము.

పురాణములయం దచ్చటచ్చట ధ్యేయమూర్తియొక్క మంగళవిగ్రహముయొక్క వివరములను వర్ణించియున్నారు. గోడల పైన చిత్రములను వ్రాయుట అంత సులభముగా ముగియునట్టి కార్యము కాదు. నిదానముగా అంగాంగములను ఆగమశాస్త్రమునందును శిల్పశాస్త్రమునందును చెప్పిన వివరములతో కొలతలతో వ్రాయుటకు చాల కాలమవును. అదేవిధమున మనోమయవిగ్రహమును కట్టుటకును అంతకంటె నధికమైన కాలము కావలసియుండును.

ఉపాసకుడు శివభక్తుడైనయెడల శివవిగ్రహమును విష్ణుభక్తుడైన విష్ణువిగ్రహమును కట్టుకొనవలయును.

శివభక్తులుగానుండువారు ధ్యానముచేయదగిన వివరమును శ్రీ కైవల్యోపనిషత్తునందు చెప్పియున్నది.

> వివిక్తదేశే చ సుఖాసనస్థః శుచిః సమగ్రీవశిరశ్శరీరః ।
> అత్యాశ్రమస్థ స్సకలేంద్రియాణి నిరుధ్య భక్త్యా స్వగురుం ప్రణమ్య ॥

హృత్పుండరీకం విరజం విశుద్ధం విచింత్య మధ్యే విశదం విశోకం ।
అచింత్య మవ్యక్తం అనంతరూపం శివం ప్రశాంత మమృతం బ్రహ్మయోనిం॥
తదాదిమధ్యాంతవిహీన మేకం విభుం చిదానంద మరూప మద్భుతం ।
ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం త్రిలోచనం నీలకంఠం ప్రశాంతం ॥

వివిక్తదేశేచ=‘వివిక్తదేశసేవిత్వం’ అని భగవద్గీత, ౧౩వ యధ్యాయము, ౧౧ వ శ్లోకమందును, ‘వివిక్తసేవీ’ అని ౧౮ వ అధ్యాయము, ౫౨ వ శ్లోకమునందును చెప్పబడియున్నది. వివిక్తము అనగా జనసమూహము లేని స్థలము. జనసమూహమున్న యెడల లోకవార్తలు నవ్వులు హాస్యములు మొదలగు యోగప్రత్యవాయము లుండును. అందువలన వివిక్తస్థలము అవశ్యముండవలెను. వివిక్తమైన ప్రదేశమునందు ఐహికతలంపులను తలంచువారు ప్రాయశః ఉండరు. కనుక వారి సంకల్పములయొక్క రూపములు అచ్చట ఆకాశమునందుండవు. మరియు వివిక్తదేశము అనినపుడు భావమంతర్గర్భితమై యున్నది. అట్టి స్థలము శుచిగా కూడ నుండవలయును. ఆ స్థలము స్వభావతః గాని లేక ప్రయత్నతః శుద్ధమై యుండవలెను. ఇది స్వగృహమునందే యుండవచ్చును.

సమే శుచౌ శర్కరావహ్నివాలుకావివర్జితే శబ్దజలాశ్రయాదిభిః ।
మనోనుకూలే న తు చక్షుపీడనే గుహానివాతాశ్రయణేన ప్రయోజయేత్ ॥

ఈశ్లోకతాత్పర్యమును అష్టాంగయోగమునుగురించి వ్రాసినపుడు చెప్పియున్నది.

సుఖాసనస్థః=ఈ విషయమును అష్టాంగయోగమునందు ఆసనమును గురించి వ్రాసినస్థలమునందు చూడవలయును.

అర్చాపూజ—ధ్యానయోగము

శుచిః=ఈ విషయమును ఈ గ్రంథము పూర్వభాగము నందు ౩౧౦ వ పుటలో ‘శౌచం’ అని వివరించియున్నది.

సమగ్రీవశిరశ్శరీరః=ఈ విషయము భగవద్గీత, ౬ అవయధ్యాయము, ౧౩ వ శ్లోకమునందు “సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః” అని చెప్పియున్నది. ఇచ్చట కాయము అను శబ్దమునకు డొక్క అని యర్థము. డొక్క, మెడ, శిరస్సు, వీట్లను సమముగా వంకరలేక. అకంపముగా నుంచుకోవలయును అని యర్థము. మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరకము, అనాహతము అను చక్రములు డొక్కయందున్నవి. విశుద్ధ అను చక్రము కంఠమునందున్నది. ఆజ్ఞ, సహస్రారము అను చక్రములు శిరస్సునందున్నవి. ధ్యానయోగమునందు చక్రములలో పనిజరుగవలసియుండును. ఇది గురూపదేశమును అనుసరించి జరుగవలయును. మూలాధారము మొదలు సహస్రారము వరకు ప్రాణసంచలనార్థము త్రోవ నిరాఘాటముగా నుండవలయును. కనుక “సమగ్రీవశిరశ్శరీరః” అని చెప్పబడినది.

సకలేంద్రియాణి నిరుధ్య=జ్ఞానేంద్రియ కర్మేంద్రియములనంతయు స్వేచ్ఛావిహారమందు ఆనందముపొందనీయక జీవాత్మయైన ఉపాసకుని నియామకమునకు లోబడియుండునట్టు నియమించవలయును. మనస్సును ధ్యానమునందు ప్రవేశపెట్టవలయును.

కొందరు జపమునకు కూరుచున్నపుడు ‘సమంకాయశిరోగ్రీవము’ గా లేక వీపు విల్లువలె వంపుగా నుంచుకొనియుందురు. ఇది కూడదు. కొందరు జపముచేయునపుడు గాని ధ్యానమునం

దమరి యున్నపుడుగాని తలపైన గుడ్డతో ముసుకు వేసు కొనియుందురు. ఇదియు తప్పు. జపమును చేయు విధానమును గురించి

న సంక్రామన్ న చ హసన్ న పార్శ్వ మవలోకయన్ ।
నాఽఽయాసితో న జల్పంశ్చ న ప్రావృతశిరా స్తథా ॥

ప్రావృతశిరాః అనగా తలపైన ముసుకు వేసికొనుటకు అర్థము.

అత్యాశ్రమస్థః=అతివర్ణాశ్రమిగా నుండుట మంచిది. నా జాతి శ్రేష్ఠమైనది, నా ఆశ్రమము శ్రేష్ఠమైనది అను మొదలగు అహంకారములకు ఎడముండ కూడదు. అట్టి అహంకారము లేనివాడు ఏ ఆశ్రమమందైనను ఉండవచ్చును. అహంకారము ధ్యానమునకు ప్రత్యవాయము.

భక్త్యా స్వగురుం ప్రణమ్య=భక్తితో తన గురువుల వారికి నమస్కారములు చేయవలయును. గురువులవారు శిష్యుని సమీపమందున్నను దూరాన ఉన్నను వారిని మనసా చింతించి కొన్ని స్తోత్రములనుచెప్పి నమస్కరించవలయును. గురువులవిషయ మందు మహీపీఠమునుగురించి జ్ఞానదీక్షలు అను అధ్యాయము నందు వ్రాసినపుడు వ్రాయబడియున్నది. "స్వగురుం" అనిన పుడు బోధకగురువులవారినే నమస్కరించి అని యుద్దేశము. 'బో ధకగురువులవారు జీవన్ముక్తులు గనుక వారు శిష్యునిసమీపమం దుండుట అరుదు. ఐనను బోధకగురువులవారియొక్క రూపమును మనసా కట్టుకొని దానికి అభిముఖ్యము నిచ్చి స్తోత్రపూర్వక ప్రణా మంబుల నాచరించవలయును.

అర్చాపూజ—ధ్యానయోగము-గురుధ్యానము

## గురుధ్యానము

అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా ।
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీ గురవేనమః ॥ ౧ ॥
శ్రీమద్గురోః పాదసరోజభక్త్యా విద్వత్సభామండల చక్రవర్తినం ।
జిహ్వాంగణే పుణ్యతమే రసాలయే శ్రీమత్పరబ్రహ్మగురుం నమామి ॥ ౨ ॥
గురుప్రసాదా దహ మేవ విష్ణుః మయ్యేవ సర్వం పరికల్పితం చ ।
ఇత్థం విజానామి తథాఽఽత్మరూపం తస్యాంఘ్రి పద్మం ప్రణతోస్మి నిత్యం ॥
గురు ర్మాతా పితాచైవ గురురేవ హి భాంధవః ।
గురుర్దైవాత్పరం నాస్తి తస్మై శ్రీ గురవే నమః ॥ ౪ ॥
చేతస్సుఖకరం శాంతం వ్యోమాతీతం నిరంజనం ।
నాదబిందుకళాతీతం తస్మై శ్రీ గురవే నమః ॥ ౫ ॥
గురురేవ జగత్సర్వం బ్రహ్మవిష్ణుశివాత్మకం ।
గురోః పరతరం నాస్తి తస్మై శ్రీ గురవే నమః ॥ ౬ ॥
యస్య స్మరణమాత్రేణ జ్ఞాన ముత్పద్యతే స్వయం ।
తథైవ సర్వసంపత్తిః తస్మై శ్రీ గురవే నమః ॥ ౭ ॥
యస్య సందర్శనా దేవ కామక్రోధకులక్షయం ।
సర్వమంగళ మప్యేతి తస్మై శ్రీ గురవే నమః ॥ ౮ ॥
యస్యాభి వాదనా దేవ భవబంధక్షయక్షయం ।
సర్వమర్మాణి పశ్యంతి తస్మై శ్రీ గురవే నమః ॥ ౯ ॥
యస్యా నుగ్రహమాత్రేణ జీవన్ముక్తోభవే న్నరః ।
బ్రహ్మాత్మజ్ఞానసంసిద్ధః తస్మై శ్రీ గురవే నమః ॥ ౧౦ ॥
వందే గురూణాం చరణారవిందం సందర్శితస్వాత్మ సుఖాంబుధీనాం ।
జనస్య యజ్జాంగలికాయమానం సంసారహాలాహలమోహశాంత్యై ॥ ౧౧ ॥
అఖండమండలాకారం వ్యాప్తం యేన చరాచరం ।
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవే నమః ॥ ౧౨ ॥

ఆనంద మానందకరం ప్రసన్నం జ్ఞానస్వరూపం నిజబోధయుక్తం ।
యోగీంద్ర మీడ్యం భవరోగవైద్యం శ్రీమద్గురుం నిత్యమహం నమామి ॥౧౩॥
గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురు రేవ పరంబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః ॥ ౧౪ ॥
వేదాంతపీయూషరసాన్ పిబంతం । నాదాంతసందీప్తనిజస్వరూపం ।
పాదాతిగం వాఙ్మనసాతిదూరం । భేదాపహం సద్గురు మాద్య మీడే ॥౧౫॥
బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం ।
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యం ।
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం ।
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి ॥ ౧౬ ॥

ఈ ప్రకారము గురుధ్యానము చేయవచ్చును. సాధ్యమైనంతవరకును అర్థమును విచారించి అర్థయుక్తముగా ధ్యానముచేయవలయును. ఇట్లు ధ్యానము చేసి గురుమహారాజుగారి మాహాత్మ్యమును మనసా భావించుటవల్ల ఉపాసకుని మనస్సు గురుమహారాజుగారి మనస్సుతో నేకీభవించును. వారివద్దనుండి ఆశీర్వాదములు శిష్యునికి వచ్చును. ఆ ఆశీర్వచనములయొక్క బలమువల్ల శిష్యుని యొక్క ధ్యానమునకు వీర్యము కలుగును. శిష్యునిశరీరమునందు ధ్యానమునకు అనుకూలములైన స్పందములు కలుగును. మనలో అనేకులకు మోహాంధకారము హృదయము నిండియుండును. సాధారణమైన చీకటిని సూర్యుని వెలుతురు పోగొట్టును. సూర్యుడు లేనపుడు చంద్రుడుగాని అగ్నిగాని పోగొట్టుదురు. హృదయమునందు నిండియుండు మోహాంధకారమును సూర్యుడుగాని చంద్రుడుగాని అగ్నిగాని ఇట్టివారలు వేయిమంది ప్రయత్నముచేసినను పోగొట్టలేరు. గురువులవారే పోగొట్టగలరు.

అర్చాపూజ—ధ్యానయోగము-శైవము

హుతాశనానాం శశినామినానాం అప్యర్బుదం వా పిబ యన్నివాంతుం।
శక్నోతి తద్ధ్వాంత మనంత-మాంతరం హంత్యాత్మవేత్తా సకృ దీక్షణేన ॥
(సర్వవేదాంతసిద్ధాంతసారసంగ్రహము)

అందువలన ధ్యానముచేయుటకు ఉత్సాహము కలుగును.

గురుధ్యానానంతరము ఉపాసకుడు తన గురువులవారు ఉపదేశించినరీతిగా "హృదయావకాశే" అని చెప్పినట్లు హృదయముందు తావున లేక హృదయాకాశమునందు ధ్యాన మారంభించవలెను. "హృదయావకాశము," "హృదయాకాశము" మొదలగు మాటలన్నియు రహస్యమును దాచిపెట్టి గురువులవారిగుండా ఉపదేశముపొందవలె నను నుద్దేశముతో చెప్పబడిన మాటలు.

రజోగుణతమోగుణములను పారదోలి సత్త్వగుణమును మాత్ర మాశ్రయించిన వారై ఉపాసకులు

అచింత్యమవ్యక్తమనంతరూపం।
శివం ప్రశాంతం అమృతం బ్రహ్మయోనిం ॥

అని శివవిగ్రహమును ఉమాసమేతముగా మనసా కట్టి ఆ మనోమయవిగ్రహమును పూజచేయవలయును.

శివవిగ్రహమును ఉమాసమేతముగా కట్టుటకుగా కొన్ని వర్ణన శ్లోకము లున్నవి. శ్లోకములు మాత్రము ఈ దిగువ నచ్చువేయబడియున్నవి. గ్రంథవిస్తరభీతిచేత నర్థము వ్రాయలేదు. అర్థమును విచారించికొని ధ్యానించనర్హము.

ఘనరత్నమయే దివ్యే మంటపే నిర్మలే శుభే।
సూర్యచంద్రాగ్నిపీఠస్థం చింతయే త్పరమేశ్వరం ॥

స్వరున్మూర్ధజలక్లిన్న జటామండలమండితం ।
సౌవర్ణరత్నఖచితమకుటేన విరాజితం ॥
బాలేందుశేఖరం ఫాలే భస్మరేఖాత్రయాన్వితం ।
విశాలపద్మపత్రాభం సూర్యచంద్రాగ్నిలోచనం ॥
పురస్తాది మహద్దివ్యం పంచబ్రహ్మముఖాన్వితం ।
మహామరకతప్రఖ్యనాగకుండలమండితం ॥
స్వర్ణరత్నాంగదలసత్పంచద్వయభుజాన్వితం ।
రత్నకంకణశోభాఢ్యం మణిబంధవిరాజితం ॥
వజ్రకీలితసౌవర్ణముద్రికాంగుళిశోభితం ।
వజ్రవైదూర్యమాణిక్య నిష్కభాసితవక్షసం ॥
జాంబూనదలతాభూత నాగయజ్ఞోపవీతినం ।
విశాలవక్షసం శుద్ధం భసితాలేపమండితం ॥
చంద్రికానిర్గమప్రాయ విలసత్సుస్మితాననం ।
అంతస్సత్వగుణోద్భాసి శుద్ధస్ఫటికసన్నిభం ॥
బ్రహ్మాండకోటి సంస్థాన వళిత్రయయుతోదరం ।
నవహాటక నిర్మాణ కింకిణీ దామశోభితం ॥
ఘంటావళి సమాక్రాంత కటిబంధవిరాజితం ।
తరుణార్కసహస్రాభ దివ్యపీతాంబరావృతం ॥
వ్యాఘ్రచర్మ పరీధానం శీఘ్రమిష్టఫలప్రదం ।
వామభాగేంక మారూఢగౌర్యాలింగితవిగ్రహం ॥
రత్నసందోహమంజీర క్వణత్పదసరోరుహం ।
దిక్పాలమౌళిమాణిక్య నీరాజితపదాంబుజం ॥
వామభాగాశ్రితాం తస్యాం నరాభరణభూషితాం ।
నీలాభ్రపుంజసంకాశ నీలకుంతలవేణికాం ॥
మందారాశోకపున్నాగ వాసితోత్తమకుంతలాం ।
ముక్తామండలసంయుక్త దీర్ఘసీమంతినీం శుభాం ॥

అర్చాపూజ—ధ్యానయోగము-శైవము

శృంగారామృతనిష్యందముఖచంద్రవిలాసినీం ।
చంద్రాంతఃకలుషప్రఖ్య కస్తూరితిలకోజ్జ్వలాం ॥
వజ్రమాణిక్యసౌవర్ణ స్ఫురత్తాటంక శోభితాం ।
ఉద్యత్కళినిభస్వచ్ఛ స్ఫురన్మౌక్తికనాసికాం ॥
ముషితాదర్శసద్భావ భాస్వద్గండస్థలీం శుభాం ।
లక్తకద్వయరాగాత్త కపోలద్వయమండితాం ॥
ప్రవాళలతికాభావ సంప్రాప్తాధరపల్లవాం ।
కటాక్షవీక్షణానేక భక్తపాలనతత్పరాం ॥
మాణిక్యముద్రికాభాస్వ త్కరాంగుళి విరాజితాం ।
శింజాన మంజు మంజీర క్వణత్పాదసరోరుహాం ॥
ఏవం ధ్యాయే న్మహాదేవం ఉమయా సహితం శివం ।
క్రమేణ నిశ్చలధియా కుర్యా దభ్యాసయోగతః ॥

(శివతత్త్వసుధానిధి)

ఈ విధముగా శివభక్తులు ఉమాసహాయులైన పరమేశ్వరుల రూప మును ధ్యానముచేయుటకు మనోమయమైన విగ్రహమును కట్టు కొనవలెను. శివం ప్రశాంతం అని చెప్పియున్నది. ఇచ్చట ప్రశాం తం అను పదము చాలముఖ్యము. ధ్యేయమూర్తి ఎప్పటికిని శాంతమూర్తిగా నుండవలయును. ధ్యాతయొక్క మనస్సునకు ఆ రూపమును చూడగానే ఆహ్లాదము కలుగవలయును. అపుడే ధ్యా నము సరిగాజరుగును.

‘శాంతాకారం భుజగశయనం’
‘మందస్మితస్ఫురితముగ్ధముఖారవిందం’
‘అపారకారుణ్యసుధాతరంగైరపాంగపాతైరవలోకయంతం’
‘శాంతం శారదచంద్రకాంతిధవళం’

అని మొదలగు వర్ణనలు ఎందుకుగా నిచ్చినారని విచారించితే ధ్యేయమూర్తియొక్క రూపము మనస్సునకు కాహ్లాదకముగా నుండవలెనని తెలియవచ్చును. ఆభరణాది చిహ్నములను మనసా కట్టుట అతిప్రయాస గనుక ఆరంభమునందు ఆభరణములు ఆయుధములు మొదలైనవి లేనట్టి విగ్రహమునుమాత్రము కట్టికొనుట సులభముగానుంటే అట్లే చేయవచ్చును.

ఇక విష్ణుభక్తుల కుపయోగించు ధ్యేయమూర్తియొక్క వర్ణన నారంభించవలయును. విష్ణుభక్తులలో కొందరు శ్రీరామచంద్రులయందు భక్తిగలవారు. మరికొందరు శ్రీకృష్ణమూర్తి యందు భక్తిగలవారు. తరుచుగా కృష్ణభక్తులుందురని నాయభిప్రాయము గనుక శ్రీమద్భాగవతమునందలి ధ్యానమార్గమును వ్రాయు నభిప్రాయమున్నది. శివకేశవభేదము భక్తులకు అంత పాటింపుగా నుండకూడదు. వారివారి రేఖను అనుసరించి కొందరు శివభక్తులుగానుందురు కొందరు; విష్ణుభక్తులుగానుందురు.

> మహేశ్వరే వా జగతా మధీశ్వరే । జనార్దనే వా జగదంతరాత్మని ।
> న వస్తుభేదప్రతిపత్తిరస్తి మే । తథాపి భక్తి స్తరుణేందు శేఖరే ॥

లోకారాధ్యుడైన మహేశ్వరునియందు గాని జగదంతరాత్మ యైన విష్ణుమూర్తియందు గాని నాకు భేదబుద్ధి లేదు. అయినను నాకేమో చంద్రచూడుడైన మహేశ్వరునియందు భక్తి అని పైశ్లోకము యొక్క అర్థము. ఏ భక్తుడైనను ఈ యభిప్రాయములను కలిగి యుండవచ్చునే గాని పాషండత్వము నవలంబించి ద్వేషబుద్ధిని కైగొనకూడదు.

అర్చాపూజ—వైష్ణవము

శ్రీమద్భాగవతము ద్వితీయస్కంధమునందు పరీక్షిన్మహారాజునకు శ్రీశుకయోగీంద్రు లుపదేశించిన వివరము.

కేచి త్స్వదేహాంతహృదయావకాశే । ప్రాదేశమాత్రం పురుషం వసంతం ।
చతుర్భుజం కంజరథాంగశంఖ । గదాధరం ధారణయా స్మరంతి ॥ ౧ ॥
ప్రసన్నవక్త్రం నళినాయతేక్షణం । కదంబకింజల్కపిశంగవాససం ।
లసన్మహారత్న హిరణ్మయాంగదం । స్ఫురన్మహారత్నకిరీటకుండలం ॥ ౨ ॥
ఉన్నిద్రహృత్పంకజ కర్ణికాలయే । యోగేశ్వ రాస్థాపితపాదపల్లవం ।
శ్రీలక్ష్మణం కౌస్తుభరత్నకంధరం । అమ్లానలక్ష్మ్యా వనమాలయా చితం ॥ ౩ ॥
విభూషితం మేఖలయాంగుళీయకైః । మహాధనై ర్నూపుర కంకణాదిభిః ।
స్నిగ్ధామలైః కుంచిత నీలకుంతలైః । విరోచమానాననహాసపేశలం ॥ ౪ ॥
అదీనలీలాహసితేక్షణోల్లసత్ భ్రూభంగ సంసూచిత భూర్యనుగ్రహం ।
ఈక్షేత చింతామయ మేవ మీశ్వరం యావ న్మనో ధారణయా వతిష్ఠతే ॥ ౫ ॥
ఏకైక శోంగాని ధియానుభావయే త్పాదాది యద్ధసితం గదాభృతః ।
జితంజితం స్థానమపోహ్యధారయే త్పరం పరం శుధ్యతి ధీర్యథా తథా ॥ ౬ ॥

కొందరు తమ దేహమందు హృదయసమీపమందుండు ప్రాదేశమాత్రస్థలమున వసించుచుండు పురుషుని యీ దిగువ వివరించిన రూపముగలవానిగా భావించి ధారణాభ్యాసమున ధ్యానింతురు. ప్రాదేశము అనగా దుత్తెడు అని యర్థము. బొటనవ్రేలిని చూపుడువ్రేలని విస్తారముగానుంచి నపుడు ఏర్పడు దూరమునకు ప్రాదేశము అని సంస్కృతమునందును దుత్తెడు అని తెనుగునందును వాడుదురు. "అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః" అని శ్రీమద్భగవద్గీతయందు చెప్పిన ప్రకారము పరమేశ్వ

రుడు హృద్దేశమునందుండును. “ఈశ్వర స్సర్వభూతానాం హృద్దే శేర్జున తిష్ఠతి” అనియు చెప్పబడియున్నది. నాలుగు చేతులవాడు. ఆ చేతులయందు శంఖము, చక్రము, గద, పద్మము అను చిహ్నములను ధరించినవాడు. అతనియొక్క ముఖము అనుగ్రహసూచకముగా నుండవలయు. కమలదళములవలె విశాలములైన కండ్లు గలవాడు. కదంబపుష్పముయొక్క వర్ణమువలె పచ్చని వస్త్రమును ధరించినవాడు. ప్రకాశించుచున్న మహారత్నములచే చేయబడిన బంగారు భూషణములు గలవాడు. జీవమణులచేత ఖచితమైన కిరీటమును కుండలములనును గలవాడు. యోగేశ్వరులు యమనియమాది అభ్యాసములను చేసి విరజంబుగా చేయించుకొనిన హృదయమును సంపాదించి ఆ హృదయకర్ణికయందు ఈ మహానుభావుని పాదకమలములను ధ్యానించిన నచ్చట ప్రసన్నుడైనవాడు. శ్రీదేవిని ఉరఃప్రదేశమునందు గలవాడు. కౌస్తుభము అను మణిని మెడన దాల్చినవాడు. వాడలేని వనమాలను దాల్చినవాడు. మహాధనము ఇచ్చిన గాని లభించని మొలనూలు, ఉంగరములు ధరించినవాడు. మరియు అంత వెలగల గజ్జలు, కంకణములు ధరించినవాడు. చక్కగా దువ్వబడిన నల్లని కుటిలాలకములుగలిగి అందువల్ల నలంకృతంబైన చిరునవ్వు మొగము గల సామి. ఉదారమయిన చిరునవ్వులీలచే చిన్నవోయిన కండ్లు గలిగి భ్రూభంగమును చూపి అందువలన సూచించిన మహదనుగ్రహమునిచ్చు వేలుపు. ఈ విధంబున మనసా కల్పింపబడిన రూపుగల పరమేశ్వరుని చూచి ఆనందించి మనస్సు అను భ్రమరము ఆ కమలదళాక్షుని చూచి యానందించుచుండ ధ్యానింతురు.

అర్చాపూజ—వైష్ణవము

ఈ పై శ్లోకములను శ్రీ పోతనామాత్యులు ఒక వచన రూపముగా ద్వితీయస్కంధమునందు వర్ణించియున్నారు. అయినను తృతీయస్కంధమునందు కపిలదేవహూతి సంవాదమునందు పద్య రూపముగా వర్ణించియున్నారు. ఆ వర్ణన పై శ్లోకముల అర్థమున కు సమీపముగా నున్నది. అది ఈక్రిందనచ్చువేయబడి యున్నది.

సీ॥ కంజాతకింజల్కపుంజరంజితపీతకౌశేయవాసు జగన్నివాసు।
శత్రుభీకరచక్రశంఖగదాపద్మవిహితచతుర్బాహు విగతమోహు।
నుతభక్తలోకమనోనేత్రవర్ధిష్ణు లాలితసద్గుణాలంకరిష్ణు।
వరకుమారకవయఃపరిపాకు సుశ్లోకు సుందరాకారు యశోవిహారు॥
గీ॥ సకలలోక నమస్కృతచరణకమలు। భక్తలోక పరిగ్రహప్రకటశీలు।
దర్శనీయమనోరథదాయి గీర్తి। నీయతీర్థయశోమహనీయమూర్తి॥
సీ॥ దరదరవిందసుందరపత్త్రరుచిరాక్షు సలలితశ్రీవత్సకలితవక్షు।
నీలనీరద నీరనీలోత్పలశ్యాము నలికులా కులమాలికాభిరాము।
కౌస్తుభరుచిర ముక్తాహారయుతకంఠు యోగిమానసపంకజోపకంఠు।
సతతప్రసన్నసస్మితవదనాంభోజు దినకరకోటి సందీప్తతేజు॥
గీ॥ సలలితానర్ఘ్యరత్న కుండలకిరీట। హారకంకణ కటక కేయూరముద్రి।
కౌతులాకోటిభూషు భక్తప్రపోషు। కింకిణీయుత మేఖలాకీర్ణజఘను॥
మ॥ విమలంబై పరిశుద్ధమై తగు మనోవిజ్ఞాన తత్త్వప్రభో।
ధమతిన్ నిల్పి తదీయమూర్తి విభవధ్యానంబు గావించి చి।
త్తము సర్వాంగవిమర్శనక్రియలకుం దార్కొల్పి ప్రత్యంగముల్।
సుమహాధ్యానము సేయగావలయు బో శుద్ధాంతరంగంబునన్॥

ఇవ్విధంబున మనస్సుతో కట్టబడిన సుందరాంగుని రూపమును అంగాంగవిమర్శతో కట్టుకొనవలయును. ఇది సులభము కాదు.

మహాప్రయాసనెత్తిన గాని సాధ్యముకాదు. అయినను, "యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నా ధికం తత:" అని చెప్పి నట్టు నిరుపమమైన ఆనందమును అనుభవించ గోరువారు ప్రయా సను గణించరుగదా. కేవల లౌకికఆనందములను సంపాదించు టకుగా ప్రయత్నపడునపుడే ప్రయాసను గణించము. అట్లుండ పరమానందప్రాప్తికొఱకు ప్రయాసపడుటకు వెనుదీయుదురే? పైన కనుపరిచిన శ్లోకములను గాని పద్యములను గాని ప్రయ త్న పూర్వకముగా వల్లించి ముఖస్థముగా జేసికొనినయెడల హావ్యాసములు లేక మనస్సు ఊరకయుండుసమయమునందు శ్లోక ములను గాని పద్యములను గాని వారివారి భక్తియొక్క గాఢతను అనుసరించి వారివారికి సాధ్యమైన విధముగా రాగముతో అనురా గముతో పాటపాడుచు నానందబాష్పములనురాల్చుచు పులకాం కితదేహమునందు జనియించు సాత్త్వికస్పందములను అనుభ వించవచ్చును. ఇది అనుభవైకవేద్యము. నిత్యంబును నిరతంబును నియతంబునుగా నిరవద్యమైన భాగవత అనురాగకీర్తనములకు నివి ఆధారముగానుండును.

మనోమయమైన రూపమును పై శ్లోకములలో చెప్పినన్ని వివరములతోడను ఆభరణములతోడను కట్టుట కష్టము. గాలిని మూటకట్టినట్టు చంచలస్వభావము గల మనస్సును స్థిరముగా నుంచుకొనుటయే. కష్టసాధ్యముగానుండగా స్థిరముగానుంచుకో బడిన మనస్సుతో భగవద్రూపమును ఆభిరూప్యముతో ఒకచే తడవన కట్టుట కష్టముగానుండును గనుక, శ్రీశుకులవారు సెల విచ్చిరి:—

**అర్చాపూజ—వైష్ణవము**

ఏకైక శోంగాని ధియా నుభావయేత్ పాదాది యద్ధసితం గదాభృతః ।
జితం జితం స్థాన మపోహ్య ధారయేత్ పరం పరం శుధ్యతి ధీర్యథా తథా ॥

మనోధారణావశంబున భగవద్విగ్రహముయొక్క చరణగుల్ఫజాను జంఘాద్యవయవంబులను క్రమముగా నొక్కొకటిని ధ్యానించుచు వరుసగా హాసన్ముఖపర్యంతమును లక్షించి కట్టుటకు సాధ్యమైన యవయవములను దాటి సాధ్యముకానివానిని మరల మరల ప్రయత్నించి కట్టి కమలపుష్పస్థమకరందపానంబునంజేసి పరవశంబైన భృంగంబునుంబోలె ఉపాసకుడు తనమనస్సు శమించి ఆనందించునటుల ధ్యానించవలయును.

చరణగుల్ఫాద్యవయవంబులం బూజించి క్రమంబుగా హాసన్ముఖంబును చేరవలె నని యుద్దేశించి యే అంగపూజయను నొక పూజాంగమును నిర్దేశించియున్నారు. ఉదాహరణము.

| | |
|---|---|
| విఘ్నేశ్వరాయ నమః | పాదౌ పూజయామి, |
| ,, | గుల్ఫౌ పూజయామి, |
| ,, | జంఘే పూజయామి, |

అని ఈ రీతిన అంగపూజను విధించియుండు వివరము చదువరులకు అనేకులకు తెలిసేయుండవచ్చును. అంగపూజను గురించి సంస్కృతభాగవతము, తృతీయస్కంధము, ౨౮ వ అధ్యాయము లోనును, తెనుగుపద్యకావ్య భాగవతమునందు తృతీయస్కంధమునందు ౯౩౦ వ పద్యము మొదలు చదువవలయును. ఇట్లు పాదాది కేశాంతస్తుతి అను స్తోత్రమును శ్రీశంకరాచార్యులవారు చేసి

యున్నట్టు లోకోక్తి. ఇవన్నియును ఒకచే యభిప్రాయమును సూచించునవి.

ఇవ్విధంబున మనోమయంబైన రూపంబును ఆభిరూప్యము తోగట్టి పాదాదిహాసన్ముఖపర్యంతమును చూచి యానందించిన మాత్రముననే తన్మయత రాచాలదు. తన్మయత రాగల విధమును ఈ క్రింది శ్లోకములయందు వివరించియున్నారు.

> తత్సర్వవ్యాపకం చిత్త మాకృష్యైకత్ర ధారయేత్ ।
> నాన్యాని చింతయేద్భూయ స్సుస్మితం భావయే న్ముఖం ॥
> తత్ర లబ్ధపదం చిత్త మాకృష్య వ్యోమ్ని ధారయేత్ ।
> తచ్చ త్యక్త్వా మదారోహో న కించి దపి చింతయేత్ ॥
> ఏవం సమాహితమతి ర్మామే వా త్మాన మాత్మని ।
> విచష్టే మయి సర్వాత్మ జ్యోతి ర్జ్యోతిషి సంయుతం ॥

పాదాది హాసన్ముఖపర్యంతమును సర్వత్రవ్యాపించియున్న చిత్తమును లాగి గుదియించి మందహాసయుతంబైన నాయాననంబున నిలిపి యితరప్రదేశములను చూడనీయక ఆ చిత్తమును నియమించవలయును. హాసన్ముఖంబుపై స్థిరంబుగానిలిచిన చిత్తంబును నాకర్షించి రూపరహితమైన యాకాశంబున ధారణ జేయవలయు. ఆ యాకాశమును కూడ త్యజించి “బ్రహ్మణో హి ప్రతి ష్ఠాహం అమృతస్యా వ్యయస్య చ” అను నిరాకారునియందు నిలుపవలయు. అపుడు ధ్యాతృధ్యేయవిభాగమును చింతించకయు మరియు నే విధమయిన చింతయును లేకుండవలయును. ఇవ్విధంబున సమాహితచిత్తుండైన యుపాసకుండు జ్యోతిస్సులో కలిసిన జ్యోతిస్సునుంబోలె తనలో నన్నును తనను సర్వాత్ముండైన నాయందునుం

అర్చాపూజ—తన్మయత

జూడగలడు అని యుద్ధవులవారికి శ్రీకృష్ణమూర్తి యుపదేశించిరి. ఇదే అర్థమును శ్రీమద్భగవద్గీత, ఆఱవ యధ్యాయమునందు ౨౫ వ శ్లోకమునందు "ఆత్మసంస్థం మనః కృత్వా న కించి దపి చింతయేత్" అని చెప్పియున్నది. ఇవ్విధంబున నతితీవ్ర మైన ధ్యానంబున మనస్సమాధానంబుగావించు యోగికి పరమ శాంతి కలుగును. బ్రహ్మసాక్షాత్కారంబు గలుగును. ఇట్టి స్థితినే యోగతారావళియందు

> ప్రసహ్య సంకల్పపరంపరాణాం సంభేదనే సంతతసావధానం ।
> ఆలంబనాశా దపచీయమానం శనైశ్శనై శ్శాంతి ముపైతి చేతః ॥
> ప్రకాశమానే పరమాత్మభానా నశ్య త్యవిద్యాతిమిరే సమస్తే ।
> అహో బుధా నిర్మలదృష్ట యోపి కించి న్నపశ్యంతి జగత్స్వరూపం ॥

౨౫౫ వ పుట మొదలు ఇదివరకును చెప్పినట్టి ధ్యానయోగమును అభ్యసించువారికి ౨౫౭ వ పుటయందు ప్రస్తావించిన తన్మయత సాధ్యము. అట్టి తన్మయతచెందినవారే తమయెదుట పూజార్థము గానుండు అర్చయందు ప్రాణప్రతిష్ఠ చేయు యోగ్యతగలవారు.

ఇందుకు ఒక ఆక్షేపము కలుగవచ్చును. ఇంతటి ధ్యాన యోగమును ఆచరించగల మహానుభావులకు అర్చాపూజవలన నేమి ప్రయోజనముండవచ్చును అని ప్రశ్నకలుగవచ్చును. "అజోపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వ రోపి సన్" "యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్తదేవే తరోజనః" "న మే పార్థాస్తి కర్తవ్యం... నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి" అను మొదలుగా గల వచనములననుసరించి ఇతరుల మేలుకుగా ప్రాజ్ఞులు కర్మలనా

చరించవలయును గనుక తన్మయతచెందగల ప్రాజ్ఞులు కూడ నిత్య కృత్యమైన దేవతార్చనమును చేయుదురు.

ఈ ప్రకారము ఆవాహనముచేసిన పిమ్మట విగ్రహమునకు షోడశోపచారపూజలుచేసి విసర్గమును (ఉద్వాసనమును) చేయుదురు.

ఆత్మానం తన్మయం ధ్యాయన్ మూర్తిం సంపూజయే ద్ధరేః ।
శేష మాధాయ శిరసి స్వధామ్న్యు ద్వాస్య సత్కృతం ॥
(శ్రీమద్భాగవతము, స్కం. ౧౧, అధ్యా. 3, శ్లో. ౫౫)

తన్మయుడై పరమాత్మను ధ్యానించి నిర్మాల్యమును శిరస్సున నునిచి "స్వధామ్ని" హృదయాకాశమునుండి తేబడి విగ్రహమునందు ఆవాహనచేయబడిన దేవుని వారి స్వస్థానమైన హృదయమునకే తీసికొనివెళ్లి మూర్తిని (విగ్రహమును) సంపుటమునందు స్థాపించి పూజావిధిని సంపూర్ణము చేయవలసిన దని యర్థము. పైశ్లోకమునకు శ్రీధరులవ్యాఖ్యానమును చూడవలయును. చాల సొంపుగానుండును.

ఇట్లు చేయు పూజ అంతయు నిదిధ్యాసన మనబడును. నిదిధ్యాసనము చాల విశాలమైన అర్థమును గలది. అంతకంటె సాధనచతుష్టయసంపత్తియందు చేరిన సమాధానము అను ఆచరణగా నిర్ణయించవచ్చును. అర్చాపూజ నిర్గుణపూజకును క్రమేణ జరుగవలసిన సమాధికిని పూర్వాంగము.

ధ్యానయోగమువల్ల అపూర్వమైన ప్రయోజన మొకటి గలదు. శ్రీమహాభారతమునందు శాంతిపర్వమునందు ౪౫వ అధ్యాయమునందు ఈ రహస్యము గూఢముగానున్నది. భారత

ధ్యానమునల్ల పరస్పరజ్ఞానము

యుద్ధము ముగిసినపిమ్మట యుధిష్ఠిరుండు రాజ్యపరిపాలనచేయు చుండి ఒకదినమ్మున ప్రాతఃకాలమునందు శ్రీకృష్ణులవారి విడిది యింటి తన తమ్ములతోసహా వెళ్లి శ్రీకృష్ణులవారిని చూచెను. అపుడు శ్రీకృష్ణులవారు

తథా సర్వం సనగరం ప్రసాద్య భరతర్షభ ।
వాసుదేవం మహాత్మానం అభ్యగచ్ఛ త్కృతాంజలిః ॥
తతో మహతి పర్యంకే మణికాంచనభూషితే ।
దదర్శ కృష్ణ మాసీనం నీలం మేరా వివాంబుదం ॥
జాజ్వల్యమానం వపుషా దివ్యాభరణభూషితం ।
పీతకౌశేయవసనం హేమ్నే వోపగతం మణిం ॥
కౌస్తుభే నోరసిస్థేన మణినాఽభివిరాజితం ।
ఉద్యతేవోదయం శైలం సూర్యేణాభి విరాజితం ॥
నాపమ్యం విద్యతే తస్య త్రిషులోకేషు కించన ।

(శ్రీమహాభారతము, శాంతిపర్వము, అధ్యా. ౪౪)

దివ్యమాల్యాంబరధారియై దివ్యాభరణధారియై తన ప్రక్కపై కూర్చొనియుండిరి. వారిని చూచి హెచ్చరించి

సోఽభిగమ్య మహాత్మానం విష్ణుం పురుషసత్తమం ।
ఉవాచ మధురం రాజా స్మితపూర్వ మిదం తదా ॥
తవ ప్రసాదాద్భగవం స్త్రిలోకగతివిక్రమం ।
జయం ప్రాప్తా యశః శ్చాగ్ర్యం న చ ధర్మచ్యుతా వయం ॥
తం తథా భాషమాణం తు ధర్మరాజ మరిందమం ।
నో వాచ భగవాన్ కించి ద్ధ్యాన మేవా న్వపద్యత ॥

(శ్రీమహాభారతము, శాంతిపర్వము, అధ్యా. ౪౪)

హే మహాప్రభో, మహాత్మా, విష్ణో, పురుషసత్తమా, తమయొక్క ప్రసాదమువల్ల జయమును, శ్రేష్ఠమైన కీర్తిని పొందితిమి, అయినను ధర్మమునుండి జారిపడలేదు అని చెప్పుచుండగా శ్రీకృష్ణులవారు ఆ వాక్కులను వినకయే తాను అదివరకును చేయుచుండిన ధ్యానమునే చేయుచుండిరి. అపుడు యుధిష్ఠిరుండు అచ్చెరువొంది,

కి మిదం పరమాశ్చర్యం ధ్యాయ స్యమితవిక్రమ ।
కచ్చి ల్లోకత్రయ స్యాస్య స్వస్తి లోకపరాయణ ॥
ఇంద్రియాణి మన శ్చైవ బుద్ధౌ సంవేశితాని తే ।
చతుర్థాం ధ్యానమార్గాం త్వ మాలంబ్య పురుషర్షభ ॥
ఉపక్రాంతో యతో జీవ స్తేన మే విస్మితం మనః ॥
నిగృహీతో హి వాయు స్తే పంచకర్మా శరీరగః ।
ఇంద్రియాణి చ సర్వాణి మనసి స్థాపితాని తే ॥
వా క్చ సత్త్వం చ గోవింద బుద్ధౌ సంవేశితాని తే ।
సర్వే చైవ గుణా దేవాః క్షేత్రజ్ఞే తే నివేశితాః ॥
నేంగంతి తవ రోమాణి స్థిరా బుద్ధి స్తథా మనః ।
కాష్ఠకుడ్యశిలాభూతో నిరీహ శ్చాసి మాధవ ॥
యథా దీపో నివాతస్థో నిరింగో జ్వలతే పునః ।
తథాఽసి భగవన్ దేవ నిశ్చలో యోగనిశ్చయాత్ ॥
యది శ్రోతు మిహా ర్హామి న రహస్యం చ తే యది ।
ఛింధి మే సంశయం దేవ ప్రపన్నాయా భియాచతే ॥
త్వం ప్రపన్నాయ భక్తాయ శిరసా ప్రణతాయ చ ।
ధ్యాన స్యాస్య యథా తత్త్వం బ్రూహి ధర్మభృతాం వర ॥

హేస్వామిన్, ఇదేమి ఆశ్చర్యము. తాము ధ్యానమునం దమరియున్నారు. తాము త్రైలోక్యనాథులు గనుక తాము ధ్యానించు

చుండుటను చూచినపుడు లోకములకు ఏమి బాధకలిగినదో అని వ్యాకులము తోచుచున్నది. తమరు చేయుచున్న ధ్యానము చాల గంభీరముగా కనబడుచున్నది. తమయొక్క యింద్రియ ములును మనస్సును బుద్ధియందు ప్రవేశించియున్నట్టున్నవి. కా బట్టి తురీయావస్థకు ఎక్కినట్టు తోచుచున్నది. శరీరమునుండి జీవుని పైకి లాగికొనియుండునట్టు కనబడుచు ఆశ్చర్యజనకముగా నున్నది. ప్రాణాపానవ్యానోదానసమానము లను పేళ్ల నెఱుం గంబడు వాయవు శరీరమునందున్నట్టు కానరాదు. సకలేంద్రియ ములు, బుద్ధియు అంగుష్ఠమాత్ర పురుషుండైన క్షేత్రజ్ఞునందు ప్రవే శించియున్నట్టు కానవచ్చుచున్నవి. దేహమునందు రోమములైనను చలింపవు. మ్రానిదూలమో, గోడనో, పాషాణమేనో అనిసందే హించవలసినట్టు తమ దేహము కనబడున్నది. గాలిలేని స్థలమునం దు వెలుగుచుండు దీపము ఏవిధముగా చలనములేక వెలుగునో అట్లు తమయొక్క శరీరము ఇంచుకైనను చలనము లేకయే ఉన్నది. ఇది చూడునపుడు యోగనిశ్చయముతో కూర్చొన్నవారు ఇట్టి విధ ముగానే ఉండవలెనో ఏమో అని తోచుచున్నది. ఇంతటి ఏ కాగ్రచిత్తముతో తాము చింతించవలసిన విషయము ఏదిగానుండు నని యోచించవలసినదిగాను ఆ రహస్యమును నేను వినగలిగితే వినుటకు నిచ్ఛగలవాడనుగా నున్నాను. చెప్పాట కాక్షేపము లే కుండిన సెలవియ్యవలయునని కోరుతున్నాను. నేను తమను శరణుజొచ్చినవాడను గదా! అనుగ్రహించ రాదా? నేను తమ ను ప్రపత్తిచెందినవాడను, భక్తుడను, సాష్టాంగప్రణామంబాచ

రించువాడను. కనుక ఈ ధ్యానముయొక్క రహస్యమును నాకు అనుగ్రహించవలయునని ప్రార్థించుచున్నాను అని యుధిష్ఠిరుండు వేడెను. అందుకు

శరతల్పగతో భీష్మః శామ్య న్నివ హుతాశనః ।
మాం ధ్యాతి పురుషవ్యాఘ్రః తతో మే తద్గతం మనః ॥ ౧ ॥
యస్య జ్యాతలనిర్ఘోషం విస్ఫూర్జితమి వాశనేః ।
న సహే ద్దేవరాజోపి త మస్మి మనసా గతః ॥ ౨ ॥
యే నాభిజిత్య తరసా సమస్తం రాజమండలం ।
ఊఢా స్త్రిస్రః పురా కన్యా స్తమస్మి మనసా గతః ॥ ౩ ॥
త్రయోవింశతిరాత్రం యో యోధయామాస భార్గవం ।
న చ రామేణ నిస్తీర్ణ స్త మస్మి మనసా గతః ॥ ౪ ॥
యం గంగా గర్భవిధినా ధారయామాస భారతం ।
వసిష్ఠశిష్యం తం తాత గతోస్మి మనసా నృప ॥ ౫ ॥
దివ్యాస్త్రాణి మహాతేజాః యో ధారయతి బుద్ధిమాన్ ।
సాంగాంశ్చ చతురో వేదాన్ త మస్మి మనసా గతః ॥ ౬ ॥
రామస్య దయితం శిష్యం జామదగ్న్యస్య పాండవ ।
ఆధారం సర్వవిద్యానాం త మస్మి మనసా గతః ॥ ౭ ॥
ఏకీకృ త్యేంద్రియగ్రామం మనస్సంయమ్య మేధయా ।
శరణం మా ముపాగచ్ఛత్ తతో మే తద్గతం మనః ॥ ౮ ॥
స హి భూతం భవిష్య చ్చ భవ చ్చ భరతర్షభ ।
వేత్తి ధర్మవిదాం శ్రేష్ఠ స్త మస్మి మనసా గతః ॥ ౯ ॥

(శ్రీమహాభారతము, శాంతిపర్వము)

శ్రీకృష్ణులవారు ప్రతివచనం బిచ్చుచున్నారు.

యుధిష్ఠిరా, వినుము. అర్జునునిచే నిర్మించబడిన అంప శయ్యపై పరుండియుండు భీష్మాచార్యులు ప్రతిదినమును బలహీను

ధ్యానమువల్ల పరస్పరజ్ఞానము

డగుచున్నాడు. స్వచ్ఛందమరణమునకు అధికారి గనుక అతని యిష్టము వచ్చినపుడు శరీరమును త్యజించును. బలహీనుడుగా నుండినను

సీ॥ అతిభక్తి నెవ్వనియందుఁ జిత్తముఁ జేర్చి యెవ్వని నామమూహించి పొగడి।
కాయంబు విడుచుచు కామకర్మాది నిర్మూలనుండై యోగి ముక్తి నొందు।
నట్టి సర్వేశ్వరుం డఖిలదేవోత్తంసు డెవ్వేళఁ బ్రాణంబు లేను విడుతు।
నందాక నిదే మహాహర్షుడై వికసితవదనారవిందుడై వచ్చె నేడు।

తే॥ నాల్గుభుజములు గమలాభినయనయుగము।
నొప్పఁ గన్నులముందట నున్నవాడు।
మానవేశ్వర నా భాగ్యమహిమ జూడు।
మేమి సేసితినో పుణ్య మితనిఁ గూర్చి॥

అని భావించి తన శరీరమ్మునందు ప్రవేశించియుండు అమ్ములవలని బాధను లెక్కపెట్టని మహాధీరుడగు భీష్ముండు నన్ను ధ్యానించు చున్నాడు గనుక నా మనస్సు అతనివద్దకు బోయియున్నది. దేవేంద్రుడైనను ఏ వీరుని శరపరంపరల కోర్వజాలక పోయెనో అట్టి వీరుడు నన్ను ధ్యానించుచున్నాడు గనుక నా మనస్సు అక్కడికి బోయియున్నది. అంబ, అంబిక, అంబాలిక లను ముగ్గురు కన్యల స్వయంవరకాలమునందు సమస్తరాజన్యనివహంబును నిరాకరించి యే శూరుడు ఆ ముద్దు కన్నియలనును తెచ్చి తన తమ్ములకు పెండ్లిచేయించెనో అట్టి శూరుడు నన్ను ధ్యానించుచున్నాడు గనుక నా మన స్సతనికడకు బోయియున్నది. పూర్వము తనకు అస్త్రవిద్యోపాధ్యాయుడును, పరమాస్త్రవిద్య

యం దళితక్షత్రియుడునైన పరశురామునితో బోరి యిరువదిమూడు దినములకు కూడ ఓడని శూరుడు ఏకాగ్రమైన మనస్సుతో నిపుడు నన్నుగూర్చి ధ్యానముచేయుచున్నాడు గనుక నా మనస్సు అతనికడకు పోయియున్నది. వసిష్ఠమహర్షియొక్క శిష్యుడును గంగాదేవికుమారుండు నగు పరమపావనుడు నన్నుగురించి ధ్యానించుచున్నాడు గనుక నేను మనసా అతనివద్దకు వెళ్లియుంటిని. ఏ మహానుభావుడు దివ్యాస్త్రవిద్య నెఱిగినవాడో సాంగోపాంగములగు నాలుగు వేదములనును అధ్యయనంబొనరించినవాడో అట్టి ప్రాజ్ఞుడు నన్ను ధ్యానించుచున్నాడు గనుక నే నతని వద్దకు పోయియుంటిని. శ్రీపరశురాముని శిష్యుడును సర్వవిద్యలకును ఆధారభూతుడుగానుండు భీష్ముడు నన్ను ధ్యానించుచున్నందున నే నతనివద్దకు వెళ్లియుంటిని. సకలేంద్రియములను ఏకీకరించి బుద్ధితో సహా నన్ను శరణుజొచ్చి "అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ । తస్మా త్కారుణ్యభావేన రక్ష రక్ష జనార్దన" అని నన్ను శరణుజొచ్చియున్నాడు గనుక అతనికి హర్షంబుగలుగజేయు నుద్దేశముతో నక్కడికి వెళ్లియుంటిని. భీష్ముడు త్రికాలజ్ఞాత, ధర్మవేత్తలలో నతిశ్రేష్ఠుండు, కనుక అతనివద్దకు మనసా వెళ్లియుంటిని" అని లోకారాధ్యుడైన తాను ధ్యానంబున నున్నందుకు సమాధానమును చెప్పిరి. చదువరులారా, మనమందఱమును బిడ్డలము. భగవంతుడు తల్లివంటివాడు. బిడ్డలకు లేతవయస్సునందు జ్ఞానము తక్కువైనందున తల్లి తనను సకలకష్టములనుండియు కాపాడగలదు అను నమ్మకము లేకయుండును. అయినను తల్లి ఎల్లకాలమును తన చిన్నబిడ్డను కాపాడుటకుగా

ధ్యానమునల్ల పరస్పరజ్ఞానము

దోగాడుచు గాని తప్పడుగులు పెట్టుచు గాని బిడ్డ పోవుచుండగా బిడ్డవెంబడే తల్లియు సంచరించుచుండును కదా. అదే విధమున ధ్యానముచేయు భక్తుని ధ్యేయవస్తువైన స్వామియు కాపాడుటకు సిద్ధముగానుండును.

౨౮౬ వ పుటయందు ప్రస్తావించిన రహస్యము ఈ విషయమునం దేది యనిన ౨౮౪ వ పుటలో నచ్చుబడియుండు శ్లోకముల యందు ఏకాగ్రచిత్తసమన్వితధ్యాన మెట్లుండవలెనను వివరము ఒకటి. ఏకాగ్రచిత్తముతో "అంగుష్ఠమాత్రః పురుషోంతరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః" అని చెప్పిన ప్రకారము ప్రకృతి జన్యములైన క్షేత్రరూపక వికారములనన్నిటిని విడనాడి తన నైజరూపమైన అంగుష్ఠమాత్రశరీరముతో ధ్యానించువారినిగురించి ధ్యేయమూర్తి కూడ బదులుకు ధ్యానించును అను మహారహస్యమును భక్తులును, ధ్యాతలు నగు నివృత్తిమార్గనిరతు లందరును గమనించి హర్షసమన్వితులై

> బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ ।
> శబ్దాదీన్ విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ ।
>
> (భ. గీ., అధ్యా. ౧౮, శ్లో. ౫౧)
>
> (ఇందుకుపిమ్మట రెండు శ్లోకములు)

మాయారహితమైన బుద్ధితో కూడినవాడును పట్టుదల అను సద్వివేకముచే తన్ను అనగా తన అంతఃకరణమును స్వాధీనపరుచుకొని యు, శరీరము నిలుచుటకుగా మాత్రము కావలసిన ఆహారాదులు కాక ఇతరశబ్దాదివిషయములను వదలి, ఆశ, ద్వేషము, అను

వానిని వదలి ఏకాంతస్థలంబులయందు నివసించువాడును, మితా
హారము గలవాడును, వాక్కును, శరీరమును, మనస్సును, స్వాధీనము
చేసికొనినవాడును, సద్గురూపదేశరీతిగా ధ్యానముచేయువాడును,
ఇహలోకభోగములయందు గాని పరలోకసుఖములయందు గాని
అభిమానము లేనివాడును, తాను వైరాగ్యాదిగుణములను సంపా
దించినవాడు అను అహంకారమును విడిచినవాడును, బలము,
దర్పము, కామము, క్రోధము అను హేయగుణములను విడిచి
యున్నవాడును, స్వాభిమానములేనివాడును, పరమోపశాంతి,
అనగా సుఖదుఃఖములయందు సమబుద్ధిగలవాడును అగువాడు
బ్రహ్మైక్యమును పొందుటకు సమర్థుడగును. ఇట్టి మహాధ్యానము
చేయువాడు

సమాపయ్య నిద్రాం సుజీర్ణాల్పభోజీ శ్రమత్యాగ్యబాధే వివిక్తే ప్రదేశే ।

తన శరీరమునకు కావలసినంతటి నిద్రను ముగించి తా నేమాత్రము
జీర్ణముచేసికొనగలడో అంతమాత్రము ఆహారమును పుచ్చుకొని
దేహమునకు లంపటకలుగు పనులను చేయక శరీరమునందలి బల
మును కాపాడుకొనుచు ఇంతకు పూర్వము చెప్పబడియుండు
విధమున ధ్యానమునకు కూర్చొని అచ్చట ధ్యానయోగమారం
భించవలయును. ౨౮౪ వ పుటయందు వివరించిన ప్రకారము ఏ
కాగ్రము సమగ్రముగా సంపాదించి ధ్యానముచేయుచువచ్చిన
యెడల ధ్యేయమూర్తి ధ్యాతను అనుగ్రహించుటకుగా ధ్యాతను
తనమనస్సునందు చింతించి అనుగ్రహింతు రనుటకు సందియము
లేదు. ఇదండీ ధ్యానయోగముయొక్క మహిమ. ఈ విధమున
చెందు తన్మయత అందరికిని సాధ్యము.

యోగత్రయము

పూజ అంతయు కర్మయోగమే కదా. శ్రీకృష్ణులవారు ఉద్ధవునికి నుపదేశముచేసిన ప్రకారము మోక్షమార్గములు మూడు. ప్రజ్ఞానాంశువు తాను వేఱు ఇతర ప్రజ్ఞానాంశువులు వేఱు అని నమ్ముటకు కారణము అజ్ఞానము.

అజ్ఞానయోగా త్పరమాత్మన స్తవ హ్యనాత్మబంధః తత ఏవ సంసృతిః ॥
(వివేకచూడామణి)

అజ్ఞానమువల్ల అనాత్మబంధము. అనాత్మబంధమువల్ల సంసారము కలిగినది. సంగములను వదిలి బంధమును వీడగొట్టుకొనుటకు మోక్షము అని పేరు. మోక్షము అను పదమునకు విడదల అని అర్థము.

యోగా స్త్రయో మయా ప్రోక్తా నృణాం శ్రేయోవిధిత్సయా ।
జ్ఞానం కర్మ చ భక్తిశ్చ నోపాయో న్యోఽస్తి కుత్రచిత్ ॥
(శ్రీమద్భాగవతము, స్కం. ౧౧, అధ్యా. ౨౦, శ్లో. ౬)

నరులకు మోక్షప్రాప్తికిగా జ్ఞానయోగము, కర్మయోగము, భక్తియోగము అను మూడు మార్గములను చెప్పితిని. అవిదక్క వేఱొక్కటియు ఎక్కడను కానరాదు అని యర్థము.

అందు

నిర్విణ్ణానాం జ్ఞానయోగో న్యాసినా మిహ కర్మసు ।
తేష్వ నిర్విణ్ణచిత్తానాం కర్మయోగ స్తు కామినామ్ ॥

ఇందుపైకి కర్మలను ఆచరించుటయందు విసుకుపుట్టి వైరాగ్యము చెందినవారికి జ్ఞానయోగము అనుకూలము. కర్మలనాచరించుట

యందు హర్షముకలిగి వాని ఫలమునందు ఇచ్ఛగలవారికి కర్మ యోగము సంభావితము.

> యదృచ్ఛయా మత్కథాదౌ జాతశ్రద్ధ స్తు యః పుమాన్ ।
> న నిర్విణ్ణో నాతి సక్తో భక్తియోగో ఽస్య సిద్ధిదః ॥

కర్మాచరణమునందు వైరాగ్యము అంతగా లేకయు మరియు ఆసక్తియైనను అంతగా లేకయు నా (హరియొక్క) కథలయందు పరప్రేరితముగాకయే అనురాగము కలిగియుండువారికి భక్తియోగ మన్వయించును అని శ్రీకృష్ణులవారు ఉద్ధవునికి ఉపదేశించిరి.

## మోక్షమార్గత్రయము

### కర్మయోగము

> న హి కశ్చిత్ క్షణ మపి జాతు తిష్ఠ త్యకర్మకృత్ ।
> కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై గుణైః ॥

(శ్రీభగవద్గీత, అధ్యా. 3, శ్లో. ౫.)

ప్రతిమనుజుడును త్రికరణములతో అనగా, మనస్సు, వాక్కు, దేహము, వీట్లతో కార్యములు జరుపుచు నే యుండును. సృష్టి యందు ప్రతివ్యక్తియు సత్త్వరజస్తమోగుణములకు లోబడియే యుండును. మనుష్యుల కర్మేంద్రియజ్ఞానేంద్రియములు, మనస్సు, జీవాత్మయొక్క ప్రేరణలేకయే కార్యములు చేయు స్వభావము గలవి. అవి చేయు కార్యములన్నిటికిని జీవాత్మకే పూచి. ఇట్టి కర్మలన్నియు వానివానికి అనుగుణములైన ఫలముల నిచ్చును.

ప్రవృత్తిమార్గమునందు చరియించుచుండు సందర్భమునందు జీవాత్మలు కామముతో బంధింపబడినవారుగానే యుందురు.

మోక్షమార్గత్రయము—కర్మయోగము

కనుక వారు చేయు కార్యములన్నియు ప్రయోజనమును కోరియే చేయుదురు. అట్లు స్థిరమైన స్వభావము ఉన్న దని తెలిసి మానవ కోటిని పెంచుచువచ్చు మనువు, ఋషులు, మొదలగువారు కొన్ని ఆచారములను ఏర్పరిచి మానవులకు ధర్మమును నిర్ధారణచేసి యున్నారు. మానవులకు పురుషార్థములు అని నాలుగింటిని నిర్ధారణ చేసియున్నారు. ధర్మము, అర్థము, కామము, మోక్షము అనునవి పురుషార్థములు. ఇందులో కడపటిదైన మోక్షము అను పురుషార్థము నివృత్తిమార్గయాత్రచేయువారికి ముఖ్యము. ప్రవృత్తిమార్గయాత్రాపరుల పురుషార్థముల పైకి కామము అనునది యొకటి గనుక ఆ కామమును ఏ మాత్రము స్వచ్ఛముగా నుంచుకోవచ్చునో అందుకై మానవకోటియందు కర్మచేయు యోగ్యత సంపాదించిన ద్విజులు అనువారికిగా కామ్యకర్మ అని నిర్ధారణ అయియున్నది. మృగశరీరములలోనుండి మానవశరీరములకు క్రొత్తగా ప్రవేశించిన జీవాత్మలకు (ఆత్మవిచారము, పూర్వభాగము, ౭౮ వ పుట మొదలు ౯౦ వ పుట వరకును చదువవలయును) ఆహారనిద్రాదివర్గము తప్ప వేఱు కోరికలుండ లేదు. మనుష్యునికి ముఖ్యముగా నుండవలసిన జ్ఞానమును సంపాదించుటకు ఆహారనిద్రాదులకంటె నధికములైన కోరికలుండవలయును. కనుక వారలలో స్వతఃగా నుండిన కామము అను గుణమును వృద్ధిపరిచి దానియందలి మాలిన్యములను తీసివేసి శుభ్రపరిచినా గాని జ్ఞానము స్వచ్ఛముగా లభించదు గనుక కర్మాచరణము అను ఆటవస్తువును చూపి ఆ జీవాత్మలయందు ఉండిన

స్తబ్ధత లేక అల్పవస్తువులు లభించినపుడు కలుగు తృప్తిని మాపి పేరాశ పుట్టునట్టు చేసి, ఆ పేరాశ తృప్తిచెందకపోయినపుడు దుఃఖమును, ఆ దుఃఖమును ఆధారముగా జేసికొని అందుకు పై మెట్టు అయిన ప్రయత్నము, సాహసము, ఇడుములకుతట్టుకొని నిలుచుట, కార్యసాధనము, ధైర్యము మొదలగు గుణములను కలుగచేయుటకు వీలుకలుగునట్లు కామ్యకర్మలను నియమించిరి. కామ్యకర్మలు కొన్ని జన్మములకాలము చేయుచువచ్చి అందుల ప్రయోజనముగా కర్మచేయునభ్యాసము స్థిరమైనపుడు నిత్యకర్మలనియు నైమిత్తిక కర్మలనియును నియమించిరి.

నిత్యకర్మలు అనగా ప్రయోజనములను కోరకయే తన యొక్క ధర్మము తానాచరించవలసినది అని ఆచరింపబడు కొన్ని కర్మలు. నిత్యకర్మలవల్ల లోకోపశాంతి కలుగును. నైమిత్తిక కర్మలు అనగా కాలనియమము లేకయే ఎప్పుడైనను తనకు కావలసినపుడు దేవతలను ఉద్దేశించి కొన్ని వ్రతములు మొదలైన వాటిని చేయుట. అందువలన ఈ లోకమందో పైలోకముల యందో తనకు ఏదైనను ప్రయోజనము కలుగును. ఆ ప్రయోజనములకు ఆశపడి చేయుకర్మలకు నిర్బంధములు, నియమములు బహుమెండు. ఇబ్బందులు అధికమైనను కొందరు తాము కోరిన ప్రయోజనమును పొందవలెనని ఆశగొని ఆ ఆశయొక్క బలముచేత ఇబ్బందులను లక్ష్యపెట్టక ప్రయత్నములుచేసి కామ్యకర్మలను యథావిధిగ చేయుదురు. ఇట్లు చేయుచురాగా ప్రయోజనముల యందు రుచి బలమై నిబంధనలను గమనించి జవదాటక కర్మలు చేయుచు అనేక జన్మములయందు కర్మలను చేయుచు వచ్చినందున

నిబంధనలకు లోబడి కర్మచేయు నభ్యాసమును స్థిరపరుచుకొందురు. నిత్య నైమిత్తిక కర్మలవల్ల నశ్వరములైన ప్రతిఫలము లెన్ని ఎట్లు పోయినను జీవాత్మకు ఒక గుణము స్థిరముగా నేర్పడును. ఇక ముందు జీవన్ముక్తిదశ వచ్చి అటుపిమ్మట లోకమును ఉద్ధరించబోవు సమయమున ఆధికారికపురుషులుగా జన్మించి తే కార్యములను సుష్ఠుగా జేసి భగవత్కైంకర్యమును చేయు యోగ్యతను సంపాదించుకొనుటకు ఇప్పుడు మనము సుష్ఠుగా కర్మలనుచేయుట ప్రారంభము. ఆధికారికపురుషులు అనగా జీవన్ముక్తులైన పిమ్మట లోకోద్ధరణార్థము మనువులు, ఋషులు మొదలగు నుద్యోగములను వహించి లోకమునందు ధర్మస్థాపన చేయుటకుగా నియమింపబడిన జీవన్ముక్తులు. ఈ విషయమునుగురించి ముందు "కైంకర్యము" అను అధ్యాయమునందు వ్రాయబడును. ప్రకృతమునందు కర్మయోగమునుగురించి వ్రాయవలయును.

మోక్షము జ్ఞానమువల్లనే సిద్ధించును అను శ్రుతివాక్యమును ఇదివరకే ప్రస్తావించితిమి. కరణములచేత చేయుబడుటవల్ల కర్మ అనబడును. కర్మ విహితము, ప్రతిషిద్ధము అని రెండు విధములు. విహితకర్మ నిత్యకర్మ, నైమిత్తికకర్మ, కామ్యకర్మ అని మరల మూడు విధములు. ఇదేకర్మ మరల ఇష్టము, పూర్తము అనియు నుపనిషత్తులలో నుపయోగించియున్నారు.

అగ్నిహోత్రం తపస్సత్యం వేదానాముపలంభనం ।
ఆతిథ్యం వైశ్వదేవం చ ఇష్టమిత్యభిధీయతే ॥
వాపీకూపతటాకాది దేవతాయతనానిచ ।
అన్నప్రదానమారామః పూర్తమిత్యభిధీయతే ॥

స్వర్గలోకవాసము కావలెనని ఆశించి యజ్ఞములు, యాగములు, అతిథిపూజ, వైశ్వదేవము మొదలగు ఇష్టకర్మలనును, బావులు త్రవ్వించుట, తటాకములు కట్టించుట, దేవతాస్థలములను నిర్మించుట, అన్నప్రదానము, తోటలు దారువులు పెట్టించుట మొదలగు పూర్తమను పరోపకారములనును చేసినయెడల తానుచేసిన కార్యములవల్ల లోకులకు మేలుకలుగునుగాని కర్త కేవల లోకోపకారార్థము కర్మలు చేయలేదు గనుక కర్త కోరిన స్వర్గాదిభోగములు అతనికి కలుగును. ఇందువల్ల కర్మబంధము కలుగక తప్పదు. కనుకనే

యజ్ఞార్థాత్కర్మణోన్యత్ర లోకోయం కర్మబంధనః ।
తదర్థం కర్మ కౌంతేయ ముక్త సంగ స్సమాచర ॥

అనియు

దూరేణహ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ ।

అనియు శ్రీ భగవద్గీతయందు చెప్పబడియున్నది. దీని తాత్పర్యము కామ్యకర్మ మంచిదికాదు అని. కామ్యకర్మలు చేయునపుడు వాటిని చేయవలసిన విధానమునందు ఏ మాత్రమైనను తక్కువపడకూడదు. తక్కువపడినయెడల చెడుపు కలుగును. ఫలాపేక్షతో చేయబడు కర్మ రాజసకర్మ అనబడును.

అభిసంధాయతుఫలం దంభార్థమపిచైవ యత్ ।
ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసం ॥
యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః ।
క్రియతే బహులాయాసం తద్రాజస ముదాహృతం ॥ (శ్రీ భ. గీ.)

విహితకర్మపైకి నిత్యకర్మలు లోకశాంతికిగా దేవతలచేత ఉపయోగింపబడును. కర్తకు చిత్తశుద్ధికలుగును. ‚‚ స్వే స్వే కర్మణ్యభిరతః

సంసిద్ధిం లభతే నరః" అని శ్రీభగవద్గీతలలో చెప్పబడియున్నది. మఱియు "కషాయే కర్మభిః పక్వే తతో జ్ఞానం ప్రవర్తతే" అనియు చెప్పబడియున్నది.

లోకమునందలి జనులందరును క్రమేణ పెరిగి ముదిరి మలినములను పోగొట్టుకొని మోక్షముపొందుటకు అర్హులు కావలెనను నుద్దేశముతో ఋషులు బ్రహ్మక్షత్రియాది జాతులకు స్వభావనియతములైన కర్మలను విధించియున్నారు. అందువల్లనే "స్వేస్వే కర్మణ్యభిరతః" అని శ్రీగీతాచార్యులవారు చెప్పినారు. మఱియు కర్మచక్రమని యొకటియున్నది.

దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః ।
పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ ॥
ఇష్టాన్ భోగాన్ హి వో దేవాః దాస్యన్తే యజ్ఞభావితాః ।
తైర్దత్తా నప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః ॥
అన్నాద్భవంతి భూతాని పర్జన్యా దన్నసంభవః ।
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః ॥
ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయ తీహ యః ।
అఘాయు రింద్రియారామో మోఘం పార్థ స జీవతి ॥
(శ్రీ భ. గీ., అధ్యా. 3)

విహితకర్మ దేవతలనుద్దేశించి చేయబడినప్పుడు దేవతలు కర్మలు చేయువారిని గమనింతురు. పరస్పర సంబంధము ఏర్పడును. అందువల్ల శ్రేయస్సు కలుగును. అందువలన కర్తలకు ఇష్టములైన సుఖములను దేవతలు ఇచ్చెదరు. వర్షములు కురిపింతురు. వర్షములవల్ల ధాన్యములు పండును. పండినధాన్యములతో యజ్ఞములు

చేయుదురు. మరల మరల ఈ చక్రము తిరుగుచుండును. ఇట్టి చక్రమునందు తిరుగుచు బహుకాలమునకు పిమ్మట కామ్యకర్మలను రజోగుణరహితముగా జేయ నిశ్చయించి, కామము రజోగుణమునకు కారణము అని నిశ్చయముగా తెలిసికొని స్వప్రయోజనమును కోరకయే కర్మలనాచరించుటకు సిద్ధమగుదురు.

కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః ।
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః ॥ (శ్రీ భ. గీ.)

కర్మలు మూడు విధములు. కర్మ అనునది యొకటి. వికర్మ అనునది రెండవది. అకర్మ అనునది మూడవది. నియతమైనకర్మకు కర్మయని పేరు. నిషేధింపబడిన కర్మకు వికర్మ అని పేరు. కర్మ చేయకుండుట అకర్మ అని సాధారణమైన అర్థము. కర్మాకర్మ వికర్మలయొక్క రహస్యమును తెలిసికొనుట చాల దుర్లభము.

కర్మాకర్మవికర్మమర్మ సుధియా బోద్ధవ్య మేవాదితః । కర్మస్యాద్విధిపూర్వకం తు మనసా సర్వేంద్రియవ్యాపృతిః । తద్ద్వేధా సఫలం ఫలేన రహితం త్వాద్యం వికర్మస్మృతం । బంధా దన్య దకర్మ శుద్ధికరణా న్నైష్కర్మ్యతా మాగతం ॥

బుద్ధిమంతు డగు పురుషుడు ఆదినుండి యే కర్మాకర్మవికర్మముల యొక్క రహస్యమును తెలిసికోవలసినది. అందు కర్మమనగా మనస్సుతోకలిసిన జ్ఞానేంద్రియ కర్మేంద్రియముల వ్యాపారము. ఇట్టి కర్మలు స్వర్గాదిలోకసుఖములను కలుగజేయునవి కొన్ని. వానికి సఫలములు లేక ఫలసహితములు అని పేళ్లు. మోక్షహేతువులగునవి కొన్ని. ఈ కర్మలకు ఫలరహితములు అని పేరు.

మోక్షమార్గత్రయము—కర్మయోగము

ఫలసహితకర్మలు అయినను ఫలరహితకర్మలు అయినను వాటిని చేయు విధానములలో మార్పులేమియు లేవు. ఉద్దేశమొక్కటే భేదము. ఫలసహితములైన కర్మములయొక్క ఫలము స్వల్పజీవితము కలది. సంసారకారణము. సంసారమనగా జననమరణరూపకమైన ప్రవాహము. ఫలాపేక్షతో చేయబడు కర్మకుకూడ ఉన్నత స్థితియందునుండి చూచునపుడు వికర్మ అని పేరు ఇయ్యవలయును. మోక్షదాయకములైన ఫలాపేక్షరహితకర్మలు అకర్మలు అని పేరు పొంది క్రమేణ నైష్కర్మ్యమునకు త్రోవ యగును. కనుక కుల్లుకు ఫలాపేక్షరహితకర్మయే శ్రేష్ఠము అని భావము. ఇందునుగురించి శ్రీమద్భాగవతంబునందు

> కర్మాకర్మ వికర్మేతి వేదవాదో న లౌకికః ।
> వేదస్యచేశ్వరాత్మత్వా త్తత్ర ముహ్యంతి సూరయః ॥
> పరోక్షవాదో వేదోఽయం బాలానా మనుశాసనం ।
> కర్మమోక్షాయ కర్మాణి విధత్తే హ్య గదం యథా ॥
> నాచరే త్యది వేదోక్తం స్వయ మజ్ఞోఽజితేంద్రియః ।
> వికర్మణాహ్య ధర్మేణ మృత్యో ర్మృత్యుముపైతి సః ॥
> వేదోక్త మేవ కుర్వాణో నిస్సంగోఽర్పిత మీశ్వరే ।
> నైష్కర్మ్యం లభతే సిద్ధిం రోచనార్థా ఫలశ్రుతిః ॥
> (శ్రీమద్భాగవతము, స్కం. ౧౧, అధ్యా. ౩)

కర్మ=విహితకర్మ, వికర్మ=అధర్మమైనకర్మ, అకర్మ=విహితకర్మను ఆచరించక పోవుట, అను నీ విషయములు వేదంబులయందు చెప్పిన విషయములే గాని సాధారణములు గావు. వేదంబులు ఈశ్వరాత్మికంబులు గావున యథార్థమైన తాత్పర్యము నెఱుగుట

పండితులకు కూడ సాధ్యముకాదు. బిడ్డలకు ఔషధములను త్రా వించునట్టి తల్లి చక్కెర లడ్డు ఇట్టి తియ్యని పదార్థములలో నా యౌషధమును కలిపి యిచ్చి ఔషధము ద్రాగి పైన పిమ్మటకూడ లడ్డు మొదలగు తియ్యని పదార్థముల నిచ్చువిధమున వేదము స్వల్పజ్ఞానముగలవారికి సుఖములయం దభిరుచి కలుగచేయుచు తద ర్థంబై కర్మలనాచరించుటకు ప్రేరేపించి కర్మాచరణచేసి ఫలాను భవముపొంది అనేక తడవలు కర్మలుచేసి వాటి ఫలములను పొంది విసికి ఫలాభిసంధిరహితమైన కర్మలనుచేయుట కారంభించి నైష్కర్మ్యమును అభ్యసించు నుద్దేశముతో కర్మల ఫలములను స్తుతిచేసి చెప్పుచువచ్చును అని తాత్పర్యము.

విహితకర్మ జీవాత్మలశక్తిని తెలిసిన దేవతలు ఋషులు మొదలగువారు జీవాత్మలను కొన్ని తరగతులుగ భాగించిరి. ఈ భాగములకు వర్ణములని పేరు.

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః  (శ్రీ భ. గీ.)

ఈ వర్ణవిభాగము గుణములు కర్మలు వీటినిపట్టి నిర్ధారింపబడినవి అని యర్థము. జనసముదాయమును చూచి పరీక్షించినపుడు కొం దరు శుద్ధ అజ్ఞానులుగను, శుద్ధ తమోగుణమునే కనబరుచు వా రుగ నుందురు. మఱికొందరు చుఱుకుగా కార్యములను చేయుశక్తి కలిగి కొంచముగా యుక్తాయుక్తజ్ఞానముకలిగి యుందురు. అథవా కామక్రోధాదులచే ప్రేరితులై స్వప్రయోజనపరులుగా నుందురు. మఱికొందరు ధైర్యశౌర్య గుణాదులను కలిగి అధికారధోరణి కలిగి యుందురు. మఱికొందరు శాంతాత్ములై శమ దమాది గుణ ములచే శోభించుచుందురు. జీవసముదాయమును చూచి గుణ

మోక్షమార్గత్రయము—కర్మయోగము

కర్మలను పరిశీలించి నాలుగు వర్ణములుగా జీవులను విభజించిరి.

బ్రాహ్మణుల గురుతులను గురించి

సత్యం దానం తపశ్చాచ మానృశంస్యం తపో ఘృణా ।
దృశ్యంతే యత్ర విప్రేంద్ర స బ్రాహ్మణ ఇతి స్మృతః ॥
జితేంద్రియో ధర్మపర స్స్వాధ్యాయనిరత శ్శుచిః ।
కామక్రోధా వశౌ యస్య తం దేవా బ్రాహ్మణం విదుః ॥
యస్య చాత్మ సమో లోకో ధర్మజ్ఞస్య మనస్వినః ।
స్వయం ధర్మేణ చరతి తం దేవా బ్రాహ్మణం విదుః ॥
యోధ్యాపయ త్యధీతేవా యజేద్వా థ యజేతవా ।
దద్యా ద్వాపి యథాశక్తి తం దేవా బ్రాహ్మణం విదుః ॥
క్షమా దయా చ విజ్ఞానం సత్యం చైవ దమశ్శమః ।
ఆధ్యాత్మజ్ఞాననిరతి రేతద్బ్రాహ్మణ లక్షణం ॥

క్షత్రియధర్మము

శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనం ।
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజం ॥

వైశ్యధర్మము

కృషిగోరక్షవాణిజ్యం వైశ్యకర్మ స్వభావజం ।

శూద్రధర్మము

పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజం ।

ఈ పైవివరించిన గుణములన్నియు సత్త్వరజస్తమోగుణముల యొక్క త్రివృత్కరణమున ఏ గుణము ఎక్కడ అధికముగానుండు నో అందును అనుసరించి నిర్ధారింపబడినవి. మొట్టమొదట తమో గుణ ప్రధానులుగానుండు జీవులకు తమోగుణమును తొలగించి

రజోగుణప్రధానులుగజేసి క్రమేణ సత్వగుణప్రధానులనుగా చే
యుటకుగా కర్మలను నిష్కర్ష చేసినారు. ఇట్టి కర్మలనే వర్ణధర్మము
లందురు. చిన్నబిడ్డలకు దోగాడుశక్తి రాగానే త్వరగా దోగాడు
నట్లు చేయుటకుగా ఆటపదార్థములను చూపి త్వరగా దోగాడు
నట్లు చేయుదురు గదా. అదేవిధమున కర్మఫలములను ధర్మ
శాస్త్రములు వివరించియున్నవి. లోకమందంతట రుచికరములైన
ఫలముల నియ్యగల వృక్షములు, చూపుకు ఆహ్లాదకరములగు
వస్తువులు మొదలగునవి యున్నయెడల నిరంకుశముగా తలచిన
వారలు తలచినవస్తువులను ఉపయోగించుటకును వీలు కలుగజేసి
యుంటే అట్టి పదార్థములను అనుభవించి ఆ జ్ఞాపకముచే మరల
ననుభవించవలయునని ఆశచెందుట సహజమే కదా. ఆ ఆశను
తృప్తిచెందించుకొనుటకుగా పాటుబడుదురు గదా. ఇవ్విధంబున
శుద్ధమందస్వభావమున నుండినవారు పాటుపడుటకు నేర్చికొని
క్రమేణ స్వప్రయత్నమువల్ల సుందరములై రుచికరములైన వస్తు
వులను తాముగానే సంపాదించుటకు ప్రయత్నపడుదురు. ఆ
రీత్యా మాంద్యమును పోగొట్టుకొందురు. ఈ ప్రకారముగా జడ
స్వభావముతో నుండినవారు జన్మ జన్మములయందును మెట్టుమెట్టు
గా పైకెక్కవలయుననియే వర్ణనియమము ఏర్పడినది. పశు
ప్రాయులగువారు తాత్కాలిక విషయానుభవమునే గమనింతురు.
అచ్చట కూడ ఇష్టానుసారము వర్తించు యోగ్యత తప్ప కొంత
మట్టుకైనను వివేకజ్ఞానము సున్న. అడ్డులేక ఇంద్రియసుఖము
లను అనుభవించుచురాగా కొన్ని కార్యములవల్ల దుఃఖము సంభ
వించినందున దుఃఖజనకములైన కార్యములను చేయకూడదు

మోక్షమార్గత్రయము—కర్మయోగము

అని అనుభవరీత్యా కనుగొందురు. దుఃఖదాయకములైన కార్యములు వికర్మలు, సుఖదాయకములైన కార్యములే కర్మ, అని కొన్ని జన్మములకు పిమ్మట అనుభవజన్యమైన జ్ఞానము లభించును.

ధర్మావిరుద్ధో భూతేషు కామోస్మి భరతర్షభ

అని శ్రీమద్భగవద్గీతయందు చెప్పినరీతిని జీవులకు స్వభావజన్యములైన కామములను ధర్మమునకు విరోధములుగాని కర్మలజేసి తృప్తిపొందించునట్లు "విహితకర్మలు" అనునవి యేర్పరుచబడినవి. స్త్రీపురుషులు పరస్పర ప్రేమాతిశయమువల్ల నిర్బంధరాహిత్యముతో ఏ పురుషునితోనైనను ఏ స్త్రీయైనను చేరియుండక నిష్కర్షగా నొక స్త్రీకి ఒక పురుషుడు అని నియామకము నేర్పరుచుటకై వివాహము అను సంస్కారమును నియమించిరి. ఈ ప్రకారము బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు అని ద్విజులకు నిర్బంధములేర్పడి ప్రతివర్ణస్థుడు ఇతర వర్ణస్థులకు సహాయము చేయవలసినట్టు ధర్మము లేర్పడినవి.

ఈ ధర్మములనన్నిటిని పరీక్షించినపుడు వాని ప్రయోజనము ఒక్కటిగానే యుండును. ప్రతివర్ణస్థుడు తాను ఆచరించవలసినట్టు ఏర్పడిన ధర్మముల నాచరించుచు తా నాచరించకూడదని నిషేధింపబడిన కర్మలను మానుకొనియు నున్నందున లోకమందంతయు సమరసభావము ప్రబలి జగత్సంసారము ప్రబలుచు వచ్చినది.

సుఖములను అనుభవించి దుఃఖములను నిషేధించుచు వచ్చినపుడు భూలోకమునందు అనుభవమునకు సాధ్యములైన సుఖములన్నిటిని అనుభవించియు తనియని వారికి దేవలోక సుఖము

లను కూడ నియ్యగల కర్మలను కామ్యకర్మలుగ నిర్ధారణ జేసిరి. అట్టి నిర్ధారణ జేసినట్టు

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే ।
తేపుణ్య మాసాద్య సురేంద్రలోకం
అశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్ ॥
తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలంక్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి ।
ఏవం త్రయీ ధర్మ మనుప్రపన్నా గతాగతం కామకామా లభంతే ॥
(శ్రీ భ. గీ.)

యజ్ఞములు, పశుబంధములు, సోమయాగములు మొదలగు కర్మలను చేసి స్వర్గలోకమునందు అనేక విధములైన స్త్రీసంభోగాది సుఖములను అనుభవించుచుండి అనేకవేలసంవత్సరము లనుభవించినను ఆ సుఖములన్నియు నంతము కలిగినవియే గనుక పుణ్యబలము క్షీణించినవెంబడే మరల భూలోకమునకు వత్తురు. ఈ ప్రకారముగా "రెడ్డివచ్చెను, మొదలెత్తుము" అనినట్టు పునః యాగకర్మ, పునః స్వర్గభోగము అగుచుండి కొన్ని జన్మములకు పిదప

యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।
ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః ॥
(శ్రీ భ. గీ., అధ్యా. ౫, శ్లో. ౨౨)

విషయములయం దింద్రియములు ప్రవర్తించుటవలన గలుగు సుఖములు ఏవి గలవో అవి దుఃఖహేతువులే యగుచున్నవి. కారణమేమనగా వాటికన్నిటికిని ఆదియు అంతమును గలవు. కాబట్టి వాస్తవము నెఱింగిన వివేకి వానియం దనురక్తి నుంచడు అని యర్థము.

ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా అష్టాదశోక్త మవరం యేషు కర్మ ।
ఏతచ్ఛ్రేయో యేఽభినందంతి మూఢాః జరామృత్యుం తే పునరేవాపి యంతి ॥

పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయా న్నా స్త్యకృతః కృతేన । తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్స మిత్పాణి శ్రోత్రియం బ్రహ్మ నిష్ఠం ॥　　(ముండకోపనిషత్తు)

ఇట్లు అనేకతడవలు స్వర్గమునకుపోయి పుణ్యము క్షీణము కాగానే భూమియందు జన్మించియు విసికి యజ్ఞరూపకములైన నావలన్నియు అదృఢములు, కనుక వీనియందు నాకు అనురక్తిలేదు అని. కర్మ చేయువాడు కామ్యకర్మలను వదులును. కామ్యకర్మలన్నియు రాజస కర్మలే.

యజ్ఞములు మూడు విధములు అని శ్రీమద్భగవద్గీతయందు చెప్పబడియున్నది.

అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే ।
యష్టవ్యమేవేతి మనస్సమాధాయ స సాత్త్వికః ॥ ౧౧ ॥
అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్ ।
ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసం ॥ ౧౨ ॥
విధిహీనమసృష్టాన్నం మంత్రహీన మదక్షిణం ।
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే ॥ ౧౩ ॥
(శ్రీమద్భగవద్గీత, అధ్యా. ౧౭)

యాగముచేయుట నాకేర్పడిన ధర్మము అని మనస్సును నిశ్చయముగా స్థిరపఱచి శాస్త్రములచే నియమింపబడిన ఏ యజ్ఞము ఫలాపేక్షను వదలుకొనినవారిచే ఆచరింపబడుచున్నదో ఆ యజ్ఞము సాత్త్వికమైనది.

ఫలమును అపేక్షించియు దంభముకొఱకును ఏ యజ్ఞము అనుష్ఠింపబడుచున్నదో ఆ యజ్ఞమును రాజసమునుగా తెలిసికొనుము.

అశాస్త్రీయమైనదియు అన్నదానము లేనిదియు మంత్రములు సస్వరము లుగా పఠింపబడనిదియు విధింపబడినరీతిగా ఋత్విక్కులు మొదలగు వారలకు ధారాళముగా దక్షిణల నీయకయే చేయబడినదియు శ్రద్ధారహితమైనదియు నగు యజ్ఞము తామస యజ్ఞము అని పెద్దలు చెప్పుదురు.

కనుక యజ్ఞములుచేయుచు వచ్చి స్వర్గసుఖములను అనుభవించి విసికినవాడు తామసరాజసయజ్ఞములను వదిలి సాత్త్వికయజ్ఞమునే చేయ నారంభించును.

యజ్ఞములను త్రిగుణములను పట్టి విభజించినట్లే కర్మలను కర్తలను కూడ త్రిగుణములను పట్టి విభజించియున్నారు.

నియతం సంగరహితమరాగద్వేషతఃకృతం ।
అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్విక ముచ్యతే ॥
యత్తుకామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః ।
క్రియతే బహుళాయాసం తద్రాజస ముదాహృతం ॥
అనుబంధం క్షయం హింసా మనపేక్ష్యచ పౌరుషం ।
మోహాదారభ్యతే కర్మ యత్తత్తామస ముచ్యతే ॥
ముక్తసంగో నహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః ।
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే ॥
రాగీకర్మఫలప్రేప్సుర్లుబ్ధో హింసాత్మకోశుచిః ।
హర్షశోకాన్వితఃకర్తా రాజసః పరికీర్తితః ॥

మోక్షమార్గత్రయము—కర్మయోగము-కర్తలు-కర్మలు

అయుక్తః ప్రాకృతస్తబ్ధశ్శఠో నైష్కృతికోఽలసః ।
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే ॥
(శ్రీమద్భగవద్గీత, అధ్యా. ౧౮, శ్లో. ౨౩—౨౮)

కర్తయొక్క వర్ణమునకును ఆశ్రమమునకును నియమింపబడిన ఏ కర్మము ఫలాపేక్షలేని కర్తచేత తాను కర్తను అను అభిమానము లేకయును ప్రీతి, ద్వేషము అనునట్టి రాగములేకయు చేయబడినదో ఆ కర్మము సత్త్వగుణమువలన బుట్టినదని యభిప్రాయము.

ఫలాపేక్షగలవానిచేతగాని తాను కర్త అను అహంకారము గల వానిచేత గాని అధికప్రయాసతో చేయబడు యజ్ఞాది కర్మలు రజోగుణ ప్రేరితములు అనబడును.

తరువాత కలుగబోవు శుభాశుభఫలమును దేహశక్తి యొక్కయు ధనముయొక్కయు నాశమును ఇతరులకు కలుగు కష్టమును, తన సామర్థ్యమును, ఆలోచింపక, ప్రారంభించెడి కార్యమును సంపూర్తిగా చేయవచ్చునో చేయ శక్యముకాదో అనుపర్యాలోచన లేక అవివేకముచేత ఏ కర్మము ఆరంభింప బడుచున్నదో అది తామసగుణమువల్ల పుట్టినది అని చెప్పబడు చున్నది.

ఫలాపేక్షను విడిచినవాడును, తాను కర్తయను నభిమాన ము లేనివాడును తానారంభించిన కార్యములు ఎంత కష్టసాధ్యము లైనను ధైర్యమును పట్టుదలయును గలవాడును, ఆరంభించినకార్య ము నెఱవేఱినను నెఱవేఱకపోయినను సంతోషము దుఃఖము మొదలగు వికారములు లేనివాడును నగు కర్త విధివాక్యములను

నమ్మి కర్మలను ఆచరించువాడు గనుక సత్త్వగుణ ప్రవర్తన గల వాడు అని యెఱుగబడుచున్నాడు.

అభిమానము గలవాడును కర్మఫలమునందాశ గలవాడును లుబ్ధుడును, పరద్రవ్యములయందాశ గలవాడును ఇతరులను హింసించియైనను తన కర్మమును చేయించుకొనువాడును అంతశ్శౌచము గాని బహిశ్శౌచము గాని లేనివాడును కార్యముసిద్ధించినపుడు సంతోషమును, చెడినపుడు దుఃఖమును చెందువాడును అగు కర్మ నాచరించువాడు రజోగుణప్రవర్తన గలవాడని యెఱుగబడును.

మనోనిగ్రహము అనగా చిత్తైకాగ్రత లేనివాడును పెద్దల మాటలయందు విశ్వాసము ఉంచని అవివేకియు ఎన్ని చెప్పినను విని కదలకయుండురీత్యా జడప్రాయుడుగా నుండువాడును మాయను చేయువాడును ఇతరులను మోసపుచ్చి యవమానముచేయువాడును సోమరియును, సర్వకాలములయందును వ్యసనముగలవాడును ఒక రోజులోపల చేయదగినపనిని ఒక నెలలోనైనను చేయలేనివాడును అగు కర్త తామసగుణప్రవర్తనగలవాడని యెఱుగబడును.

సత్త్వరజస్తమోగుణముల ననుసరించి యేర్పడిన కర్మల యొక్కయు కర్తలయొక్కయు తరగతులను తెలిసికొనిన పిమ్మట నిత్యకర్మ, నైమిత్తిక కర్మ, భగవత్ప్రీత్యర్థము చేయుకర్మ, నిష్కామ కర్మ అను తరగతులను విచారించ వలయును.

<u>నిత్యకర్మ</u> అనగా కర్మచేయు యోగ్యతను సంపాదించు కొనినవాడు ప్రతినిత్యమును అతనియొక్క అంతరాత్మను శుద్ధిచేసి కొనుటకుగా కొన్ని కర్మలను చేయవలసినట్లు తత్త్వవేత్త లగు ఋషులు నిబంధనలను చేసియున్నారు. సాధారణముగా ద్విజుడు

మోక్షమార్గత్రయము—కర్మయోగము-నిత్యకర్మ

"పంచ పంచ ఉషఃకాలము" నందు నిద్రమేలుకోవలయును. అదిమొదలు అతనికి కర్మాచరణ మారంభించును.

బ్రాహ్మే ముహూర్తే సంప్రాప్తే నిద్రాంపరిత్యజ్య ॥

రాత్రిప్రమాణము ముప్పదిగడియలకాలము. రాత్రి పదిగడియల సమయమునకు నిద్రనారంభించి పదునైదుగడియలకాలము నిద్రించవలయునని నియమము. "పంచ పంచ" అనగా ఐదైదులు= ఇరువదియైదు గడియలు, సూర్యోదయమునకు ఐదుగడియలకు మునుపు 'ఉషఃకాలము' ప్రారంభించును. అప్పటికి నిద్రను నివర్తి చేయవలయును. నిద్రప్రారంభమునకు విష్ణుపురాణమునందు కొన్ని నియమములు చెప్పబడియున్నవి.

శయ్యా మధిష్ఠాయ రాత్రిసూక్తం జపిత్వా, విష్ణుం నమస్కృత్య ఇష్టదేవతా స్మరణం కృత్వా సమాధి మాస్థాయ అన్యాన్ శైవ వైదికాన్ మంత్రాన్ సావిత్రీం చ జపిత్వా స్వపేత్ । నమస్కృత్వా ఽవ్యయం విష్ణుం సమాధిస్థ స్స్వపే న్నిశి ॥

రాత్రి శయ్యపై కూర్చొని రాత్రిసూక్తము అను మంత్రమును జపించి, ఇష్టదేవతను నమస్కరించి నిద్ర యను సమాధిని ప్రవేశించవలయును.

క్షీరసాగరతరంగశీకరాసారతారకిత చారుమూర్తయే ।
భోగిభోగశయనీయ శాయినే మాధవాయ మధువిద్విషే నమః ॥

అని విష్ణుపరమైన శ్లోకమును పఠించి నిద్రించితే విష్ణుభక్తులు నిద్రాసమయమునందు విష్ణుమూర్తియొక్క ధ్యానములోనే కైంకర్యము చేయుచుందురు.

ఇట్లు నిద్రించినవారు బ్రాహ్మముహూర్తము (పంచ పంచ ఉషఃకాలము) నందు నిద్రను చాలించి వెంటనే తాము నిద్రా సమయమునందు సేవించుచుండిన భగవంతుని ధ్యానించి సంసార యాత్ర ప్రారంభించుట సంప్రదాయము.

ప్రాతస్స్మరణ

ప్రాత స్స్మరామి ఫణిరాజితనౌ శయానం నాగామరాసుర మనాది జగన్నిదానం । వేదై స్సహాగమగణై రుపగీయమానం కాంతారకేతనవతాం పరమం నిధానం ॥ ౧ ॥

ప్రాత ర్భజామి భవసాగరవారిపారం దేవర్షి సిద్ధ నివహై ర్విహితోప హారం । సందృప్తదానవకదంబమదాపహారం సౌందర్యరాశిజలరాశిసుతా విహారం ॥ ౨ ॥

ప్రాత ర్నమామి శరదంబరకాంతికాంతం పాదారవిందమకరంద జుషాం భవాంతం । నానావతారహృతభూమిభరం కృతాంతం పాథోజ కంబురథపాదకరం ప్రశాంతం ॥ ౩ ॥

ప్రాత స్స్మరామి భవభీతిమహార్తిశాంత్యై నారాయణం గరుడ వాహన మబ్జనాభం । గ్రాహాభిభూతమదవారణముక్తిహేతుం చక్రా యుధం తరుణవారిజపత్రనేత్రం ॥ ౪ ॥

ప్రాత ర్నమామి మనసా వచసా చ మూర్ధ్నా పాదారవింద యుగళం పరమస్య పుంసః । నారాయణస్య నరకార్ణవతారణస్య పారా యణ ప్రవణవిప్రపరాయణస్య ॥ ౫ ॥

ప్రాత ర్భజామి భజతా మభయంకరం తం ప్రాక్సర్వజన్మకృత పాపభయాపనుత్త్యై । యో గ్రాహవక్త్రపతితాంఘ్రిగజేంద్రఘోరశోక ప్రణాశనకరోద్ధృతశంఖచక్రః ॥ ౬ ॥

---

**మోక్షమార్గత్రయము—కర్మయోగము-నిత్యకర్మ**

ప్రాత ర్నమామి పరమేశ్వరపాదపద్మం పద్మోద్భవామరమునీంద్రమనోనివాసం । పద్మాక్షనేత్రసరసీరుహపూజనీయం పద్మాంకుశధ్వజసరోరుహలాంఛనాఢ్యం ॥ ౧ ॥

ప్రాత స్స్మరామి పరమేశ్వరవక్త్రపద్మం ఫాలాక్షకీలపరిశోషితపంచబాణం । భస్మత్రిపుండ్రరచితం ఫణికుండలాఢ్యం కుందేందుచందనసుధారసమందహాసం ॥ ౨ ॥

ప్రాత ర్భజామి పరమేశ్వరబాహుదండా న్ఖట్వాంగశూలహరిణాహిపినాకయుక్తాన్ । గౌరీకపోలకుచరంజితపత్రరేఖా న్సౌవర్ణకంకణమణిద్యుతిభాసమానాన్ ॥ ౩ ॥

ప్రాత స్స్మరామి పరమేశ్వరపుణ్యమూర్తిం కర్పూరకుందధవళం గజచర్మచేలం । గంగాధరం ఘనకపర్దవిభాసమానం కాత్యాయనీతనువిభూషితవామభాగం ॥ ౪ ॥

ప్రాత స్స్మరామి పరమేశ్వరపుణ్యనామ శ్రేయఃప్రదం సకలదుఃఖవినాశహేతుం । సంసారతాపశమనం కలికల్మషఘ్నం గోకోటిదానఫలదం స్మరణేన పుంసాం ॥ ౫ ॥

ప్రాత స్స్మరామి భగవంత ముమాసహాయ మర్ధేందుమండితజటామకుటం త్రిణేత్రం । శార్దూలచర్మవసనం ధవళాంగరాగ మారూఢపుంగవ మనంగరిపుం ప్రసన్నం ॥ ౬ ॥

ప్రాత ర్నమామి శివ మేన శివైకభాజం భక్తార్తిభంజనపరం భగవంతమీశం । త్రాసాకులార్దితమృకండుసుతాపరోక్షం పాదారవిందగళితాంతకబాహుమధ్యం ॥ ౭ ॥

ప్రాత ర్నమామి సకలామయశాంతిహేతుం శ్రీనీలకంఠవృషభాంకముమాకుచాంకం । హాలాహలాకులవిధాతృముకుందభీతికోలాహలామయనిదానకృపానిధానం ॥ ౮ ॥

---

ప్రాత స్స్మరామి హృది సంస్ఫురదాత్మతత్త్వం సచ్చిత్సుఖం పరమహంసగతిం తురీయం । య త్స్వప్నజాగరసుషుప్తమవైతి నిత్యం తద్బ్రహ్మ నిష్కళ మహం న చ భూతసంఘః ॥ ౧ ॥

ప్రాత ర్భజామి చ మనోవచసామగమ్యం వాచో విభాంతి నిఖిలా యదనుగ్రహేణ । యంనేతి నేతి వచనైర్నిగమా అవోచు స్తం దేవ దేవ మజ మచ్యుతమాహు రగ్ర్యం ॥ ౨ ॥

ప్రాత ర్నమామి తమసః పర మర్కవర్ణం పూర్ణం సనాతన పదం పురుషోత్తమాఖ్యం । యస్మిన్నిదం జగదశేషమశేషమూర్తౌ రజ్జ్వాం భుజంగమ ఇవ ప్రతిభాసితం వై ॥ ౩ ॥

ఈ పైకనుపరిచిన విష్ణుపరములైనవిగాని శివపరములైనవిగాని లేక అద్వైతపరములైనవి గాని యగు శ్లోకములను పఠియించుచు మనస్సును ఐహికములగు లోకవార్తలయందు ప్రవేశపెట్టకయే స్నానము, సంధ్యావందనము, జపము మొదలగు నిత్యకర్మలను చేయవలయును. సంధ్యావందనాది జపకృత్యములను చేసి ముగించు నంతవరకును స్తోత్రపాఠములు మొదలగు విధముల మనస్సును భగవత్పరముగానే యుంచితే జపము, సంధ్యావందనము మొదలగు పూజలు చేయునప్పటికి నిన్నటిరాత్రి నిద్రసమయమునందు నివృత్తిమార్గయాత్రాపరుడు భగవంతునెడ ప్రేమతో చేయుచుండిన భక్తి, కైంకర్యము మొదలగు వివరములు మెల్లమెల్లగ జ్ఞాపకమునకు వచ్చును. ఆ విధమున సుషుప్త్యవస్థలో జరిగిన విషయములు కాలాంతరేణ జాగ్రదవస్థలో అనుభవమునకు వచ్చుచు క్రమేణ అవస్థాత్రయ సాక్షిత్వము అనుభవమునకు రాగలదు.

మోక్షమార్గత్రయము—కర్మయోగము–నిత్యకర్మ

పరాశరస్మృతియందు

సంధ్యాస్నానం జపో హోమః దేవతానాం చ పూజనం ।
ఆతిథ్యం వైశ్వదేవం చ షట్కర్మాణి దినే దినే ॥

అని నిత్యకర్మలను బ్రాహ్మణునికి విధించియున్నారు. స్నానము, సంధ్యావందనము, జపము, హోమము, దేవపూజ, ఆతిథ్యము, వైశ్వదేవము, అని నిత్యకర్మలు ప్రతినిత్యమును జరుపబడవలయు నని చెప్పబడియున్నది. అందుపైకి స్నానము, సంధ్య, జపము అను వాటిని మాత్రము గురించి సంగ్రహముగా విచారించవలయును.

స్నానము—స్థూలశరీరము సాధారణముగా జాగ్రదవస్థయందే స్వేదము మొదలగు స్రావములవల్ల మాలిన్యము చెందుచుండుట అందఱకు ననుభవమే కదా. జాగ్రదవస్థయందు జీవాత్మయొక్క శక్తి దేహమునందు నిండుగానుండుటవల్ల ప్రాణకర్మ లనగా జొల్లు కారుట మొదలగు కర్మలు వాని యిష్టానుసారముగా జరుగక నిబంధనలకు లోబడియుండును. నిద్రసమయమునందు జీవాత్మ యొక్క అధికారము తక్కువగానుండుటవల్ల జొల్లుకారుట మొదలగు మాలిన్యములు నిరాటంకముగా స్రవించుచు శరీరమునందు దుర్గంధమును బలపరచును. కనుక స్థూలశరీరమును శుద్ధిచేయకయే ఆహ్నికక్రియలు జరుపుటకు యోగ్యము కాదు. కనుక స్నానము ఆవశ్యకము. ప్రాయశః చల్లనీళ్ల స్నానము శరీరమునకు ఆరోగ్యము.

ధర్మశాస్త్రములయందు స్నానములను ౧. నిత్యస్నానము, ౨. నైమిత్తికస్నానము, ౩. కామ్యస్నానము, ౪. గౌణస్నానము

అని భాగించియున్నారు. గౌణస్నానమనగా నిజమైన స్నానము చేసి దేహమును శుద్ధిచేసికొనుటకు వీలులేనివారికి విధించిన మంత్ర స్నానము, గాయత్రస్నానము, భస్మస్నానము, కాపిలమార్జనము మొదలగు విధములైన స్నానపర్యాయములు. ఈ స్నానములతో ప్రకృతము మనకు అక్కరలేదు.

కామ్యస్నానము అనగా కొందరు కార్తికమాసమునందు మాఘమాసమునందును స్నానములు చేసి తద్ద్వారా పుణ్యప్రాప్తి నాశించియుందురు. గంగాదితీర్థస్నానములు కూడ అనేకులకు కామ్యస్నానములే.

నైమిత్తికస్నానము అనగా దేహమునకు ఏదో మైల తగిలి నపుడు గాని జనసంమర్దమునందు ప్రవేశించినపుడు గాని దేహ శుద్ధ్యర్థము చేయు స్నానము. నిత్యస్నానమునుగురించి యే ఇపుడు ప్రస్తావన. శుద్ధములై నిర్మలములైన తటాకోదకములయందు గాని నదీజలమునందు గాని స్నానం బాచరించవలయును. చర్మము నందలి రోమకూపములు మురికిచే మూయబడిపోవును. స్నాన కాలమునందు చక్కగా చర్మమును నానపెట్టి మురికిని తీసివేయవల యును. తటాకజలములయందు క్రిమిసమూహము లుండును. కన్ను లకు కానరావు. బ్రాహ్మముహూర్తమునందు తటాకములయందు స్నానముచేయుట యందు పురుగులబాధ కానరాదు. సూర్యరశ్మి లేనందున పురుగులన్నియు నీటిలో లోతుకు వెళ్లి నిద్రించు నని లోకోక్తి. కనుక సూర్యోదయాత్పూర్వము చేయబడు తటాకో దకస్నానము ఆరోగ్యము. ఇండ్లలోనైనను నూతినీరు చాల ఆరో గ్యమే. కొందరు స్నానకాలమునందు దేహమునందలి మురికిని

మోక్షమార్గత్రయము—కర్మయోగము-నిత్యకర్మ

పోగొట్టుకొనుటకై అనేకవిధములైన సబ్బుబిళ్లల నుపయోగింతు రు. నివృత్తిమార్గనిరతుడు సబ్బు నుపయోగించ గోరినపుడు మాలిన్యరహితమైన సబ్బును చూచి సంగ్రహించి ఉపయోగించ వలయును. సబ్బునందు తైలపదార్థ మున్నది. కొంకాయనూనె, శనగనూనె మొదలగు తైలముల నుపయోగించి చేయబడిన సబ్బులు నిరపరాధములు. అటుగాక మృగములను చంపి వాటి క్రొవ్వు లేక మత్స్యముల నూనె మొదలగు తైలవస్తువులను చేర్చి చేసిన సబ్బులు హేయములు.

పశ్చిమదేశములు అనగా ఐరోపా అమెరికా మొదలగు దేశ ములయందు చేయబడు సోపులయందు కందమూల తైలములతో చేయబడు సబ్బులు మహా అరుదు. పియర్సుసోపు, వైనోలియా సోపు, ఇరాస్మిక్కుసోపు మొదలగు మహాప్రఖ్యాతికెక్కిన సబ్బ బిళ్లలు అన్నియు నివృత్తిమార్గనిరతునికి వర్జనీయములే. సాధా రణముగా తిలతైలము, శీకాయపొడివంటి వస్తువులు అతి శుభ్ర ములు. ఇట్లు స్నానమును చేయవలయును. ఈ స్నాన మంతయు మహాశుద్ధి నిచ్చును.

సంధ్యావందనము గాయత్రీజపమునకు పూర్వాంగము. శ్రీ సూర్యభగవానుల రథము ఆకాశమార్గమునందు పోవుచుండగా "మందేహాది" రాక్షసులు సూర్యుని రథమునకు అడ్డపడుదురట. ఆ రాక్షసులు మరణములేనివారట. సూర్యుని రథము నడ్డగించి నపుడు సంధ్యావందనము చేయువారు చేయు అర్ఘ్యప్రదానము వలన పుట్టిన జలబిందువులు వజ్రాయుధములై ఆ రాక్షసులను సూ

ర్యుని రథమునకు అడ్డమురానీయక దూరమునకు తరుమకొట్టునట.
“ మందేహానాం వినాశాయ నిక్షిపేత్తు జలాంజలీన్ ”—దీనికి రహ
స్యార్థములు కలవు. సూర్యభగవానులు జీవాత్మ, “ హృదాకాశే
చిదాభానుః సదాకాల ప్రవర్తకః ” అనిన ప్రకారము జీవాత్మ
అను సూర్యుని మందేహాది రాక్షసులు అడ్డగింతురట. మంద
ము+ఈహ అనునవి తమోగుణ రజోగుణముల యొక్క గురు
తులు. సంధ్యావందనము వలన మందేహాదులను తొలగించుట
అనగా ప్రతి సంధ్యయందును తమోగుణ రజోగుణములను
జయించుటకు ప్రయత్నము చేయవలయునని సూచన. ప్రతిపూట
సంధ్యావందనమునందును తనను ఆవరించియున్న తమోగుణ
రజోగుణములను జయించుటకు ప్రయత్నము జరుపుచుండ
వలయును.

ప్రాతఃకాల సంధ్యావందనమునందు “ యద్రాత్ర్యా పాప
మకార్షం మనసావాచాహస్తాభ్యాం పద్భ్యాముదరేణశిశ్నా ”
అను మంత్రములున్నవి. పూర్వదినపు సాయంసంధ్యాకాలమునకు
తరువాత తాను తన జ్ఞానేంద్రియకర్మేంద్రియములతో ఏమేమి
పాపములను చేసియుండునో వాని నన్నిటిని పరిశీలించి ‘ ఈ పాప
మును ఇక మరల చేయను ’ అని నిశ్చయించుకొని మంత్రింపబడిన
జలమును త్రాగుట పాపములను తగ్గించుకొను ప్రయత్నమునకు
గురుతు. ఇదేవిధమున సాయంకాల సంధ్యావందనమపుడు కూడ
చేయుదురు. ఇట్లు దినమునకు రెండుతడవలు తాను చేసిన తప్పుల
నన్నిటిని పరిశీలించి ఇక యీ తప్పులను చేయను అని తీర్మా
నించుకొనుచు వచ్చువాడు తరుచుగా తప్పులను చేయడు.

మోక్షమార్గత్రయము—కర్మయోగము-నిత్యకర్మ

మఱియు ఉదయకాలమునందును అస్తమయ కాలము నందునను సంధ్యావందనము చేయువాడు తనయందు ఇమిడియుండు దుర్గుణములను పోగొట్టుకొనుటకుగా కొన్నిమంత్రములను చెప్పి పాపపురుషులను విసర్జించుకొనుచుండును. ఉదయము మొదలు సాయంకాలము వరకును చేసిన పాపములను "యదహ్నాపాపమకార్షం" అను మంత్రములతోనును, సాయంకాలము మొదలు మరుసటిదినముదయమువరకును చేసిన పాపములను "యద్రాత్ర్యా పాపమకార్షం" అను మంత్రములతోనును పోగొట్టుకొనుచు మఱియు పాపములను ప్రేరేపించు పాపపురుషులను కూడ విసర్జించుకొనుచు వచ్చువాడు ఎంతో దుర్మార్గుడు కాకుంటే మరల తప్పులను చేయడు. ఈ కాలమునందు వచ్చిన కష్టమేమనగా సంధ్యావందనముచేయు శ్రద్ధాళులు కూడ మంత్రములను పాడుటయే గాని వానియొక్క అర్థములను విచారించుటలేదు. అర్థముతోసహా మంత్రములను పాడినప్పటికేగాని తాము చేయు కర్మయొక్క ఫలమును గ్రహించలేరు. అంతేకాదు. మనస్సుతోకూడ పాపములను తొలగించుటకు నిశ్చయము చేసికొనవలయును. అప్పటికే పాపము తొలగును. ఇట్లు పాపములను తొలగించుకొని పాపములను కలుగజేయు పాపపురుషులను కూడ తొలగించుకొన్న పిమ్మటనే అర్ఘ్యప్రదానము చేయవలయును.

జపము అనగా ఒకటే మంత్రమును పలుమారు వల్లించుట. శ్రీ గురువులవారు చెప్పిన ప్రకారము యేదైన నొక మంత్రమును అంగన్యాసకరన్యాసములవల్ల తన శరీరమునందిముడుచుకొని ఆ

మంత్రముయొక్క దేవతతో తన్మయతను చెంది పలుమారు ఆ మంత్రమును వల్లించుట. సంధ్యావందనము నందు ముఖ్యాంశము గాయత్రీమంత్రజపము.

జపము అనగా అగ్నేయపురాణమునందు,

జకారో జన్మవిచ్ఛేదః పకారః పాపనాశకః ।
తస్మాజ్జప ఇతిప్రోక్తో జన్మపాపవినాశకః ॥

జపము చేయువారలను మనము అనేకులను చూచియుందుము. కొందరు జపము చేయునపుడు సమీపమందుండువారు వినునట్లు మంత్రము నుచ్చరింతురు. కొందరు విని విననట్టుగా నుచ్చరింతురు. మరికొందరు వినబడకనే జపముచేయుదురు.

వాచిక శ్చ తథోపాంశు మానసశ్చ జప స్త్రిధా ।
ఉత్తరో త్తర ఉత్కృష్టః సర్వపాపప్రణాశనః ॥
(అగ్నేయపురాణము)

వాచికము, ఉపాంశు, మానసము అని జపము మూడు విధములు. ఇందులో మొదటిజాతి కంటె రెండవది, రెండవజాతి కంటె మూడవది శ్రేష్ఠములు.

స్వరత్రయ సమాయుక్తో వర్ణవ్యక్తిపరో జపః ।
సవాచిక ఇతి ఖ్యాతః సాక్షరోచ్చరితో నృప ॥
(అగ్నేయపురాణము)

ఉదాత్తానుదాత్త స్వరితములనెడి స్వరములతో సహ అక్షరయుక్తముగా ఇతరులు వినునట్లు చేయబడు జపము వాచికము అనబడును.

ఈషదుచ్చరితో రాజన్ కించిదోష్ఠౌ ప్రచాల్యచ ।
స ఉపాంశురితి ఖ్యాతః కించిచ్ఛబ్దయుతో నృప ॥

స్వల్పముగా ఉచ్చరించి పెదవులను మాత్రము కదిలించి మంత్రములను వల్లించినట్టు చేయబడు జపము ఉపాంశు వనబడును.

మానసో మనసా చింత్యః ।

మనస్సుతో మాత్రము చింతించి చేయు జపము అనగా పెదవులైనను కదలకయే నాలుకను కూడ కదిలించకయే చేయుజపము మానసికము. మనస్సుతో చేయబడు సకల కార్యములును చాల బలము గలవి. ఏలయనగా జీవాత్మ ‟మనోమయః ప్రాణశరీరనేతా” అని వ్యవహరింపబడియున్నాడు. జీవాత్మ మనో రూపముగలవాడు. ఇంద్రియములు, శరీరము వీట్లకు అధిపతి. కనుక మనస్సుతో చేయబడు సకల అనుష్ఠానములును జీవాత్మ స్వంతముగా చేసినట్టు అర్థము. ఇంతేకాదు. వాచికముగానును ఉపాంశువుగానును జపమును చేయునెడల ఇతరవిషయములను చింతించుటకు పోవు స్వభావముగల మనస్సును నిగ్రహించుటకు వీలుండదు. మనస్సునకు ఇష్టములైన హీనవిషయములు అనేకములు గలవు. వాచిక ఉపాంశుజాతుల జపములయందు మనస్సు వ్యాసంగమునందు చిక్కి తగిలికొనియుండదు గనుక మనస్సు యథేష్టముగా సంచరించుటకు అవకాశముండును. మనస్సునే జపమునందు ప్రవేశపెట్టి జపమును జరిపించుచుండిన యెడల మనస్సు జపము అను వ్యాసమునందు చిక్కుబడి యుండునందున యథేష్టముగా హీనవిషయములయందు ప్రవేశించుటకు అవకాశము తక్కువ. కనుక మానసిక జపమే ఉత్తమము. మఱియు మానసిక జపమును గురించి

ధ్యాయేద్య దక్షరశ్రేణిం వర్ణాద్వర్ణం పరాత్పరం ।
శబ్దార్థచింతనం భూయః కథ్యతే మానసోజపః ॥
మనస్సంతోషణం శౌచం మౌనం మంత్రార్థచింతనం ।
అవ్యగ్రత్వం అనిర్వేదో జపసంపత్తి హేతవః ॥

మానసికజపము అనగా మంత్రములోని అక్షరములను ఒకటి వెంబడి మరియొకటిగా మనస్సుతో నుచ్చరించుచు ఆ మంత్రములోని పదములయొక్క అర్థములను విచారించుచు చేయుజపము.

జపము తృప్తికరముగా కుదురవలె ననినయెడల మనస్సునకు సంతోషమును, శౌచమును, మౌనమును వేరుతలంపులేకుండుటయు విసుకులేమియు నవశ్యములు.

నైమిత్తికకర్మ—నియమితకాలములయందు గాక అనియమితములైన కాలములయందును సందర్భములయందును చేయబడు కర్మ నైమిత్తికకర్మ యనబడును.

నైమిత్తికకర్మ మూడు విధములుగా నుండును.

౧. కేవలనైమిత్తికము, ౨. కామ్యము, ३. ప్రాయశ్చిత్తరూపకము.

నైమిత్తికకర్మలలో కొన్ని మాత్రము ఇచ్చట చెప్పబడుచున్నవి.

అమావాస్యా శ్రాద్ధములు, వృద్ధిశ్రాద్ధములు, గ్రహణశ్రాద్ధములు, తీర్థశ్రాద్ధములు, క్షేత్రశ్రాద్ధములు, క్షేత్రోపవాసములు, అర్థోదయ మహోదయ శ్రాద్ధములు, అనేకవిధములైన ప్రాయశ్చిత్తములు, ఇవి మొదలగునవి.

శ్రాద్ధములవిషయము కించిత్తుగా విచారింతము.

మోక్షమార్గత్రయము—కర్మయోగము-భగవదర్పణకర్మ

అగ్నౌ కృతేన దేవస్థాః స్వర్గస్థా విప్రభోజనాత్ ।
యమస్థాః పిండదానేన వికిరా న్నరకస్థితాః ॥

(కారికావృత్తి)

మృతిజెందిన పిమ్మట జీవాత్మలు వారి వారి యోగ్యతానుసారముగా కొందరు దేవలోకమునందును కొందరు స్వర్గమునందును కొందరు యమలోకమునందును మరికొందరు నరకమునందు నుందురు. ఇన్నిలోకములయందు నుండువారికి శాంత్యర్థముగా శ్రాద్ధములు చేయబడును.

నరకలోకము అనగా ఆస్ట్రిల్ ప్లేనులో గరుకులైన అణువులతో నేర్పడిన సబుప్లేనులు. యమలోకము అంతకంటె కొంత మేలైనది. స్వర్గలోకము ఆస్ట్రిల్ ప్లేనుయొక్క పైభాగమును మెంటల్ ప్లేనుయొక్క అడుగుభాగమును. దేవలోకము అనగా నంతకంటె పైభాగము.

వికిరపిండదానముచేత నరకలోకస్థులును, పిండప్రదానముచేత యమలోకస్థులును, బ్రాహ్మణభోజనముచేత స్వర్గలోకస్థులును, అగ్నియందు చేయు హోమముచేత దేవలోకస్థులును తృప్తిచెందుదురు. వసురుద్రాదిత్యరూపక దేవతలు శ్రాద్ధఫలమును ఆయా పితరులకు చెందునట్లు చేయుదురు.

నైమిత్తికకర్మలనుగురించి ఈ మాత్రము వ్రాయుట చాలునని తోచుచున్నది.

భగవదర్పణకర్మ—నిత్యనైమిత్తికకర్మలు చేయునపుడు ఆదియందును అంత్యమునందును భగవత్స్మరణచేయుట సంప్రదాయ

ము. కామ్యకర్మలు చేయునపుడు భగవద్ధ్యానము చేయవలసినది విధాయకమే. అయినను కామ్యకర్మ భగవదర్పణముగా చేయుట లేదు. నిత్యకర్మలును నైమిత్తికకర్మలును భగవద్ధ్యానపూర్వకము గా జేయబడును. "శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం" అని చెప్పి ఆరంభించుచు "శ్రీ కృష్ణార్పణమస్తు" అని ముగించుట ఎల్లరకును తెలిసిన విషయమే. మఱియు

ఈశానః పితృరూపేణ మహాదేవో మహేశ్వరః ।
ప్రియతాం భగవా నీశః పరమాత్మా సదాశివః ॥
చతుర్భి శ్చ చతుర్భి శ్చ ద్వాభ్యాం పంచభి రేవ చ ।
హూయతే చ పునర్ద్వాభ్యాం స మే విష్ణుః ప్రసీదతు ॥
యజ్ఞేశ్వరో హవ్యసమస్తకవ్యభోక్తా వ్యయాత్మా హరి రీశ్వ రోఽత్ర ।
తత్సన్నిధానా దపయాంతు సద్యో రక్షాం స్యశేషా ణ్యసురా శ్చ సర్వే ॥

ఇట్టి స్తోత్రములను నైమిత్తిక కర్మలయందు ప్రయోగించుట సంప్రదాయము.

ధ్యాయే న్నారాయణం దేవం స్నానాదిషు చ కర్మసు ।
ప్రాయశ్చిత్తం హి సర్వస్య దుష్కృతస్యేతి వై శ్రుతిః ॥

నారాయణస్మరణపూర్వకముగా నారంభించబడిన యెడల భగవదర్పణ కర్మ యగును.

భగవదర్పితమైన కర్మ చేసినందున చిత్తశుద్ధికలిగి కాలాంతరమునందు జ్ఞానము జనించుటకు సాధ్యమగును. కర్మవల్ల కలుగు ఫలము కర్తనుమాత్ర మాశ్రయించును. అదే కర్మ భగవత్ప్రీతిగా చేయబడిన యెడల ఆ కర్మయొక్క ఫలము లోకోపకారమునకుగా నగును.

మోక్షమార్గత్రయము—కర్మయోగము-భగవదర్పణకర్మ

తపస్వినో దానపరా యశస్వినో మనస్వినో మంత్రవిద స్సుమంగళాః ।
క్షేమం న విందంతి వినా యదర్పణం తస్మై సుభద్రశ్రవసే నమో నమః ॥
(శ్రీమద్భాగవతము, స్కం. 2, అ. 4)

తపస్సులు జేసియు దానములిచ్చియు మంత్రజపములు మొదలగు వాటిని జేయువారు తమ తమ తపస్సులనే భగవంతునికి అర్పింపకున్న నా కార్యము లన్నియు సఫలంబులుగాకయు నర్పించిన యెడల ఫలసిద్ధికలుగునో అట్టి మంగళకీర్తిగల భగవంతుని నమస్కరింతునని యర్థము. శ్రీశుకమహర్షిగారు ఈ స్తోత్రమును చేసిరి.

కర్మలను భగవదర్పణము చేయుటయందు మహాప్రఖ్యాతిని చెందిన వారు ప్రాచేతసులు.

య న్న స్స్వధీతం గురవః ప్రసాదితాః విప్రా శ్చ సిద్ధా శ్చ సదానువృత్త్యా ।
ఆర్యా వతా స్సుహృదో భ్రాతర శ్చ సర్వాణి భూతా న్యనసూయ యైవ ॥
య న్న స్సుతప్తం తప ఏత దీశ నిరంధసాం కాల మదభ్ర మప్సు ।
సర్వం తదేత త్పురుషస్య భూమ్నో వృణీమహే తే పరితోషణాయ ॥
(శ్రీమద్భాగవతం, స్కం. 4, అధ్యా. 30)

మాచేత నాచరింపబడిన స్వాధ్యాయము, గురుపూజ, విప్రులను సిద్ధులను అనుసరించి నడిచిన యాచారము, ఆర్యులకు చేసిన పూజలు, అసూయలేకయే సర్వభూతములు మాకన్నదమ్ములే యనియు స్నేహితులే యనియు సన్మానించినదియు, అనేక వేల సంవత్సరములకాలము మేము నీటియందు మునిగి చేసిన కఠినతపస్సును, తాము తమ తృప్తికిగా నంగీకరించవలయు నని పెద్దవరంబు కోరు

దుము అని సకల సత్కర్మలను భగవత్ప్రీతిగా ప్రాచేతసులు దత్తముచేసిరి.

పరమదారుణమైన తపస్సును శీలము మొదలగు సమస్తములనును వానియందు తమ కేమాత్రమైనను స్వార్థేహ లేకయే భగవత్ప్రీతిగా సమర్పించుట యెంతటి దానము అను విషయము చక్కగా పరిశీలించవలయును.

ఇట్లు అనేకజన్మములయందు శ్రద్ధాసమేతముగా కర్మలను చేసి వానిని భగవత్ప్రీతిగా దత్తముచేయుచువచ్చునెడల కర్మలయందు అభిమానము వదులును. కర్మలవలని ఫలములైన భక్తియు చిత్తశుద్ధియు ప్రాప్తించును. కర్మచేయుస్వభావ మేర్పడినపుడు నిష్కామకర్మ చేయుటకు వీలు కలుగును. లోకమునందు కోట్లకొలదియుండు జీవాత్మలందరును ఒకరే యగు నీశ్వరునియొక్క అంశలు అను సంగతిని ఎఱిగిన ఉపాసకులు లోకోద్ధరణార్థముగా భగవంతుడు చేయు కర్మలను తామే చేయవలెను. తనవలెనే ఈశ్వరాంశలుగానుండు ననేకులును తాను పొందు ఆనందములను పొందవలె నను నాశతో కర్మ తనకు స్వభావధర్మ మని తెలిసికొని లోకోపకారకర్మ చేయుచురావలెను.

కర్మల నాచరించి వాని ఫలములను కోరుచుండినది కొంతకాలము. కర్మఫలముల ననుభవించుటవల్ల చిక్కులు పడినది కొంతకాలము. ఫలానుభవమువల్ల చిక్కులుకలుగు నని తెలిసికొని కర్మఫలాపేక్ష లేకయే కర్మల నన్నిటిని భగవత్ప్రీతిగా వదులుకొన్నది కొన్నినాళ్లు. భగవత్ప్రీతిగా వదులుకొన్నపుడు కూడ అంతః ఒకవిధమైన సంతోషముండినది. తాను కదా కర్మల

మోక్షమార్గత్రయము—కర్మయోగము

నాచరించినవాడు; కష్టపడిచేసిన కర్మలను తానుకదా స్వప్ర యోజనమును కోరకయే భగవదర్పణము చేసితిని యను తృప్తి యుండును. అట్టి తృప్తి కూడ బంధకారణమే గనుక అట్టి ప్రీతికి కూడ నాస్పదము లేకయే "కర్మ స్వాభావికం మత్వా" అని తాను చేయు సకలకర్మలును తన స్వభావమే అని కర్మచేయుట నిష్కామ కర్మ. ఇది సాధారణజనులకు సాధ్యము కాదు. జీవన్ముక్తులకే సాధ్యము. సర్వజీవాత్మైక్యభావము కలిగిన వెనుకనే ఇట్టి నిష్కామ కర్మ సాధ్యము.

> ఆత్మా త్వం గిరిజా మతిః పరిజనాః ప్రాణా శ్శరీరం గృహం।
> పూజా తే విషయోపభోగరచనా నిద్రా సమాధిస్థితిః।
> సంచారః పదయోః ప్రదక్షిణవిధిః స్తోత్రాణి సర్వాగిరో।
> యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవా రాధనం ॥

ఈ శ్లోకముయొక్క ముఖ్యార్థము—కర్మయోగి చేయు సకల కర్మలును భగవదారాధనము అనునది కాక వేఱుకాదు. ఇట్లు నిష్కామ కర్మ, భగవదర్పణకర్మ, వీట్లను నాచరించుటవల్ల భక్తివృద్ధియగును.

శ్రీమద్భగవద్గీతయందు కర్మయోగమును గురించి విపులముగా చెప్పబడియున్నది. ఆ విషయము ఈ క్రింద సంగ్రహముగా వ్రాయబడుచున్నది.

"కామమయ ఏవాయం పురుషః" అను వాక్యప్రకారము మనుజుడు దుష్పూరమైన ఆశచే ప్రేరేపింపబడువాడు. ధనరాసులున్నను మరియు నధికముగా ధనము కూడబెట్టవలెనని ఆశించును. సుఖమనుభవించుచుండినను మరియు నధికమైన

సుఖమును కోరుచుండును. ఆశ కంతముండదు. కనుక మను జుడు ఎప్పటికిని యతృప్తుడుగానే యుండును. రజోగుణము ప్రబలి యుండువాడు గనుక లోభము, ప్రవృత్తి, ప్రయత్నము, ఈహా, కర్మలనుచేయుచునే యుండవలె నను ఆశ, ఇవన్నియు నతని వద్ద లకయుండును. కర్మఫలములను విధించు శాస్త్రములు చదువుట వల్ల కర్మఫలానుభవార్థముగా కర్మచేయుచుండును. కర్మవల్ల బంధము కలుగుచుండును. కర్మచేయక ఊరకుండుట అసాధ్యము. కర్మచేసినపుడు కర్మఫలానుభవరీత్యా బంధ మేర్పడును. శరీరయా త్రకుగా నైనను కర్మ చేసియే తీరవలయును. కర్మచేసినపుడు ఆ కర్మయందు సంగముంచుకొన్న యెడల రజోగుణము సిద్ధముగా తానున్నానని చెప్పుచు కర్మఫలమునందు తృష్ణకలుగజేసి కర్మ సంగముచేత దేహిని బంధించును.

కనుక కామ్యకర్మవల్ల బంధము అనివార్యము.

> యజ్ఞార్థాత్కర్మణోన్యత్ర లోకో యం కర్మబంధనః ।
> తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగ స్సమాచర ॥
>
> (శ్రీ భగవద్గీత, అ. 3, శ్లో. ౯)

భగవత్ప్రీత్యర్థము గాక ఇతరముగా జేయబడు కర్మ అనగా కామ్యకర్మ అంతయు బంధము కలుగజేయునదియే. కనుక నీవు చేయు కర్మనంతటిని ఫలాపేక్ష లేక యే సంగము వదలి చేయు చుండుము అని యర్థము.

> కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః ।
> జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛంత్యనామయం ॥
>
> (శ్రీ భగవద్గీత, అ. ౨, శ్లో. ౫౧)

మోక్షమార్గత్రయము—కర్మయోగము

సుఖదుఃఖములయందు సమత్వబుద్ధిగలవారలు స్వర్గాదులు కూడ నశించుస్వభావము కలిగి దుఃఖములను వృద్ధిచేయునవి అని తెలిసి కొని, నాశములేనిదియు దుఃఖస్పర్శలేనిదియు మోక్షమొకటే యని గ్రహించి, కర్మచేయుటవల్ల కలుగు ఫలమును అపేక్షింపకయే కర్మలనాచరించి బంధవిముక్తిచెందుదురు అని యర్థము.

కనుక కర్మఫలాపేక్షలేకయే కర్మ చేయవలయును. దేహ ధారులు కర్మచేయకయుండుట అసాధ్యము అని శ్రీభగవద్గీత మూ డవ అధ్యాయము ఐదవ శ్లోకమునందు చెప్పబడియున్నది. మనో వాక్కాయము లను త్రికరణములతో దేనితోచేసినను కర్మయే యగును గనుక కర్మేంద్రియములను మాత్రము పనిచేయనియ్యక ఎవ్వడు మనస్సుతో కర్మ చేయుచుండునో అతడు వివేకశూన్యు డును కపటాచారము గలవాడును అగునని శ్రీభగవద్గీత మూ డవ అధ్యాయము ఆరవ శ్లోకమునందు చెప్పబడియున్నది. కనుక "శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణ మేవచ" అను జ్ఞానేం ద్రియములను మనసా నిగ్రహించి వాగాదికర్మేంద్రియములచేత సత్కర్మలను ఫలాపేక్షలేనిదే ఎవ్వడుచేయునో అతడు ఉత్త ముడు అని మూడవ అధ్యాయము ఏడవ శ్లోకమునందు చెప్పబడియున్నది.

కర్మఫలమునందు అభిలాష లేనపుడు కర్మచేయుటయందు ఆసక్తి తగ్గకూడదు. కనుక

న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నానవాప్తం అవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥

యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్య తంద్రితః ।
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః ॥
ఉత్సీదేయు రిమే లోకాః న కుర్యాం కర్మ చేదహం ।
సంకరస్య చ కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః ॥
యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే ॥
సక్తాః కర్మణ్య విద్వాంసో యథా కుర్వంతి భారత ।
కుర్యా ద్విద్వాం స్తథాఽసక్తః చికీర్షు ర్లోకసంగ్రహం ॥
న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినాం ।
జోషయే త్సర్వకర్మాణి విద్వాన్ యుక్త స్సమాచరన్ ॥

(శ్రీమద్భగవద్గీత, మూడవ అధ్యాయము)

సర్వేశ్వరుండును, సర్వజ్ఞుండును అగు నాకు చేయదగిన కర్మ మేదియు లేదు. నేను పొందని సుఖముగాని పొందవలెనని కోరతగిన సుఖముగాని ఏదియు లేదు. అయినను నేను కర్మల నాచరించుచున్నాను గదా. నేను ఎల్లపుడును అతి జాగ్రత్తగలవాడనుగా కర్మలనాచరించనియెడల నన్ను నిర్దేశముగా కొనియుండు. లోకులు నా మార్గముననే చరియించువారు గనుక నేను కర్మల నాచరించ లేదు కదా యని లోకులందరును కర్మలను మానుకొందురు. అందువలన వారలకు కీడు సంభవించును. అందువలన నేను ప్రజలను చెడగొట్టిన వాడనగుదును. శిష్టులైన వారు ఎట్లు ప్రవర్తించుచున్నారో అట్లే పామరులుకూడ నడుతురు. కనుక తనకుగా ఫలాపేక్షలేకున్నను బ్రహ్మజ్ఞానియైన వాడు లోకులను కూడగట్టుకొను నిమిత్తము ఫలమునందాశతో పామరుడు ఎంత శ్రద్ధతో కర్మలను చేయునో అదేవిధముగా కర్మల

మోక్షమార్గత్రయము—కర్మయోగము

నాచరించవలయును. లేనియెడల కర్మలయం దాసక్తిగల అవివేకులయొక్క బుద్ధులు తడబడి చెడిపోవును అని శ్రీమద్భగవద్గీతయందు స్వామివారు పదేశించియున్నారు.

> మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా ।
> నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః ॥
> యే మే మత మిదం నిత్య మనుతిష్ఠంతి మానవాః ।
> శ్రద్ధావంతోఽనసూయంతః ముచ్యంతే తేపి కర్మభిః ॥
> (శ్రీమద్భగవద్గీత, అధ్యా. 3)

సర్వాత్ముడును సర్వజ్ఞుడును పరమేశ్వరుడును వాసుదేవుడు నగు నాయందు సకలకర్మఫలములను సమర్పణముచేసి కర్మఫలములయంద పేక్షగాని, కర్తను నేననిగాని అహంకారమమకారములు లేక కర్మచేయుము. ఏ మనుష్యులు నాయొక్క ఈ యభిప్రాయమును, నా వాక్యమునందు విశ్వాసముగలవారును పరమగురువగు నాయంద సూయలేనివారునై, ఎల్లపుడును అనుసరింతురో వారును పుణ్యపాపకర్మలచే విడువబడుచున్నారు.

> యే త్వేత దభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతం ।
> సర్వజ్ఞానవిమూఢాం స్తాన్ విద్ధి నష్టా నచేతసః ॥
> (శ్రీభగవద్గీత, అధ్యా. 3, శ్లో. 3౨)

ఎవ్వరైతే నేనిదివరకును పదేశించిన సిద్ధాంతమునందు విశ్వాసములేక యుందురో, వారలు జ్ఞానహీనులనియు సకలవిధములను చెడినవారనియు తెలిసికొనుము.

ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః ।
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే ॥
(శ్రీమద్భగవద్గీత, అధ్యా. ౧౮, శ్లో. ౨౬)

కర్మఫలముగోరకయే కర్మలను చేయువాడును, తాను కర్త యను నభిమానమైనను లేనివాడును, తానారంభించిన కార్యముల యందు ధైర్యమును పట్టుదలయును గలవాడును, ఆరంభించిన కార్యము నెఱవేఱినను నెఱవేఱకపోయినను సంతోషము దుఃఖము మొదలగు వికారములు లేనివాడును, గురూపదిష్టవాక్యములను నమ్మినవాడును సత్త్వగుణప్రధానుడగు కర్త యనబడును అని అర్థము.

నివృత్తిమార్గమును కోరినవాడు సాత్త్వికకర్తగా నుండవలయును గదా.

కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన ।
మాకర్మఫలహేతుర్భూ ర్మాతే సంగోఽస్త్వకర్మణి ॥
యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ ।
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే ॥
(శ్రీ భగవద్గీత, అధ్యా. ౨, శ్లో. ౪౭-౪౮)

కర్మల ననుష్ఠించునప్పుడు కర్మఫలములయందు నీక పేక్ష కూడదు. అట్లని కర్మత్యాగముకూడ కూడదు. కాబట్టి స్వప్రయోజనము నపేక్షింపక ఈశ్వరార్పణబుద్ధితో భగవద్ధ్యానము చేయుచు ఈశ్వరుడు ప్రీతిచెందవలెననిగాని నేను కర్తననిగాని యేర్పడు సంగములను వదిలి సిద్ధియందు గాని అసిద్ధియందు గాని మనస్సు చలించనివాడవై నిబ్బరముతో నీవు చేయు కర్మ కర్మయోగమని పేరు పొందును.

మోక్షమార్గత్రయము—కర్మయోగము

ఇట్టి గుణములు గల కర్మయోగి లోకముయొక్కయు లోకులయొక్కయు మేలుకై సకలకర్మల నాచరించునే గాని కర్మముల యందలి యాసక్తివలన గాదు. అట్టి కర్మయోగి ధనవంతుడుగా నుండినయెడల తన ధనమును లోకులకు అధికమైన లాభముగల శ్రోత్రమార్గములయందు సెలవుపుచ్చుచుండును. ఇతరులు తమ సొంతపుమేలుకొఱకును తమ కుటుంబముల మేలుకొఱకును పని చేసి కష్టపడునట్లు కర్మయోగి ఇతరులకుగా బనిచేయుచు మనుష్య జాతియొక్క మేలుకొఱకై తన యావచ్ఛక్తిని వినియోగించును. సిద్ధియందును అసిద్ధియందును సుఖమునందును దుఃఖమునందును మానావమానములయందును, రాగద్వేషములయందును, కర్మయోగి సమబుద్ధికలిగియుండును. ఇంతే గాక విధిని నెరవేర్చుట యొకటియే యుద్దేశముగలవాడు గానుండును.

యస్త్వాత్మరతి రేవ స్యా దాత్మతృప్త శ్చ మానవః ।
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే ॥
నైవ తస్య కృతేనార్థో నా కృతేనేహ కశ్చన ।
న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రయః ॥
(శ్రీ భ. గీ., అధ్యా. ౩, శ్లో. ౧౭–౧౮)

ఏపురుషుడైతే పరమాత్మయందే మునిగి తృప్తుడగుచున్నాడో, పరమాత్మయందే సంతోషపడుచున్నాడో అతనికి కర్మలవశ్యములు గావు. కర్మచేసినందుచేత ప్రయోజనము బొత్తిగాలేదు. కర్మము చేయనందుచేత ప్రత్యవాయమును లేదు. ఇతనికి ప్రయోజనము నాశ్రయించవలసిన యవశ్యమే లేదు.

ఈ స్థితియందు దేనిని గోరునట్టిదియు దేనిని ఇచ్ఛయించు నదియు దేనిని ద్వేషించునదియు లేదు. ఇట్టి స్థితియందు జ్ఞానముదయించుచున్నది. ఎవడు కర్మలననుష్ఠించుచునే బాహ్యాకర్మలను వేరుగానును ఆత్మానుభవమును వేరుగానును వివేచనము చేయుయోగ్యతగలిగియున్నాడో అతడు తత్త్వము గ్రహించుట ఏమి ఆశ్చర్యము. ఇతరులు ధ్యానాదులవలన జ్ఞానులగునట్లు ఇతడు కర్మయోగ మార్గమున జ్ఞాని యగుచున్నాడు. "మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరంతి తే" అనినట్లు నిష్కామకర్మ ననుష్ఠించు కర్మయోగి అచిత్తుయొక్క సప్తావరణరూపకమైన మాయాపరివేష్టితుండుగా నుండు భగవంతుని కనుంగొనును. మనస్సును సమస్తమైన కోరికలనుండి వదిలించి పరమపవిత్రమై ఆత్మగుహాంతర్వర్తియైన పరమాత్మను సర్వజీవాత్మైక్యభావమువల్ల కనుగొనును. అంతేకాదు. అతని వృత్తియంతయు అతి గంభీరమైన శాంతిరూపముగానుండును. భగవత్కైంకర్యమే ఉద్దేశముగా గలవాడగును. ఏకర్మచేసినను దేవునికి పూజయగుచున్నది. ఏకర్మచేసినను సర్వేశ్వరునకు సేవయగుచున్నది. ఇట్టిస్థితియందు కర్మయోగి బ్రహ్మానందతుల్యంబైన సంతోషము ననుభవించుచుండును. మెట్టుమెట్టుగా నతడు ప్రకృతియందలి మోహమువదిలి తాను సర్వేశ్వరునితో నొకటియని తెలిసికోగలడు. భగవంతుడే కర్త, భగవంతుడే కర్మ, భగవంతుడే కర్మఫలదాత, భగవంతుడే కర్మఫలమును గ్రహించువాడు. అంతయును భగవంతునియందే యున్నది.

బ్రహ్మార్పణం బ్రహ్మహవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతం ॥

అన్న ప్రకారము సంపూర్ణముగా నీశ్వరభావము వ్యక్తీకరించినపుడు కర్మమార్గము సర్వోత్తమ మైన శాంతి నియ్యగలదు. ఇట్టి కర్మ యోగికిని జ్ఞానయోగికిని వ్యత్యాసమేమియుండును. కాబట్టి మార్గత్రయమునందు ఏ ఒక మార్గమును అవలంబించినను ఆ మార్గాంతమందు మిగిలిన రెండుమార్గములును కలియును. కర్మ యోగియే జ్ఞానయోగిగను భక్తియోగిగను పరిణమించును. మూడు మార్గములకును గమ్యస్థాన మొకటే కదా.

ఇట్టి కర్మయోగి నిరంతరము కర్మలు జరుపుచునేయుండును.

> లోకేశ చైతన్యమ యాదిదేవ శ్రీకాంత విష్ణో భవదాజ్ఞ యైవ ।
> ప్రాత స్సముత్థాయ తవ ప్రియార్థం సంసారయాత్రా మనువర్తయిష్యే ॥

హే లోకనాథ, చైతన్యమే నీవు, నీవు ఆదిదేవుండవు, శ్రీకాంత, విష్ణో, తమ యాజ్ఞానుసారముగానే ప్రాతఃకాలమునందు లేచి తమ ప్రీతికిగా తమయొక్క సంసారమునందు నేను సలుపవలసిన యాత్రను సలుపుచున్నాను అని భగవత్కైంకర్యమును ఆరంభించును. ఇదే అర్థమును హిందీభాషయందు, "జానకిజీవన రాం కరింగే తేరా కాం" అని చెప్పబడియున్నది.

> సాంఖ్యయోగౌ పృథక్ బాలాః ప్రవదన్తి న పండితాః ।
> ఏకమప్యాస్థిత స్సమ్య గుభయోర్విందతే ఫలం ॥
> యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే ।
> ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి ॥
>
> (శ్రీ. గీ., అధ్యా. ౫, శ్లో. ౪, ౫)

కర్మయోగము, జ్ఞానయోగము అను రెండును కర్తలయొక్క స్వభావముల ననుసరించి అభ్యసించబడును అనునపుడు కర్మ

యోగియొక్క గమ్యస్థానము వేఱనియు, జ్ఞానయోగికి గమ్య స్థానము వేఱనియు శాస్త్రానుభవము లేనివారు అనుకొందురు. వేదాంతశాస్త్రార్థజ్ఞానముగలవారు అట్లు చెప్పరు. మోక్షమన గా సర్వబంధవినిర్ముక్తినిని, సర్వజీవాత్మైక్యభావానుభవమును ఉపా సకుడు అనుభవ సిద్ధముగా దెలిసికొనుట. పైన వివరించినప్రకా రము కామ్యకర్మలను చేసి క్రమేణ భగవదర్పణకర్మకు సిద్ధమై తద నంతరము నిష్కామకర్మ చేయుటకు సిద్ధపడువాడు తాను కర్మ చేయుచుండునపుడే కర్మలకు ప్రాముఖ్యము నిచ్చినను సహజముగా కొంతమట్టుకు భక్తిని అనుష్ఠించుచు జ్ఞానము నుపాసించుచుండును. కర్మయోగమందు ఉన్నత పదవికి వచ్చువాడు క్రమముగా భక్తి జ్ఞానములయందు కూడ ఉన్నతపదవిని చెందును. కనుకనే కర్మ పరంపరా సాధనము అని యిదివరకే చెప్పబడియెను. కర్మవల్ల చిత్తశుద్ధి గలిగి జ్ఞానము పుట్టును. కర్మయోగమును సాంతముగా నభ్యసించినపుడు అట్టి కర్మయోగి జ్ఞానాభ్యాసముగూడ చేసినవాడే యగును. అందువలననే వేదాంతశాస్త్రములను తెలిసినవారు కర్మ మార్గము వేఱు, జ్ఞానమార్గము వేఱు అను భ్రమను చెందరు. జ్ఞాననిష్ఠులు ఏ స్థానమును అనగా ఏ మోక్షమును పొందుదురో ఆస్థానమును కర్మయోగులు కూడ పొందుదురు. కనుక కర్మయోగ ఫలమును జ్ఞానయోగఫలమును ఒక్కటిగా నెవ్వడు తెలిసికొనునో వాడే తెలివి గలవాడు అని యర్థము.

మూడు మార్గములపైకి ఒకటి శ్రేష్ఠమనిగాని మరియొకటి అల్పమనిగాని యెవరును భ్రమ పడకూడదు. కర్తలయొక్క స్వ భావముల ననుసరించి మార్గములు మూడుగా ననుష్ఠింపబడును

గాని వేఱుకాదు. ఇక జ్ఞానమార్గమును గురించి యథాశక్తిగా విచారించ వలయును.

### జ్ఞానయోగము

మార్గత్రయమునందు జ్ఞానమార్గ మొకటి. దీనినే శ్రీమద్భగవద్గీతయందు బుద్ధియోగ మనియు సాంఖ్యయోగ మనియు వాడియున్నారు.

కర్మయోగమునుగురించి వ్రాసినపుడు రజోగుణప్రేరితుడైన మనుష్యుడు కర్మలను చేయుచు సంగమును వదిలి నిస్సంగతకు ఏ విధముగా రాను సాధ్యమైనది అనియు, ఫలకాంక్షవదిలి సర్వఫలత్యాగమును అభ్యసించుటకు సిద్ధమయ్యెను అనియు, ఫలమునందలి ఆశను మానుకొన్నందున ఏ విధముగా పరమేశ్వరునిపొందుటకు సాధ్యమైనదనియు విచారించితిమి. మనుష్యకోటియొక్క స్వభావమును పట్టి సగమునకు అధికముగా కర్మాచరణమునందు అభిలాషగలవారుగా నుందురు. జ్ఞానాభ్యాసమునకు కొందరే యోగ్యులుగా నుందురు. జ్ఞానమార్గము కర్మమార్గమువలె సులభమైనది కాదు. కర్మను ఆచరించుటకు దేహదార్ఢ్య ముండిన చాలును. జ్ఞానాభ్యాసమునకు మనస్సును శుద్ధిచేసికొనవలసినది అవశ్యము. మనస్సును శుద్ధిచేసికొనుట అను చర్యకు సాధనసంపత్తి యని పేరు. ఇది చాలకష్టము.

జ్ఞానాభ్యాసము నారంభించు మనుష్యుడు విశాలమైనదియు, గొప్పదియు, ఉన్నతమైనదియు నగు బుద్ధివికాసము కలిగియుండవలెను. జ్ఞానాభ్యాసికి మనస్సు వశీకరింపబడి యుండవలెను. ఇంద్రి

యములు జయింపబడి యుండవలెను. ఇవన్నియు సాధనచతుష్టయము అను నధ్యాయమునందు విపులముగా వ్రాయబడియున్నవి. సాధనములయందు మొదటిది వివేకము. వివేకమనగా అనిత్యముల నుండి నిత్యములను వేఱుదీయు శక్తి. విషయములు వేఱు, ఆత్మ వేఱు అని తెలిసికొను శక్తి. అనేక వ్యక్తులయందు ప్రచ్ఛన్నమై యుండు ఒకటిని తెలిసికొనుట. వివేకము అను ధర్మమును ఉపాసకుడు సంపాదించినందుకు ఫలము వైరాగ్యము. వైరాగ్యమనగా బాహ్యములైన వ్యక్తులయందు స్పృహ మానియుండుట ; బాహ్యస్పర్శలు తనకు అక్కఱలే దని తప్పించుకొని యెచటికైనను నిశ్శబ్దమై నిర్జనమైయుండు స్థలంబునకు వెళ్లవలె నని యాసబుట్టుట ; స్థూలసూక్ష్మప్రపంచములకు సంబంధించిన అపరాప్రకృతిరూపకములైన లోకములయందు తనకు తానే శత్రు వని అనుభవజ్ఞానము తెచ్చుకొనుట; శరీరముగాని మనస్సుగాని ఉపాసకునికి తొందర పెట్టుటకు ఏమాత్రమైనను శక్తిలేక యుండునట్లు బాహ్యస్పర్శల యందు అసక్తుడు అగుట.

శమమును సంపాదించి తాను చేయబూనుకొన్న యాత్మాన్వేషణంబు సమగ్రముగా ఫలించునట్లు ప్రయత్నముచేయవలయును. శమము ఉపాసకునికి బలము నిచ్చును. అనుష్ఠించుటకు అతి దుస్తరమైన జ్ఞానమార్గము "నాయమాత్మా బలహీనేన లభ్యః" అనినట్లు శమము సంపాదించని బలహీనునికి అజేయము. శమాది షట్కసంపత్తి యీ జ్ఞానమార్గమునందు చాల దృఢముగా నేర్పడవలెను.

మోక్షమార్గత్రయము—జ్ఞానయోగము

సాధనా న్యత్ర చత్వారి కథితాని మనీషిభిః ।
యేషు సత్స్వేవ సన్నిష్ఠా యదభావే న సిధ్యతి ॥
(వివేకచూడామణి)

ఈ జ్ఞానమార్గమునందు ముఖ్యముగా కావలసినవి నాలుగు సాధనములు. అవి యుండినట్లైతేనే జ్ఞాననిష్ఠ సాధ్యము, లేనట్లైతే నిష్ఠ సిద్ధించదు.

సాధనచతుష్టయసంపత్తిని పొందిన ఉపాసకుడు జ్ఞానోపదేశము పొందుటకు సిద్ధుడుగానుండును. ప్రవృత్తిమార్గయాత్రయందును, నివృత్తిమార్గమునాచరించవలెనని యాశపుట్టిన పిమ్మటను, ఉపాసకుడు అభ్యసించిన శాస్త్రజ్ఞానముచే నిశితమైన బుద్ధిగలవాడును, సూక్ష్మగ్రాహియైన మనస్సుగలవాడును అయి జ్ఞానదాత యైన గురువును ఆశ్రయించుటకు అర్హుడగును.

జ్ఞానము అనగా నాత్మసాక్షాత్కారజ్ఞానము. "ఏకం, విభు, నిత్యం, అనంతం" అను విశేషణములచేత నెఱుగదగినది ఆత్మవస్తువు. అట్టివస్తువును సాక్షాత్కరించు జ్ఞానమునకు 'జ్ఞానము' అనిపేరు.

"అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః"
"సర్వస్య చాహం హృది సన్నివిష్టః"
"ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి"

అను మొదలగు వాక్యములచేత గుర్తించతగినది ఆత్మ. లోకమునందుండు ప్రతివ్యక్తియందు ఆత్మను కనుగొనుట జ్ఞానము. పరమాత్మయొక్క తత్త్వమును దానియొక్క సర్వవ్యాపకమైన యే

కత్వమును తెలియుట జ్ఞానము. ఆత్మ యొక్క ఏ, భేదము బాహ్య
ప్రపంచమువల్ల పుట్టినది, మాయావరణమువల్ల భ్రమము కలుగు
ను, మాయావరణమువల్లనే మనము అంధత్వము చెంది యున్న
వారము అని కనుగొనుట జ్ఞానము.

దైవీ హ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా ।
మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే ॥
త్రిభిర్గుణమయై ర్భావై: ఏభిస్సర్వ మిదంజగత్ ।
మోహితం నాభిజానాతి మామేభ్య: పరమవ్యయం ॥
న మాం దుష్కృతినో మూఢా: ప్రపద్యంతే నరాధమా: ।
మాయయాపహృతజ్ఞానా: అసురం భావమాశ్రితా: ॥
నాహంప్రకాశ: సర్వస్య యోగమాయా సమావృత: ।
మూఢోయం నాభిజానాతి లోకో మా మజ మవ్యయం ॥

లోకోత్తరసామర్థ్యముకలదియు త్రిగుణాత్మకమైనదియు నగు నా
యొక్క మాయ దాటుటకు శక్యముకానిది. నన్నే ఎవ్వరు శరణు
నొందుదురో వారు ఈ మాయను దాటుచున్నారు. సత్త్వరజస్త
మస్సు లనెడి మూడువిధములైన గుణవికారముగల వస్తువులచేత
సమస్తమైనప్రపంచము అవివేకము పొంది నేను గుణాతీతుడను
అని నన్నెరుగజాలదు. అవివేకులును, మనఃపూర్వకముగా పాప
ములను జేయువారును, మాయచేత నపహరింపబడిన జ్ఞానముగల
వారును, అసురస్వభావము నాశ్రయించినవారును, హింసానృతాది
స్వభావము నాశ్రయించినవారును, మనుష్యాధములును, నీచజను
లును నన్ను పొందరు. నేను సమస్తలోకంబులయందుండు ప్రజల
కును ప్రత్యక్షమైనవాడను గాను. త్రిగుణవిశిష్టమైన మాయచే

మోక్షమార్గత్రయము—జ్ఞానయోగము

నావరింపబడి వివేకశూన్యులైన లోకులు నన్ను పుట్టుకలేనివాడు అనియు నాశరహితుడు అనియు నెఱుగరు అని శ్రీకృష్ణమూర్తి ఉపదేశించిరి.

పై శ్లోకములయందు 'మాయయాపహృతజ్ఞానాః' అని చెప్పబడియున్నది. అనేక విధములచేతను మనుష్యులు మోస బోవుచున్నారు. ఇదంతయు మాయామాహాత్మ్యమనియే యెఱుగ వలయును.

> దుస్సంకల్ప వికల్ప కూలయుగళా ధైర్యద్రుమోన్మూలినీ కల్లోలైరభిమాన మత్సరముఖైష్షడ్భిః పరీతోర్మికా। అహన్తాద్యమతాదిభిః పరివృతా దుఃఖైకధారార్పితా పూర్ణా మోహనదీ యస్మిన్నేవ నిభృతం చేతస్స్థిరోర్మాయినాం ॥

మాయయొక్క పరిణామమైన మోహమును ఒక నదీరూపముగా వర్ణించియున్నారు. నదికి రెండు గట్టులుండును. దురుద్దేశము వికటోద్దేశము అనునవి రెండు ఒడ్డులు. నదీప్రవాహము చెట్లను పెల్లగించి త్రోయును. మాయామోహమనెడు నది ధైర్యమనెడు చెట్టును పెల్లగించును. నదీప్రవాహమునందు కరుళ్లుండవలెను. కామక్రోధలోభమోహమదమాత్సర్యముల నునవి కరుళ్లు (అలలు). నదీప్రవాహమునందు సుళ్లుండును. అహంకారమమకారముల నునవి సుళ్లు. దుఃఖమనునది ప్రవాహము. మాయా వశీగులగు జనులయొక్క చిత్తస్థితి అట్టి మోహనదియందు మునిగియున్నది అని యర్థము.

ఒకవస్తువు మరియొక వస్తువుగా మారుట, జన్మము, యౌవనము, మరణము, జీవజంతువుల యెడతెగని మారుట యను చక్ర

ము, ఇవన్నియు త్రిగుణముల విలాసముగానున్నవి. గుణములు చక్ర
మువలె తిరుగుచున్నవి. ఆత్మ ఏమాత్రమైనను మార్పులేక నిలిచి
యుండును. ఇదంతయు మాయచేత మూయబడిన భగవంతుడును
లీలాసహితుడునైన విష్ణువుయొక్క ప్రపంచలీల. ఇవంతయు సర్వేశ్వ
రునియొక్క యిచ్ఛ. రూపములు మారుచున్నవి. మారనివాడు
భగవంతుడొక్కడే.

ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః ।
యః పశ్యతి తథాఽఽత్మాన మకర్తారం స పశ్యతి ॥

ప్రకృతియే సమస్త కర్మములనును చేయుచున్నదనియు, ఆత్మ కర్త
కాడనియు నెవడెరుగునో అతడే తెలివివంతుడు. ఇతడే "సమం
పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరం" అని యంతటను సమా
నముగా నిండియుండు ఈశ్వరుని జూచువాడు. అంతటను సమాన
ముగానున్నాడని మాటలతో చెప్పుట సులభమే. ఆచరించుట
దుఃఖసాధ్యము. జ్ఞానికే సమదర్శనము సాధ్యము. పరమనీచుని
యందుండు ప్రజ్ఞానాంశువును (monad) పరమర్షియందుండు
ప్రజ్ఞానాంశువును స్వభావమునం దొకటే.

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః ॥

బ్రాహ్మణునియందును, గోవునందును, ఏనుగునందును, కుక్కయం
దును, చండాలునియందును పండితులు సమదర్శనము కలిగియుం
దురు. ఇట్టి సమదర్శనము తొలుత భ్రాతృభావమును అనుష్ఠించు
చుండచ్చుటవల్ల కలుగును. స్వల్ప విషయములయందంతయు సర్వ

మోక్షమార్గత్రయము—జ్ఞానయోగము-జ్ఞానసాధనములు

జీవాత్మైక్యభావమును అభ్యసించుచురాగా సర్వజీవాత్మైక్యభావము చివరకు భారీవిషయములయందు సాధ్యమగును.

ఇట్టి సమత్వబుద్ధికుదురుటకుగా చేయవలసిన ప్రయత్నమునందు మెట్లు కొన్నిగలవు. సాధనచతుష్టయసంపత్తియను నంశమునందు అనేకములు చెప్పబడియున్నవి. అయినను పరమగురువులు శ్రీకృష్ణమూర్తి శ్రీమద్భగవద్గీత, ౧౩ వ అధ్యాయము, ౭ వ శ్లోకము మొదలు ౧౧ వ శ్లోకము వరకును ఇరువది గుణములు జ్ఞానము అని చెప్పియున్నారు. జ్ఞానమునకు అంతరంగహేతువులును సాధనములును గనుక సాధనమునే జ్ఞానము "అమానిత్వాదిగణం జ్ఞానసాధనత్వాత్ జ్ఞానశబ్దవాచ్యం విదధాతి భగవాన్" అని చెప్పబడినది. ఈ గుణములను గురించి, ఆత్మవిచారము పూర్వభాగమునందు శీలము అనునధ్యాయమునందు వ్రాయబడియున్నది. చూడవచ్చును. అయినను ప్రస్తావనావశమున అతి సంగ్రహముగా నిక్కడ వ్రాయనగును.

అమానిత్వం తనకున్న గుణములో లేనివో అట్టివానిని శ్లాఘించి గౌరవమును కోరుట మానిత్వము. అట్టి దురాచారము లేకుండుట అమానిత్వం. అదంభిత్వం, లాభపూజాఖ్యాత్యర్థము స్వధర్మ ప్రకటీకరణము దంభము. అదిలేకుండుట అదంభిత్వము. మనోవాక్కాయము లను త్రికరణములలో దేనిచేతనైనా ప్రాణులను పీడించుట హింస. అది లేకుండుట అహింస. పరాపరాధకాలమునందు చిత్తము తడబడి కోపమువచ్చినను నిర్వికారచిత్తముతో వారి యపరాధములను సహించుకొనియుండుట క్షాంతి

యనబడును. 'మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనాం' అని నట్టు త్రికరణములును ఏకీభావముగా సన్మార్గమునందు చరించుట ఆర్జవము. చోదకగురువులవారియొక్కయు బోధకగురువుల వారియొక్కయు సేవ ఆచార్యోపాసనము. శౌచం అనగా పరిశుద్ధి. ఇందును గురించి ఆత్మవిచారము, పూర్వభాగము, ౩౧౧ వ పుటలో విపులముగా వ్రాయబడియున్నది. స్థైర్యం—మోక్షసాధనమైన జ్ఞానమును అభ్యసించుకాలమునందు లెక్కలేనన్ని విఘ్నములు వచ్చును. అట్టి విఘ్నములను లక్ష్యపెట్టక జ్ఞానాభ్యాసమునందు పట్టుదలతో వ్యాసంగముచేయుట. ఆత్మవినిగ్రహమనగా దేహేంద్రియాదిసంఘాతము అన్యవిషయములయందు ప్రవర్తించుటకు ఇష్టపడును. పూర్వవాసనలు వాటిని తప్పుమార్గమునందులాగును. 'అశుభేషు సమావిష్టాం శుభేష్వేవా వతారయేత్' అని యెన్ని ప్రత్యవాయములు వచ్చినా వాటిని జయించి మోక్షప్రాప్తిహేతుకమైన జ్ఞానాభ్యాసమును చక్కగా నాచరించుట. ఇంద్రియార్థేషు వైరాగ్యం అనగా శబ్దాదివిషయములయందు వైరాగ్యము; అనగా పంచేంద్రియముల సంబంధమైన విషయములను స్వతఃగా చూచి అనుభవించుటయందు గాని లేక చూచినవారు విన్నవారు అనుభవించినవారు తమ అనుభవములను వర్ణించుచుండగా వినుటకుగాని ఇచ్ఛలేమి. అనగా వాటియందు రాగములేకుండుట. ఈ కాలమందు డ్రామాలకుపోయి రాత్రి నిద్రమేలుకొనియుండి ఆనందము చెందినామని సంతోషించుట సహజము. డ్రామాలలో జాగ్రదవస్థలో పొందు ఆనందమునకంటె వేయింత లధికమైన ఆనందమును అదే సమయమునందు నిద్రించి సుషుప్త్యవస్థకెక్కిన నివృత్తిమార్గ

యాత్రాపరుడు బ్రహ్మానందమును పొందును. ఇది తెలిసికోలేక పోవుట నివృత్తిమార్గయాత్రాపరునికి చాల నష్టము.

అనహంకారము—ఆత్మస్తుతి చేసుకోకపోయినను తన మనస్సులో అంతః నేను అధికుడను, ఇతరులు అధములు అని అభిప్రాయపడి వెలుపలికి చెప్పుకోకయే అంతః రమించుట కూడ అహంకారమే. ఇట్టిచేష్ట లేకయుండుట అనహంకారము. జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషానుదర్శనం అనగా సాధారణముగా లోకసేవార్థముగా కాక ఇట్టి స్థలమునందు జన్మించవలెనను నభిప్రాయము గాని, యిన్నిసంవత్సరములు జీవించవలెనను నాశగాని, ముసలితనము దుర్భరము కనుక తప్పించుకోవలెనని యిచ్ఛయించుటగాని, వ్యాధివచ్చినపుడు నివృత్తిమార్గనిరతుడు నెల్లపుడునుండవలసిన శాంతిని పోగొట్టుకొనుటగాని, దుఃఖములువచ్చినపుడు ధైర్యము పోగొట్టుకొనుటగాని, ఇట్టి అజ్ఞానచేష్టలు లేకుండుట. ‘ అసక్తిః అనభిష్వంగః పుత్రదారగృహాదిషు’—సక్తి యనగా ఇది నాది యను ప్రీతి. అభిష్వంగ మనగా ఈ వస్తువు నేనే అను ప్రీతి. సక్తికన్న నధికమైనది. నాది అనుటకంటె నేనే అను బంధము చాల దుర్జేయము. ఇట్టి సక్తి గాని అభిష్వంగము గాని పుత్త్రిలు, భార్య, ఇల్లు ఇట్టివానియందు లేకుండుట అసక్తి, అనభిష్వంగము. నిత్యంచ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు. ఇదే అర్థమును “దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః” అను వాక్యము తెలుపుచున్నది. “నప్రహృష్యే త్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియం” అను వాక్యముకూడ సమబుద్ధిభావమును తెలుపు

చున్నది. "మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ" వాసుదేవుండును, భగవంతుండును, సర్వేశ్వరుండును నగు నాయందు ప్రేమ. "గతిర్భర్తా ప్రభుః సాక్షీ నివాసశ్శరణం సుహృత్" అనిన ప్రకారము సర్వోత్కృష్టుడైన నాయందు అనగా శ్రీకృష్ణునందు ఇతడు సర్వోత్తముడు గదాయని జ్ఞానము కలిగినందువల్ల పుట్టిన పరమప్రీతి. అట్టి ప్రీతి ఎట్లుండవలెననగా "త్వమేవ మాతా చ పితా త్వమేవ త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ। త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ త్వమేవ సర్వం మమ వాసుదేవ॥ అన్యథాశరణంనాస్తి త్వమేవశరణం మమ। తస్మాత్కారుణ్యభావేన రక్ష రక్ష జనార్దన॥" అను వాక్యములయందు కనుపరచిన అనన్యభక్తి కలిగియుండుట. స్వామివారే చెప్పినదేమనగా "ప్రీతిర్నయావన్మయి వాసుదేవే న ముచ్యతే దేహయోగేన తావత్" నేనైన వాసుదేవునియందు ఎంతకాలమువరకును పరమప్రేమ రూపమైన భక్తి కలుగదో అదివరకును దేహబంధమునుండి విడువబడరు అని చెప్పిరి గనుక వాసుదేవునియందు అనన్యభక్తి కలుగవలయును. వివిక్తదేశ సేవిత్వమరతిర్జనసంసది-జనసమ్మర్దములేని స్థలమునందు నివసించుటకు కలిగిన యాశ. మఱియు జనసమూహమునందు సంచరించుట కిష్టములేమి. జనసమూహమందు చాలమంది విషయభోగేచ్ఛగలవారుగానే యుందురు. అట్టివారిమధ్యన చరించుట నివృత్తిమార్గ నిరతుని వృద్ధికి చెరుపు.

> సంగ స్సర్వాత్మనా హేయః స చే త్త్యక్తుం న శక్యతే।
> స సద్భి స్సహ కర్తవ్యః సంత స్సంగస్య భేషజం॥

మోక్షమార్గత్రయము.—జ్ఞానయోగము—జ్ఞానసాధనములు

సర్వాత్మనా సంగమేమో చెడ్డదే. అయినను సంగమును వదులుటకు వీలులేకుంటే సత్పురుషులతో సంగముంచుకోవలెను. సత్సంగమునందు సంగదోషము కానరాదు.

> సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వం ।
> నిర్మోహత్వే నిశ్చలతత్త్వం నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః ॥

అని చెప్పియున్నది. అయితే లోకసేవార్థమై జనసమ్మర్దమునందు ప్రాయశః జ్ఞాని సంచరించవలసినది అవశ్యముగానుండును. అది జ్ఞానియొక్క ధర్మము గనుక అగత్యముగా చేయవలసినదే. అట్లు సందర్భించినపుడు, ఆత్మవిచారము, పూర్వభాగము, ౯౯౦ వ పుటయందు చెప్పినప్రకారము కవచమును ధరించి వెళ్లవలయును.

అధ్యాత్మజ్ఞాననిత్యత్వం—ఆత్మానాత్మవివేచన జ్ఞానము అధ్యాత్మజ్ఞానము. ఇట్టి వివేచనము ఎల్లప్పుడును జరుపుచుండుట. సదా అదేచింతగా పరీక్షచేయుచుండనియెడల ఉద్దేశమును మరిచిపోవు నట్టేర్పడును. కనుక సంతతమును మరువక మన ఉద్దేశములను పరీక్షించుచుండవలయును. మరుపురాక యుండుటకుగా సర్వదా నిత్యానిత్యవస్తు వివేచనాభ్యాసమునందుండుట అధ్యాత్మజ్ఞాననిత్యత్వము.

తత్త్వజ్ఞానార్థదర్శనం—తత్త్వవివేచనము చేయుటకు ఫలరూపమైనది బ్రహ్మసాక్షాత్కారము. 'అహంబ్రహ్మాస్మి' యను సాక్షాత్కారమునకు శక్తినియ్యగల వేదాంతవాక్యముల చింతనకును, పైన చెప్పబడిన అమానిత్వాదిగుణసాధన పరిపాకమునకును, అవిద్యకు ఫలరూపములైన నిఖిలదుఃఖనివర్తికిని, పరమానంద స్వరూప

మైన ఆత్మావాప్తికిని వేరుపేరైన మోక్షమునందే ఎల్లపుడును దృష్టియుంచియుండుట. తత్త్వజ్ఞాన ప్రయోజనమైన మోక్షేచ్ఛ దృఢముగా నుంటేనేగదా మోక్షప్రాప్త్యుపాయముల నభ్యసించుటకు ఎడతెగని ప్రయత్నము సాధ్యము. కనుక తత్త్వజ్ఞానార్థదర్శనము అతిముఖ్యము.

ఇట్టి జ్ఞానము అను జ్ఞానసాధనములన్నియు కర్మయోగాచరణవల్ల పుట్టు భక్తివల్ల సాధ్యము. "భక్తిర్జ్ఞానజనిత్రీ" అని చెప్పబడియున్నది.

> మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే ।
> సగుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే ॥

ఎవ్వడైతే అవ్యభిచారమైన భక్తితో నన్ను సేవించుచున్నాడో వాడు గుణములను అతిక్రమించి జ్ఞానియై జీవన్ముక్తదశను పొందుటకు సమర్థుడగుచున్నాడు. భక్తిచేత జ్ఞానముపొందుటకు కావలసిన సాధనములనన్నిటిని సంపాదించగలడు.

ఇన్నిసాధనరూపక జ్ఞానచిహ్నములను గలవాడు జ్ఞానియనబడును. ఇతడే స్థితప్రజ్ఞుడు అను పేర భగవద్గీత ద్వితీయాధ్యాయమునందు వాడబడియున్నాడు. ఇతనికే బ్రహ్మభూతుడనియు పేరు.

> బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి ।
> సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరాం ॥

(శ్రీమద్భగవద్గీత, అ. ౧౮, శ్లో. ౫౪)

శ్రవణమననాభ్యాసములవల్ల 'బ్రహ్మాస్మి' అని తెలిసికొనినవాడును, ఆ తెలివియందు దృఢనిశ్చయము కలవాడును, శమదమాది గుణ

ములను అభ్యసించుచు వచ్చినందున శాంతిచెందిన చిత్తము గల వాడును గనుక విధివశమ్మున సందర్భించిన దుఃఖములను గురించి శోకముచెందనివాడును, ప్రాప్తించని సుఖములను కోరనివాడును, కనుకనే "ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున" అని నట్టు లోకులకు కలిగిన దుఃఖములనుగాని సుఖములనుగాని తనకే సంభవించినట్టుగా భావించి "అవిభక్తం చ భూతేషు విభక్తమి వ చ స్థితం" అనినట్టు భూతములయందు అంతర్యామిత్వేన ఒకటి గానుండినను దేహతాదాత్మ్యజ్ఞానమువల్ల విభక్తుడుగా కనబడు ఆత్మ తానే అని మననరీత్యా అనుభవ సిద్ధముగా తెలిసికొని యున్నాడు గనుక సర్వభూతములయందును సమానభావమును చూపును. అంతేకాక తానెక్కిన అత్యున్నతపదవినుండి లోక మంతయు తన పరిణామమే యనియు దృఢముగా తెలిసి యను భవించును. ఈ పైన వ్యాఖ్యాతమైయుండు శ్లోకమునందు 'నశో చతి న కాంక్షతి' అను నర్థములను తెలిసికొనుటకుగా శ్రీమహా భారతమునందు "మంకీ ఉపాఖ్యానము" శ్రీమద్భాగవతము, ఏకాదశస్కంధమునందు 'భిక్షుగీతా' అను భాగమును చదువ వలయును. సమత్వబుద్ధి కొంచెముగా పుట్టినపుడు దానిని దృఢ పరుచుకొనుటకుగా

> మామేవ సర్వభూతేషు బహిరంతరపావృతం ।
> ఈక్షేతాత్మని చాత్మానం యథా ఖమమలాశయః ॥
> ఇతి సర్వాణి భూతాని మద్భావేన మహామతే ।
> సభాజయన్ మన్యమానో జ్ఞానం కేవలమాశ్రితః ॥

బ్రాహ్మణే పుల్కసే స్తేనే బ్రహ్మణ్యేఽర్కే స్ఫులింగకే ।
అక్రూరే క్రూరకే చైవ సమదృక్పండితో మతః ॥
నరే ష్వభీక్ష్ణం మద్భావం పుంసో భావయతో చిరాత్ ।
స్పర్ధాసూయాతిరస్కారాః సాహంకారా వియంతిహి ॥
విసృజ్య స్మయమానాన్ స్వాన్ దృశం వ్రీడాంచ దైహికీం ।
ప్రణమే ద్దండవ ద్భూమా వశ్వచండాలగోఖరం ॥

((శ్రీమద్భాగవతము, స్కం. ౧౧, అధ్యా. ౨౧)

జ్ఞాని నిర్మలమానసుండై తనయందును సర్వభూతములయందును ఆకాశ మెల్లయెడల నిండియుండు రీతిగా బహిరంతరములయందు నిండియుండు నన్ను గనవలయును. కేవల జ్ఞానమును అనుష్ఠించు చుండుటవల్ల జనియించిన జ్ఞానదృష్టిం జేసి సర్వభూతములనును మద్భావమున బూజించవలయును. బ్రాహ్మణులు, పుల్కసులు, దొంగలు, బ్రహ్మణ్యులు, సూర్యుడు, మిణుగురు, క్రూరుడు, అక్రూరుడు ఇది మొదలగు ద్వంద్వంబులందు సమదర్శనంబు గల యతండు గదా పండితుండు. జీవకోటియందు మద్భావమును తరుచుగా భావించు జ్ఞానికి అతి శీఘ్రముగా స్పర్ధాసూయాతిరస్కారాహంకారములు తొలగిపోవును. అట్టివాడు తన కార్యములను చూచి పరిహాసముచేయు స్వజనులను, దేహాభిమానమును, లజ్జనును విడిచి కుక్కలు, చండాలురు, గోవులు, గర్దభములు మొదలగు నుచ్చనీచస్వభావంబులం గల సర్వభూతములకును వీటియం దన్నింటియందును పరమేశ్వరుండే కదా యంతర్యామి త్వేన నున్న వాడని యెఱిగి వాటికెల్లయు దండప్రణామంబు లాచరించవలయు నని యర్థము,

మోక్షమార్గత్రయము—జ్ఞానయోగము

ఇటువంటి జ్ఞాని "సర్వథా వర్తమానోపి స యోగీ మయి వర్తతే" అనినట్టు అతనికి విధినిషేధము లేమియు నుండవు. "నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః". అయినను అతడు లోకసేవ చేయుట అతని స్వభావముగానుండును. లోకసేవ చేయునపుడు "ఇదం మదీయం ఇదం నేతి గణనా లఘుచేతసాం" అల్పులు వీరుమావారు వీరుమావారుకారు అని విమర్శించినట్టు విమర్శించకయే లోకమందెల్లభూతములను సుఖపెట్టు నుద్దేశముతో వానికి సేవ చేయుచుండును.

> అయ ముత్తమోఽయ మధమో జాత్యా రూపేణ సంపదా వయసా ।
> శ్లాఘ్యోఽశ్లాఘ్యో వేత్థం న వేత్తి భగవా ననుగ్రహావసరే ॥
> అన్తస్సభావభోక్తా యతో న్తరాత్మా యథా మహామేఘః ।
> ఖదిర శ్చమ్పక ఇతి వా ప్రవర్షణే కిం విచారయతి ॥
>
> (బోధసుధాకరము)

గొప్ప మేఘము వర్షింపబోవునపు డిది చంద్రచెట్టుగాన దీనిమీద వర్షించ కూడదు, ఇది సంపెంగచెట్టు గాన దీనిమీద వర్షించవచ్చును అని ఆలోచింపక యన్నిటిమీదనును సమానముగా నిష్పక్షపాతముగా నెట్లు వర్షించునో, అట్లు సకల ప్రాణులయొక్క యంతర్యామిగా నుండునదియు సర్వసమము నైన బ్రహ్మము (ఈశ్వరుడు) తానెవరినైన ననుగ్రహించు నవసరమున వీడు జాతియందు గాని రూపమునందు గాని ఐశ్వర్యమునందు గాని వయస్సునందు గాని యుత్తముడని కొనియాడదగిన వాడు గాన వీని రక్షించెద, వీడు జాత్యాదులయందు అధముడును నిందింపదగిన

వాడును గాన వీని సంరక్షింపను అనకయు వైషమ్యమును చూపకయు నందఱినిని సమముగా రక్షించునుగదా. అదే విధముగా బ్రహ్మభూతుడును ప్రసన్నాత్ముడు నైన యోగి సర్వసమత్వము నభ్యసించవలయును.

మార్గత్రయముపైకి దుఃఖసాధ్యమగు జ్ఞానయోగము అభ్యాసమునకు కఠినమైనను కఠినమార్గమున నడువగల శక్తి గలవారే ఈ మార్గము నవలంబింతురు. మనుష్యులస్వభావము ననుసరించి దృఢప్రయత్నము చేయువారును ఇడుములు వచ్చినపుడు ధైర్యము విడువనివారును నైన దృఢచిత్తులకే గదా ఈ జ్ఞానయోగము సాధ్యము. కొండ నెక్కుటకు సులభమైనత్రోవ లనేకము లున్నను అట్టి సులభములైన త్రోవలుగుండా ఎక్కుటకు చాల అవకాశము కావలసియుండును గనుక నిదానించుట కిష్టము లేని దృఢగాత్రులు ఎక్కుటకు కష్టమైన సమీపమైన త్రోవగుండా గుండ్లెక్కి దుమికి శ్రమపడియైనను కొండనెక్కుట అను ప్రయాణమును స్వల్పకాలమునందే ముగించునట్లుగా జ్ఞానమార్గమును అనుసరించువారు శ్రమలకు జడియరు. కనుకనే “జ్ఞానీత్వాత్మైవమే మతం” అని శ్రీ కృష్ణభగవానులు సెలవిచ్చిరి.

## భక్తియోగము

సీ॥ శ్రుత్యంతవిశ్రాంతమత్యనుక్రమణీయభగవత్ప్రసంగతుల్ భాగవతులు।
సకలసన్ముఖయోగిజన సదానందైకపరమభాగ్యోదయుల్ భాగవతులు।
కృష్ణపదధ్యానకేవలామృతపానపరిణామయుతులు శ్రీభాగవతులు।
బహుపాతకానీకపరిభవప్రక్రియాపురుషాగ్రమూర్తులు భాగవతులు।

మోక్షమార్గత్రయము—భక్తియోగము

గీ॥ భావతత్త్వార్థవేదులు భాగవతులు।
బ్రహ్మవాదానువాదులు భాగవతులు।
సిరులు దనరంగ నెన్నడు చేటులేని।
పదవి నొప్పారువారు వో భాగవతులు॥

శ్రీ కృష్ణులవారు ఉద్ధవున కుపదేశించిన విధమున మోక్షమార్గములు మూడింటిలో భక్తియోగము ఒకటి. అంతే కాదు. కర్మయోగములోనును జ్ఞానయోగములోనును కలిసి సకామకర్మలను నిష్కామకర్మలుగా మార్చతగినది భక్తియే. జ్ఞానమును పుట్టించి జ్ఞానయోగాచరణమునందు స్థిరముగా నిలుపునదియు భక్తియే.

యస్య ప్రసాదేన విముక్తసంగాః శుకాదయ స్సంసృతిబంధముక్తాః।
తస్య ప్రసాదో బహుజన్మలభ్యః భక్త్యేకగమ్యో భవముక్తిహేతుః॥
(సర్వవేదాంతసిద్ధాంతసారసంగ్రహః)

ఏమహానుభావుని ప్రసాదమువల్ల సంగములను వదులుకొని శుకాదులు సంసారబంధవిముక్తులైరో ఆ మహానుభావుని ప్రసాదము అనేకజన్మములయందు చేయుచువచ్చిన భక్తియొక్క ఫలమే. అదే సంసారబంధముక్తికి కారణము.

ఆత్మారామా శ్చ మునయః నిర్గ్రంథా అ ప్యురుక్రమే।
కుర్వం త్యహైతుకీం భక్తిం ఇత్థం భూతగుణో హరిః॥
(శ్రీమద్భాగవతము, స్కం. ౧, అధ్యా. ౭, శ్లో. ౧౦)

ధీరులు నిరపేక్షులు నా। త్మారాములు నైన మునులు హరిభజనము ని।
ష్కారణము జేయుచుందురు। నారాయణు డట్టివాడు నవ్యచరిత్రా॥
(శ్రీ పోతనామాత్యులు)

మునులు నిర్గుణబ్రహ్మధ్యాననిష్ఠులైయు హృదయగ్రంథుల బో గొట్టుకొనియు నద్భుతశక్తిమంతుడైన భగవంతునందు నిర్హేతుక మైన భక్తిని ఆచరించుచుందురు. కనుక ఇట్టి ప్రభావముగలవాడు శ్రీమన్నారాయణమూర్తి యని అర్థము.

భక్తియోగము అజ్ఞులు మొదలు ప్రాజ్ఞులవరకును ఎల్లరు అభ్యసించదగినది.

భక్తిని కొన్ని గ్రంథములయందు వర్ణించిన వివరము ఏమనగా

౧. ద్రవీభావపూర్వికా మనసో భగవదాకారరూపా భక్తిః ॥

౨. భజతే భగవదాకారం అనయా అంతఃకరణం ఇతి భక్తిః ॥

౩. ద్రుతస్య భగవద్ధర్మా ద్ధారావాహికతాం గతా ।
సర్వేశే మనసో వృత్తి భక్తి రిత్య భిధీయతే ॥

౪. సా త్వస్మిన్ పరమప్రేమరూపా ॥

౫. భజ సేవాయాం ॥

౬. భజ ఇత్యేష వై ధాతుః సేవాయాం పరికీర్తితా ।
తస్మా త్సేవా బుధైః ప్రోక్తా భక్తిస్సాధనభూయసీ ॥

౭. మహాత్మ్యజ్ఞానపూర్వక దృఢప్రేమా ॥

జీవాత్మ పరమాత్మయొక్క అంశ అను విషయమును ధృఢముగా తెలిసికొనినయెడల భక్తి యను విషయము వివరముగా అవగాహన అవును. ముండకోపనిషత్తునందు చెప్పిన ప్రకారము మహాప్రకాశ ముతో జ్వలించుచున్న అగ్నియొక్క జ్వాలలనుండి గాలిచే వేఱు పరుపబడిన మిణుగురులు ఏ విధముగా అగ్నియొక్క సహజగుణము

లైన తేజస్సు ఉష్ణము అను స్వభావములను కలిగియుండునో అదే ప్రకారము పరమాత్మయొక్క అంశలైన జీవాత్మలకు కూడ ఈశ్వరుని గుణములైన సత్ చిత్ ఆనందము అను గుణములు యత్కించిత్తుగా కలవు.

ఈశ్వరుని గుణములగు సత్ చిత్ ఆనందములు గల జీవులు ప్రకృతి సంబంధములైన శరీరములయందు ప్రవేశించి తమయొక్క నిజస్వభావమును తాము మరచియున్నను తమకే తెలియక యే నిర్హేతుకముగానో అన్నట్లు జీవాత్మలకు పరమాత్మయందు ఒక విధమైన అనురాగము కలుగును. ఆ అనురాగమువల్ల ఆ పరమాత్మను చెందవలెనని ఆశ కలుగును. పరమాత్మను చెందుట అనుటకు మోక్షము అని పేరు. పైనచెప్పిన అనురాగమునకు భక్తియని పేరు. అనురాగమునకు 'ప్రేమ' అని మరియొక పేరు కలదు. నారదసూత్రములయందు "సా త్వ స్మిన్ పరమప్రేమరూపా" అని భక్తిని వర్ణించియున్నారు. సా=భక్తియనగా, అస్మిన్=పరమాత్మయందు, పరమప్రేమరూపా=అత్యంతమైన అనురాగరూపమైనది అని యర్థము. పరమప్రేమ యేల కలిగినది అనగా పరమాత్మయొక్క మాహాత్మ్యజ్ఞానము కొంచెముగా జీవాత్మకు లభించుచువచ్చినందున కలిగినది. జీవాత్మ తాను కించిత్ శక్తికలవాడనియును మహాశక్తిగల పరమాత్మయు తానును ఏక స్వభావులయ్యును తనకును పరమాత్మకును తారతమ్య మతిగానుండు వివరమును శ్రవణమననములవల్ల తెలిసికొని మహాశక్తికలిగి 'గతి ర్భర్తా ప్రభుః సాక్షీ నివాస శ్శరణం సుహృత్' అని వర్ణింపబడిన పర

మాత్మను తెలిసికొనుటకు ఆశకలిగినందున, మాహాత్మ్యము కల పరమాత్మయందు పరమ ఆశ్చర్యమును అందును అనుసరించి ప్రేమయు కలుగును.

జీవాత్మలకు రెండుస్వభావములు గలవు. ఈ స్వభావములనే ద్వంద్వములు అని శాస్త్రములయందు చెప్పుదురు. ఈ ద్వందములు ఇచ్ఛాద్వేషములు అనునవి. ఇచ్ఛ యనగా స్నేహము. ద్వేషము అనగా స్నేహ అభావము. దీనినే మరియొక విధముగా చెప్పవచ్చును. ఇచ్ఛాద్వేషములు అనగా సన్నికర్ష విప్రకర్షములు. సన్నికర్షము అనగా నొక వస్తువు మరియొక వస్తువును చేరదీయుట. విప్రకర్ష మనగా నొక వస్తువు మరియొక వస్తువును దూరాన తొలగించియుంచుట. ఆంగ్లేయభాషయందు ఈ రెండు గుణములను "Attraction, Repulsion" అందురు. ఇచ్ఛ సన్నికర్షము. ద్వేషము విప్రకర్షము.

భక్తియనునది సన్నికర్షస్వభావమునకు చేరినది. లోకము నందంతట ప్రతిమనుష్యునికిని అధికులు, సమానులు, తక్కువ వారు నుందురు.

పైనచెప్పిన సన్నికర్షస్వభావము మూడువిధములుగా నన్వయించును. తనకన్న నుత్తములయందు అన్వయించునపుడు, సన్మానము, పూజ, నమ్రత, భక్తి యనబడును. తనతోసమానుల కన్వయించినపుడు స్నేహము, ప్రేమ అనబడును. తనకంటె తక్కువైనవార్లయం దుపయోగించినపుడు కృప, కటాక్షము, దయ, కనికరము అనబడును. కనుక సన్నికర్షావస్థకు సంబంధించి ఉత్తముల విషయమందు అన్వయించునది భక్తి యని యెఱుగ వలయును, సాధారణముగా తనకంటె నెక్కువైన వారలను గాక

మోక్షమార్గత్రయము—భక్తియోగము-తామస రాజస సాత్త్విక భక్తులు

తనకు చాల అధికులగు గురువులవారికి గాని ఇష్టదైవమునకు గాని సన్నికర్షస్వభావము అన్వయింపబడునెడల అట్టి సన్నికర్షావస్థను భక్తి, దాస్యము, ఆత్మనివేదనము అనదగును. భక్తియం దెపుడుగాని పరహింస అసంగతము. హింస అంతయు విప్రకర్షావస్థకు సంబంధించినది. కనుక దైవభక్తులు తమ మతము గాక నితర మతస్థులను ద్వేషించునపుడు భక్తివల్ల ద్వేషము పుట్టిన దనుట అసంగతము. అట్టిభక్తి భక్తికాదు. అది ద్వేషము.

ఈ మూడు తరగతులలో తగ్గినవాడు ఉన్నతపురుషుని యందు చూపునట్టి సన్నికర్షముయొక్క గుణమునకు భక్తియని నామధేయము అని నొక్కి చెప్పబడియె. సన్నికర్షము ప్రేమయే కదా. అత్యంతసన్నికర్షము పరమప్రేమ. అత్యంత సన్నికర్షమే ఐకమత్యము. ఐకమత్యమే సమానైశ్వర్యత్వము. సమానైశ్వర్యము సాయుజ్యమునకు క్రిందిపదవి. సమానైశ్వర్యత్వము, సాయుజ్యము ఈ రెండును మోక్షపదవియందలి భేదములు.

భక్తినిగురించి శ్రీమద్భాగవతము తృతీయ స్కంధమునందు కపిలమహాముని యుపదేశించిన విషయములు సంగ్రహముగా వ్రాయబడును.

మనుష్యకోటియందు స్వభావభేదములు అనేకములు. గుణభేదములును అట్లే. ఈ రెంటినిపట్టి అభిప్రాయములును భేదములే అగును. ఇట్టివారు భక్తిననుష్ఠించునపుడు ఉపాధిభేదంబునుబట్టి భక్తి అనేకవిధములయ్యె. ముఖ్యముగా భక్తి రెండు విధంబులు. ౧. నిర్గుణ భక్తి. ౨. సగుణభక్తి అని. ఇందులో సగుణభక్తి

మొట్టమొదట మూడు విధములు. ౧. తామసభక్తి. ౨. రాజసభక్తి. ౩. సాత్త్వికభక్తి అని.

తామసభక్తియనగా హింసజేయు నుద్దేశముతోనైనను, దంభమునుచూపు నుద్దేశముతోనైనను, మత్సరస్వభావముతోనైనను, క్రోధియగుచు భేదబుద్ధితో చేయబడు భక్తి.

రాజసభక్తియనగా విషయసుఖమును గోరియైనను కీర్తిని గోరియైనను ఐశ్వర్యమును గోరియైనను భేదబుద్ధితో ప్రతిమాదులను అర్చించుట.

సాత్త్వికభక్తియనగా పాపక్షయార్థమో, పరమేశ్వరప్రీత్యర్థమో, శాస్త్రములలో చెప్పియున్నందుననో భేదబుద్ధితో చేయబడుభక్తి. తామసభక్తి, రాజసభక్తి, సాత్త్వికభక్తి యీ మూడింటియందును మూడేసి జాతులుగలవు.

| | |
|---|---|
| సాత్త్వికభక్తి | ౧. పాపక్షయార్థము |
| | ౨. ఈశ్వరప్రీత్యర్థము |
| | ౩. శాస్త్రములలో చెప్పినందున |
| రాజసభక్తి | ౧. విషయసుఖమునకుగా |
| | ౨. కీర్తిచెందుటకుగా |
| | ౩. ఐశ్వర్యమును పొందుటకుగా |
| తామసభక్తి | ౧. హింసించుటకు |
| | ౨. దంభమును చూపుటకు |
| | ౩. మత్సరముతో |

మూడింటను చెరి మూడేసి అంశములు కలవు. కనుక ఒట్టుకు తొమ్మిది విధములగు ఉద్దేశములు కలవు. ఇవి గౌణవిభాగములు.

మోక్షమార్గత్రయము—భక్తియోగము-నవవిధభక్తులు

మరియొకవిధమున తొమ్మిది తెగలగా భక్తి అభ్యసింపబడుచున్నది. ఇవి భక్తియందు వేరు వేరు మెట్లు అని చెప్పవచ్చును. ౧. శ్రవణము. ౨. కీర్తనము. ౩. స్మరణము. ౪. పాదసేవనము. ౫. అర్చనము. ౬. వందనము. ౭. దాస్యము. ౮. సఖ్యము. ౯. ఆత్మనివేదనము. ఇందులో ఆత్మనివేదనము తక్క మిగిలినవన్నియు గౌణభక్తులనబడును.

శ్రవణం కీర్తనం విష్ణోస్స్మరణం పాదసేవనం ।
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనం ॥
(శ్రీమద్భాగవతము, స్క. ౭, అధ్యా. ౫, శ్లో. ౨౩)

హరికథాశ్రవణము, హరిమాహాత్మ్య కీర్తనము, హరినామ స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము అని భక్తి నవవిధములుగా నుండును.

౧. శ్రవణము. శ్రీహరియొక్క గుణకర్మలను వినుట. ఇట్లు వినుటకు సత్సాంగత్య ముండవలయును. సత్సాంగత్యమును గురించి ఇకముందు వ్రాయబడును. శ్రద్ధావంతుడై సత్సాంగత్యమున్న యెడల భగవత్కథా శ్రవణము లభించుట సులభము.

శ్రవణమునకు పూర్వము కొంతమట్టుకు ఐహికవిషయముల యందువిరక్తి కలిగియుండవలయును. దుఃఖములు సంభవించినపుడు విరక్తి కలుగుటకు వీలుకలదు. శ్రీమద్భగవద్గీతలయందు "ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ" అను నాలుగు తెగలయందలి సుకృతపురుషులు భక్తి చేయువారని చెప్పబడియున్నది. ఆర్తుడనగా బాధలు పడి దైన్యముచెందినవాడు. దైన్యముచెందినపుడు బలవంతుని ఆశ్ర

యించుట సహజమే కదా. బలవంతులను ఆశ్రయించుట అనునదే సుకృతఫలము. బలవంతులని వినియుండిన యెడల వారల నాశ్రయించుట సులభము. కనుక శ్రవణము అను భక్తి అవశ్యము.

ఇత్థం పరస్య నిజధర్మరిరక్షయాత్త లీలాతనో స్తదనురూప విడంబనాని ।
కర్మాణి కర్మకషణాని యదూత్తమస్య శ్రూయాదముష్యపదయోరనువృత్తి మిచ్ఛన్ ॥

మర్త్యస్తయాను సవమేధితయానువృత్త్యా శ్రీమత్కథాశ్రవణ మంగళ కీర్తన చింతయైతి । తద్ధామ దుస్తరకృతాంత జవాపవర్గం గ్రామాద్వనం క్షితిభుజోపి యయుర్యదర్థాః ॥

(శ్రీమద్భాగవతము, స్కం. ౧౦, అధ్యా. ౯౦.)

భాగవతము, దశమస్కంధమునందు వివరించిన రీతిగా ఎప్పుడెప్పుడు లోకమునందు ధర్మము నాశమొందునో అప్పుడంతయు తానవతరించి భూభారమును తగ్గించు ధర్మమును అవలంబించిన భగవంతుని లీలను వినినవారియొక్క పాపములు నాశంబగును. భగవంతుని మాహాత్మ్యమును వినుటయొక్క ప్రయోజన మేమనగా వారు నడిచినట్టుగా మనమును నడువవలెనని ప్రయత్నించుట. శ్రీ కృష్ణకథాశ్రవణము వల్లనును, శ్రీకృష్ణునియొక్క మంగళకరమయిన కీర్తనమువల్లనును, స్మరణము వల్లనును, భక్తి పెంపొంది మెట్టుమెట్టుగా నెక్కి ఆత్మనివేదనము అను భక్తిగా మారుటకు అర్హమగును. ఇట్లు శ్రవణకీర్తన స్మరణములను ఆచరించినందుకు ప్రయోజనముగా భగవత్పాదసేవ చేయవలయును. భగవంతుని పాదమనగా లోకము—“ పాదోస్యవిశ్వా భూతాని ” యని శ్రుతి వాక్యమున్నది. భగవత్స్వరూపమైన లోకమును సేవించవలయును.

మోక్షమార్గత్రయము—భక్తియోగము-నవవిధభక్తులు

శ్రవణము అను భక్తిని అనుష్ఠించుచు అంతకుపైమెట్టైన కీర్తనము నభ్యసించవచ్చును. కీర్తనమనగా నామస్మరణ అని లోకమందు వాడబడు చర్యగానుండవచ్చును. లేక లోకులకు భగవంతుని మాహాత్మ్యమును తెలుపుటగా నుండవచ్చును. హరినామ కీర్తనము అజామిళోపాఖ్యానమునందు ఈ దిగువ కనుపరిచిన రీతిగా వర్ణింపబడియున్నది.

సీ ॥ బ్రహ్మహత్యానేక పాపాటవుల కగ్నికీలలు హరినామకీర్తనములు ।
గురుతల్పకల్మష క్రూరసర్పములకు గేకులు హరినామకీర్తనములు ।
తపనీయచౌర్యసంతమసంబునకు సూర్యకిరణముల్ హరినామకీర్తనములు ।
మధుపానకిల్బిషమదనాగసమితికి గేసరుల్ హరినామకీర్తనములు ।

గీ ॥ మహితయోగాగ్రనిత్యసమాధివిధుల ।
నలరుబ్రహ్మాది సురులకు నందరాని ।
భూరినిర్వాణ సామ్రాజ్యభోగభాగ్య ।
ఖేలనంబులు హరినామ కీర్తనములు ॥

సీ ॥ ముక్తికాంతైకాంత మోహనకృత్యముల్ కేలిమై హరినామకీర్తనములు ।
సత్యలోకానంద సౌభాగ్యయుక్తముల్ కేలిమై హరినామకీర్తనములు ।
మహితనిర్వాణసామ్రాజ్యాభిషిక్తముల్ కేలిమై హరినామకీర్తనములు ।
బహుకాలజనిత తపఃఫలసారముల్ కేలిమై హరినామకీర్తనములు ।

గీ ॥ పుణ్యమూలంబుల నపాయపోషకంబు ।
లభిమతార్థంబు లజ్ఞానహరణకరము ।
లాగమాంతోపలబ్ధంబు లమృతసేవ ।
లాతతశుభములు హరినామకీర్తనములు ॥

ముఖ్యముగా కీర్తనము అను భక్తిని అభ్యసించుట ఇతరులకు భగవన్మాహాత్మ్యమును తెలియజెప్పుట అని యెరుగవలయును.

అహం సర్వస్య ప్రభవో మత్త స్సర్వం ప్రవర్తతే ।
ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః ॥
మచ్చిత్తా మద్గతప్రాణాః భోధయంతః పరస్పరం ।
కథయంత శ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ ॥

(శ్రీ భ. గీ., అధ్యా. ౧౦, శ్లో. ౮-౯)

వాసుదేవుం డను వ్యవహార నామధేయంబున నెఱుంగంబడు నేను సర్వజగత్తులకును ఉత్పత్తికారణము (ఉపాదానకారణము, నిమిత్తకారణము కూడ) అనియు, స్థితి, నాశము అను చర్యలుకూడ నావల్లనే జరుగుచున్నవి అనియు, అంతర్యామినై సర్వభూతముల ప్రేరేపించు నందున వాని వాని మర్యాదను అతిక్రమించకయే భూతములు వర్తించుచున్నవనియు పండితులు నిశ్చయముగా తెలిసికొని నా మాహాత్మ్యజ్ఞానపూర్వక ప్రేమతో నన్ను భజించుచున్నారు. ఆ భజనము ఏవిధముగా జరుగుననగా మచ్చిత్తాః, తమ చిత్తమును నాయందు ప్రవేశపెట్టియు మద్గతప్రాణాః, తమయొక్క చక్షురాది ఇంద్రియములను నా సేవకొఱకే ఉపయోగించుచు

సీ ॥ కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ ।
సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము ।
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరిఁదవిలిన మనము మనము ।
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి ।

మోక్షమార్గత్రయము—భక్తియోగము-నవవిధభక్తులు

తే ॥ దేవదేవుని జింతించు దినము దినము ।
చక్రహస్తుని బ్రకటించు చదువు చదువు ।
కుంభినీధవుని జెప్పెడు గురుడు గురుడు ।
తండ్రి హరిఁజేరు మనియెడి తండ్రి తండ్రి ॥

(పోతనామాత్య, ౭ స్కంధము)

భగవంతుని భజించుటకుగానే చూపు మొదలగు ఇంద్రియ వ్యాపారముల నుపయోగించువారు, లేక, భగవంతుని భజియించ వలెనను నుద్దేశముతోనే జీవించియుండువారు; మఱియు విద్వత్సభల యందు భగవంతునే బోధించువారును. పూర్వకాలమందు సత్త్రి యాగమని యొక సభకూడుచుండును. ఆ సభకు మహాశీలవంతు లును మహాపండితులును మహాభక్తులునగు శిష్టులు వత్తురు. వా రందఱును ఒక్కొక్కరును సమానపాండిత్యము గలవారైనను సర్వ జనసమ్మతముగా తమలో నొకరిని అగ్రాసనాధిపత్యమునందుంచి వారి యాజ్ఞకు లోబడి తమ తమకు గల సందేహములను పరస్పర ము "తత్త్వబుభుత్సుకథయా" చెప్పుకొని సందేహములను తీర్చు కొందురు. అంతేగాని తమ పాండిత్యమును ప్రకటించు కొఱకుగా వాదించరు. ఆ విధముగా "బోధయంతః పరస్పరం" అనియు కథయంతశ్చ తమ శిష్యులకు నన్నే (భగవంతుని మాహాత్మ్యము నే) ఉపదేశించుచును, నాయందు (భగవంతునందు) చిత్తసమర్పణ ము (అంతరింద్రియార్పణము), జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను కూడ అర్పణముచేసి తమ సమానులయందు అన్యోన్యముగా నా మాహాత్మ్యబోధనము చేయుచును, తనకంటె తక్కువైనవారలకు

భగవత్కథా శ్రవణము చేయించుచును సంతోషింతురు. మఱియు ఆనందము చెందుదురు.

ఈ రెండు శ్లోకములయందును స్మరణభక్తియును, కీర్తన భక్తియును చెప్పబడియున్నవి.

> సతతం కీర్తయంతో మాం యతంత శ్చ దృఢవ్రతాః ।
> నమస్యంత శ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే ॥
>
> (శ్రీ భ. గీ., అధ్యా. ౯, శ్లో. ౧౪)

ఈ శ్లోకము జ్ఞానులాచరించు భక్తిని వర్ణించునది. అయినను ఇంద్రియనిగ్రహము, దయ, అహింస మొదలగు సాధనములయందు సన్నాహముచేయుచు శ్రద్ధాపూర్వకముగా నన్ను (పరబ్రహ్మస్వరూపుడు వాసుదేవాఖ్యుడునైన నన్ను) ఎల్లపుడును స్మరించుచున్నవారును (స్మరణభక్తి, కీర్తనభక్తి), చలింపక బ్రహ్మచర్యాది వ్రతములను అనుష్ఠించుచు భక్తినిచేసి నన్ను తృప్తి చెందించుటకుగా యతంతః ప్రయత్నించువారును (పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, ఆత్మనివేదనము అను భక్తులననుష్ఠించువారును), హృదయమునందు నమస్కరించువారును నయి సేవించుచున్నారు.

జ్ఞానోదయమునకు కారణభూతమైనది సాధనభక్తియనబడును. సాధనభక్తిని అనుష్ఠించు సమయమందును, సాధ్యభక్తి లేక పరాభక్తి అను జ్ఞానోదయాత్పరము అనుష్ఠించు భక్తియందును, పై ప్రస్తావించిన శ్లోకముయొక్క అర్థము అన్వయించును.

ఆత్మనివేదనము

శ్రీవామనమూర్తికి బలిచక్రవర్తి తన సర్వస్వములను తనను అర్పించుకొనెను.

మోక్షమార్గత్రయము—భక్తియోగము-శరణాగతి

ఇత్థం స నిశ్చిత్య పితామహో మహా అగాధబోధో భవతః పదాంబుజం ।
ధ్రువం ప్రపేదే హ్యకుతోభయం జనాద్భీత స్స్వపక్షక్షపణస్య సత్తమః ॥
అథా హ మప్యాత్మరిపో స్తవాంతికం దైవేన నీతః ప్రసభం త్యాజితశ్రీః ।
ఇదం కృతాంతాంతికవర్తి జీవితం యయా ధ్రువం స్తబ్ధమతి ర్న బధ్యతే ॥
(శ్రీమద్భాగవతము, స్కం. ७, అధ్యా. ౨౨)

హరిపాదారవిందములనే నమ్మినవానిని భగవంతుడు కాపాడును.

స్వపాదమూలం భజతః ప్రియస్య త్యక్తాన్యభావస్య హరిః పరేశః ।
వికర్మ యచ్చోత్పతితం కథంచిత్ ధునోతి సర్వం హృది సన్నివిష్టః ॥
(శ్రీమద్భాగవతము, స్కం. ౧౧, అధ్యా. ౬)

అన్యులను వదిలి తన పాదమూలము నాశ్రయించిన భక్తునకు ఎన్నడై నను కర్మభ్రష్టత్వము కలిగినను పరమేశ్వరుండైన హరి తాను అతని హృదయాంతర్వర్తి గనుక మాలిన్యజాలమును తొలగ గొట్టును.

ఇట్టి స్వాత్మనివేదనము తనయొక్క సర్వాంగములును సర్వేంద్రియములును చక్కని స్థితియందుండునపుడే సలుపవల యును. స్వాత్మనివేదనమునే కొందరు శరణాగతియనియు వర్ణింతురు. శరణాగతియందు ఏమాత్రమైనను స్వప్రయోజనముండ కూడదు. ఆత్మనివేదనమును శరణాగతియు లోకసేవార్థముగా జరుపవలసినదేగాని పృథగ్భావముతో తాను భగవంతునికి సమీపమందుండు వాడు అను ఆశతో చేయకూడదు.

శరణాగతి శ్లోకములు

దుర్వాసనా మమ సదా పరికర్షయంతి చిత్తం శరీర మపి రోగగణా దహంతి । సంజీవనం చ పరహస్తగతం సదైవ తస్మా త్త్వమేవ శరణం మమ శంఖపాణే ॥

పూర్వం కృతాని దురితాని మయా తు యాని స్మృత్వాఖిలాని హృదయం పరికమ్పతే మే । ఖ్యాతా చ తే పతితపావనతా తు యస్మా త్తస్మా త్త్వమేవ శరణం మమ శంఖపాణే ॥

నీచోపి పాపవలితోపి వినిందితోపి బ్రూయా త్తవాహమితి యస్తు కిలైకవారం । తం యచ్ఛసీశ నిజలోక మితి వ్రతం తే తస్మా త్త్వ మేవ శరణం మమ శంఖపాణే ॥

వేదేషు ధర్మవచనేషు తథాగమేషు రామాయణేపి చ పురాణ కదంబకే వా । సర్వత్ర సర్వవిధినా గదిత స్త్వమేవ తస్మా త్త్వమేవ శరణం మమ శంఖపాణే ॥

సర్వాంతర్యాం ప్రభవతిజనః సంసృతి ప్రాప్తమా గశ్చేతశ్శ్వాసప్రశమ సమయే త్వత్పదాబ్జే నిధాయ । తస్మిన్ కాలే యది మమ మనో నాథ దోషత్రయార్తం । ప్రజ్ఞాహీనం పురహర భవే త్తత్కథం మే ఘటేత ॥

ప్రాణోత్క్రాంతి వ్యతికరదళత్సంధిబంధే శరీరే ప్రేమావేశప్ర సరదమిత క్రందితే బంధువర్గే । అంతఃప్రజ్ఞా మపి శివభజ న్నంతరాయై రనంతైః ఆవిద్ధోహం త్వయి కథమి మామర్పయిష్యామి బుద్ధిం ॥

అద్యైవ త్వత్పదనళినయో రర్పయామ్యంత రాత్మ న్నాత్మానం మే సహపరికరై రద్రికన్యాధినాథ । నాహం బోద్ధుం శివ తవ పదం న క్రియాయోగ చర్యాః కర్తుం శక్నో మ్యనితరగతిః కేవలం త్వాం ప్రపద్యే ॥

క్షంతవ్యం వా నిఖిలమపి మే భూతభావివ్యలీకం దుర్వ్యాపార ప్రవణమథవా శిక్షణీయం మనో మే । న త్వే వార్త్యా నిరతిశయయా త్వత్పదాబ్జం ప్రపద్య త్వద్విన్యస్తాఖిలగురు మముం యుక్త మీశ ప్రహాతుం ॥

భక్తివిషయమై నారదసూత్రములు, శాండిల్యసూత్రములు అను గ్రంథములు సూత్రప్రాయపువాక్కులతో గంభీరమైన అర్థము గలవిగా భక్తిని తెలియపరచునవి గలవు.

మోక్షమార్గత్రయము—భక్తియోగము—భక్తిసోపానములు

శ్రీమద్భాగవతము, ప్రథమస్కంధము, అయిదవ అధ్యాయమునందు శ్రీవేదవ్యాసులవారికి నారదమహర్షి భక్తినిగురించి వివరముగా చెప్పియున్నారు. ఆ అంశముయొక్క విమర్శ ఈ దిగువ వ్రాయబడుచున్నది. శ్రీమద్భాగవతము, స్కం. ౧, అధ్యాయము ౫ లో 33 వ శ్లోకముయొక్క వ్యాఖ్యానమునందు శ్రీధరులవారు "ప్రథమం మహత్సేవా, తతస్తత్కృపా, తతస్తద్ధర్మశ్రద్ధా, తతో భగవత్కథాశ్రవణం, అతో భగవతి రతిః, తయాచ దేహాద్వయ వివిక్తాత్మజ్ఞానం, తతో దృఢా భక్తిః, తతో భగవత్తత్త్వ విజ్ఞానం, తతస్తత్కృపయా సర్వజ్ఞత్వాదిగుణావిర్భావః" అని వ్రాసియున్నారు. నారదులు తన పూర్వజన్మంబున మహర్షులను సేవించినందున వారి యుపదేశంబున తనకు భక్తికలిగినదని చెప్పిరి. అందువల్ల పెద్దలసేవ మొదటి మెట్టు.

పెద్దలసేవవలన వారికి నారదులయం దనుగ్రహము కలిగినది. ఇది "తత్కృపా" అను రెండవ మెట్టు.

ధర్మవేత్తలగు మహర్షు లనుష్ఠించుచుండిన ధర్మంబులందు నారదులవారి మనస్సునకు ప్రేమబీజంబగు రుచి కలిగినదట. కనుక పెద్దలాచరించు ధర్మంబులయందు శ్రద్ధ (తతస్తద్ధర్మ శ్రద్ధా) కలుగుట మూడవమెట్టు.

నారదులవారు మహర్షులకు సేవచేయుచుండిన కాలమందు మహర్షులు చేయుచుండిన భగవత్కథలను వినుచుండిరి అని చెప్పబడియున్నది. కనుక భగవత్కథాశ్రవణము (తతో భగవత్కథా శ్రవణం) నాలుగవ మెట్టు.

ప్రతినిత్యమును భగవన్మాహాత్మ్యమును తెలుపుకథలను వినుచుండినందున శ్రీకృష్ణభగవానులయందు ప్రేమాంకుర మను రతి యుదయించెను. భగవంతునియందు రతి (అతోభగవతిరతిః) అయిదవ మెట్టు.

ఆ రతివల్ల " నేను ప్రపంచాతీతబ్రహ్మరూపుడను, నాయందు స్థూలసూక్ష్మరూపమగు ప్రపంచమంతయు నిజావిద్యామహిమకల్పితంబుగాని వాస్తవము కాదని చూచుచుండెదను" అని నారద మహర్షిగారు చెప్పిరట. అందువల్ల ఆత్మానాత్మజ్ఞానము కలిగినది. ఇది (తయాచ దేహద్వయ వివిక్తాత్మజ్ఞానం) ఆఱవ మెట్టు.

ఇందువల్ల భక్తి దృఢపడుట. (తతోదృఢా భక్తిః) ఇది ఏడవ మెట్టు.

నిత్యానురాగము, వినయము, శ్రద్ధ, ఇంద్రియనిగ్రహము, పరిచర్యయుం గలిగి క్షీణపాపుడై వర్తించుచున్న బాలుడైన నాయందు దీనవత్సలులైన నమ్మహామునులు భగవంతుడు తానే వారికి చెప్పిన పరమరహస్య మగు నీశ్వరజ్ఞానమును నాకుపదేశించిరి అని నారదమహర్షిగారు సెలవిచ్చినందున నీశ్వరజ్ఞానము (తతోభగవత్తత్త్వవిజ్ఞానం) అను ఎనిమిదవ మెట్టు.

ఇందుపైన "తతస్తత్కృపయా సర్వజ్ఞత్వాదిగుణావిర్భావః" అనునది తొమ్మిదవమెట్టు.

శ్రీమద్భాగవతంబునకు తెనుగున అర్థము వ్రాసిన బ్రహ్మశ్రీ వెంకటరంగశాస్త్రిలవారు ఈవిధంబున వ్రాసియున్నారు.
" ఇవ్విధంబున తొలుత సాధుసేవనంబు కలిగినం దాన తత్కరుణాలాభము, దానివలన ధర్మశ్రద్ధ, ఆశ్రద్ధవలన భగవత్కథాశ్రవ

మోక్షమార్గత్రయము—భక్తియోగము-భక్తిసోపానములు

ణంబు, దాన భగవదాసక్తి, యయ్యాసక్తివలన దేహద్వయ వివిక్తాత్మజ్ఞానంబు, ఆ జ్ఞానమున ధృఢభక్తి, ఆ భక్తివలన భగవ త్తత్త్వవిజ్ఞానంబు, దాన సర్వజ్ఞత్వాది భగవద్గుణావిర్భావం బును, క్రమమున గలుగు. భగవదర్పణముగ జేయబడు కర్మలు భక్తియోగసమన్వితంబైన జ్ఞానము నొదవించు. బాహ్యకర్మంబు లగు భోజనహోమదానతపంబు లెల్ల నాకర్పింపుమని భగవంతు డర్జునునకు పదేశించిన గీతార్థంబు తలపోసి తత్క్రమ మున కర్మలనాచరించువారు కృష్ణనామకీర్తన కృష్ణస్మరణా దులం జేసినవారగుదురు."

పైవివరించిన యెనిమిదవమెట్టు అయిన భగవత్తత్త్వవిజ్ఞానము కుదిరినయెడల భగవత్కృపవల్ల భగవంతుని శక్తులైన సర్వజ్ఞత్వాది గుణములు భక్తునియందు పుట్టుట సహజముగానుండును. ఇది తొమ్మిదవ మెట్టు.

౧. మహత్సేవా

శుశ్రూషా శ్రద్ధధానస్య వాసుదేవకథారతిః ।
స్యాన్మహత్సేవయా విప్రాః పుణ్యతీర్థనిషేవణాత్ ॥

(శ్రీమద్భాగవతము, స్కం. ౧, అధ్యా. ౨)

బ్రాహ్మణులారా? శ్రద్ధతో శుశ్రూష చేయగోరువానికి పుణ్య తీర్థస్నానము మొదలగువానివలన మహాత్ములసేవ లభించును. అందువలన భగవత్కథాశ్రవణమునం దభిలాషయు కలుగును.

నష్టప్రాయే ష్వభద్రేషు నిత్యం భాగవతసేవయా ।
భగవత్యుత్తమశ్లోకే భక్తి ర్భవతి నైష్ఠికీ ॥

(శ్రీమద్భాగవతము, స్కం. ౧, అధ్యా. ౨)

భాగవతులను సేవించుటవల్ల అమంగళకరములైన అరిషడ్వర్గము నశించిపోవును. ఉత్తమశ్లోకుడైన భగవంతుని యందు నిశ్చలమైన భక్తి పుట్టును.

సతాం ప్రసంగా న్మమ వీర్యసంవిదో భవంతి హృత్కర్ణరసాయనాః కథాః ।
తజ్జోషణా దాశ్వ పవర్గవర్త్మని శ్రద్ధా రతి ర్భక్తి రనుక్రమిష్యతి ॥

(శ్రీమద్భాగవతము, స్కం. ౩, అధ్యా. ౨౫)

సత్సంగమున భక్తులు (శ్రోతలు) హృదయమునకును చెవులకును రసాయనరూపముగా ననగా నింపుగా నా ప్రభావమును తెలియపరుచునట్టి కథలను వినగలరు. అందువలన త్వరలోనే అవిద్యానాశకంబులైన శ్రద్ధయు, ప్రేమయు, భక్తియు భగవంతునందు అభిరుచియు కలుగును.

తులయామ లవేనాపి న స్వర్గం నాపునర్భవం ।
భగవత్సంగిసంగస్య మర్త్యానాం కిముతాశిషః ॥

(శ్రీమద్భాగవతము, స్కం. ౪, అధ్యా. ౩౦)

స్వర్గసుఖముగాని మోక్షసుఖముగాని భగవద్భక్తుల సంగముతో సమానముగా నెన్నము. అట్లుండగా నితరభోగములను గురించి చెప్పవలయునా ?

యత్రేడ్యంతే కథామృష్టా తృష్ణాయాః ప్రశమో యతః ।
నిర్వైరం యత్ర భూతేషు నోద్వేగో యత్ర కశ్చన ॥

(శ్రీమద్భాగవతము, స్కం. ౪, అధ్యా. ౩౦)

మోక్షమార్గత్రయము—భక్తియోగము-భక్తిసోపానములు

భగవద్భక్తుల సంగము లభించెనేని అచ్చట « తృష్ణాప్రశమనంబు లైన మృష్టకథలు చెప్పబడుటచేత భూతంబులయందు వైరంబును ఉద్వేగంబును లేకుండును.''

దుర్లభో మానుషో దేహో దేహినాం క్షణభంగురః ।
తత్రాపి దుర్లభం మన్యే వైకుంఠప్రియదర్శనం ॥
(శ్రీమద్భాగవతము, స్కం. ౧౧, అధ్యా. ౨)

కొంతకాలమే జీవించియుండు స్వభావముగల మనుష్యదేహమును దేహులు పొందుట దుర్లభము. అట్టి మనుష్యదేహమును సంపాదించినందుకు ఫలము వైకుంఠప్రియులను (భగవద్భక్తులను) దర్శించుటయే.

వ్రతాని యజ్ఞశ్ఛందాంసి తీర్థాని నియమా యమాః ।
యథా వరుంధే త్సత్సంగ స్సర్వసంగాపహో హి మాం ॥
(శ్రీమద్భాగవతము, స్కం. ౧౧, అధ్యా. ౧౨)

ఏకాదశ్యుపవాసాదివ్రతములును, సోమయాగము మొదలగు యజ్ఞములును, వేదాధ్యయనాది విద్యలును, గంగాస్నానాది యాత్రలును, మరియు ననేకములగు తపస్సులు దానములు మొదలగునవి యును నన్ను వశీకరించుకొనవు. సత్పురుషులు నన్ను వశీకరించుకోవలెనని నయెడల నా సాంగత్యముగాని నా భక్తుల సాంగత్యము గాని చేయుచుండవలయును.

౨. తతస్తత్కృపా

ఇది పెద్దల అనుగ్రహమనబడును. పెద్దలను భక్తితో సమీపించినపుడు పెద్దలు శిష్యుల వృద్ధి కనుగుణముగా బోధింతురు.

జనన్యాభిహితః పంథాః స్స వై నిశ్శ్రేయసస్య తే ।
భగవాన్ వాసుదేవ స్తం భజ తత్ప్రవణాత్మనా ॥
ధర్మార్థకామమోక్షాఖ్యం య ఇచ్ఛే చ్ఛ్రేయ ఆత్మనః ।
ఏకం హ్యేవ హరే స్తత్ర కారణం పాదసేవనం ॥
(శ్రీమద్భాగవతము, స్కం. ౪, అధ్యా. ౮)

బాలకా, ధృవా, నీతల్లి నీకు చెప్పినమార్గము చాలమంచిది. ఆమార్గము ననుష్ఠించినయెడల నీకు శ్రేయస్సు కలుగును. భగవంతుడగు వాసుదేవుని భక్తితో ధ్యానింపుము. పురుషార్థములైన ధర్మార్థకామమోక్షములలో దేనిని కోరినను అది సిద్ధించుటకు హరిచరణసేవయే కారణము.

### 3. తత స్తద్ధర్మశ్రద్ధా

పెద్దల ఆచారములను బాలురు అనుసరించి నడుచుట మనకు తెలిసియున్నది. శిష్యుడు గురుభక్తిగలవాడై సాధువుల నాశ్రయించి నడుచునపుడు సాధువుల నడవళ్లు శిష్యుని ప్రయత్నము లేకనే అతనికి పట్టుపడును.

### ౪. తతో భగవత్కథాశ్రవణం

పిమ్మట కథాశ్రవణము. ఇది శ్రవణభక్తి.

సంసారసింధు మతిదుస్తర ముత్తితీర్షోః నాన్యః ప్లవో భగవతః పురుషోత్తమస్య । లీలాకథారస నిషేవణ మంతరేణ పుంసో భవే ద్వివిధ దుఃఖదవార్దితస్య ॥

అనేకవిధంబులైన దుఃఖంబు లను దావాగ్నిచే బాధింపబడుచుండి సంసారసాగరమును దాటతలచువానికి భగవత్కథాశ్రవణంబు దక్క నితరమైన ప్రాపు కానరాదు.

మోక్షమార్గత్రయము—భక్తియోగము-భక్తిసోపానములు

## ౫. అతోఽభగవతిరతిః

భగవత్కథాశ్రవణమువల్ల భగవంతునియందు అనురక్తి కలుగును. ३६౮ వ పుటయందుండు "సతాం ప్రసంగాత్" అను శ్లోకార్థమును చూడవలయును. మఱియు

భవాపవర్గో భ్రమతో యదా భవే జ్జనస్య తర్హ్యచ్యుత సత్సమాగమః। సత్సంగమో యర్హి తదైవ సద్గతౌ పరాపరేశే త్వయి జాయతే మతిః ॥

న కామయే న్యం తవపాదసేవనాత్ అకించనప్రార్థ్యతమాద్వరం విభో। ఆరాధ్య కస్త్వాం హ్యపవర్గదం హరే వృణీత ఆర్యో వర మాత్మబంధనం ॥

(శ్రీమద్భాగవతము, స్కం. ౧౦, అధ్యా. ౫౧)

సంసారంబునం జీవించుచు సంసారబంధ ముక్తికిగా ప్రయత్నపడు వానికి మొట్టమొదట లభించవలసినది సత్సమాగమము. సత్సంగప్రాప్త్యనంతరము సద్గతియును పరాపరేశుండవైన నీయందు భక్తియును కుదురును. తమపాదసేవకంటె వేరైన వరములను నేను కోరను. మోక్షదాతవైన తమను ఆశ్రయించినవాడు ఎవ్వడుగాని వేఱు వరంబులం గోరునే. త్వత్సేవకు వ్యతిరిక్తమైన ఏ వరము అయినను బంధకారణమే యని నా యభిప్రాయము అని ముచుకుందుడు శ్రీ కృష్ణులవారిని ప్రార్థించెను.

## ౬. తయాచ దేహద్వయ వివిక్తాత్మజ్ఞానం

అనగా స్వస్వరూపావబోధము. తా నెవ్వడు అను విచారమందు తాను పరమాత్మయొక్క అంశయే యని యనుభవసిద్ధము

గా తెలిసికొనుట. దీనికే జ్ఞానమని పేరు. ఇది భక్తివల్ల కలుగును.

పురే హ భూమన్ బహవోఽపి యోగిన స్త్వదర్పితేహా నిజకర్మలబ్ధయా ।
విబుధ్య భక్త్యైవ కథోపనీతయా ప్రపేదిరేంఽజోఽచ్యుత తే గతిం పరాం ॥

(శ్రీమద్భాగవతము, స్కం. ౧౦, అధ్యా. ౪)

ఓ పరమేశ్వరా, పూర్వకాలమందు ఈ లోకమందు అనేకులు కర్మయోగులు వారి కర్మలను తమకు అర్పించియు జ్ఞానంబు వడయలేక భక్తినభ్యసించి తద్ద్వారా జ్ఞానులైరి యని యర్థము.

౭. తతోదృఢాభక్తిః

భక్తివల్ల జ్ఞానము సిద్ధించినపిమ్మట జ్ఞానియాచరించు భక్తికి పరాభక్తియనియు, దృఢభక్తియనియు పేళ్లు. ఇది జ్ఞానపూర్వక భక్తి. ప్రహ్లాదుడు ఇట్టిభక్తిని అభ్యసించినవాడు.

న్యస్తక్రీడనకో బాలో జడవ త్తన్మన స్తయా ।
కృష్ణగ్రహగ్రహీతాత్మా న వేద జగ దీదృశం ॥

(శ్రీమద్భాగవతము, స్కం. ౭, అధ్యా. ౪)

ప్రహ్లాదుడు కుఱ్ఱవాడు, ఆటలాడవలసిన వయస్సుగలవాడైనను ఆటపదార్థములను విడిచి కృష్ణభగవాను లను గ్రహముపట్టినవాని వలె జడునివలె లోకమిట్టిదని యైనను గమనించడు.

౮. తతః భగవత్తత్త్వ విజ్ఞానం

దృఢమైనభక్తివల్ల ప్రేమ అధికమై భగవంతునియొక్క రహస్యమును తెలియుశక్తి భగవత్తత్త్వ విజ్ఞానం అను పరమా

త్మానుభవము. మఱియు విషయములందును వస్తువులయందును అసూయ.

ఇమం లోకం తథై వాము మాత్మాన ముభయాయినం ।
ఆత్మాన మనుయేచే హ యే రాయః పశవో గృహాః ॥
విసృజ్య సర్వా నన్యాం శ్చ మా మేవం విశ్వతో ముఖం ।
భజం త్యనన్యయా భక్త్యా తాన్మృత్యోర్యరతి పారయే ॥
(శ్రీమద్భాగవతము, స్కం. ౩, అధ్యా. ౨౫)

భక్తులు ఇహలోకసుఖములనును ఇంతకు పైలోకసుఖములనును ఇతర ఐశ్వర్యములనును హేయములని వర్జించి దేహాభిమానమును వదిలి పుత్రమిత్రకళత్రాదులయందు స్వార్థత విడిచి మమత్వము మాని సర్వజ్ఞుడును విశ్వతోముఖుండునైన భగవంతునే సుతసఖ గురుత్వాదిభావంబులచే ఇతర విషయములను కోరని భక్తితో నారాధింతురు. అటువంటిభక్తులను భగవంతుడు కాపాడును.

౯. తత స్తత్కృపయా సర్వజ్ఞత్వాది భగవద్గుణావిర్భావః

ఎనిమిదిమెట్లు ఇంతకుముందు వివరింపబడినవి. ఎనిమిది మెట్లను సాధించినవారికి తొమ్మిదవ మెట్టు అతిసులభసాధ్యము. భగవద్ధర్మములే భాగవతులయందు వ్యక్తములై యుండును. జడ భరతుడు, పరీక్షిన్మహారాజు, అంబరీషుడు మొదలగువారు ఇందుకు దాహరణములు.

శ్రీధరులవారు భాగవత వ్యాఖ్యానమునందు చెప్పిన నవ విధంబులైన భక్తిసోపానంబులను గురించి విచారించితిమి. భక్తి స్వరూపమేమని చక్కగా విచారించవలయును. భక్తులలో నతి

శ్రేష్ఠుండును భక్తిరూపుడునైన నారదమహర్షి లోకోపకారార్థము గా లోకులకిచ్చిన భక్తిసూత్రములయందు "సాత్వస్మిన్ పరమ ప్రేమరూపా" అని చెప్పబడియున్నది. ఇచ్చట మూడుపదములు గలవు. ౧. అస్మిన్. ౨. పరమప్రేమ. ౩. సా అనునవి. ఈ పదములయొక్క గూఢార్థములను విచారించవలయును. అస్మిన్ అనగా నితనియందు అని యర్థము. ఇత డెవ్వడు? జ్ఞాన మార్గము నందు జ్ఞాని యెవ్వని చేరవలెనని యిచ్ఛయించెనో అతడే యితడు. జ్ఞానియొక్క ఉద్దేశమునకును భక్తునియొక్క ఉద్దేశమునకును వస్తుతః వ్యత్యాసమేమియు లేనట్లున్నను వ్యత్యాస ముండుట యేమో నిశ్చయము. ఆ వ్యత్యాసము బలవత్తరమైనది.

జ్ఞానమార్గమునను సరించువాడు అక్షరమనిర్దేశ్యం, అవ్యక్తం, అచలం, ధృవం అను పదములచే నెఱుగబడు వస్తువును పొందగోరు చున్నాడు. సాధనచతుష్టయసంపత్తిని పొందిన పిమ్మట పట్టుదలతో జ్ఞానాభ్యాసమును చేయుచువచ్చినందున జ్ఞానియై ఆత్మవస్తువును పొందుచున్నాడు. ఇది అవ్యక్తోపాసనము అనదగును. సోహంభావ మును అభ్యసించి "యేత్వక్షరమనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే। సర్వత్రగమచింత్యంచ కూటస్థమచలం ధృవం॥" అను శ్లోకమునకు విషయమైన నిరాకారమైన అవ్యక్తమును పొందుచున్నాడు. భక్తుడైతేనో నిరాకారరూపమును విషయీకరించుట తనకు సా ధ్యము కాదని నరాకారరూపుడై వ్యక్తుడైన భగవంతుని ఆరా ధించుట కారంభించును. "నరాకార రూపం నిరాకారమాద్యం" "పరేశం పరానంద రూపం వరేణ్యం" అని యెఱుగబడు భగవం తుని గమనించి, పూజించి, ధ్యానించి, సేవించి, ప్రేమించి, తన్మయత

చెందును. సర్వాధికుడైన యీశ్వరుడే భక్తులయందలి యనుగ్రహంబుతో శరీరంబును ధరించి, వ్యక్తుడైన "ఏకం నిత్యం" మొదలగు విశేషణములచే నెఱుంగంబడు వస్తువే అని యెఱుగనగును. భక్తిని అభ్యసించ గోరువారికి వాస్తవముగా నొక పరిచ్ఛిన్న వ్యక్తియే విషయము గావలెను. అవ్యక్తము విషయమగుట శక్యము గాదు. ప్రపంచనాథుడు, ఈశ్వరుడు, సర్వాధికుడు నగు పరమాత్మ అవ్యక్తదశనుండి వ్యక్తీభావముపొందును. స్వయముగా సర్వత్రగమైయును భక్తానుగ్రహార్థమును ప్రపంచము వర్తించునట్లు చేయుటకుగానును స్వయముగా వ్యక్తీభావమును పొందును. దీనికి పరిచ్ఛిన్నవ్యక్తి అని పేరు.

> అజోऽపి సన్న వ్యయాత్మా భూతానా మీశ్వరోऽపి సన్ ।
> ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవామి యుగే యుగే ॥

అనినప్రకారము అవ్యక్తలింగుడైయు స్వమాయాశక్తిచే వ్యక్తుడుగా నవతరించి మనుష్యరూపమున దన్ను ప్రత్యక్షముగా కనుపరుచుచు, మనుష్యులహృదయముల నానందింపజేయుచు తన మనోహరత్వమున మనుష్యుల భావములను వశీకరించునట్టి సౌందర్యమునంతయు చూపుచు జనులకు ఆసక్తిని, ఉపాసనమును, ప్రీతినిని పుట్టించుచున్నాడనియు తెలిసికొనియున్నాము. అనుగ్రహామువల్ల ప్రేరితుండై ప్రాణులయశక్తకు కనికరించి, మనోభావములయశక్తకు కరుణించి, వారి పరిచ్ఛిన్నమైన అవగాహనకును దృష్టికిని శక్యము అగునట్లుగా మనుష్యరూపమున ఆ సర్వేశ్వరుని శక్తులను కనబరుచుచు అవతారరూపమున లోకసంచారము చేయుచున్నాడు. ఏలయనగా

క్లేశోఽధికతరస్తేషాం అవ్యక్తాసక్తచేతసాం ।
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే ॥
(శ్రీ భ. గీ., అధ్యా. ౧౨)

మనుష్యులు ఒక వ్యక్తిని కొలుచుటకు అతి ఆతురము కలిగి యున్నారనియు, భక్తియుక్తమైన మనోభావము వ్యక్తముగానుండు దేవుని ఆరాధించుటయందే ఆశ కలిగియున్నదనియు, శరీరధారులకు అవ్యక్తమును అవగాహనచేసికొనుట కష్టమనియు భక్తానుగ్రహార్థముగా నరరూపధారియై భగవంతుడు సంచరించెను.

పరమప్రేమ అనునది రెండవ పదము. ప్రేమయనగా ప్రీతి, పరమప్రేమ యనగా నతిప్రీతి. మనుష్యులలో నొకరియందొకరికి కలిగియుండు అనురాగము దేవుని యందలి భక్తికి ఒక సూక్ష్మ నిదర్శనముగా కనబడుచున్నది. మనుష్యులయందు ఇతరేతరానురాగమునకును దేవునియందలి భక్తికిని ఉద్దేశము భిన్నముగా నున్నను స్వభావము ఒక్కటే యని తెలిసికొనవచ్చును.

మనుష్యులయందు కలిగియుండు అనురాగములో మిక్కిలి బలిష్ఠమైనదియు శుద్ధమైనదియు నుదారమైనదియునగు అనురాగమును గురించి యొక క్షణమాలోచింతము. శుద్ధమై, బలిష్ఠమై, ఉదారమై విలసిల్లు అనురాగము కుమారునందు లేక కుమారియందు తలిదండ్రులకు గల ప్రేమ. ఈ ప్రేమతో పోల్చుటకు మరియొకటేదియు కనబడదు. శ్రీమద్భాగవతము, షష్ఠస్కంధమునందు చిత్రకేతూపాఖ్యానమును చదివినయెడల మమతాదోషంబున తండ్రి పుత్రునిపై యెంతటి అనురాగము చూపుచుండెననియు ఆ పుత్రుడు మరణముచెందినపుడు తండ్రి యెంత దుఃఖించెననియు

మోక్షమార్గత్రయము—భక్తియోగము-భక్తిస్వరూపము

తెలియవచ్చును. మనుష్యులు మిక్కుటముగా కోరు కోర్కెలు ప్రజ, ధనము, కీర్తి, విద్య మొదలగునవి గదా. వీటి పైకి ఏ ఒక్కటిని మనుష్యులు మిక్కుటముగా కోరుదురో అట్టి వస్తువునకు ముందు మిగిలినవన్నియు నుపేక్షార్హంబులే కదా. మనము బలిష్ఠముగా గోరిన ఒకవస్తువునకు ముందు మిగిలిన వస్తువులు ఎంత మంచివిగా నుండినను నిరుత్సాహకరములై యుండునుగదా. బలిష్ఠముగా కోరబడినవస్తువు మనకు స్వాధీనమైన యెడల పరవశత్వము కలుగును. అంతఃకరణ మావస్తువుతో పూరింపబడియుండును. ఇదేవిధమున ఒకానొకడు పరమస్నేహితుడుగానుండిన యెడల నతని సాన్నిధ్యమందు పరవశత సిద్ధముగా కనబడును. స్నేహితునకన్న నధికుడైన గురువుయొక్క సాన్నిధ్యమందు అతనియొక్క ఆచార్యత్వము మాత్రము కాదు; సహాయ్యత్వము కూడ కనబడును. వారియందు అనురాగముంచుటవల్ల మన జీవితమంతయు మార్పునొందును. వారి ప్రకాశమువలన ప్రతివస్తువును క్రొత్త రూపమును ధరించును. అట్టి మనుష్యసంబంధియైన అనురాగమును ఉన్నతస్థితి కెక్కించి పరిశుద్ధిచేసి దానికి సముద్రమంత లోతును, సూర్యునంత కాంతియు, చంద్రునంత సౌహార్దమును ఇచ్చి భావించిన యెడల అది సర్వోత్తమమైన ప్రేమయనందగును. సకల సుగుణములకు నాకరముగా నుండును. అట్టి ప్రేమాచరణమునందు ఎప్పటికైనను బడలిక గానరాదు. అసూయగాని ఉత్సాహన్యూనతగాని కనబడదు. ఇట్టి స్థితి పరమప్రేమ యనంబడును. ఇట్టి పరమప్రేమ మనుష్యులయందు వినియోగ పెట్టుటకంటె దేవుని

యందు వినియోగపెట్టబడునెడల శతాంశ మధికమై కానంబడును. దేవునియొక్క మాహాత్మ్యజ్ఞానమువల్ల ప్రేమసముద్రముప్పొంగుచుండును. ఇతరవిషయకము లైన యనురాగములన్నియు దుర్బలములైపోవును. ఇట్టి మనోభావమే 'సా' అను పదమునకు అన్వయించును. ఇదియే భక్తి, "సా పరమప్రేమరూపా, అస్మిన్". ఆ యనుభవరీత్యా తెలిసికొనుటయే భక్తిని యనుభవించుట. అది సమస్త కర్మలను దేవునకు సమర్పించుటయు దేవుని మఱచుటయందు పరమదుఃఖము పొందుటయునుగా నున్నది. భక్తుడు తన జీవితము నంతయు తన భక్తివిషయమైన వస్తువునకు సమర్పించును. ఆయనను మఱచుటయే పరమదుస్సహమైన దుఃఖము. భక్తుని హృదయము ఇతరవస్తువుల అంధకారముచే నిండియుండిన యెడల గాని ఒక నిమిషకాలమైనను తన దేవుని మరిచినగాని పరమ దుస్సహమైన దురవస్థ అతనికి కలుగుచున్నది. దేని బొంది మనుష్యుడు పూర్ణుడగుచున్నాడో, అమృతుడగుచున్నాడో, తృప్తుడగుచున్నాడో, దేనిని పొందినవాడై యితరములైన దానిని దేనిం గోరడో, దుఃఖింపడో, ద్వేషింపడో, ఇంద్రియసంబంధములైన విషయములను ఆశింపడో, స్వప్రయోజనపరములైన ఫలముల కొరకు ఏ ప్రయత్నముం జేయడో, దేనిని తెలిసినవాడై అతడు సంతోషముచే మైమఱచినవాడై ఆత్మయందు స్థిరీకృతుడై యానందించునో అట్టిది భక్తి. అది కోరికల నీడేర్చుకొనుటకై చేయబడనేరదు. ఏలయనగా దాని స్వభావము సన్న్యాసముగా నున్నది.

భక్తిస్వరూపమును గురించియు భక్తియొక్క సాత్త్వికరాజసతామస స్వభావములను గురించియు భక్తిని అభ్యసించుటయందు,

మోక్షమార్గత్రయము—భక్తియోగము-భక్తిస్వరూపము

శ్రవణం, కీర్తనం, మొదలగు మెట్లను గురించియు శ్రీ నారదుల వారు వేదవ్యాసులవారికి తన పూర్వజన్మవృత్తాంతమును గురించి తెలియజెప్పినందుపైన శ్రీధరులవారు వ్రాసిన వ్యాఖ్యాన ప్రకారము భక్తిసోపానములను గురించియు వ్రాయబడెను. ఇక భక్తునికి జనియించిన భక్తిని యేవిధముగా వృద్ధిచేసికొనవలయును అను మొదలగు వివరములను గురించి వ్రాయవలయును.

లోకమునందు మనుష్యుల స్వభావమునందు గల సన్నికర్ష విప్రకర్షము లను స్వభావముల పైకి సన్నికర్షమను స్వభావమునకు సంబంధించినది భక్తియని యిదివరకే వ్రాయబడియె. సన్నికర్షము అనగా సమీపమునకు లాగుట అనియు చెప్పబడియె. సమీపమునకు లాగుట అనగా భక్తుని పార్శ్వమునుండి ప్రేమ, మర్యాద, ఆశ్రయించుట అను ధర్మములు. ఉత్తమమైన సేవ్యవస్తువునుండి వాత్సల్యము, అభయప్రదానము, అఘశోషణము, ఔదార్యము, అనుగ్రహము ఆదరము అనునవి ధర్మములు.

సన్నికర్షస్వభావము వ్యక్తీకరించవలయునంటే భక్తుని తన వద్దకు లాగికొనునంత సౌమనస్యము గల వస్తువుండవలయును. సౌమనస్యము అనగా మంచి మనోభావము కలిగి యుండుట. సేవ్య వస్తువునందు మహాత్మ్య ముండవలయును. అనుగ్రహశక్తియు అనుగ్రహము చేయుటకు ఇచ్ఛయు కనబడవలయును. అప్పటికే ఆ వస్తువును సేవించవలయునని ఆశపుట్టును. మనుష్యుల కందఱకును ఆనందము ననుభవించవలయునని ఆశయుండును. ఆయాశను తృప్తి చెందించగల శక్తిగల వస్తువును చేరుటకు మనుష్యులు ఇచ్ఛయిం

తురు. ఆనందమును అనుభవించవలయునని మనుష్యులు చేయు ప్రయత్నములన్నియు ఆనందమునిచ్చు వస్తువుతో నైకమత్యము చెందవలయునను ప్రయత్నములే కదా. ఈ ఐకమత్యము వల్లనే ఆనందము కలుగును.

భక్తిని వృద్ధిచేయుటకుగా మనోహరమైన సేవ్యమూర్తి యొక్కటి యుండవలసినది అవశ్యము. ఇట్టి మూర్తులను లోకులకు ఇచ్చుటకొఱకేనో యేమో పరమేశ్వరుడు మనుష్యాది శరీరములను స్వీకరించిరి అని తోచుచున్నది. అవతారపురుషులగు శ్రీ రామ చంద్రులు, శ్రీ కృష్ణులు, మొదలగు మానవ శరీరధారులు మనుష్య కోటి ననుగ్రహించుటకై తమయొక్క శీలమును లోకమునకు తెలియునట్టుగా నడుచుకొనుచు తమయందలి ఆత్మశక్తిని లోకులకు మాహాత్మ్యరూపముగా ప్రదర్శించుచుండిరి. సత్ చిత్ ఆనంద ములు అను స్వభావములను తమయందు ప్రచ్ఛన్నముగా నుంచు కొని యుండిన మహానుభావులు అగు అవతారపురుషులు మానవ శరీరములయందు అమానుష వైభవములను చూపినందున అజ్ఞాన సాగరమునందు మునిగియుండిన ఆకాలపు జనులు ఆ అవతారపురు షులయొక్క మాహాత్మ్యమును శీలమును రూపసౌందర్యములను ఇతర దైవిక చిహ్నములను చూచి భ్రమిసి ఇట్టి మహాను భావులను గదా మనము ఆశ్రయించవలయును అని వారి మనస్సు ఉప్పొంగి హర్షము పుట్టవలయును. అట్టి హర్షము పుట్టినపుడు భక్తి వృద్ధియగును.

క్షత్రియులకెల్ల నిదర్శనముగా శ్రీరామచంద్రుల వారు ఉన్నారు. వారివలె తల్లితండ్రులయందు మర్యాదయు, సత్యము

నందు దృష్టియు, భరతునియందు వాత్సల్యమువలె ప్రజలయందు అనురాగమును, సత్యపరాక్రమమూర్తియును అభయప్రదాతయు నగు మరియెవ్వరిని నిదర్శనముగా కొనవచ్చును.

శ్రీకృష్ణమూర్తివలె స్నేహితుడు, ఆప్తుడు, చెలికాడు, శరణ్యుడు, భర్త, ప్రియుడుగా మరియెవ్వరిని కనుగొందుము. అమానుషచర్యలు, మానుషప్రేమలు, నిరాకారుండయ్యు నరాకారుండు, బిడ్డడు, గురువునుగ గదా నటించెను. మానుషరూపంబున ఇతరులకు దురవగాహంబును దుర్భరమును అగు అమానుష చర్యలు, కాంతులు, ప్రభ అనుగుణముల నిమిడిచి తన భక్తజన శ్రేణియందు కానవచ్చు ప్రేమను అంగీకరించిన బ్రహ్మగోపాలవేషుడు కాడే.

భక్తి యివ్విధంబున జనియించుననిగాని యివ్విధంబున వ్యక్తంబగుననిగాని యితరులకు తెలియజెప్పుట అసాధ్యము. అది అనుభవైక వేద్యముగాని వేఱుకాదు. యుక్తితో మనయొక్క కించిత్ జ్ఞత్వముయొక్క పరిమాణమును, అవతారపురుషులయొక్క సర్వజ్ఞత్వమును విమర్శించినట్లైతే భక్తి అగత్యముగా జనియించును.

ప్రకృతకాలమందు అవతారపురుషులు భూమియందు చరియించు చుండలేదు. కనుక వారలకన్న కొంచెము తక్కువ పదవియందుండు వారలు అగు జీవన్ముక్తులు మనకు సేవ్యులు. జీవన్ముక్తులు అనగా బ్రహ్మసాక్షాత్కారమును చెంది అమానుష శక్తిగలవారై ప్రారబ్ధక్షయ మవునంతవరకును ఇపుడుండు స్థూలశరీరమును పయోగించుచుండువారు. "ముక్తస్య ఈశ్వరరూపత్వాత్" అని చెప్పబడియున్నది. జీవన్ముక్తుడు ఈశ్వరునితో సమానుడు అని

యర్థము గనుక అవతారపురుషులు భూమియందు సంచరించు చుండిన కాలమందు వారు ఎంతమాత్రము జనుల చిత్తములను ఆకర్షించుచుండిరో అదే విధముగా జీవన్ముక్తులు కూడ శిష్యుల మనంబుల నాకర్షించగలరు. జీవన్ముక్తులకు బోధక గురువులు అని పేరు.

బోధకగురువులు కూడ ఈ కాలమందు సాధారణముగా దృగ్గోచరులు కారు. కనుక జీవన్ముక్తుల శిష్యులు, చోదకగురువులు, లోకమునందు మనుష్యులతో కలిసి మెలగుచు నివృత్తి మార్గమును త్రొక్కవలెనని యాశించువారికి దృష్టిగోచరులై శిష్యుల నంగీకరించగలవారలుగా నున్నారు. అట్టివారిని ఆశ్రయించి వారికి భక్తి సలుపవచ్చును. చోదకగురువులు అనుపదవి యందుండువారలు బ్రహ్మసాక్షాత్కారము చెందనివారైనను సాధారణమనుష్యుల కంటె నెన్నో సోపానము లధికముగా నెక్కిన వారు. కనుక అసిధారాతుల్యంబైన నివృత్తిమార్గమున క్రొత్తగా ప్రవేశించిన ఉపాసకులను తమవద్దకు చేరదీసి నివృత్తిమార్గపు మొదటి మెట్లను త్రొక్కుటకు కావలసిన సహాయము చేయగల వారు. ఇక ఒకటి రెండు జన్మములలోనే జీవన్ముక్తులు కాగల వారు. కనుక గురుపరంపరలో చేర నర్హులు. ఇట్టి చోదకగురువుల యందు శిష్యులు చూపు ప్రేమ, మర్యాద, భక్తి యనునవి శిష్యుని యందు భక్తి స్వభావమును వృద్ధిపరుచును. మనకు అందరాని అవతారపురుషులు గాని, అందుటకు కష్టసాధ్యులైన జీవన్ముక్తులు గాని, భక్తికి అర్హులైనను మనుష్యులలో మనుష్యులుగా కలిసి మెలగుచుండు చోదకగురువులు అనువారు శిష్యులయొక్క పూ

మోక్షమార్గత్రయము—భక్తియోగము-భక్తినివృద్ధిచేయుట

జలకును, మర్యాదలకును, భక్తికిని సమీపమందున్న కారణము వల్ల అందతగినవారు. ఇట్టి చోదక గురువులవారిని కనుగొని వారి చెంతజేరి వారిచే నంగీకరింపబడుట మొదటి మెట్టు. అంగీకరింపబడిన పిమ్మట "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా" అనిన ప్రకారముగా వారల ఆశ్రమమునందే నివసించుచు వారలకు సేవ చేయుచు వారు ఎవ్వరిని సేవింతురో అట్టి బోధకగురువులవారికి పరోక్షమందు సేవచేయుచు క్రమేణ భక్తిని వృద్ధిపరుచుకొని వచ్చును. వృద్ధిచెందుచు వచ్చు భక్తిభావముతో నవతారపురుషుని యందు భక్తికుదరవచ్చును. అవతారపురుషునియందు భక్తి కలిగించుటకే కదా గురువులందరును కావలయును. గురువులవారు మధ్యవర్తియే గాని ప్రధానపురుషులు గారు. చోదక గురువుల వారి యందు భక్తిని చేయుచు బోధకగురువులవారిని అందుకొని వారి మూలముగా నవతారపురుషులయందు భక్తి చేయగల శక్తిని సంపాదించుకొనవచ్చును.

ఇటుగాక ఇతరమార్గముల వల్ల కూడ అవతారపురుషుల యందు భక్తి కుదరవచ్చును. ప్రతి అవతారపురుషుని గురించియు నొక్కొక పురాణ మేర్పడి యున్నది. ఇట్టి పురాణమునకు ఇతిహాసము అని పేరు. శ్రీమద్రామాయణము ఒక ఇతిహాసము. శ్రీరామచంద్రులవారి జననము మొదలు వారు భూలోకమునందు నడిచిన నడవళ్లు, చేసినకార్యములు, రక్షించిన రక్షణలు, అనుగ్రహములు, పరాక్రమములు మొదలగునవి యన్నియు నీ యితిహాసము నందు సవిస్తరముగా నున్నవి.

అవతారపురుషుల చరిత్రము లనదగిన ఇతిహాసములను చదివి వానియందు చెప్పిన వివరములను అవతారపురుషుల మాహాత్మ్యములనును చదివి చింతించి మననము చేసి చేసి ఆ కథలయందు అనురక్తి కలుగునట్లు ఏర్పడెనేని భక్తుని యదృష్టము సఫలమగును. ఇతిహాసములలో కథారూపముగా చెప్పబడియుండు విశేషములను చదివి ఆ కథలను మనసా చింతించి ఆ కథలయందలి కథాపాత్రములలో భక్తుడైన తాను నొక్కడని భావించి మనసా విషయీకరించి ఆ అనుభవమును పొందితే అపుడు ఆ యవతారపురుషునియందు భక్తిముదురును. ఉదాహరణము—శ్రీమద్రామాయణమునందు చెప్పియుండు కథను సంగ్రహముగా శ్రీమద్భాగవతమునందు

> గుర్వర్థే త్యక్తరాజ్యో వ్యచర దనువనం పద్మపద్భ్యాం ప్రియాయాః ।
> పాణిస్పర్శాక్షమాభ్యాం మృజితపథరుజో యో హరీంద్రానుజాభ్యాం ।
> వైరూప్యా చ్ఛూర్పణఖ్యాః ప్రియవిరహరుషా రోపితభ్రూవిజృంభ ।
> త్రస్తాబ్ధి బద్ధసేతుః ఖలదవదహనః కోసలేంద్రో వతా న్నః ॥
>
> (స్కం. ౯, అధ్యా. ౧౦, శ్లో. ౪)

తన తండ్రియగు దశరథమహారాజు కామమోహితుడై చేసిన వాగ్దత్తము అన్యాయమైన దైనను తనకు తండ్రి గనుక అతని మర్యాదను కాపాడి అతడు చేసిన వాగ్దానము సత్యము అని స్థాపించవలెనని శ్రీరామచంద్రులవారు అడవి కేగిరి. తాను సత్యమాడుటే గాక ఇతరులు కూడ సత్యమాడునట్లు వారలకు సహాయము చేయు మహనీయుడు. అంతేకాదు. తండ్రిచేసిన వాగ్దానము న్యాయవిరోధమైనదే గాక ఆ వాగ్దానప్రకారము తాను రాజ్యభోగమునుండి చాలించుకొనవలసి వచ్చినప్పటికిని రాజ్యభోగము

మోక్షమార్గత్రయము—భక్తియోగము-భక్తిని వృద్ధిచేయుట

వదలుకొని పట్టణమునందైనను వసియించుచుండనీయక ఆ వాగ్దానముయొక్క మహిమవల్ల తాను బహుకంటకక్రూరమృగసంకులంబైన యరణ్యమునకు పోవలసివచ్చెను. అదే విధమున అడవికిని వెళ్లెను. అడవియందు సంచరించుటకుగా రాజపుత్రవేషమును వదిలి జటావల్కలధారియై పాదుకలవాహనంబున అరణ్యమునకు వెళ్లెను. ఇన్నికష్టములకు: బాలైనను తనయందు అతి భక్తిని చూపుచుండు భరతుడు అరణ్యమునందు తనను దర్శించి, ప్రేమించి, సేవించి, తాను శ్రీరామచంద్రులవారికి బదులగా పాదుకలను పూజించుకొందునని తన పాదుకుల నిమ్మని యడిగినపుడు ఆ పాదుకలను అతని కిచ్చెను. తనకెన్ని కష్టములును భోగహానియు కలిగినను తానే కాక తన తండ్రికూడ అసత్యమాడక యుండునట్లు నడుచుకొనిన సత్యసంధుడు. అడవులలో సంచరించునపుడు అతి కోమలములైన తన పాదములు నున్ననిస్థలమునందు నడుచుటకే ఓర్వకపోవునట్టివిగా నున్నను ముండ్లగరుకుభూమియందు కంటకోచ్ఛిష్టనిరహరణార్థము పయోగించు పాదుకులను తన భక్తుడైన భరతునికిచ్చినట్టి వాత్సల్యభావము చూపు మహనీయుడు. లక్ష్మణుడును హనూమంతుండును పరిచర్య చేయుచుండగా మార్గాయాసము పోగొట్టుకొనుచు, రావణాసురునిచే నపహృతమైన సీత లేమింజేసి ఆ కోపంబున దుష్టుని శిక్షణార్థము కపిసైన్యంబును కూడబెట్టికొని రావణాసురిని వానివారలనును సంహరించి సీతను కైగొని మరల అయోధ్యచేరిన వీరుడు మమ్ము గాచు గాత అని యర్థము.

ఈ యితిహాసమునందు లీలానాటకరంగములు కొన్ని గలవు.

౧ ది. శ్రీదశరథమహారాజు శ్రీరామచంద్రునితో తాను కైకకు చేసియిచ్చిన శపథముల వివరమును తెలియపరచుట. ఆ సమాచారమును నెమ్మదిగా శ్రీరామచంద్రులవారు విని యంగీకరించుట.

౨ ది. తండ్రిగారి ఆజ్ఞను అనుసరించి శ్రీరామచంద్రుడు తన తమ్ముడు లక్ష్మణస్వామియు తన భార్య సీతాదేవియు తన్ను వెంబడించి వచ్చుచుండగా నయోధ్యవదిలి "శాద్వలేనపథా రాత్ర్యాం సజగామ సురాపగాం" అని రథారూఢుడై బాటనువదిలి గడ్డిమొలిచిన ప్రదేశముమీద రథమును నడిపించి గంగానదిని చేరుట. బాటను వదిలినందుకు కారణము చక్రములు నడిచిన గురుతు బాటపైన కనుపడును. అయోధ్యాపట్టణ వాసులందరును శ్రీరామచంద్రునితో సహా అడవికి వెళ్లుదుము అని సన్నాహము చేయుచుండిరి. వారికి తాను వెళ్లినత్రోవ ఇది యని తెలియకుండుటకుగా చేసిన యుక్తి. గడ్డిపైన తన రథముపోతే చక్రములువెళ్లిన జాడ తెలియదు.

3 ది. గంగానదీతీరమందు రథమునువదిలి గుహుడు అను భక్తుడు తెచ్చిన పడవయందు కూర్చొని గంగానదిని దాటుట.

౪ ది. గంగనుదాటి పాదచారియై "సాకం సౌమిత్రిసీతాభ్యాం" అని లక్ష్మణుని సీతను వెంటపెట్టుకొని అడవియందు ప్రయాణముచేసి చిత్రకూటాద్రి చేరుట.

౫ ది. చిత్రకూటాద్రియందు పర్ణశాల నేర్పరుచుకొని సీతాలక్ష్మణులతోకూడ అచట వసియించుట.

మోక్షమార్గత్రయము—భక్తియోగము-భక్తిని వృద్ధిచేయుట

౬ ది. శ్రీరామభక్తిభరితుండును అభిరామగుణాకరుండు నగు భరతుండు అన్న శ్రీరాములు అడవికివెళ్లిన తరువాత తాను కొన్నిదినములగా వసియించుచుండిన తన మేనమామగారి యింటినుండి అయోధ్యకు తిరిగివచ్చి శ్రీరామచంద్రుడు కైక యొక్క అభీష్టమును నెరవేర్చుటకుగా దశరథమహారాజు చేసిన ఆజ్ఞను అనుసరించి అడవికి వెళ్లిరి అని యెరిగి ఆ మాటవినలేక మూర్ఛపోయి కొంత తడవునకు మేల్గాంచుట.

౭ ది. దశరథమహారాజు తన యిష్టమునకు విరోధముగా శ్రీరాములవారిని అడవికి వెళ్లమని యుత్తరువుచేసియు ఆ వియోగమువల్ల కలిగిన దుఃఖమును ఓర్వలేక మృతిచెందుట.

౮ ది. భరతుండు దశరథమహారాజుయొక్క ఔర్ధ్వదైహిక క్రియలనుచేసి ముగించిన పిమ్మట అడవిలోనుండు శ్రీరాములను పట్టణమునకు మరల రమ్మని ప్రార్థించుటకై చిత్రకూటంబునకు పరివార సమేతంబుగా వెళ్లి శ్రీరాములవారిని అయోధ్యకు రమ్మని ప్రార్థించుట.

౯ ది. తన తండ్రిగారి ఆజ్ఞను తండ్రిగారు చనిపోయిన పిమ్మటనైనను ఉల్లంఘించకూడదని శ్రీరాములవారు "పాపభీరుర్వితృష్ణః" "రాజ్యభోగాన్నివృత్తః" అనినట్లు రాజ్యభోగమును ఇచ్ఛయించకయు తృష్ణారహితుడయ్యు పాపమునకు భయపడియు అయోధ్యకు వెళ్లుటకు ఇష్టపడక పోవుట.

౧౦ ది. శ్రీరాములవారియందు తనకుగల భక్తిని ముందిడికొని భరతుండు తాను జటావల్కలంబుల నంగీకరించి శ్రీ

రాములవారి ప్రతినిధిగా వారి పాదుకలను సింహాసనంబున నునిచి తాను "రామాగమన దివసాః గణయ న్నువాస" అని అతివైరాగ్యముతో శ్రీరాము లేలవలసిన రాజ్యమును తానేలుట కనర్హుడు అని నిశ్చయించి శ్రీరాములవారి పాదుకల నర్చించు చుండుట.

ఇట్లే అనేక రంగములను విమర్శించవచ్చును. ఇతిహాసములను చదివి భక్తిని వృద్ధిచేసుకొనుటకు ఆశపడువాడు ఇట్టి రంగములుగా కథలను భాగించి ఆ రంగములయందు తానును ఒక నాటకపాత్ర అనుకొని ఆ రంగము తన కంటియెదుట నటింపబడు చున్నదని ఊహించి మనోరాజ్యము నుపయోగపరిచి ఆ నాటక పాత్రలతో సహా తననుకూడ కనుగొను నతండు క్రమేణ అవతార పురుషుని పలుమారు తాను చూచుచుండిన మనోరాజ్య ప్రతిమ మూలకముగా అంది వారియొక్క అనుగ్రహమును పొందును.

ఇతిహాసపురాణములను పారాయణము చేయవలయు నని యుపదేశించిన మహర్షుల యభిప్రాయము ఇవ్విధంబుగానే యుండి యుండవచ్చును అని తోచుచున్నది.

ధ్యేయం సదా పరిభవఘ్నమభీష్టదోహం
తీర్థాస్పదం శివవిరించినుతం శరణ్యం ।
భృత్యార్తిహం ప్రణతపాల భవాబ్ధిపోతం
వందే మహాపురుష తే చరణారవిందం ॥
త్యక్త్వా సుదుస్త్యజ సురేప్సిత రాజ్యలక్ష్మీం
ధర్మిష్ఠ ఆర్యవచసా య దగా దరణ్యం ।
మాయామృగం దయితే యేప్సితమన్వధా
వద్వందే మహాపురుష తే చరణారవిందం ॥

(శ్రీమద్భాగవతము, స్కం. ౧౧, అధ్యా. ౫)

మోక్షమార్గత్రయము—భక్తియోగము-భక్తిని వృద్ధిచేయుట

ఓ మహాపురుషా, శ్రీరామచంద్రప్రభో, సమస్తకాలమందును నీ పాదారవిందములను భజింతును. ఏల యనగా నీ పాదారవిందాశ్రిత చిత్తవృత్తిగలవారలకు జ్ఞానేంద్రియ కర్మేంద్రియ అంతరింద్రియము లనెడు పదునొక్కండు శత్రువులయొక్కయు, కుటుంబముయొక్కయు బాధనుండి కలుగు తిరస్కారము ఎల్లపుడును తొలగిపోవును. అంతేకాదు. తిరస్కారమును పోగొట్టి వారు కోరు కోరికలు ఇహలోకవిషయికము లైనను, పరలోక విషయికములైనను మోక్షసామ్రాజ్యసంబంధిమైన వైనను వాట్లను ఇయ్యగలవు. మఱియు తమ పాదారవిందముల నుండి గంగాతీర్థ ముదయించి లోకపావనంబై పాపహారియై వెలయుచున్నది గదా. అట్టి తీర్థమునకు అస్పదమైనది తమ పాదారవిందము. తీర్థములు ఇయ్యగల పావనమునకంటె ననేకంతలు అధికమైన పావనమును తమ పాదారవిందములు ఇయ్యగలవు. నేనెంతమాత్రము. లోకాధికులైన శివుడు, బ్రహ్మ మొదలగువారు సేవించి అభీష్టములను పొందిరి గనుక నేను సదా తమ పాదారవిందములను సేవించెదను. మఱియు శరణ్యాం, శరణుపొందుటకు అర్హములైనవి. తమ ప్రియాపహారియైన రావణాసురిని తమ్ముడు విభీషణుడు తమ పాదారవిందములను శరణుజొచ్చిన వెంబడే అతనిని శత్రువునకు తమ్ముడు కదా, అను గ్రహార్హుడు కాడు అని సందేహించకయే అతనికి అభయప్రదానము నొసంగలేదా. కనుక నావంటి భక్తుడు శరణుజెందిన యెడల నిరాకరింపబడడు. గనుక శరణ్యాం. కనుకనే భృత్యార్తిహాం, పాదభృత్యుడైన భక్తునికి కలిగిన భయమును పోగొట్టగల శక్తిని కలది.

కనుక ప్రణతపాలా, స్వామిన్ నీ చరణారవిందమునకు సదా వంద
నంబు లాచరించెద. మఱియు తమ పాదకమలము లెట్టివనగా,
సుఖముగా రాజ్యాభిషిక్తుడై రాజ్యమేలుచుండవలసిన యువరా
జైన తాము త్యజించుట కసాధ్యమైనదియు దేవతలైనను తాము
అనుభవించవలెను అని కోరదగిన రాజ్యలక్ష్మిని వదలుకొని ఆప్త
కాముడవైన దేవా మీరు మీతండ్రిగారి వాక్యమునకు మర్యాద
చేయువారైయే తమ పాదారవిందములు అరణ్య సంచారమునకుగా
బయలు వెడలెనో ఆ యరణ్యమునందు కూడ తమ ప్రియురాలైన
సీతాదేవి కోరినందున మాయామృగమును పట్టు నుత్సాహముతో
పట్టబోయిన చరణారవిందములను ఎల్లపుడును వందనపూర్వకము
గా ధ్యానింతును. ఇవ్విధంబున నొక యవతారపురుషుని

య ఏత ద్దేవదేవస్య విష్ణోః కర్మాణి జన్మచ ।
కీర్తయే చ్ఛ్రద్ధయా యుక్తః సద్యః పాపైః ప్రముచ్యతే ॥
ఇత్థం హరేర్భగవతో రుచిరావతారవీర్యాణి బాలచరితాని చ శంత మాని ।
అన్యత్ర చేహ చ శ్రుతాని గృణన్మనుష్యో భక్తిం పరాం పరమహంస గతౌ లభేత ॥
(శ్రీమద్భాగవతము, స్కం. ౧౧, అధ్యా. ౩౧, అంత్యం)

"జన్మ కర్మ చ మే దివ్యం ఏవం యో వేత్తి తత్త్వతః" అని శ్రీమ
ద్భగవద్గీతయందు చెప్పినప్రకారము దేవదేవుండైన విష్ణుదేవుని
జన్మకర్మములను శ్రద్ధతో చదివియు ఇతరులకు వినిపించియు నానం
దించునతడు ఎల్లపాపంబుల నుండియు త్వరగా విముక్తుడగును.
ఈ ప్రకారముగా శ్రీహరియొక్క పరమమంగళంబులైన యవతార
ములయొక్కయు వీర్యములయొక్కయు బాల్యావస్థయందు కృష్ణావ
తారమందు జరిపిన క్రీడలయొక్కయు చరిత్రములను ఇహపర

లోకంబులందు శుభకరంబులైన వాటిని కీర్తనము చేయువారు పరమహంసాశ్రమమున కెక్కిన మహనీయులకు గమ్యస్థానంబైన శ్రీకృష్ణునిపై పరమభక్తిం బడయుదురు.

జన్మచరిత్రంబులనును క్రీడలను గురించియు విన్నమాత్రము చాలదు. అట్టి క్రీడలను ఇంతకుముందు చెప్పినప్రకారము మనసా చింతించి అట్టి క్రీడాపాత్రలలో తాను (భక్తుడును) ఒకడుగా నుండినట్లు భావించి ఆ క్రీడలయందు తాను కూడ సంబంధపడి నట్లు ఊహించుకొన్నయెడల ఆ క్రీడలకు అధిపతియైన కృష్ణభగ వానుల అనుగ్రహము భక్తునియందు ప్రవేశించును. ఇది మనో రాజ్య సంబంధమైనది. మనోరాజ్యముయొక్క ఉపయోగమును ఆత్మవిచారము, పూర్వభాగమునందు చెప్పియున్నది.

భక్తిని వృద్ధిచేయుటకు మరియొక మార్గము కలదు. అది ఏది అనిన: తనకంటె భక్తియం దధికులైనవారివద్ద చేరి కలిసి యుండుటవల్ల వారి మార్గములు తనకు పట్టుపడును.

తనకంటె భక్తియం దధికులను ఏవిధముగా కనుకొన వచ్చును అని ప్రస్తావము రావచ్చును. ప్రకృతకాలమునందు ఒక చెడ్డ దురదృష్టము లోకులకు సంభవించియున్నది. ప్రయత్న మే మియు లేకయే ఇతరులయందు దోషములను మాత్రము కను గొనుట. ఒక మనుష్యుని చూడగానే వీని దోషములేమి అను విచారణ కలుగుతున్నదేగాని వీని మంచిగుణములేవి యను ప్రశ్న కలుగదు. ఎంతవరకును ఇతరులయందు దోషాన్వేషణమే జరుగు చుండునో అంతవరకును నివృత్తిమార్గయాత్ర అడ్డపడినదనే అను

గొనవలయును. ప్రవృత్తిమార్గమునందు నడుచుచుండినంత కాలము ఈ దుశ్చేష్టవల్ల కలుగు హానిని లోకులు ఎఱుగలేక యున్నారు. తన కంటియందుండు కాయను గమనించకయే ఎదుటివాని కంటి యందు పడియుండు పూవును ఆక్షేపించువారు అనేకులు. ఎప్పటి కిని ఇతరులయందుండు మంచిగుణములే మనకు అగుపడునట్లుగా నభ్యాసము చేసికొనవలయును.

పరస్వభావకర్మాణి న ప్రశంసే న్న గర్హయేత్ ।
విశ్వ మేకాత్మకం పశ్యన్ ప్రకృత్యా పురుషేణ చ ॥
పరస్వభావకర్మాణి యః ప్రశంసతి నిందతి ।
స ఆశు భ్రంశతే స్వార్థా ద స త్యభినివేశతః ॥

(శ్రీమద్భాగవతము, స్కం. ౧౧, అధ్యా. ౨౮)

లోకమంతయు ప్రకృతిపురుషమయమని తెలిసి పురుషుడు పరుల స్వభావములను గురించియు వారి కార్యములను గురించియు మెచ్చ రాదు ; నిందించరాదు. అట్లు ఎవ్వడైతే లోకులయందు తాను చూచు సుగుణములనుగాని దుర్గుణములనుగాని స్తోత్రముగాని దూషణగాని చేయునో అతడు ప్రకృతియొక్క పరిణామములైన అసత్తును అనుసరించుట యను దోషమునకు పాత్రుడై చెడిపో వును. ఇతరులయందు తప్పులను చూచినపుడు ఆ తప్పులు గుణ ముల చేష్టలుగాని వేరుకాదని వాటిని నిందించకుండవలయును. ఇతరుల తప్పులను ప్రస్తావించుట లోకుల ధర్మము కదా యనవచ్చు ను. లోకుల ధర్మమనగా ప్రవృత్తిమార్గ పరుల ధర్మముగాని నివృత్తిమార్గమందు ప్రయాణముచేయు నిచ్ఛగలవాని ధర్మము కాదు. శ్రీమద్భగవద్గీత, ౧౬ వ అధ్యాయమున దైవీసంపద్గుణ

మోక్షమార్గత్రయము—భక్తియోగము-భక్తినివృద్ధిచేయుట

ములను గురించి చెప్పినపుడు 'అపైశునం' అను నొక గుణమును చెప్పియున్నారు. అపైశున మనగా పైశునము కానిది. పైశునము అనగా నితరుల దోషములను గమనించుట. పైశునము ఆసుర సంపద్గుణము కనుక "నిబంధాయాసురీమతా" అని చెప్పిన ప్రకారము నివృత్తిమార్గయాత్రాపరుడు బంధవిముక్తికిగా ప్రయత్నపడుచుండగా బంధమునియ్యగల ఆసురసంపద్గుణములను పోగొట్టుకోవలెనని వేఱుగా చెప్పవలెనా? కనుక ఇతరులయందు తప్పులను వెదకు స్వభావమును వదిలినపుడు వారి మంచిగుణములను వెదకు స్వభావ మేర్పడును. అపుడు భక్తుడు తానుండుమార్గమునందు తనకంటె నధికులను సులభముగా కనుక్కొనును.

అట్టివారిని కనుక్కొని వారి సమీపమునందు ఉండి వారు సేవాదులెట్లు చేయుచున్నారో గమనించి ఆ శ్రోవన భక్తిని వృద్ధిపరుచుకోవచ్చును.

సేవ్యవస్తువు అయిన అవతారపురుషుని ధ్యానించి, చింతించి, విషయీకరించుకొనుటవల్ల ఆ అవతారపురుషుని వద్దనుండి వారి అనుగ్రహాకారములైన సాత్విక స్పందములు భక్తునిశరీరమునందు ప్రవేశించి భక్తుని ఉన్నతస్థితికి తెచ్చునా అని సందేహించవలసిన అవశ్యముండదు. భక్తుడు తాను తనధ్యేయవస్తువుపైన ధారావాహినిగా కుమ్మరించు భక్తికంటె అనేకంతలు అధికమైన అనుగ్రహధారలు ధ్యేయవస్తువునుండి భక్తునియందు ప్రవహించుచుండును. గురువులవారికి శిష్యునియందు వాత్సల్యము ఉన్నట్టు భక్తునియందు భగవంతునికి వాత్సల్యముండును. ఇది నిజము

అని ద్రౌపదీ వస్త్రాపహార కాలమందు దూరాన ఉండిన శ్రీకృష్ణుల వారు చేసిన అనుగ్రహమువల్ల తెలిసికొనవచ్చును.

భక్తివలన ప్రయోజనములు—

౧. భక్తి 'ద్రవీభావపూర్వికా మనసో భగవదాకారరూపా' అని చెప్పబడినది. భక్తునియంతఃకరణము భగవంతుని రూపును గొనును. భక్తియను అరణియందు చిక్కిన జీవాత్మయొక్క అంతఃకరణము ద్రవీభావము చెందును. మెత్తనిమైనమును చేతితో నలుపుచుండగా మృదువై ఏ విధముగా నెట్టిరూపముగా నా మైనమును మార్చవలెనన్నను సాధ్యమగునో అట్లు భక్తి స్పందములతో అంతఃకరణము ద్రవీభావముచెందును. సమానరూపగుణవయస్కులై మనుష్యమాత్రులైన ఇద్దరు స్నేహితులే ఒకరిని మరియొకరు తనవలె మార్చుట మనము చూచుచుండగా సృష్టి స్థిత్యంతఃకరణ శక్తిగల భగవంతునందు భక్తుడు చేయు చెలిమివల్ల భక్తుడు భగవంతునివలె అనుగ్రహాధికారము పొందుట ఏమి ఆశ్చర్యము.

౨. భక్తివల్ల కర్మక్షయమవును. భక్తుడు భగవంతుని సేవించుచుండుటవల్ల క్రొత్తగా దుష్కర్మచేయుట అసాధ్యము. భగవదనుగ్రహము భక్తునియందు ప్రవహించుచుండుటవల్ల ప్రారబ్ధసంచితములుకూడ నశించును. భక్తుని యంతఃకరణమునందు భగవంతుడే నివసించియుండును.

శృణ్వతః శ్రద్ధయా నిత్యం గృణతశ్చ స్వచేష్టితం ।
కాలేన నాతి దీర్ఘేణ భగవాన్ విశతే హృది ॥
ప్రవిష్టః కర్ణరంధ్రేణ స్వానాం భావసరోరుహం ।
ధునోతి శమలం కృష్ణ స్సలిలస్య యథాశరత్ ॥

మోక్షమార్గత్రయము—భక్తియోగము-భక్తివలని ప్రయోజనములు

ధౌతాత్మా పురుషః కృష్ణపాదమూలం న ముంచతి ।
ముక్తసర్వపరిక్లేశః పాంథ స్స్వశరణం యథా ॥
(శ్రీమద్భాగవతము, స్కం. ౨, అధ్యా. ౮)

ప్రతినిత్యమును శ్రద్ధతో భగవత్కథాశ్రవణంబు చేయువానికిని పఠియించువానికిని భగవంతు నను గ్రహము కలిగి భగవంతుడు త్వరలోనే భక్తులచిత్తంబులలో ప్రవేశించును. ఇట్లు స్వభక్తుల మనంబులయందు శ్రవణరంధ్రమార్గంబున ప్రవేశించి ఆ మనంబు లందు నిలిచియుండు దోషములను జలకడిగి పరిశుద్ధిచేయును. ఇట్లు నిష్పాపుడైన భక్తుడు భగవత్పాదమూలమును వదలడు.

భక్తుడు భగవంతునికి తాను భృత్యుడనియు నెల్లపుడును తనయందు భగవంతుడు నివసించియుండుననియు కాబట్టి తన శరీర మునకు తనకు హక్కు లేదనియును నమ్మియుండును. లోకసేవార్థ ముగా తన స్వాధీనమునందు తన శరీరమును భగవంతుడు ఉంచి యున్నాడని నమ్మి ఆ శరీరముతో లోకసేవ చేయుచుండును. భగ వంతు నాజ్ఞప్రకారమే తానెల్లకార్యములను చేయునని నమ్మి యుండును.

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం ॥
శుభాశుభ ఫలైరేవం ముచ్యసే కర్మబంధనైః ।
(శ్రీమద్భగవద్గీత, అధ్యా. ౯)

భక్తుడు చేయుకర్మలన్నియు భగవత్ప్రీత్యర్థమే చేయబడు నెడల శ్రౌతకర్మ కాస్పదముండదు.

3. భక్తి అంతఃకరణమును శుద్ధిపరుచును. ఈ విషయమై ఇదివరకే “ధునోతి శమలం కృష్ణ స్సలిలస్య యథాశరత్” అని ౩౯౪ వ పుటయందు చెప్పబడియె.

అపి చేత్సు దురాచారో భజతే మామనన్యభాక్ ।
సాధురేవ స మంతవ్యస్సమ్య గ్వ్యవసితోహి సః ॥
క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి ।
కౌంతేయ ప్రతిజానీహి న మేభక్తః ప్రణశ్యతి ॥

(శ్రీమద్భగవద్గీత, అధ్యా. ౯)

జీవాత్మలందరును పరమాత్మను చెందవలెనని కోరుట న్యాయమే యని యిదివరకే చెప్పబడియె. “యథాభ్రామ్యత్యయో బ్రహ్మన్ స్వయమాకర్షసన్నిధౌ । తథామే భిద్యతే చేత శ్చక్రపాణే ర్యదృచ్ఛయా ॥” అని శ్రీమద్భాగవతము, సప్తమస్కంధము, అ. ౪ నందు చెప్పినరీతిగా (ఈ శ్లోకార్థము—ఏ విధముగా ఇనుపతునక అయస్కాంతపు రాతి సమీపమునందు, ఆ కాంతమునే అనుసరించి చలించి ఆ కాంతము వెంబడి పరుగెత్తుచుండునో ఆ విధముగా నా మనస్సు హరిఁజేరఁగోరుచున్నది యని శ్రీ ప్రహ్లాదుడు చెప్పెను) ఆ ప్రకారము భక్తుని మనస్సు భగవంతునే యాశ్రయించి యున్నయెడల దురాచారమున కాస్పదముండదు. సదాచారములే పట్టుబడుచుండును. ఇట్టి భక్తునికి పతనమునకవకాశముండదు. మనోనిశ్చయమువల్ల భక్తుడు మెట్టు మెట్టుగా భగవంతుని ధర్మములనే తనయందు ఇముడుచుకొనుచుండును. కనుక “క్షిప్రం భవతి ధర్మాత్మా” అతి శీఘ్రముగా ధర్మాత్ముడగును. స్వార్థతను పరిపూర్ణముగా మరిచి పరార్థతనే యభ్యసించుచుండును గనుక “న మే భక్తః ప్రణశ్యతి”.

మోక్షమార్గత్రయము—భక్తియోగము-భక్తివలని ప్రయోజనములు

౪. భక్తి శ్రమను మరుచునట్లు చేయును. లోకమందు ఒక నికి నింద్రియసుఖముల నియ్యగల మరియొక వ్యక్తియొక్క తృప్తికి గా నతడు శ్రమపుచ్చుకొన్నపుడు ఆ శ్రమ శ్రమగా కనబడదు అను విషయము అందఱకును తెలిసిన విషయమే. అట్లుండగా నింద్రియ సుఖములకన్న నెన్నో వంతు లధికముగానుండు మోక్షసుఖము నియ్యగల భగవంతుని ప్రీతికిగా నొకడు పడు శ్రమలు శ్రమలుగా కనుబడవు అనుటకు సందేహముండునా. ప్రవృత్తిమార్గమునందు మొదటి మెట్లయందు నడుచువారు వారకాంతల ప్రీతి కొఱకు వేయి కష్టములబడి వారి చిరునవ్వును సంపాదించినందున శ్రమ మరిచిపోవుట లోకమున చూచియున్నాము. నివృత్తిమార్గమున నడుచువారు ముక్తికాంత సేవయందు శ్రమలు మరుచుట అరు దా? భక్తియనునది కఠినములైన ఉద్యమములను సరళములుగా జేయును. దుఃఖములైన సేవలను ఆనందదోహములుగా జేయును.

౫. భక్తి మనశ్శాంతి నిచ్చును. అంతరంగమునందు నివ సించుచుండు భగవంతునియొక్క స్పందములు శాంతము నిచ్చు చుండగా లోకమందంతయు ప్రతివ్యక్తియందును భగవంతునే చూచుచుండు భక్తునికి ప్రతివ్యక్తియందుండియు శాంతిస్పందములే వచ్చుచుండును. కనుకనే మంచి భక్తులు శాంతులుగా నుందురు.

> నారాయణపరా స్సర్వే న కుతశ్చన బిభ్యతి ।
> స్వర్గాపవర్గనరకే ష్వపి తుల్యార్థదర్శినః ॥
> దేహినాం దేహసంయోగా ద్వంద్వా నీశ్వరలీలయా ।
> సుఖం దుఃఖం మృతిర్జన్మ శాపోనుగ్రహ ఏవచ ॥

అవివేకకృతః పుంసో హ్యర్థ భేద ఇవాత్మని ।
గుణదోషవికల్పాశ్చ భిదైవ స్రజివద్యథా ॥
వాసుదేవే భగవతి భక్తి ముద్వహతాం నృణాం ।
జ్ఞానవైరాగ్యవీర్యాణాం నేహకశ్చిద్వ్యపాశ్రయః ॥
నహ్యస్యాతి ప్రియః కశ్చిత్ నాప్రియ స్స్వపరోపివా ।
ఆత్మత్వా త్సర్వభూతానాం సర్వభూత ప్రియో హరిః ॥
తస్మా న్నవిస్మయః కార్యః పురుషేషు మహాత్మసు ।
మహాపురుష భక్తేషు శాంతేషు సమదర్శిషు ॥
(శ్రీమద్భాగవతము, స్కం. ౬, అధ్యా. ౧౭)

హరిభక్తులు దేనినుండియు భయమునొందరు. స్వర్గాపవర్గనరకంబులు సమానంబులని యుందురు. ఈశ్వరలీలవల్ల దేహికి దేహసంయోగమునంజేసి సుఖదుఃఖములు, చావు పుట్టుకలు మొదలగు ద్వంద్వంబులు వాటిల్లు. ఇట్టి ద్వంద్వంబులు కేవల ఆత్మయందు లేవు. వాసుదేవుండైన భగవంతునందు భక్తికలిగినపుడు జ్ఞానము, వైరాగ్యము, వీర్యము అనునవి కలుగును. అపుడు ఒక విషయము ఇష్టప్రదంబనిగాని మరియొకటి అనిష్టప్రదంబని గాని యెఱుగరు. అతని కొక్కండు ప్రియుండనిగాని మఱియొక డప్రియుండని గాని వేఱొకండు స్వకీయుండని గాని మఱియొక్కండు స్వకీయుడు కాడనిగాని యుండదు. సర్వభూతములయందును ఆత్మనే కనుగొనును గనుక సర్వసమత్వమునే కనుగొనును. మహాపురుషుని భక్తులైనవారు శాంతులు, సమదర్శనముగలవారునుగా నుందురు.

కనుక సన్నికర్ష స్వభావంబునం బుట్టిన భక్తిని చూడగా సర్వసమత్వము, పరమప్రేమ, దయాకృపాకటాక్షములు, అనుకంపాది భగవద్గుణంబులు వ్యక్తంబులై యుండును. ఇవి వారి

చిహ్నంబులు. ఈ విషయమును విపులముగా, శ్రీమద్భగవద్గీత, ౧౨ వ అధ్యాయాంత శ్లోకంబులయందు చదువవలయును.

కనుక ఇంత సులభముగా సాధించతగినదియు సాధించిన పిమ్మట తనకే గాక పరులకుకూడ అత్యుపయోగకారియు నైన భక్తియనునది లేనంతట

> కింస్యాద్వర్ణాశ్రమాచారైః కిం దానైః కింతపశ్శ్రుతైః ।
> సర్వాఘఘ్నోత్తమశ్లోకే న చేద్భక్తి రధోక్షజే ॥
>
> (శ్రీమద్భాగవతము, స్క. ౨, అధ్యా. ౪)

సర్వాత్ముడును సర్వాంతర్యామియు నైన పురుషోత్తమునియందు భక్తిలేని యెడల వర్ణాశ్రమాచార దంభంబులెందుకు? దానంబులం బ్రయోజనంబేమి? తపస్సు అధ్యయనము మొదలగునవి యన్నియు నిరుపయోగంబులే కదా! అంతేకాదు.

> విప్రాద్ద్విషడ్గుణయుతాదరవిందనాభ పాదారవింద విముఖాచ్ఛ్వపచంవరిష్ఠం ।
> మన్యే తదర్పిత మనోవచ నేహితార్థ ప్రాణం పునాతి సకులం న తు భూరిమానః ॥
>
> (శ్రీమద్భాగవతము, స్కం. ౭, అధ్యా. ౯)

జ్ఞానము, సత్యము, దమము, తపస్సు, మాత్సర్యము లేమి, హ్రీ, తితిక్ష, అనసూయ, యజ్ఞము, దానము, ధైర్యము, శాంతి యను పండ్రెండు గుణములు బ్రాహ్మణునం దుండవలయును అని సనత్సుజాతీయమునందు చెప్పియున్నది. ఇట్టి ద్వాదశగుణయుక్తుండయ్యు కమలనాభుండైన శ్రీహరియొక్క పాదారవిందములయందు భక్తిలేని బ్రాహ్మణునికంటె భక్తిగల చండాలుడు మేలు అని నాయభిప్రాయము అని ప్రహ్లాదుడు చెప్పెను.

గ్రామేషు మలినం తోయం నదీ భవతి సంగమే ।
విష్ణుభక్తివిశేషేణ శ్వపచోపి బ్రాహ్మణో భవేత్ ॥

ఏ విధముగా నొక గ్రామమునందు జలదారులు మొదలైన స్థలములయందుండు మలినోదకంబు వర్షము కురిసి వెల్లువలుగా ప్రవహించు నీటితో కలిసి ఆ నీరంతయు నొక నదియందు పడునపుడు అవియు నదియే యగునో అట్లు శ్వపచుండైనను విష్ణుభక్తిప్రభావంబున బ్రాహ్మణుడే యగును.

భక్తుడు భగవంతు నర్చించుటయందు బహు ప్రయాసతో పూజాద్రవ్యములను సంపాదించవలసిన అవశ్యము లేదు. ద్రవ్యవ్యయములేకయే అల్ప ప్రయాసతో సంపాదించుటకు సాధ్యమైన వస్తువులను అర్పించినను భక్తి ప్రభావమువల్ల ఆ అల్పవస్తువునే భగవంతులు ప్రేమతో నంగీకరింతురు.

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః ॥

(శ్రీమద్భగవద్గీత, అధ్యా. ౯)

ఎవ్వడు నాకొరకు భక్తితో ఆకును పువ్వును పండును లేక నీటిని మాత్రము అర్పించుచున్నాడో అట్టి శుద్ధాంతఃకరణము గలవానిచే భక్తిపూర్వకముగా సమర్పింపబడిన పత్రపుష్పాదులను నేను స్వీకరించుచున్నాను అని యర్థము.

శ్రద్ధయోపహృతం శ్రేష్ఠం మమ భక్తేన వార్యపి ।

(శ్రీమద్భాగవతము, స్కం. ౧౧, అధ్యా. ౨౭)

నా భక్తునిచే శ్రద్ధతో నియ్యబడిన నీరైనను నాకు శ్రేష్ఠము అని శ్రీకృష్ణులు ఉద్ధవున కుపదేశించిన దేవపూజావిధానమందు చెప్పిరి.

మోక్షమార్గత్రయము—భక్తియోగము

వస్తుతః అతి స్వల్పమైన వస్తువునైనను భక్తితో సమర్పించిన యెడల ఆ వస్తువు స్వల్పము అను న్యూనతను పోగొట్టుకొనును. ఉదాహరణములు—శ్రీ కృష్ణులవారు విదురుని యింటికి పోయిరి. ధృతరాష్ట్రుడు చక్రవర్తిగానుండిరి. వారి యింటికి పోయియుండిన యెడల వారియ్యగల మృష్టాన్నమును లక్ష్యపెట్టక భక్తుడైన విదురుని యింటికి పోయి గంజిత్రాగి తృప్తిపొందివచ్చిరి. మఱియు సుదాముండు అను భక్తుడు శ్రీకృష్ణమూర్తి దర్శనంబునకు పోయిరి. సుదామునికి కుచేలుడు అని వేఱు నామధేయము కలదు. శ్రీకృష్ణమూర్తికి సుదాముడు బాల్యస్నేహితుడు. సుదాముడు శ్రీకృష్ణులవారి దర్శనార్థము వెళ్లిన కథ శ్రీమద్భాగవతము, దశమ స్కంధము యెనుబది యొకటవ అధ్యాయమునం దున్నది.

కిముపాయన మానీతం బ్రహ్మన్ మే భవతా గృహాత్ ।

ఏమయ్యా నీవు ఇంటినుండి నాకు ఏమి తినుపదార్థంబు తెచ్చితివి అని కుచేలుని శ్రీకృష్ణమూర్తి యడిగిరి.

అణ్వప్యుపాహృతం భక్తైః ప్రేమ్ణా భూర్యేవ మే భవేత్ ।
భూర్యప్యభక్తోపహృతం న మే తోషాయ కల్పతే ॥
పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః ॥
ఇత్యుక్తోపి ద్విజస్తస్మై వ్రీడితః పతయేశ్శ్రియః ।
పృథుకప్రసృతిం రాజన్న ప్రాయచ్ఛ దవాఙ్ముఖః ॥

నాయందు భక్తిగలవారు అణుమాత్రంబు తెచ్చినను ప్రేమయను గుణముతో గూడినందున నాకు అదియే పెద్దయగును. భక్తిలేని

వారిచేత పెద్దవస్తువులు తేబడినను భక్తిలేమింజేసి నాకు సంతోషంబు నియ్యదు. భక్తితో నెవ్వడైనను పత్రమునైన బుష్పము నైన ఫలమునైన జలమునైన నాకు సమర్పించినయెడల శుద్ధాంతరంగుండైన భక్తుని యర్పణంబును నే నుపయోగించుకొందును అని నీవు నాకేయుపాయనంబు తెచ్చితివి యని యడుగుచుండగా శ్రియఃపతియు మహానీయుండునైన హరికి తా నేవిధంబున అటుకుల నియ్యందగునని సిగ్గువడి యవనతాననుండుగా నుండెనని శ్రీమద్భాగవతంబునం జెప్పియున్నది.

ఇది యేమియు నతిశయోక్తియనం దగదు. ఇందుకు అనుగుణములుగాఁ బురాణకథలు గలవు.

౧. పత్రదానము. తులసి మారేడు మొదలగు పత్రములతో పూజించుట కలదుకదా. ఇది నిజమేయైనను పత్రము అనగా ఆకుకూరతునియను అంగీకరించి అనుగ్రహించినందుకు ఇతిహాస మొక్కటి కలదు. పాండవులు జూదంబునందోడి వనవాసంబు నేయుచుండ వారలకు భోజన సుఖమునకుగా మహత్త్వమును చెందిన అక్షయపాత్రను సూర్యభగవానులు ద్రౌపదికి నిచ్చిరట. ఆ పాత్రయందు ఉంచిన పదార్థములు వారలకు కావలసినంత మృష్టాన్నంబును సిద్ధపరిచి యియ్యగలదట.

ఇట్లుండ పాండవులు పరాభవంబును పొందినయెడల సంతోషించవలెనని యాసగొన్న దుర్యోధనుడు ఒక్కనాడు మహర్షియైన దుర్వాసస్సు తన శిష్యకోటితో దేశసంచారము చేయుచుండగా వారలకు మార్గాయాస మేమాత్రమైనను కానరాకుండునట్లు శైత్యోపచారంబులంజేసి అందువలన తృప్తుండైన యమ్మహా

మోక్షమార్గత్రయము—భక్తియోగము

గ్నిని యొక వరంబు వేడెనట. ఆ వరప్రభావంబున దుర్వాసస్సు తన శిష్యకోటితోకూడ ఒకనాడు పాండవులు రాత్రిభోజనంబుచేసి విశ్రమింపబోవుసమయంబున వనంబున పాండవాశ్రమంబునకు బోయి తనకును తన శిష్యవర్గమునకును అన్నంబు కావలెనని పాండవులం బ్రార్థించెనట. అన్నము లేదన్న శాపముసిద్ధము, అన్నమియ్యుటకు సాధ్యములేదు. అట్లుండగా ద్రౌపది తనకు ఆపద్బాంధవుడైన శ్రీకృష్ణుని ధ్యానించిన నతండు ప్రత్యక్షం బయ్యెనట. అపుడు ద్రౌపది తనకు సంభవించిన దుఃఖంబును చెప్పుకొనెనట. అపుడు శ్రీకృష్ణమూర్తి తనకు లేశమాత్ర మేవస్తువు నైనను భుజింపదగిన దానిని యిచ్చిన యెడల తాను భుజించితే ద్రౌపది యింటికి అతిథులుగా వచ్చినవారలందరును ఆకలిలేక యుందురని యు నా విధంబున శాపభయంబుండదనియు చెప్పిరట. తన యింట యేమియు లేదని చాలదైన్యము నొందిన ద్రౌపది చెప్పెనట. అపుడు అక్షయపాత్రను వెదకిచూచిన నేమైన దొరుకునని శ్రీకృష్ణమూర్తి చెప్పిరట. అక్షయపాత్రశుద్ధిమై బోరలపడి యున్నదని మనవిచేసి భయకంపితమైన ద్రౌపది గద్గద స్వరంబున చెప్పుకొనెనట. అయినను శుద్ధిమైన అక్షయపాత్రను పరీక్షించి చూచిరి. దానియందు నాడు వండిన ఆకుకూర తునక ఒకటి యుండెనట. ఆ యాకుకూర తునకను తీసి నీళ్లలో కలిపి శ్రీ కృష్ణమూర్తికి అర్పించిన వారు దానిని తిని సంతోషించి తృప్తిపొందిరట. అంత దుర్వాసస్సును వారిశిష్యులును తృప్తిచెందిరట. ఈ కథ ఆరణ్యపర్వమునందున్నది.

౨. పుష్పదానము. ఈ విషయమై గజేంద్రమోక్షణం బును చదువవలయును. "ఉత్క్షిప్యసాంబుజకరం" అని చెప్పి యున్నది. గజేంద్రుడు ఒక కమలమును తొండముతో పట్టి విష్ణు మూర్తికి సమర్పించి వేడెను. ఇది పుష్పదానము చేసినవానికి భగవంతుని యనుగ్రహము.

౩. ఫలదానము. శ్రీమద్రామాయణమునందు శబరి శ్రీరా ములవారికి రుచికరములైన ఫలముల నిచ్చినదని చదివియున్నాము.

౪. తోయదానము. నీటిని సమర్పించి యనుగ్రహంబు వడసిన భక్తుడు ఒకడు ఉన్నాడు. శ్రీమద్భాగవతము, స్కం. ౯, అధ్యా. ౨౧ యందు రంతిదేవునికథ యున్నది. భరత వంశమునందు రంతిదేవుడను మహనీయు డొకడు జనియించె. క్షత్రియుడయ్యు దనకుగా నేమియు నక్కరలేదని విరక్తిచెందిన యతండు దైవవశంబున బ్రాప్తించిన యన్నము నాయా పూట యందు భుజియించుచుండెను. అంత నొక్క సమయంబున నలు వదియెనిమిది దినంబులు జలపానంబైనను లభించకపోయెను. ఒకనాడు సూర్యోదయ సమయమందు మృష్టాన్నము లభించెను. ఆ యన్నమును కుటుంబసమేతుడై భుజియింపనున్నపుడు ఒక బ్రాహ్మణు డతిథిగా వచ్చెను. "హరిం సర్వత్ర సంపశ్యన్" అని అతిథియందుకూడ హరియేయున్నాడని యా యతిథికి ఆదర పూ ర్వకంబుగా అన్నము సమర్పించిన నాయతిథి భుజించి చనియె. అతిథి పూజానంతరము శేషాన్నమును కుటుంబసమేతుడై భుజియింప ప్ర యత్నపడునపుడు ఒక శూద్రుడు వచ్చెను. హరియే శూద్రస్వరూప మున వచ్చెనని తలచి శేషాన్నములో నొక భాగమును శూద్రున

మోక్షమార్గత్రయము—భక్తియోగము

కిచ్చెను. మిగిలిన యన్నమును కుటుంబముతో భుజియించ నుద్దే శించె. అపుడు కుక్కలను తోలుకొని యొకడు వచ్చి తనకును తన కుక్కలకును అన్నమియ్యమని రాజును యాచించెను. సర్వం బును హరియే యని మ్రొక్కి మిగిలియుండిన అన్నమునంతయు కుక్కలకును కుక్కలవానికిని బహుమానపురస్సరంబుగా నిచ్చి తృప్తిపరిచెను. అపుడొక్కనికి చాలినంత జలముమాత్రము మిగిలి యుండెను. ఆ జలమునైన త్రాగుదునని త్రాగబోవు సమ యమందు ఒక పుల్కసుండు వచ్చి యదృష్టహీనుండైన నాకు అతి దాహముగానున్నది. నేను నీరువట్టుగొన్నాను. రాజన్యా, నాకు త్రాగను జలమున్నదా యని దీనవచనములతో వేడెను. అపుడు రంతిదేవుడు పరమభక్తుడు గనుక

న కామయే హం గతిమీశ్వరాణా మష్టర్థియుక్తా మ పునర్భవం వా ।
ఆర్తిం ప్రపద్యే ఖిల దేహభాజాం అంతస్థితో యేన భవంత్య దుఃఖాః ॥

ఈశ్వరుల బూజించి వారినుండి అణిమాద్యష్టైశ్వర్యములను గాని మోక్షమునుగాని గోరను. అయితే యేమి కోరుదునంటే నేను సకల భూతములయందును నివసించుశక్తియు అట్టి నివాసమువల్ల వారలనుభవించు దుఃఖములు మొదలగు దైన్యములను వారికి బదులుగా నే ననుభవించి వారలను దుఃఖరహితులుగా జేయుశక్తిని కోరెదను అని శ్రీహరిని ప్రార్థించి తనవద్దనుండిన జలమును ఆ పుల్కసునకిచ్చి వాని దాహమును తీర్చెను.

క్షుత్తృట్ఛ్రమో గాత్ర పరిశ్రమశ్చ దైన్యంక్లమశ్శోకవిషాదమోహాః ।
సర్వే నివృత్తాః కృపణస్య జంతో ర్జిజీ విషో ర్జీవ జలార్పణా న్మే ॥

జీవించుట కిచ్ఛయించుచున్న కృపణుడైన యీ పుల్కసునకు నేను జీవజలము నిచ్చుటచేత నాకు కలిగియుండిన ఆకలి, దప్పిక, శరీరప్రయాస, దైన్యము, దుఃఖము మొదలగు మోహములన్నియు నివర్తించిపోయినవి అని చెప్పబడియున్నది.

అంత నా రంతిదేవునకు బ్రహ్మాది త్రిమూర్తులు దర్శనం బొసంగిరని వ్రాసియున్నది. ఈ విషయమును శ్రీ పోతనామాత్యుల ముద్దువచనంబులతో చదువరులకు సమర్పించ నుత్సాహంబు గానవచ్చుచున్నది. నవమస్కంధమునందు

సీ॥ రాజవంశోత్తమ రంతిదేవునికీర్తి యేల చెప్పగ విను మిందు నందు।
నా రాజు దన సంచితార్థంబులన్నియు సెడపక దీనుల కిచ్చి యిచ్చి।
సకుటుంబుడై ధైర్యసంయుతుండై పేదయై కూడునీరులేక ధమవృత్తి।
నెందేని నలువదియెనిమిది దివసములచ్చరియింప నొక దివసంబు రేపు।
ఆ॥ నెయ్యిపాయసంబునీరును గలిగిన।
బహుకుటుంబ భార భయముతోడ।
నలసి నీరువట్టు నాకలియును మిక్కి।
లొదవ జూచి కుడువ నుత్సహించె॥

వ॥ అయ్యవసరంబున.

సీ॥ అతిథి భూసురు డొక్క డాహార మడిగిన గడపక ప్రియముతో గారవించి।
హరిసమర్పణం బంచు నన్నంబులో సగ మిచ్చిన భుజియించి యేగె నాత।
డంతలో నొక శూద్రు డశనార్థియై వచ్చి పొడసూపలేదనఁ బోక తనకు।
నున్న యన్నములోన నొక భాగ మిచ్చిన సంతుష్టుడై వాడు చనిన వెనుక।
ఆ॥ కుక్కగుమియుఁ దానుఁ నొక్కడేతేర నా।
యన్నశేషమిచ్చి నన్నయంబు।
లాడి మ్రొక్కి పంప నోడక చండాలు।
డొక్క డరుగుదెంచి చక్కనిలిచి॥

మోక్షమార్గత్రయము—భక్తియోగము

క ॥ హీనుడ జండాలుడను । మానవకులనాథ దప్పి మానదు నవలం ।
బోసేర నీకు జిక్కిన పానీయము నాకు బోసి బ్రతికింపగదే ॥

వ ॥ అనిన వాని దీనాలాపంబులకు గరుణించి రాజిట్లనియె.

ఉ ॥ అన్నము లేదు కొన్ని మధురాంబువు లున్నవి త్రావు మన్న రా ।
వన్న శరీరధారులకు నాపద వచ్చిన వారి యాపదల్ ।
గ్రన్నన మాన్చి వారికి సుఖంబులు సేయుట కన్న నొండు మే ।
లున్నదె నాకు దిక్కు పురుషోత్తము డొక్కడ చుమ్ము పుల్కసా ॥

వ ॥ అని పలికి

మ ॥ బలవంతంబగు నీరువట్టున నిజప్రాణాంతమైయున్న చో ।
నలయం డేమియు వీని వ్రాజ్జ్వరము నా యాసంబు ఖేదంబు నా ।
జలదానంబున నేడు మాను ననుచున్ సర్వేశ్వరాధీనుడై ।
జలమున్ బోసెను రంతిదేవుడు దయం జండాలపాత్రంబునన్ ॥

భళారా, రంతిదేవా, దానకర్ణావతారుడవే కదా.

బ్రాహ్మణుడు, శూద్రుడు, కుక్కల పెంచువాడు, చండాలుడు అను భేదంబెన్నక అన్నదానంబొసంగిన భూవరుడు గదా రంతిదేవుడు. దానంబులలో కెల్లను అన్నదానంబు శ్రేష్ఠంబని రూఢి. ఇతర దానంబులకు పాత్రాపాత్ర నిర్ణయంబున్నను అన్నదానంబునకు "అన్నస్య క్షుధితం పాత్రం" అనిన రీతిని జాతి వర్ణాశ్రమాది నియమంబులు లేవు. ఆకలిగొన్నవాడే సత్పాత్ర. అయినను రంతిదేవునివంటి వాడు సర్వసముడై "యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి" అని సర్వవ్యక్తుల యందును తన యిష్టదైవమునే కనుగొను యోగ్యతగల భక్తుడు. నలువదియెనిమిది దినములు ఆహారము లేకయుండియు తనకు

నలువది తొమ్మిదవ దినమునందు లభించిన ఆహారపదార్థముల నెల్లను ధర్మంబునేసి నీటిని కూడ శ్రీకృష్ణార్పణమస్తు అని నీరు వట్టుగొన్న చండాలున కొసంగిన మహా భక్తుడు.

కనుక "పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి" అని చెప్పిన వాక్యము అతిశయోక్తి కాదు అని యెఱుగ వలయును.

మోక్షంబనగా అజ్ఞాననాశంబని వినియున్నాము. అజ్ఞానమే పృథగ్భావము. పృథగ్భావము అనగా జీవాత్మలు ఒకరి కొకరు వేఱు అను మోహము. పృథగ్భావమువల్లనే స్వార్థత, స్వార్థతే సర్వానర్థకారణము. మోక్షమునకు సాక్షాత్ సాధనము జ్ఞానము అని చెప్పబడియె. జ్ఞానము సర్వజీవాత్మైక్యమును అనుభవించుట. జ్ఞానమునకు కర్మయు భక్తియు సాధనములనియు నిదివరకే చెప్పబడియె. "భక్తిర్జ్ఞాన జనిత్రీ" అను వాక్యమునకు అర్థము భక్తియందుకలుగు సర్వసమత్వము.

అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే ।
ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః ॥
మచ్చిత్తా మద్గతప్రాణాః బోధయంతః పరస్పరం ।
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ ॥
తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం ।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే ॥
తేషామేవానుకంపార్థ మహమజ్ఞానజం తమః ।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥

(శ్రీమద్భగవద్గీత, అధ్యా. ౧౦)

మోక్షమార్గత్రయము—భక్తియోగము

నేను సమస్తమైన జగత్తునకును ఉత్పత్తికారణము, నావలన సమస్త జగత్తును ప్రవర్తించుచున్నది అని నమ్మి పండితులు నాతత్త్వ మెఱింగి నన్ను ధ్యానముచేయుచున్నారు. నాయందు స్థిరపరుప బడిన మనస్సుగలవారు నాయందు ప్రవేశపెట్టబడిన ఇంద్రియ చేష్టలు గలవారు అగుచు సమానస్థులలో నొకరితో నొకరు తత్త్వము నెఱుగుటకుగా వాదించుకొనువారయి తమకంటె తక్కువజ్ఞానవంతులకు నామాహాత్మ్యమును గురించి కీర్తన చేయు వారయి అందువలన సంతోషము నొందుచు అత్యానందమగ్ను లగుచున్నారు. ఎల్లపుడును నాయం దేకాగ్రమైన మనస్సుకలిగి విశ్వాసపూర్వకముగా (భక్తితో) నన్ను భజియించుచుండు వార లకు నన్ను చేరుటకు కారణభూతమైన జ్ఞానయోగమును ఇచ్చు చున్నాను. ఇంతే కాదు. నేను వారల ననుగ్రహించవలెనను తలంపుతో వారలయొక్క అంతఃకరణమునందు నివసించుచుండు వాడనై వారలయొక్క (నన్ను సదా ఏకాగ్రమైన మనస్సుతో విశ్వాసపూర్వకముగా భజియించు వారియొక్క) మోహాంధకార మును జ్ఞానదీపంపు ప్రకాశంబుతో బోగొట్టెద అని యర్థము.

“చిత్తస్య శుద్ధయే కర్మ” అని కర్మలచేయుచు చిత్తశుద్ధిని సంపాదించుకొని “భక్తిర్జ్ఞాన జనిత్రీ” అని భక్తిని సలుపువారికి కర్మ ఫలము నిచ్చు భగవంతుడు బుద్ధియోగము (జ్ఞానమును) నిచ్చును. “అహం సర్వస్య ప్రభవః” అనగా

జ్ఞాతోఽసి మేఽద్య సుచిరాన్ననను దేహభాజాం న జ్ఞాయతే భగవతో గతిరిత్య వద్యం। నాన్యత్త్వదస్తి భగవ న్నపి యది తన్న శుద్ధమాయా గుణవ్యతికరాత్త్వ మురు ర్విభాసి ॥(శ్రీమద్భాగవతము, స్కం. ౩, అధ్యా. ౯)

స్వామిన్, నేను బహుకాల ప్రయత్నముయొక్క ఫలంబుగా నిన్నె ఱింగితిని. దేహులు నీయొక్క తత్త్వము నెఱుగకపోవుట చాల నష్టము. నీవొక్కడవేయైనను మాయాగుణప్రభావముంజేసి నానా రూపంబులం బొందినవానివలె కనబడుచుందువు.

> నాతః పరం పరమ యద్భవత స్స్వరూప మానందమాత్రమవికల్ప మవిద్ధవర్చః । పశ్యామి విశ్వసృజ మేక మవిశ్వ మాత్మన్ భూతేంద్రియాత్మకమద స్త ఉపాశ్రితోఽసి ॥

(శ్రీమద్భాగవతము, స్కం. 3, అధ్యా. ౯)

"మత్తస్సర్వంప్రవర్తతే" అని ఓ పరమ (పురుషోత్తమా), మబ్బు కప్పని ప్రకాశంబు గలిగినది గనుక అవికల్పమైనదియు కనుకనే ఆనందరూపము గలదియునగు నీ రూపమును ఆశ్రయించుచున్నాను. ఈ రూపము ఉపాస్యములలో నతిముఖ్యమైనది. ఏలయనగా లోకములను సృష్టించునది. కనుకనే అవిశ్వం అనగా లోకమునకంటె భిన్నము. భూతములకు నింద్రియములకును కారణము గనుక నీ రూపమును నే నాశ్రయించితిని.

"ఇతిమత్వాభజంతేమాం" అనుటకు

> తద్వా ఇదం భువనమంగళ మంగళాయ ధ్యానే స్మ నో దర్శితం త ఉపాసకానాం । తస్మై నమో భగవతే ను విధేమ తుభ్యం యో నాదృతో నరకభాగ్భిర సత్ప్రసంగైః ॥

(స్కం. 3, అధ్యా. ౯)

లోకములకెల్ల మంగళంబు నొసంగు ప్రభో, లోకముల శ్రేయస్సు కొఱకును తమయొక్క భక్తులు ధ్యానంబు సలుపుటకుగానును మాకు దర్శనంబిచ్చిన భగవంతుడైన నీకు మ్రొక్కెద.

మోక్షమార్గత్రయము—భక్తియోగము

"సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం" అనుటకు "ఆత్మభావస్థః" అనుటకును

యేతు త్వదీయ చరణాంబుజకోశగంధం జఘ్రంతి కర్ణవివరైః శ్రుతి వాత నీతం। భక్త్యా గృహీత చరణాః పరయా చ తేషాం నాపైషి నాథ హృదయాంబురుహాత్స్వపుంసాం ॥

తావద్భయం ద్రవిణగేహసుహృన్నిమిత్తం శోకస్పృహా పరిభవో విపులశ్చ లోభః। తావన్మమేత్య సదవగ్రహ ఆర్తిమూలం యావన్న తేంఘ్రి మభయం ప్రవృణీత లోకః ॥

దైవేన తే హతధియో భవతః ప్రసంగా త్సర్వాశుభోపశమనా ద్విముఖేంద్రియా యే। కుర్వంతి కామసుఖలేశలవాయ దీనా లోభాభిభూత మనసో కుశలాని శశ్వత్ ॥　　　　(స్కం. ౩, అధ్యా. ౯)

ఏ భక్తులు తమ పాదకమలములయొక్క పరిమళమును ఘ్రాణింతురో అనగా నెవ్వరు తమ మహాత్మ్యంబును శ్రవణభక్తిచేసి విందురో, ఏ భక్తులయొక్క హృదయమునందు త్వదీయ పాదారవింద పరిమళంబు జొనపబడియున్నదో, ఏ భక్తులు పరమప్రేమతో తమ పాదంబులను పట్టియుందురో వారి హృదయంబులందునుండి తాము తొలంగరు.

ధనము, గృహము, సుహృత్తులు మొదలగు వారి విషయముగా భయమును, ధనాదులకు నాశంబువాటిల్లెనేని దుఃఖము, పోగొట్టుకొన్న వాటిని మరల సంపాదించవలెనను ఇచ్ఛ, ఆ యిచ్ఛవల్ల ధైర్యహానియు, ధైర్యహానివల్ల నత్యంతమైన లోభము, మఱియు భయశోక పరిభవ లోభంబులనుండి మమతయు నరుడు

చెందుచుండును. ఇట్టి దుఃఖంబులు ముక్తిప్రదంబులగు తమ పాదారవిందంబులను నరుడు ఆశ్రయించువరకును కలుగుచుండును. దైన్యమునకు కారణమైన మమత నరుడు తమ పాదారవిందములు చేరునంతవరకును కలుగుచుండును. ప్రారబ్ధకర్మవశంబున బుద్ధి ముశించినవారు సకల అనర్థములనును మాన్పగల తమ కథాశ్రవణమునందు మనస్సునుపెట్టరు. లోభము మొదలగు శత్రువర్గము చేత మోహింపబడిన మూఢులు దీనులై కామసుఖము అను స్వల్పములకుగా అశుభములైన కర్మలను చేయుచుందురు.

జ్ఞానదీప మనగా

వైరాగ్యతైలసంపూర్ణే భక్తివర్తిసమన్వితే ।
ప్రజ్ఞాన పూర్ణపాత్రే తు జ్ఞప్తిదీపం విలోకయేత్ ॥

(దక్షిణామూర్త్యుపనిషత్)

వివేకప్రత్యయరూపేణ భక్తిప్రసాదస్నేహాభిషిక్తేన, మద్భావనాభినివేశవాతేరితేన బ్రహ్మచర్యాదిసాధనసంస్కారవత్ప్రజ్ఞావర్తినా విరక్తాంతఃకరణాధారేణ విషయవ్యావృత్తచిత్తరాగద్వేషాకలుషితనివాతాపవరకస్థేన నిత్యప్రవృత్తైకాగ్ర్యధ్యానజనితసమ్యగ్దర్శనభాస్వతా జ్ఞానదీపేనేత్యర్థః ।

(శంకరభాష్యం—గీత, అధ్యా. ౧౦, శ్లో. ౧౧)

దీపమునకు నూనె ఏదనగా ఆత్మజ్ఞానమును సంపాదించవలెను అను ఆస్త. అట్టి ఆస్తకు సంబంధించిన అనుగ్రహము తైలము. గాలి తోలని తావునందు దీపము వెలుగదు. వెలుగుటకు అనుకూలమైనంత గాలి కావలయును. అట్టిగాలి యేదనగా భగవంతునిచేరవలెను అను ఆశ. బ్రహ్మచర్యము, శమము, దమము మొదలగు గుణముల

మోక్షమార్గత్రయము—భక్తియోగము

వల్ల పుట్టిన ప్రజ్ఞయే వర్తి. వైరాగ్యము అనునది గూడు. గూటిలో దీపము వెలుగునని ఉద్దేశము. ప్రతినిత్యమును జరుపుచు వచ్చిన ఏకాగ్రసహితమైన ధ్యానమునుండి పుట్టిన తెలివి అను ప్రకాశముగలది జ్ఞానదీపము. ఇది "భక్తిర్జ్ఞాన జనిత్రీ" యనుటకు వివరము.

జ్ఞానమునకు కారణభూతమైన భక్తి జ్ఞానము పుట్టినతరువాత ఆ జ్ఞానమువల్ల ఉపాసకుడు తెలిసికొనిన సర్వజీవాత్మైక్యజ్ఞానముతో కలిసి భగవత్కైంకర్యము చేయునట్టుగా నగును. జ్ఞానాభ్యాసముతో కలిసినభక్తికి పరాభక్తియని పేరు.

> శాంతా స్సమదృశశ్శుద్ధాస్సర్వభూతానురంజనాః ।
> యాంత్యంజ సాచ్యుత పద మచ్యుతభాంధవాః ॥
>
> (శ్రీమద్భాగవతము, స్కం. ౪, అ. ౧౨)

శాంతులు, సమదర్శనము గలవారు, శుద్ధులు, సర్వభూతములయందును స్నేహమును చూపువారు నగు భక్తులు విష్ణుమూర్తికి బంధువులు గనుక విష్ణుసాయుజ్యమును చెందుదురు.

> జ్ఞానవైరాగ్యయుక్తేన భక్తియోగేన యోగినః ।
> క్షేమాయ పాదమూలం మే ప్రవిశంత్యకుతో భయం ॥
>
> (శ్రీమద్భాగవతము, స్కం. 3, అధ్యా. ౨౫)

జ్ఞానవైరాగ్య యుక్తమగు భక్తియోగము నభ్యసించి భయము లేని నా పాదారవిందములను చేరుదురు.

కనుకనే "కౌంతేయ ప్రతిజానీహి న మేభక్తః ప్రణశ్యతి" అని శ్రీకృష్ణమూర్తి చెప్పినారు.

భక్తినిగురించి వ్రాయుటకు ఇట్టి గ్రంథములు రెండు కావలసివచ్చును. ఇప్పటికే ఆత్మవిచారము పూర్వభాగమునకన్న నుత్తరభాగము డెబ్బది పుట లధికముగా నగునట్లున్నది. కనుక సంగ్రహముగా ముగించవలసియున్నది.

భక్తుని లోకులు చూచునపుడు అతనియందు కొన్ని సద్గుణములు బహిరంగముగా తెలియవచ్చుచుండును. ఆ గుణములలో ముఖ్యములైనవి—నమ్రత, సంతోషము, పరమకారుణ్యము, సర్వభూతసమత్వము, స్వార్థేహను పరిపూర్ణముగా మరిచి పరార్థేహానే యభ్యసించుచుండుట అనునవి. ఈ చిహ్నములను శ్రీభగవద్గీత, ౧౨ వ అధ్యాయము, ౧౩ మొదలు ౧౯ వరకును గల శ్లోకములలో విశదీకరించియున్నది.

శ్రవణమనననిదిధ్యాస లను నామంబున వ్రాయబడిన ఈ అయిదవ యధ్యాయము చాల విపులముగా వ్రాయబడినది. మోక్షమార్గములు మూడు అనియు ఆ మార్గములయందు చరించుచు వచ్చుచుండగా ఆ మార్గములే యోగములు అను నామధేయమును పొందును అనియు నెఱుగవలసినది ముఖ్యాంశము. "యోగాస్త్రయో మయా ప్రోక్తాః" అను శ్రీమద్భాగవత శ్లోకము ఈ అధ్యాయమునందు వ్రాయబడియున్నది. కర్మమార్గము, భక్తిమార్గము, జ్ఞానమార్గము అనుపేర వ్యవహరింపడు ఆచరణలు క్రమేణ కర్మయోగము, భక్తియోగము, జ్ఞానయోగము అని పేరుపొందును. అన్ని యోగములయందును బాహ్యేంద్రియ అంతరింద్రియ నిగ్రహంబులు అత్యావశ్యకము. ఉపాసకుడు కర్మమార్గమునందు నిత్యకృత్యములను జరుపుచువచ్చి కర్మచేయు నభ్యా

సమును పొందుచున్నాడు. ఆహ్నిక క్రియలయందు ఇంద్రియ నిగ్రహంబును పరోపకారబుద్ధియు నభ్యసించుటకు వీలు గలదు. ఏ యొక మార్గమునందుగాని చరియించి ఆ యోగము నభ్యసించు వారు మిగిలిన రెండు యోగములనును అవశ్యాత్తుగా బొందుదురు. కర్మయోగి భక్తినభ్యసించి కర్మఫలత్యాగము నాచరించి అందు వలన నహంకారమనుకారంబులం జంపి జ్ఞానియగును. భక్తినిండిన హృదయమునందు జ్ఞాన మేవిధముగా నంకురించునని యిదివరకే విచారించితిమి.

నిదిధ్యాసవల్ల జాతికులగోత్రములను దాటి ఉపాసకుడు పరమాత్మానుగ్రహంబు బడసి యానందించి పరమేశ్వరానుగ్రహ పాత్రుడగును. శ్రమలేవియు నతని లక్ష్యంబును మారునట్టు చేయుటకు శక్తికలిగి యుండవు. కైంకర్యము మరువకూడదు.

> ఏకాదశస్థే గోవిందే ముకుందే యదునందనే ।
> కిం కుర్వంతి గ్రహాః స్సర్వే ద్వాదశాష్టమజన్మసు ॥

ఏకాదశేంద్రియమైన మనస్సునందు భగవంతుడు నిలిచియుండగా గ్రహచారాదిశ్రమలు అతనిని ఏమి చేయగలవు. గోచారరీతిగా జ్యోతిషమునందు ఏకాదస్థానమునం దుండు గ్రహములు శుభఫల దాయకములు. ద్వాదశము, అష్టమము, జన్మము అను స్థానము లందు ఉండు గ్రహములు దుఃఖదాయకములు. రాజగ్రహమైన గోవిందుడు ఏకాదశస్థాన మను మనస్సునందుండినయెడల నిజము గానే గ్రహచారము క్రూరకాలముగానున్నను భక్తునికి బాధ కలుగదు.

ధ్యాయన్తు చేశ్వరం నిత్యం శుక్లవర్ణం చతుర్భుజం ।
శంఖచక్రగదాపద్మ వనమాలా విభూషితం ॥
కౌస్తుభాభరణం దేవం నీలపీతాంబరావృతం ।
అనన్తమవ్యయం రూపం నిర్గుణం సగుణాత్మకం ॥

---

అనేకజన్మసిద్ధానాం శుద్ధానాం సత్త్వదేహినాం ।
ముక్తిత్వమను వక్తవ్యం బ్రహ్మతత్త్వ విభావణాత్ ॥

---

సదా జ్ఞానసిద్ధః సదా కర్మసిద్ధః
సదాభక్తిసిద్ధ స్స్వరూపోహమాత్మా ।
నవైనైకసిద్ధః సదా సర్వ సిద్ధః
సదా కేవలా కేవలస్సత్యరూపః ॥

---

సబోధస్వరూపో విరూపోయమాత్మా ।
హ్యభేదప్రయుక్తో న భేదోయమాత్మా ॥
న సర్వత్ర సంసార సిద్ధోయమాత్మా ।
విభిన్నః పరస్సర్వరూపోయమాత్మా ॥

---

యస్యావతారగుణకర్మవిడంబనాని
నామాని యే సువిగమే వివశా గృణంతి ।
తే నేక జన్మశమలం సహ సైవ హిత్వా
సంయాంత్యపావృత మృతం తమజం ప్రపద్యే ॥

---

## ౬ వ అధ్యాయము

ప్రాయేణ దేవ మునయ స్స్వవిముక్తికామా
మౌనం చరంతి విజనే న పరార్థనిష్ఠాః ।
నైతాన్ విహాయ కృపణాన్ విముముక్ష ఏకో
నాస్య త్వదన్యశరణం భ్రమతో౽నుపశ్యే ॥
(శ్రీమద్భాగవతము. స్క. ౭, అధ్యా. ౯)

---

## కైంకర్యము

కైంకర్యము అను విషయమునుగురించి వ్రాయుటకు పూర్వము ఆత్మవిచారము, పూర్వభాగములోనును, ఉత్తరభాగములో ఐదు అధ్యాయముల యందును చెప్పిన విషయముల సారాంశమును విచారించి అ విషయములను ఉపసంహరించవలయును.

ప్రజ్ఞానాంశువు అని మనము తెలిసికొనిన మోనడ్డు (monad) అను పరిచ్ఛిన్నవ్యక్తి సప్తలోకరూపమైన బ్రహ్మాండమునకు వెలుపలిలోకములైన గోలోకము వైకుంఠము అను లోకములనుండి బయలువెడలి యీ బ్రహ్మాండమును ప్రవేశించెను. ప్రవేశించి సత్యలోకము, తపోలోకము, జనలోకము అను లోకములయందలి దేవతలచే నాతిథ్యమును బొంది దివ్యజ్ఞానసమాజపు

వారి గ్రంథములలో చెప్పిన ఆత్మిక్ ప్లేను, బుద్ధిక్ ప్లేను, హైయర్ మెంటల్ ప్లేను అను లోకములయందు ఒక్కొక్క అణువును సంపాదించుకొనెను. సత్యలోకము, తపోలోకము, జనలోకము అనునవి అరూపలోకములు గనుక రూపమును ఆ లోకములలో సంపాదించుకొనకయే అణువులను మాత్రము సంపాదించుకొని ఆ లోకములయందలి దేవతల సహాయముతో రూపలోకములయిన భూలోక భువర్లోక స్వర్గలోకములయందు ప్రవేశించి సప్తవర్గముల యందు కొంతకొంతగా స్థూలస్పందములను అనుభవించుటకు ఆరంభించెను.

సప్తవర్గములలో ప్రవేశించెనని చెప్పితిమికదా. సప్తవర్గము లేవనిన—

౧. అభ్యాత్మవర్గము (First Elemental Kingdom). ౨. సౌరాత్మవర్గము (Second Elemental Kingdom). 3. చంద్రాత్మవర్గము (Third Elementral Kingdom). ౪. పాషాణాదిధాతువర్గము (Mineral Kingdom). ౫. తరుగుల్మలతాది వర్గము (Vegetable Kingdom). ౬. మృగవర్గము (Animal Kingdom). ౭. మనుష్యవర్గము (Human Kingdom). ఈ సప్తవర్గములలోనును ఒకటి వెంబడి యొకటిలో ప్రవేశించి సమూహాత్మ (Group soul) యొక్క గర్భవాసమందు పెరుగుచువచ్చి క్రమేణ స్థూలశరీరము లేక భూతాత్మ (Physical Elemental), కామమయశరీరము లేక ఇంద్రియాత్మ (Desire Elemental), సంకల్పాత్మ లేక మనోమయశరీరము (Mental Elemental), అను వాటిని సంపాదించుకొని క్రమేణ ఫిజికల్ ప్లేను, ఆస్ట్రిల్ ప్లేను,

లోయర్ మెంటల్ ప్లేను అను లోకములయందు స్థాయీభావ మును చెందెను.

భూలోక భువర్లోక స్వర్గలోకములు అను ముల్లోకంబునకును పురాణములయందు "త్రిలోకి" అని పేరు. ఈ ముల్లోకంబును బ్రహ్మదేవునియొక్క దైనందిన ప్రళయావసరమునందు అనంతుని ముఖమునందుండి యుద్భవిల్లు అగ్నివల్ల దహించబడగా పై ముల్లోకంబైన జనలోకము, తపోలోకము, సత్యలోకంబులకు ఆ ప్రళయబాధ లేకుండును అని శ్రీమద్భాగవతమునందు వివర ముగా చెప్పబడియున్నది.

అరూపముల్లోకంబునందలి యోగులకు అమూర్తయోగు లని పేరు. రూపముల్లోకంబు నందలి యోగులకు మూర్తయోగు లని పేరు. "అమూర్తానాంచ మూర్తానాం ధ్యాయినాం యోగ చక్షుషాం" అని పురాణములందు ప్రస్తావించబడియున్నది. భూ లోక భువర్లోక స్వర్గలోకము అను మూర్తత్రిలోకంబునకును జన లోక తపోలోక సత్యలోకము అను అమూర్తత్రిలోకంబునకును మధ్యన ఉండి అమూర్తంబున కమూర్తంబుగానును మూర్తంబున కు మూర్తముగాను ఉండునది అమూర్తమూర్తలోకము అగు మహర్లోకము. దీనికే లోకాలోకము అనియు పురాణసంప్రదాయ నామధేయంబు కలదు.

బ్రహ్మాండాద్బహిః ఉండి బ్రహ్మాండమునందు ప్రవేశించిన ప్రజ్ఞానాంశువు హైయర్ మెంటల్ ప్లేను నుండి అధ్యాత్మవర్గములో సంచరించి అనేక కాలమునకు పిమ్మట లోయర్ మెంటల్ ప్లేను నందు సౌరాత్మవర్గము నందు ప్రవేశించి సంచరించి ఆస్ట్రల్ ప్లేను

నందు చంద్రాత్మవర్గంబునందుండి ఫిజికల్ ప్లేనుకు దిగి ధాతువర్గము నందు సంచార మారంభించి అనేకలక్షుల సంవత్సరములకాలము ధాతువర్గములోనును మరియు ననేకలక్షుల సంవత్సరకాలము తరు గుల్మలతాదివర్గములోనును మరియు ననేకలక్షుల సంవత్సరములకాల ము మృగవర్గములోనును సంచరించి జన్మించి చచ్చి మరల పుట్టి పుట్టి సమూహాత్మయందు ఇమిడియుండు గుణములను పంచుకొని మనుష్యశరీరధారియై భూతాత్మ, ఇంద్రియాత్మ, సంకల్పాత్మ లను శరీరవర్గంబులో హైయర్ మెంటల్ ప్లేనులో విజ్ఞానాత్మ యను పేర నెలుంగబడు హైయర్ మెంటల్ బాడీని సంపాదించుకొని యిది మొదలు జీవాత్మయను సంజ్ఞావాచకంబు అన్వయించునట్లు ఏర్పడును.

ఇదిమొదలు జీవాత్మయొక్క వికాసమును విచారించవల యును. ఈ సందర్భమునందు ప్రజ్ఞనాంశువు తన ప్రతిబింబమైన జీవాత్మనును అతని ప్రతిబింబముగా మూర్తత్రిలోకియందు వ్యవ హారముచేయు భూతాత్మ ఇంద్రియాత్మ సంకల్పాత్మల సంఘాతమైన లోయర్ సెల్ఫ (Lower Self) అను ప్రతిబింబమును స్థూలత్రిలోకి యందలి వ్యవహారము ప్రారంభించుటకుగా నియోగించును. మూర్త త్రిలోకియందు వ్యవహరించునది ప్రతిబింబముయొక్క ప్రతిబింబము. మొదటి ప్రతిబింబము జీవాత్మ. జీవాత్మయొక్క ప్రతిబింబము లోయర్ సెల్ఫ అనునది. లోయర్ సెల్ఫ (Lower Self) అనగా భూతాత్మ ఇంద్రియాత్మ సంకల్పాత్మలయొక్క సంఘాతము.

ప్రతిబింబము అను శబ్దము వేదాంతపరిభాషకు చేరినది. వేదాంతములో ఆ శబ్దమునకు ఇచ్చియుండు అర్థము పరిపూర్ణ ముగా అన్వయించునో ఏమో లేక వేదాంతుల మనస్సులలో ప్రతి

బింబము అను పదము ఎన్ని అర్థములను కలుగజేయునో అన్నియు నే నిక్కడ యుద్దేశించియుండలేదు. కనుక ప్రతిబింబము అనుట కంటె ప్రతికృతి అను పదము నుపయోగించుట మంచిది అని తోచుచున్నది.

పరమాత్మయొక్క అంశ ప్రజ్ఞానాంశువు (Monad). ప్రజ్ఞానాంశువుయొక్క ప్రతికృతి జీవాత్మ. జీవాత్మయొక్క ప్రతికృతి లోయర్ సెల్ఫు (Lower Self). మూర్తత్రిలోకియయిన భూలోక భువర్లోక స్వర్గలోకములయందు వ్యవహరించునది లోయర్ సెల్ఫు. లోయర్ సెల్ఫుయొక్క వ్యవహారమున కంతయు జీవాత్మ సాక్షి. అదేవిధమున జీవాత్మయొక్క వ్యవహారములకంతయు ప్రజ్ఞానాంశువు సాక్షి, ప్రజ్ఞానాంశువుయొక్క వ్యవహారముల కంతయు పరమేశ్వరుడు సాక్షి.

జీవాత్మ (జీవాత్మయొక్క ప్రతికృతి) భూలోకమునందు అహం మమ అను పృథగ్భావమును సంపాదించి లోకానుభవమును సంపాదించుట కారంభించును. స్థూలశరీరసంబంధియగు మెదడు అను భాగము నుపయోగించి పూర్వాపర జ్ఞానరూపకమైన జ్ఞాపకమును సంపాదించును. జ్ఞాపకమునుండి విమర్శజ్ఞాన ముదయించును.

జ్ఞాపకము, విమర్శజ్ఞానము అను శక్తుల నభ్యసించుచు రాగా రాగా క్రమేణ శీలము అను నడతను చక్కపెట్టుకోవలెనని తోచును. ఈ ప్రకారముగా ననేక జన్మములయందు కూడపెట్టిన యనుభవములయొక్క సహాయముచే అంతఃకరణము (మనస్సు-బుద్ధి-చిత్తము-అహంకారము) అనునది కొంచెకొంచెముగా పక్వమగుచు వచ్చును. పక్వము అయిన అంతఃకరణమునకును అపక్వాంతఃకరణమునకును

వ్యత్యాసము అనేక తరగతులు కలదిగానుండును. అంతఃకరణము నుపయోగించుట కారంభించునప్పటికి కామమయ మనోమయ శరీరములు కొంచెకొంచెముగా రూపేర్పడుట కారంభించును.

ఈ మాత్రము వికాసము సాధ్యమైనపుడు జీవాత్మయొక్క సంకల్పములకు రూపేర్పడి సంకల్పరూపములు అని ఆత్మవిచారము, పూర్వభాగమునందు చెప్పిన (Thought Forms) థాట్ ఫారమ్స్ ఏర్పడి ఆ సంకల్పరూపములకు మహిమ యేర్పడును.

సంకల్పరూపములకు మహిమ యేర్పడనపుడు తానుండు స్థలమునకు సమీపమునందే అతనికి యిన్ని దినములును కార్యములు జరుపుటకు సాధ్యముగానుండినది. ఇపుడు తన స్థూలశరీర మెక్కడనుండినను మనోమయశరీరముతో నతిదూరస్థలమునందు కూడ పనిచేయుటకు సాధ్యమగును. సంకల్పరూపములు అను నౌకరులను సృష్టించి రవాణాచేయుచు వాటియొక్క శక్త్యనుసారము పనులు చేసినవా లేవా అని గమనించవచ్చును. ఈ గ్రంథము 3వ అధ్యాయములో చెప్పినట్టు స్థూలేతరశరీరములను సుష్టుచేయుచు రావచ్చును. అనేక జన్మములయందు స్థూలశరీరముతోనును కామమయమనోమయశరీరంబులతోనును కలుగజేసిన కర్మఫలములను అనుభవించి మెంటల్ ప్లేనునందు తన తలంపులను బలపరచుకొనుచు మళ్లీజన్మమునకు దిగివచ్చి ముందుజన్మమునందుకంటె క్రొత్త జన్మమునందు అంతఃకరణకు శక్తులు అధికమగుచుండగా శాస్త్ర శ్రవణము పఠనము మొదలగు సంస్కారములవల్ల ప్రవృత్తిమార్గ యాత్రయందు విముఖుడై నివృత్తిమార్గయాత్రయం దిచ్ఛ ముదురుచు వచ్చును.

ఈ స్థితియందు కొంచెకొంచెముగా దేహాత్మభావము మాసి పోవుట కారంభమగును. నివృత్తిమార్గమును ప్రవేశించిన యతడు శ్రద్ధాభక్తిధ్యానయోగంబుల మెల్లమెల్లన నభ్యసించును. నాడీ శోధనంబు మొదలగు ఉపాసనల నారంభించును. శ్రవణము, మన నము, ఉపాసన ఇత్యాదులవల్ల కొంతకొంతగా నాసురసంపద్గుణము లను జయించి దైవీసంపద్గుణములను స్థిరపరచుకొనుట కారంభిం చును. మఱియు చోదకగురువులవారి నాశ్రయించి వారిమూల ముగా బోధకగురువుల వారినికూడ పరోక్షజ్ఞానముతో సేవించు చుండును. నాడీశోధన, చక్రములయందు ధారణ, కుండలినీ శక్తిని మేలుకొలుపుట మొదలగు నుపదేశములను పొందుచురాగలడు. స్వార్థేహ యున్నంతవరకును ఈయుపాసనలు సఫలంబులు గావు. స్వార్థేహను పరిపూర్ణముగా వదిలినపుడు యోగసిద్ధులు ఒక టొకటిగా వ్యక్తంబులగును.

"దుర్గం పథం యత్తత్కవయో వదంతి" అని యుపనిష త్తులలో చెప్పబడియున్నది. ఈ నివృత్తిమార్గము నడుచుటకు కష్ట మయిన మార్గము. "అసిధారా వ్రతచర్య" యనియు నీ మార్గ యాత్రకు పేరు. సాధారణముగా జనులు కష్టమైన పనిని "కత్తి మీది సాము" అని వాడుట కలదు. అసి యనగా కత్తి. ధార యనగా కత్తియొక్క పదునైన పార్శ్వము. వ్రతచర్య యనగా కత్తిని పదునైన పార్శ్వమును పైకివచ్చునట్టుగా పెట్టి ఆ పదును పైన నడుచుట. అరికాళ్లు కోతబడును, కాన ప్రయాణము జరుగుట అసాధ్యము అని అర్థము. ఏలయనగా ప్రవృత్తిమార్గ మునందు నడుచుచుండు కాలమునందు పృథగ్భావమును అభ్యసించి

జీవాత్మ యితరుల సౌఖ్యములను గమనించకయే తనకు కలుగవలె నని తాను కోరిన లాభములను ఇతరులకు నష్టముకలిగినను చింత లేదు అని వితర్కించి లాభములను పొందుచుండెను. తానువేఱు, ఇతరులు వేఱు అను భావము నమ్మకముగానుండి లాభమునందే దృష్టికలిగి యుండెను. ప్రవృత్తిమార్గమునందు కొన్ని వేల సంవత్సరములు నడిచినపిమ్మట స్వప్రయోజనమునందే దృష్టియుండినను అపుడపుడు కృపారూపకముగా నితరులకు కష్టనివారణ చేయవలయు నను ఆశతో కొన్ని ధర్మకార్యములు మొదలగు నిష్టాపూర్తాదులను చేయుచు ఆ కార్యములయొక్క ప్రతిఫలముగా సంతోషమును అనుభవించుచు వచ్చును. ఆ సంతోషములు కొంత కాలమే నిలిచియుండునని తెలిసియు జీవాత్మ మరలమరల అదే సంతోషములను పృథగ్భావముతో స్వప్రయోజనార్థము గానును స్వజనప్రయోజనార్థము గానును అనుభవించుచుండును.

ఈ పృథగ్భావము ప్రవృత్తిమార్గమునందు నడుచుటకు అవశ్యమే. అయినను నివృత్తిమార్గమును ప్రవేశించినపుడు వదలవలసిన గుణములలో మొదటిది పృథగ్భావము. ప్రవృత్తిమార్గయాత్రాంత్యమునందును నివృత్తిమార్గయాత్రారంభమునందును పృథగ్భావము చాలమట్టుకు నశించినట్టు కనబడుచు కొంచెము కొంచెముగా నరిగిపోవుచు నివృత్తిమార్గమునందు అభిలాష అధికము కాను కాను పరిపూర్ణముగా మాసిపోవలయును. అయినను బహుకాలముగా నభ్యసింపబడిన గుణము గనుక సులభముగా మాసిపోదు. యోగసిద్ధులు, అంతకంటె చాల తక్కువజాతి సిద్ధులు మొదలగునవి ఉపాసకునికి కలుగుచురాగా ఆ సిద్ధులవల్ల కలుగు

లాభమును స్వప్రయోజనార్థము ఏమాత్రమైనను ఉపయోగించ కూడదు. ఉపయోగించినయెడల పతనము సిద్ధము.

యోగభ్రష్టము ఎంతో నష్టకారి. యోగభ్రష్టమున్నది గనుకనే కత్తిమీది సాము అని యీ మార్గమును వర్ణించియున్నారు.

యోగసిద్ధులకంటె తక్కువైన సిద్ధులున్నవని పైన ప్రస్తావింప బడెను. అవి యేవి అనగా—౧. సంకల్పశక్తి. ౨. కొంత మట్టుకు ఇతరుల మనస్సును తన మనస్సుతో జయించగలశక్తి. 3. ఇతరుల రహస్యములను ఉద్దేశించి ఈ వ్యవహార మితనిచే నేవిధముగా జరుపబడినది అని యూహించుట. ౪. ఉపాసకుని దేహము నందునుండి వెలుపలికి నిరంతరాయముగా ప్రవహించుచుండు విద్యుచ్ఛక్తిని యితరులపై నుపయోగించుట, సంకల్పశక్తిని ఉపయోగించువిధము మొదలగునవి. ఉపాసకుడు ఇచ్ఛయించితే తాను ఒక విధముగా నొక కార్యము జరుగవలెనని నిష్కర్షచేసి ఎదుటివాడు తన యిష్టప్రకారము జరుపవలెనని కోరుట. ఇది తప్పు. లేక మనమెక్కి సవారిచేయుచున్న గుఱ్ఱమునకు అలసట కనుపడక యుండవలయునని తైలధారవలె చింతించి సంకల్పశక్తిని ఉపయోగపెట్టవచ్చును. ఇది యోగ్యమైనకార్యము. మనము సవారిలో పోవుచుండు రిక్షాబండిని లాగుచుండు వానికి బండిలాగిన బడలికలేకుండవలెనని దృఢసంకల్పముచేయుట. అందువలన నిస్సందేహముగా కూలివానికి బడలిక తగ్గును. లేక బాటవెంబడి మనము పోవుచుండగా బాటసారులు మూటలు మోసికొని డస్సినది చూచి వారల తలపైనగాని మూపునగాని ఉన్న మూటయొక్క భారము పాటింపు లేకపోవలెనని మనసా ధృఢప్రయత్నము

చేయుట. అందువల్ల ఉపాసకుని మనస్సుయొక్క శక్తిననుసరించి బాటసారుల బడలిక తగ్గును. లేక ఉపాసకుడు వీథులలో నడుచుచుండునపుడు దేహజాడ్యములు కలిగి అనేక విధములైన శ్రమలు పడువారల కంతయు ప్రయాస తగ్గవలెనని ధృఢమైన సంకల్పములను చేసి సంకల్పరూపములను వెదచల్లుచు వీథులవెంబడి నడుచుచుండుట. ఇవి మొదలగు ననేక విధములలో సంకల్ప శక్తిని ఉపయోగించి పరమేశ్వరుని కైంకర్యమును అనుకంపాస్వభావముతో నిరర్గళముగా రెండవ మనుష్యునికి తెలియకయే చేయుచురావచ్చును. చేయవలయునని కూడ చెప్పవచ్చును. ఇతరుల మనస్సులను తన మనస్సుతో గెలుచుశక్తి సులభముగా సంపాదించ వచ్చును గాని నివృత్తిమార్గయాత్ర చేయువాడు అభ్యసించ కూడదు.

ఉపాసకుని దేహమునందలి విద్యుచ్ఛక్తిని యితరుల లాభము కొఱకు వారలపై కుమ్మరించుట. ఇది అతి సులభముగా చేయవచ్చును. ఇట్టి సిద్ధులు కొన్ని 'దేహముల సౌష్ఠవము' అను నధ్యాయమునందు వివరించబడియున్నవి.

ఇట్లు జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలయందు ఉపాసకుడు భూలోకభువర్లోక స్వర్గలోకముల యందంతటయు నుండు సకల భూతములకును అనుకంపారూపమైన సహాయమును చేయుచుండవచ్చును. సహాయము చేయవలసినది ముఖ్యమే గాని ఇట్టివారి వద్దనుండి సహాయము వచ్చినది అని సహాయము పొందినవానికి తెలియవలసినది లేదు. వానివద్దనుండి ఉపాసకునికి కృతజ్ఞతాపూర్వక నమస్కారము అవశ్యము లేదు. సహాయముచేయుటయందు అదృశ్యుడుగా నుండి సహాయముచేయుట ఉపాసకునికి ధర్మము. సహాయ

ము చేయుటకు వీడు నావాడు కనుక వీనికి సహాయముచేయవలయును, వీడు నావాడు కాడు కనుక సహాయము చేయకూడదు అని విమర్శకు అవకాశముండదు.

> ఇదం మదీయం ఇదంనేతి గణనా లఘుచేతిసాం ।
> ఉదారచరితానాం తు వసుధైవ కుటుంబకం ॥

అని యుదారచరితుడైన యుపాసకునకు అందరును తన కుటుంబమునకు చేరినవారే అని నమ్మకముండవలయును. అపుడే ప్రేమ నిరాటంకముగా ప్రవహించును.

ఇట్లు పరోపకారబుద్ధి ముదురుచురాగా పరేంగితజ్ఞానము అను సిద్ధి లభించును. పరేంగితజ్ఞానమును గురించి ఆత్మవిచారము, పూర్వభాగమునందు వ్రాయబడి యున్నది. పరేంగితజ్ఞానసిద్ధి కలిగినపుడు ఇతరులు వారల దుఃఖములు మనకు తెలుపకయే వారి దుఃఖములను మనము ఎఱిగి వారలకు సహాయము చేయవచ్చును.

ఇట్లు పరోపకారము ఇతరులకు తెలియకయే చేయుచు వచ్చిన యెడల తురీయావస్థను అందుకొను శక్తి ఉపాసకునికి కలిగి బుద్ధిక్ ప్లేనులో (Buddhic Plane) పనిచేయు శక్తి కలుగును. ఉపాసకుడు మెట్టుమెట్టుగా జ్ఞానదీక్షలను పొందుట కర్హుడగును.

ఒక చెడుపుమాత్రము సంభవించకయే చూచుకోవలయును. ఆత్మస్తుతియను రోగమునకు అవ మియ్యకూడదు. ఆత్మస్తుతి చేసికొని స్వసద్గుణప్రకటన చేయుట కారంభించగానే పతనము సిద్ధము.

ఇట్లు చిన్న చిన్న సహాయములు చేయుచువచ్చిన యెడల క్రమేణ జీవన్ముక్తుడై తదనంతరము ఆధికారికపురుషవర్గమునందు చేరవచ్చును.

జాగ్రదవస్థయందు తలచిన తలంపులును, కోరిన కోర్కెలకు అనుకూలమైన తలంపులును, రాత్రియందు స్వప్నముగా వచ్చుట అందరికి తెలిసినవిషయమే కదా. దీనికి అర్థమేమనగా మనము చేయు కార్యములు స్వభావములుగా నేర్పడును. జాగ్రదవస్థయందు ఎవరెవరికి ఏయే స్వభావములు వ్యక్తములుగా నుండునో ఆ స్వభావములే స్వప్నావస్థలో కూడ అనుష్ఠింపబడును. మనస్సు జాగ్రదవస్థలో స్థూలశరీరమును పరోపకార స్వభావమునకు లోపరిచి పరోపకారాదులను స్వాభావికకార్యములగా జరుపును. అదే మనస్సు స్వప్నావస్థయందు ఆస్ట్రిల్ బాడీయందుండి స్వాభావికముగా పరోపకారకార్యములయందు ప్రవర్తించునట్టుగా చేయును. అదే మనస్సు సుషుప్త్యవస్థయందు మనోమయ శరీరములతో పరోపకారరూపక కైంకర్యములను జరుపును. ఇందువల్లనే “కర్మ స్వాభావికం మత్వా” అని చెప్పబడియె.

స్వాభావికముగా పరోపకారము చేయుట అను శక్తిని సంపాదించవలయును. ఉపాసకుడు తాను చేయు ఉపాసనయొక్క బలమువల్ల తలచినపుడు స్థూలశరీరమును వదిలి స్థూలేతర శరీరములతో దూరప్రాంత్యములకు పోయి అదృశ్యసహాయముచేయు శక్తిని సంపాదించుకోవచ్చును. మరికొంత ఉపాసనాతీవ్రము కలిగినపుడు ఆస్ట్రిల్ బాడీని కూడ వదిలి మనోమయ శరీరములతో దూరదేశములయందు అదృశ్యసహాయముచేయు శక్తి కలు

గును. ఇట్లు చేయుచురాగా ఆధికారికపురుషవర్గమును చేరుటకు అర్హుడగును.

ఆధికారిక పురుషులు

జ్ఞానదీక్షలుపొంది జీవన్ముక్తిదశకు పోయినవారు వారి వారి రేఖకు సంబంధించిన కైంకర్యములు చేయుచుందురు. ప్రారబ్ధక్షయానంతరము జీవన్ముక్తులు దేహపాతమునకు ఒప్పుకొని విశ్రాంతి చెందుదురు అని వినియున్నాము.

ప్రారబ్ధకర్మనాశ మెప్పటికి అవునో చెప్పుట కెవ్వరికి సాధ్యము. జ్ఞానదీక్షలు లభించుటకు మునుపే లోకమందు సాధనచతుష్టయమును అభ్యసించుచున్నపుడు ఏ ఉపాసకుడైనను తాను బ్రహ్మకల్పాంతమువరకును పరమాత్మకైంకర్యము జరుపుచునే యుందును; మఱియు తాను ముక్తుడైనను పరమాత్మయొక్క అంశలైన ఇతర జీవాత్మలందరును ముక్తులగు పర్యంతమును నేను పరమాత్మయొక్క కైంకర్యమును చేయుచు జ్ఞానోపదేశము చేయుచు జీవాత్మలనందరిని ముక్తులుగా జేయుదును అని కోరియుండిన యెడల ఆ ప్రారబ్ధబలమువల్ల జీవన్ముక్తునికి కూడ పునర్జన్మము సాధ్యము కావచ్చును గదా. అట్టి ప్రారబ్ధకర్మగలవారు ఒక జన్మమే కాదు, అనేక జన్మములెత్తి తాము ఎన్నో జన్మములకు ముందు చేసిన శపథమును నెరవేర్చవలసి యుండును. నెరవేర్చుచున్నారు.

కేవల స్థూలదేహము యొక్క ధారణార్థము ఇతరుల ఆకటిని గౌరవించినపిదపనే గృహస్థువు భుజించవలెను అను మొదలగు అనుకంపావచనములుండగా అజ్ఞాననాశంబునకు ముఖ్య

సాధనంబైన జ్ఞానదానంబునకు అనుకంపవలని ప్రేరేపణ ఉండుట ఏమి ఆశ్చర్యము. స్వల్పవిషయములలో మాత్రము పరోపకారము మును భారీవిషయమైన మోక్షప్రాప్తికి కారణభూతమయిన జ్ఞాన దానమునకు మాత్రము అనుకంపయొక్క బంధముండ కూడదా?

కొందరు ఋషులు బ్రహ్మసాక్షాత్కారమును పొందియు అనేకయుగములకు పిదపకూడ జ్ఞానదాతలుగా ప్రపంచమందు వ్యవహరించుచున్నట్లు శాస్త్రములు ఘోషించుచున్నవి. ఈ గ్రంథము ద్వితీయాధ్యాయమునందు మహిపీఠమును గురించి వ్రాయబడి యున్నది. శ్రీమద్భగవద్గీత శంకరభాష్య ప్రారంభము నందు ప్రవృత్తిమార్గమునందు చరించువారికి సహాయముగా ప్రజా పతులున్నారనియు, నివృత్తిమార్గయాత్ర చేయువారికి సహాయము చేయు నధికారమును వహించి సనకాదు లున్నారనియు చెప్పియున్న ది. మరియు "విష్ణోర్భక్తా హి లోకానాం పావనాయ చరంతి హి" అనియును "జనస్య కృష్ణా ద్విముఖస్య దైవాద ధర్మశీలస్య సుదుఃఖితస్య। అనుగ్రహాయేహచరంతి నూనం భూతాని భవ్యాని జనార్ద నస్య" అనియు చెప్పబడియున్నది. విష్ణుభక్తులు లోకమును పావనము చేయుటకుగా సంచరించు చున్నారనియు దైవభక్తిలేక హీనదశకు పోవువారిని కాపాడుటకుగా జనార్దనునియొక్క మంగళకరులైన భక్తులు లోకమునందు సంచరించుచున్నారనియు పై శ్లోకమున కర్థము.

తైత్తిరీయ శ్రుతియందు నక్షత్రేష్టి యని యొక భాగమున్న ది. అచ్చట అగ్ని, ప్రజాపతి, సోముడు మొదలగు ముప్పదియేడు గురు పరమర్షులు ఆధికారిక పురుషులుగా నియమింపబడి యున్న

ట్టును, వారిలో కొందరు జీవుల కర్మానుసారముగ వారికి సుఖదుః ఖములు నిత్తురనియును, కొందరు సృష్టిస్థితిలయకర్మల కధికారులుగా నుందురనియు చెప్పబడియున్నది. బద్ధులమైన మనకందఱకును జ్ఞానోపదేశము చేయుటకుగానును లోకమందు పరమేశ్వరుని మర్యాద నతిక్రమింపక కార్యము జరుపుటకుగానును అధికారములను వహించి అనేకులున్నారు. మరియు దైవయానమునందు ఎనుబది యెనిమిదివేల మందియు పితృయానమునందు ఎనుబదియెనిమిదివేల మంది ఋషులు ఉండి లోకులకు కావలసిన ధర్మశాస్త్రాదులను ఇచ్చి చక్కని మార్గమున నడిపించుచున్నారనియు యాజ్ఞవల్క్య సంహితయందు చెప్పియున్నది.

> తత్రాష్టాశీతిసహస్రా మునయో గృహమేధినాం ।
> పునరావర్తినో బీజభూతా ధర్మప్రవర్తకాః ॥
> సప్తర్షి నాక వీథ్యంతే ర్దేవలోకం సమాశ్రితాః ।
> తావంత ఏవ మునయః సర్వారంభ వివర్జితాః ॥
> తపసా బ్రహ్మచర్యేణ సంగత్యాగేన మేధయా ।
> తత్రగత్వా వతిష్ఠంతే యావదా భూతసంప్లవం ॥
> యతో వేదాః పురాణాని విద్యోపనిష దస్తథా ।
> శ్లోకా స్సూత్రాణి భాష్యాణి యచ్చ కించన వాఙ్మయం ॥
> వేదానువచనం యజ్ఞో బ్రహ్మచర్యం తపో దమః ।
> శ్రద్ధోపవాసశ్చ తథా స్వాత్మనో జ్ఞానహేతవః ॥
>
> (యాజ్ఞవల్క్యస్మృతి)

ఇంతేకాక ఈ కల్పమునందు అధికారముల నంగీకరించియుండు దిక్పాలకులు మొదలగు వారందరును పూర్వకల్పములయందు సిద్ధులైన జీవన్ముక్తులే.

ఇట్టివా రందరును, మహీపీఠపు ఆధికారిక పురుషులు. కైంకర్యము చేయుటయే తమ ధర్మమని నమ్మి ఆ నమ్మకము అను ప్రారబ్ధమును అనుభవించుచుందురు.

చిన్నతనమునందు బలహీనదశలో నుండగా మనము ఇతరుల సహాయమును కోరితిమి కదా. తలిదండ్రులు శిశువులను కాపాడినట్లు క్రొత్తగా మన బ్రహ్మాండములో ప్రవేశించిన ప్రజ్ఞానాంశువులకు సత్యలోకము, తపోలోకము, జనలోకము మొదలగు లోకములయందలి దేవతలు సహాయముచేసి మెట్టు మెట్టునందును సహాయము చేయుచువచ్చి ప్రవృత్తిమార్గయాత్ర యందు సహాయపడిన ప్రజాపతులు వారి యనుచరులు వారి శిష్యప్రశిష్యులందరును ప్రజ్ఞానాంశువులైన మనలను ఇంత దూరమునకు తెచ్చిరి. పిమ్మట మనము నివృత్తిమార్గము నందు ప్రవేశించ నిచ్ఛయించిన సమయమునందు చోదక గురువులు గానును బోధకగురువులుగానును శ్రీ సనత్కుమార ప్రముఖులయిన మహీపీఠపు ఋషులును వారి శిష్యప్రశిష్యులును సహాయపడుచున్నారు.

కర్మచక్రమునందు "దేవాన్భావయతానేన తే దేవా భావ యంతు వః" అని చెప్పినప్రకారము ఉపకారమును పొందిన మన ము ప్రత్యుపకారము చేసి మనము పడియుండు ఋణములను తీర్చ వలెను కదా. మనము పొందిన లాభములను మనము ఇతరులకు ఇయ్యవలెను. ఇదియే జ్ఞానచక్రరహస్యము.

గురువులవారి వలన నుపదేశంబులం బొందిన మనము ముది రిన పిమ్మట మనకంటె తక్కువ పదవియందుండువారలకు జ్ఞాన

దానము చేయవలయును. అందువలననే "స్వాధ్యాయప్రవచనే చ" అని చెప్పబడినది.

ఈ విధముగా నివృత్తిమార్గయాత్ర నారంభించి యాత్రను ముగించి అజ్ఞానముతో నంధత్వమును చెందిన లోకమునకు జ్ఞాన దానముచేసి మనమును కల్పాంతము వరకును కైంకర్యము చేయుటకు ఇష్టపడి, ఆరీత్యా ఋణవిముక్తులగుటకు శ్రీ గురుదేవుల వారు మనలను సిద్ధపరుతురు గాక యని ప్రార్థన.

---

శాంతిప్రాక్సుకృతాంకురం దమ సముల్లాసోల్లసోత్పల్లవం । వైరాగ్యద్రుమ కోరకం సహనతా వల్లీప్రసూనోత్కరం । ఐకాగ్రీ సుమనోమరంద విసృతిం శ్రద్ధా సముద్యత్ఫలం । విందేయం సగురోర్గిరాం పరిచయం పుణ్యైరగణ్యైరహం ॥

---

శ్రీ

బ్రహ్మజ్ఞానసమాజసద్గురుమణిః లోకైకరక్షామణిః ।
సద్విద్యామృతదానకల్పకమణిః కారుణ్యవార్ధీమణిః ।
యా మాత్రైవ విరాజతే ప్రభుమణిః శ్రీమద్వసంతామణిః ।
తస్యాః శ్రీపదపంకజే సవినయం భక్త్యార్పితేయం కృతిః ॥



జయతు జయతు నిత్యం బ్రహ్మవిజ్ఞానసంసత్
జయతు జయతు నిత్యం శ్రీవసంతాంబికా
జయతు జయతు నిత్యం శ్రీగురుశ్చాగమిష్యన్
జయతు జయతు నిత్యం సత్యరూపో హి ధర్మః ॥

# విజ్ఞాపన

ఆత్మవిచార మను నీ గ్రంథమును వ్రాయుట కారంభించినది మొదలు బ్రహ్మాండము అను విషయమును గురించి వ్రాతునని పదే పదే చెప్పి ఉత్తరభాగమునందు వ్రాతుననియు చెప్పి యుంటిని. అయినను ఉత్తరభాగమును వ్రాయబూనుకొన్నపుడు ఏ విషయమునుగాని నాకు తెలిసినంతవరకైనను సమగ్రముగా వ్రాయుటకు గ్రంథవిస్తరభీతిచేత వీలు కలుగక పోయెను. అట్లుండియు పూర్వభాగమునకంటె నుత్తరభాగము ౨౦౦ పుటలధికముగా వ్రాయబడియె. గ్రంథము వ్రాయుటయందు అధ్యాత్మిక దుఃఖంబు లనేకంబు లుండినను ఆధిభౌతికదుఃఖంబులు నిస్తరణీయంబులు అని తెలియవచ్చినది. కనుక బ్రహ్మాండము అను నంశమునికముందు ఆత్మవిచారము పూర్వభాగము మరల నచ్చొత్తించునపుడు ఆ ప్రతియందు చేర్చుట సాధ్యము అని ప్రకృతమునందు వదులుకొన్నాను. చదువరలు మన్నింతురని ప్రార్థించుచున్నాను.

గ్రంథకర్త

---

